భగవత్

# కల్యాణమహోత్సవము



డా॥ రేజేటి వేంకట వేణుగోపాలాచార్యులు,



ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# భగవత్
# కల్యాణమహోత్సవము

దేవస్య కల్యాణారాధనం సర్వ క్షేమకరమ్ -

"సర్వశాన్తికరం సర్వ దుఃఖోత్సాదన ముత్తమమ్
రాజ్ఞో రాష్ట్రస్య సుఖద మాయురారోగ్య వర్ధనమ్
ప్రజానాం వాసుదేవస్య కల్యాణారాధనం మహత్
ఇమం దేవాదయ స్సర్వే విష్ణోరుత్సవ ముత్తమమ్
కృత్వా శాశ్వతికం స్థానం ప్రాపు రత్యన్త దుర్లభమ్॥

..... పాద్మే చర్యా. II.285-287.

సంపాదన, పరిశోధన, పరిష్కరణ :

డా॥ రేజేటి వేంకట వేణుగోపాలాచార్యులు,

ఎమ్.ఏ., ఎమ్. ఇడి., పి.హెచ్.డి ; రిటైర్డ్ ప్రొఫెసర్




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

# BHAGAVAT KALYANA MAHOTSAVAM (Sanskrit) in Telugu

*Edited by :*
**Dr. Rejeti Venkata Venugopalacharyulu**
Retd. Professor
9-153, Adarsanagar
Konthamuru P.O.
Rajahmundry - 533 103



T.T.D Religious Publication series No.

First Edition 2008

Copies : 1,000

*Published by:*
Sri **K.V.Ramanacharya,** I.A.S
Executive Officer
Tirumala Tirupati Devasthanams
Tirupati

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press
Tirupati

# కల్యాణమస్తు!

ఆధునిక మానవసమాజం భౌతికంగా ఎంత ప్రగతిని సాధిస్తున్నా, ఆధ్యాత్మికజ్ఞానం లోపించడం వల్ల జీవితాల్లో సుఖశాంతులు కరువైపోతున్నాయి. మానవతా విలువలు మంటగలిసిపోతున్నాయి.

రానున్న ఈ విపత్తును గుర్తించి తిరుమల తిరుపతి దేవస్థానం ఎప్పటినుంచో ఆధ్యాత్మిక గ్రంథాలను వెలువరిస్తూ తనవంతు కృషిని శాయశక్తులా నిర్వర్తిస్తోంది.

ధార్మిక ప్రచారంలో భాగంగా ఇప్పుడు వెలువడుతున్న "భగవత్ కల్యాణమహోత్సవము" అనే ఈ గ్రంథంలో భగవంతుని కల్యాణోత్సవానికి సంబంధించిన అనేక విషయాలు చోటు చేసుకున్నాయి. అంతేగాకుండా ప్రధాన విషయాలతో పాటు అనుబంధంలో చేర్చిన పంచసూక్తహోమం, అగ్నికార్య విధి, మధుపర్క ప్రకరణం వంటి అంశాలు ఎన్నో మనలో ఆసక్తిని కలుగజేస్తాయి.

డా॥ రేజేటి వేంకట వేణుగోపాలాచార్యులు పరిష్కరించిన ఈ గ్రంథం ఆగమపండితులకు, ఆర్షవిజ్ఞాన సంపన్నులకు పాంచరాత్రాగమ విధానాల విషయ విశ్లేషణలో ఒక విజ్ఞాన సర్వస్వం వంటిది.

శ్రీవారి పూజావిధానాల నెన్నింటినో కరతలామలకం చేస్తున్న ఈ గ్రంథం దేవస్థాన ప్రచురణగా స్వీకరించబడడం హర్షణీయం. ఈ గ్రంథాన్ని కూడా పాఠకలోకం యథాపూర్వం ఆదరిస్తుందని, ఆదరించాలని ఆకాంక్ష.

బి. కరుణాకర రెడ్డి

(భూమన కరుణాకర రెడ్డి)

అధ్యక్షులు,

తి.తి.దేవస్థానములు, తిరుపతి.

తిరుపతి

03.01.2008

# తోరణం !

"భగవత్ కల్యాణమహోత్సవము" అనే అపురూప ధార్మిక గ్రంథాన్ని సంపాదించి, పరిశోధించి, పరిష్కరించి పఠితలకు అందజేసిన డా॥ రేజేటి వేంకట వేణుగోపాలాచార్యుల వారి కృషి ప్రశంసనీయం.

స్వామివారికి జరిగే ఉత్సవాలన్నింటిలోను కల్యాణోత్సవం అత్యంత ప్రశస్తమైనది. ఈ కల్యాణోత్సవాన్ని పూర్వకాలంలో దేవతలు కూడా నిర్వర్తించి అనేక శుభాలు పొంది శాశ్వతకీర్తిని పొందారని మన ఆగమాలలో చెప్పడం జరిగింది.

ఈ కల్యాణోత్సవానికి సంబంధించి డా॥ రేజేటి వేంకట వేణుగోపాలాచార్యుల వారు చేసిన పరిశోధన వారిని భగవంతుని కృపకు మరింతగా పాత్రుణ్ణి చేస్తుందని చెప్పుకోవచ్చు.

ఈ గ్రంథంలో వివరించబడిన విష్వక్సేనపూజ, ధ్వజపటప్రతిష్ఠ, భేరీతాడనం, పాణిగ్రహణం వంటి అనేక పాంచరాత్రాగమ విషయాలు సంప్రదాయాభిలాషులకు హృదయాహ్లాదకరాలు.

తిరుమల తిరుపతి దేవస్థానం వారు ప్రచురిస్తున్న ఈ గ్రంథం ఆగమ పండితులకు, జ్ఞాన పిపాసువులకు ఎంతో ఉపయుక్తంగా ఉంటుంది.

తిరుమల తిరుపతి దేవస్థానం వారు ధర్మప్రచారసాధనంగా ఇప్పటికెన్నో ఉత్తమగ్రంథాలు ప్రచురించారు. ఆద్యంతం ఆధ్యాత్మిక సౌరభాలు వెదజల్లుతున్న ఈ గ్రంథం కూడా రసజ్ఞులైన ఆంధ్రపాఠకులకు ఆమోదం చేకూర్చగలదని మావిశ్వాసం.

కె.వి. రమణాచారి
కార్యనిర్వహణాధికారి,
తి.తి. దేవస్థానములు, తిరుపతి.

తిరుపతి
07.01.2008

నా తొలిదైవం

కామరాజుపేట -

శ్రీ వేణుగోపాలస్వామివారికి -



తొలి గురువు, మా తండ్రి గారు -

శ్రీమాన్ రేజేటి రంగాచార్యులు గారికి-



(26-7-1910) (1-10-1987)

శ్లో॥ సాధారణాబ్ద సంయుక్తే ఆషాఢే కృష్ణపక్షగే
చతుర్థ్యాం చోత్తరాభాద్రే రవౌ కర్కటగే బుధే
పాంచరాత్రార్థ తత్త్వజ్ఞం భగవద్భక్తి తత్పరం
రేజేట్యన్వయ సంజాతం రంగాచార్య మహం భజే॥

శ్లో॥ అర్చావతార హరిమంగళ దివ్యబింబాన్
సంస్థాప్య చాష్టసప్తతి ప్రభవాభిధేబ్దే
ఆశ్వయుజ శుద్ధ నవమీ గురువాసరేచ
భూమిం విహాయ భగవత్పద మావివేశ॥

 భక్తితో, సవినయుంగా, సమర్పితం. 

# ఆధార గ్రంథములు

| తాళపత్రలిఖితములు | | | | సంకేతము |
|---|---|---|---|---|
| 1. | శ్రీకూర్మప్రతి ప్రాచీనం | వివాహ ప్రయోగము, వి.పూజ, పుణ్యాహములు వ్రాయలేదు | | శ్రీకూ |
| 2. | రేజేటి బలరామయ్య | వి.పూజ, భగవత్పుణ్యాహవాచనం | వృష,1821 A.D. | రేజే.బల |
| 3. | భద్రం శ్రీరామాచార్యులు | ప్రతిష్ఠా ప్రయోగం | 1800 A.D. ప్రాంతం | భద్రం.శ్రీ |
| 4. | అంపోలు అప్పలాచార్యులు | వివాహ ప్రయోగం | | అం.అప్ప |
| 5. | రేజేటి చినసింగరాచార్యులు | భారద్వాజ సంహి.ప్రతిష్ఠా | 1845 A.D. | రేజే.చి.సిం. |
| 6. | రేజేటి శ్రీరంగనాయకులు | కల్యాణం | 1860 A.D. | రేజే. శ్రీరం |
| 7. | భద్రం కృష్ణమాచార్యులు | వి.పూజ, పుణ్యాహం | 1862 A.D. | భద్రం.కృ |
| 8. | దొడ్డిపట్ల ఉప్మాకయ్య | అగ్నికార్యవిధివ్యాఖ్య | 1866 A.D. | దొ॥ ఉ |
| 9. | దొడ్డిపట్ల ఉప్మాకయ్య | చోర, లక్ష్మీసంవాదములు | | దొ॥ ఉ |
| 10. | చామర్తి వారి ప్రతి | భరద్వాజ సంహిత, కల్యాణం | 1869 A.D. ప్రాంతం | చామర్తి |
| 11. | రేజేటిఅప్పలన్నసింహాచార్యులు | పాణిగ్రహణం | 1881 A.D. | రేజే. అ.న. |
| 12. | పొందూరు సూర్యనారాయణాచార్యులు | కల్యాణం | 1895 A.D | పొం.సూ |
| 13. | అంపోలు వేంకట నరసింహాచార్యులు | కల్యాణం | 1915 A.D | అ.వేం.న. |

<u>వ్రాతప్రతులు</u> (కాగితం)

| | | | | |
|---|---|---|---|---|
| 14. | దొడ్డిపట్ల ప్రకాశం | అగమగ్రంథం | 10-4-1926 కుముందు | దొ॥ప్ర |
| 15. | రేజేటి రంగనాథస్వామి (రంగాచార్యులు, కామరాజుపేట) | కల్యాణం | 1926 | రే॥రం |
| 16. | రేజేటి గోపాలాచార్యులు (వేళంగి) | కల్యాణం | 1950 | రే.గో |
| 17. | చామర్తి వేంకట రామభట్టాచార్యులు (బాలసీమ) | కల్యాణం | 1946 | చా.వే.రా.భ. |
| 18. | అంపోలు సీతారామాచార్యులు (అమల్దార్, బొబ్బిలి) | కల్యాణం | 1950 ప్రాంతం | అం.సీ. |
| 19. | అంపోలు కూర్మాచార్యులు (బ్రహ్మపురం) | కల్యాణం | 1955 ప్రాంతం | అం.కూ. |
| 20. | పొందూరు లక్ష్మణాచార్యులు (కాకినాడ) | కల్యాణం | 1980 ప్రాంతం | పొం॥ల |
| 21. | చామర్తి జగ్గప్పలాచార్యులు (బాలసీమ) | కల్యాణం | 1950 ప్రాంతం | చా॥జగ్గప్ప |
| 22. | భద్రం వేం. రమణాచార్యులు (బొబ్బిలి) | కల్యాణం | 1980 ప్రాంతం | భద్రం.ర |
| 23. | అంపోలు వీర రాఘవాచార్యులు (బొబ్బిలి | కల్యాణం | 1990 ప్రాంతం | అం.వీ.రా |

Srimte Narayanaynmha! Srimnnarayna ytibhyonmha! Srimte Ramanujayanmaha!



SRIMADUBHAYA VEDANTACHRYA PEETAM

(Regd.)

Registered office : 294, Satara Street, Sriramgam, Trichi Dt., Tmilnadu.

Administretive Office : Sitangaram -522501; Gunture Dt., A.P Ph.(08645) 72929, 72353

Founder H.H. Sri Sri Sri Tridandi Srimnnarayana Ramanuj Jeeyar Swamivaru

Managing Trustee : H.H. Sri Sri Sri Tridandi China Srimnnarayana Ramanuj Jeeyar Swamiji

---

ఓం అస్మ ద్గురుభ్యోనమః శ్రీమతే నారాయణాయనమః

ప్రియ శ్రీమన్ వేంకట వేణుగోపాలాచార్యస్వామిన్

అనేకమంగళాశాసనములు . మీరు సంకలనం చేసిన కల్యాణ ప్రయోగాన్ని చూచాం. స్వామికి జరిగే ఆరాధనా లన్నింటిలో కల్యాణారాధనం ప్రశస్తమైనది. సర్వశాన్తికరము, సర్వదుఃఖ ప్రశమనము, సర్వోత్తమము, రాష్ట్రపాలకులకు ప్రజలకు క్షేమం కరము, ఆయురారోగ్య వివర్ధకముగా కల్యాణారాధనాన్ని ఆగమాలు ఉద్ఘోషిస్తున్నవి. "..వాసుదేవస్య కల్యాణారాధనం మహత్ " అన్న పాద్మవచనం దాన్ని స్పష్టపరుస్తున్నది. ఈ కల్యాణారాధనాన్ని దేవాదులుకూడా నిర్వర్తించి, శాశ్వతికము, దుర్లభము అయినస్థానాన్ని పొందారనికూడా ఆగమం ఉద్ఘోషిస్తున్నది.

ఇంతవరకు మహోత్సవవిధిలో చివరిభాగంగా కల్యాణప్రక్రియ చేర్చబడి ప్రకాశింపబడుతూ లభిస్తున్నది. అయితే, కల్యాణ ప్రయోగంపై విమర్శనాత్మక (Critical) ప్రకాశనాన్ని తీసుకొనిరావడానికి మీరుచేసిన ప్రయత్నం సర్వథా ప్రశంసనీయం.

మన ఆంధ్రదేశంలో శ్రీపాంచరాత్రాగమాన్ని సాకల్యంగా అధికరించి ప్రతిష్ఠా కల్యాణాది ప్రయోగాలను సమర్థతతో నిర్వర్తిస్తున్న పెద్దలు కొందరున్నారు. వారివద్ద ఆగమవిద్యను ఆయా ఆగమ పాఠశాలల్లో అధ్యయనం చేసి, ప్రతిష్ఠోత్సవ కల్యాణాలు అధ్యయనం చేసి, ప్రస్తుతం అప్రక్రియలను ప్రయోగపురస్సరంగా ఆయా సందర్భాలలో నిర్వహిస్తున్న యువకులు కూడా క్రమక్రమంగా తయారుకావడం మాకెంతో ఆనందాన్ని కలిగిస్తుంది.

ఇక విశేషించి ఉత్తరాంధ్రంలో కొన్ని శ్రీవైష్ణవ వంశాలు ఈప్రయోగాలను ఆనువంశికంగా తాళపత్ర గ్రంథాలలో నిక్షిప్తంచేసి రక్షించుకొంటూ వస్తున్నారు. అలాంటి శ్రీవైష్ణవ వంశాలలో రేజేటి వంశం ఒకటని గమనించి, ఆవంశానికి చెందిన మీరు వివిధ ప్రతులను ఎడిట్ చేసి సమగ్రంగా ఒకప్రతిని ప్రత్యేకంగా కల్యాణప్రయోగంతో తయారుచేయడం సర్వథా ప్రశంసనీయం.

శ్రీపాంచరాత్రాగమానికి చెందిన వివిధ ప్రయోగాలను వివిధ ప్రతులను పరిశీలించి క్రిటికల్ ఎడిషన్స్ తయారుచేసే ప్రక్రియ ప్రస్తుతం ఇంకావిస్తృతంగా సాగవలసిన అగత్యం ఎంతైనా ఉంది. శ్రీపాంచరాత్రం పరమ వైదికమని ఈనాడు పనిగట్టుకుని ప్రచారం చేయవలసిన అవసరం లేకుండానే, మన ప్రాచీనాచార్యులైన

భగవద్యామునులు ఆగమ ప్రామాణ్యాన్ని సుస్థం చేశారు. భగవద్రామానుజులు ఆలయాల్లో శ్రీపాంచరాత్రారాధనావిధానం సక్రమంగా కొనసాగేలా చేశారు.

ప్రస్తుతం శ్రీపాంచరాత్రాగమానికి చెందిన ప్రాచీన వ్రాతప్రతులను, తాళపత్ర గ్రంధాలను రక్షించు కోవడంతో బాటు, యథావకాశంగా పరిష్కరించుకొని ముద్రించే ప్రయత్నంకూడా సాగాలని మేం భావిస్తున్నాము. ఈదిశలో మీప్రయత్నం సర్వథా అభినన్దనీయం. ఈకృషి అవిచ్ఛిన్నంగా సాగుతుందని ఆశిస్తూ, సాగాలని అనేక మంగళాశాసనాలు చేస్తున్నాం.

జై శ్రీమన్నారాయణ.

5/4/05

---

కర్షణాది ప్రతిష్ఠాన్త విశారద, ద్విశతాధిక ప్రతిష్ఠాపనాచార్య

**శ్రీమాన్ చామర్తి జగ్గప్పలాచార్యులు,** ఎం. ఏ

విశాఖపట్నంజిల్లా అర్చక సంఘ కార్యవర్గసభ్యులు , అర్చకవాణి మాసపత్రిక గౌరవసంపాదకులు

శ్రీకాకుళం జిల్లా దేవాదాయ ధర్మాదాయ శాఖ ఆగమ సలహాదారు

బాలసీమ, ఉర్లాం (పోష్టు), ఫోన్: (08942) 241803

శ్రీమాన్ రేజేటి వేంకట వేణుగోపాలాచార్యులవారు సంపాదన, పరిశోధన, పరిష్కరణ జేసిన " భగవత్కల్యాణ మహోత్సవము" అను గ్రన్థ మాతృకను ఆమూలాగ్రముగా పరిశీలించే భాగ్యము నాకు కలిగినందులకు అత్యన్త ఆనందదాయకముగా నున్నది. శ్రీపాంచరాత్రాగమములో ఇతః పూర్వము ఆచార్యపురుషులెవ్వరూ సాహసించని ముద్రణ కార్యానికి శ్రీకారంచుట్టిన ఘనత శ్రీ ఆర్.వి.వి. గోపాలాచార్యుల వారికే దక్కినది.

ఆగమ జిజ్ఞాసువులకు, క్రియాసక్తులకు ఈ గ్రంథము బహుళ ప్రయోజనకారియై వరపరీక్షా ఉత్తీర్ణతానిమిత్త పాఠ్యాంశముగా రూపుదాల్చాలని, వీరి సంపాదనలో మరిన్ని గ్రన్థముల ముద్రణ జరగాలని శ్రీలక్ష్మీ హయవదనుని ప్రార్థిస్తూయుంటాను.

భగవద్భాగవత విధేయుడు,

చామర్తి జగ్గప్పలాచార్య దాసః

శ్రీమతే రామానుజాయ నమః

పాంచరాత్రాగమ విశారద, సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ

ఆయుర్వేద విశారద, భిషగ్రత్న, వేదాన్తభూషణ

ఉ॥వే॥ప్ర॥ శ్రీమాన్ మహేంద్రాడ వేంకట జగన్నాధస్వామి

కళింగపట్నం గ్రామం

గార మండలం, శ్రీకాకుళంజిల్లా, పిన్ ; 532 406

శ్రీగురుభ్యోనమః హరిః ఓమ్ తేది 25-9-2004

ఉ॥వే॥ శ్రీమాన్ రేజేటి వేంకట వేణు గోపాలాచార్యులుగారు సంకలన మొనర్చిన " భగవత్ కల్యాణమహోత్సవము " అను ప్రతిని స్థాలీ పులాకన్యాయముగ చూడగలిగితిని. వీరు సుప్రసిద్ధ పాంచరాత్రాగమ కుటుంబమునకు చెందినవారు. పాంచరా త్రాగమమును శ్రద్ధగ నభ్యసించినవారు. ఆంగ్లమున అచార్య పట్టమును పొంది కళాశాలలో పనిచేసి విశ్రాంతి నొందిన తదుపరి చక్కని పరిశోధనతో " చందనోత్సవము " అను అమూల్య గ్రంథమును వెలువరించిరి.

ఈకల్యాణమహోత్సవము అను గ్రంథము ధ్వజారోహణ ప్రభృతి పుష్పయాగ పర్యన్తము సరళముగ వివరింపబడినది. ఇయ్యది అగమపండితులకు, జిజ్ఞాసువులకును కూడ మిక్కిలి ఉపాదేయమైనది. త్వరలో ముద్రితమై యెల్లరకు ముదమందించగలదని నమ్ముచున్నాను.

సహృదయ విధేయుడు,

మ. వేం. జగన్నాధస్వామి

---

Dr. **C. Vijayaraghavacharyulu,**
Senior Faculty Member,
Dr. M.C.R HRDI A.P Hyderabad. 500033

డా॥ శ్రీమాన్ గోపాలాచార్యులవారి కృషి అద్భుతం, అనితరసాధ్యం. పెద్దపెద్ద సంస్థలు చేయాల్సిన పనిని ఆ మహానుభావులు చేస్తున్నారు. మహా గంభీర విషయాలను ఆవిష్కరిస్తోన్న సాహిత్య తపస్సు, భగీరథయత్నం. ఇది భగవద్భాగవతానుగ్రహం వలన ప్రాప్తమౌతుంది. వారి జీవితంసాఫల్యమైనది. వారి తిరువడి తలవంచి ప్రణమిల్లు తున్నాను. వైఖానసాగమంప్రాచీనమైనదని, పాంచరాత్రాగమం ఆచార్యులు ఈ మధ్య వ్రాసినదని ఒక పెద్ద అధికారి నాతో అన్నారు. చాలా బాధ పడ్డాను. ఇటువంటి దుష్ప్రచారాలకు గోపాలాచార్యులవారు ఒక వ్యాసంవ్రాసి ప్రచురిస్తే బాగుంటుంది.

భవదీయ,

విజయరాఘవాచార్య

# అవతారిక

శ్లో॥ శ్రీరామా కుచకుంబ కుంకుమ పరీరంభో గుణానాంనిధిః
పూర్వాచార్య గుణావతార నికరః శ్రీపాంచరాత్రార్చితః
విష్వక్సేన విభీషణః ప్రభృతిభిః భక్త్యా స్సదా సేవితః
పాయాన్నో భగవాన్ పురాణ పురుషః కుర్యా త్సదా మంగళమ్॥

భగవత్పూజావిధానం రెండు రకములు – 1. స్వార్థ యజనము, 2. పరార్థ యజనము. స్వార్థ యజనం సాధారణంగా గృహార్చ ఐతే, రాజా రాష్ట్ర ప్రజాభివృద్ధ్యర్థం జరుపబడు పరార్థ యజనం దేవాలయార్చనగా కన్పిస్తున్నది. స్వార్థయజనానికి అందరూ అర్హులైనా, పరార్థయజనానికి కొన్ని అర్హతలున్నవి.

<u>లక్ష్మీ తంత్రం పరార్థ యజనార్హతను ఈక్రింది విధంగా నిర్దేశిస్తున్నది.</u> ---

" కాత్యాయనముని ప్రోక్త సూత్ర కర్మ క్రియాశ్రితాః
కాశ్యపో గౌతమశ్చాథ భృగు రశ్వలాయనోంగిరా
ఇత్యాదయో మునిశ్రేష్ఠాః పరార్థ యజనే హరే
సాధికారా భవే దన్యే యజనే నాధికారిణః ॥........
కాశ్యపాది మునిశ్రేష్ఠ గోత్రజైర్హి పరార్చనా
కార్యా భాగవతై రన్యైః కృతాయది పరార్చనా
మోహేన రాజరాష్ట్రాణాం బలా ద్దోషో భవిష్యతి॥ (పుట.165)

సత్యలోకమునుండి భగవదర్చామూర్త్యవతార కాలమున ఆయామునులు కూడ వచ్చుటచేత వారినే ప్రశంసించుట జరిగినదని చెప్పబడుచున్నది. అట్టి వారు, కేవలము పంచసంస్కారములచే మోక్షార్థదీక్షితులు మాత్రమే గాక, పారంపర్య ప్రాప్తమగు ఆరాధనాపద్ధతి నెరిగినవారు, ఆలయోక్త మన్త్రాది దర్శితచక్రాబ్జ దీక్షాయుతులు, సమర్థులునై యుండగలరని తాత్పర్యము. ప్రస్తుత ఆంధ్రపాంచరాత్ర భగవత్కల్యాణ ప్రయోగగ్రన్థసంపాదనమును పురస్కరించుకొని ఈ విషయములకు ప్రాధాన్యత ఏర్పడుచున్నది.

పన్నెండవ శతాబ్దమున, కాశ్యప సగోత్రజులై, భగవద్రామానుజుల నుండి పాంచరాత్రాగమము నందుకొని, పరార్థయజనాధికారులగు చామర్తి, భద్రం మొదలగు కుటుంబములవారు నేటికీ శ్రీకూర్మ క్షేత్రమున (ఇతర ప్రదేశములయందుకూడ)

అర్చనాదులను నిర్వహించుచున్నారు. అక్కడి అర్చక స్వాములకు దేవదీక్షపేరుతో నేటికీ చక్రాబ్జమండలదీక్ష నిర్వహించ బడుచున్నది. అవిధంగా ఆనాటినుండి పరార్థ యజనాధికారులగు చామర్తి, భద్రం, పొందూరు మొదలగు కుటుంబములలో, వారి బంధువుల కుటుంబములలో పాంచారాత్రాగమ ప్రయోగ గ్రంథముల పఠనపాఠనములే గాక ప్రయోగ నిర్వహణ కౌశలంకూడ వంశపారంపర్యంగా సంక్రమిస్తూ వస్తున్నది. ఆయా పాంచరాత్ర ప్రయోగ గ్రంథాలు ఆయా కుటుంబాల స్వంత ఆస్తులవలె పరిరక్షింప బడుతూ వస్తున్నవి.

పైదానికి సాక్ష్యం పలుకుతూ మాపూర్వులు శ్రీమాన్ దొడ్డిపట్ల ఉప్మాకయ్యగారు 1896 ప్రాంతాన వ్రాసిన "పంచాయతన ప్రతిష్ఠ మొదలైనవి" అను తాళపత్రగ్రంథంలో 27 ఆకులో వ్రాసుకొన్న వీక్రింది శ్లోకములు --

" శ్రీకూర్మ విషయిక చర్చా --

శ్లో॥ కదాచి ద్యతిరాజశ్చ శ్రీమద్రామానుజో మునిః
సచ్ఛిష్యై ర్వైష్ణవైశ్చేతి ప్రార్థితో ముని పుంగవః
దేవస్థానాని దివ్యాని కర్తుకామ స్సముద్యతః ।
శ్రీరంగా న్నిర్యయౌ శిష్యై రనేకైశ్చ త్రిదండిభిః
మార్గేణోత్తరయాగచ్ఛన్ తత్రతత్రస్థలేషుచ ।
స్థితాన్ దేవాన్ నమస్కృత్వా యయౌ శ్రీ పురుషోత్తమే॥
తతో నిర్గత స్సోయం శ్రీకూర్మ క్షేత్రమాగమత్ ।
కూర్మనాథం మహాదేవం నత్వా స్తుత్వా జనార్దనం
శ్రీపాంచరాత్రవిధి మాలోచ్య భాష్యకృత్ ।
శ్రీకూర్మనాథ దేవస్య సాధకానాం విశేషతః
పంచభిశ్చైవ సంస్కారై స్తాపాద్యైశ్చ యథావిధి ।
సంస్కృత్య తానువాచేదం స్వశాఖాద్వైతిభిస్సహ
సంబంధవంతో భవ కూర్మనాథస్య శాసనాత్ ।
ఏవమాజ్ఞాప్య యతిరాట్ పాంచరాత్రాగమం దదౌ
తదాగమోక్త మార్గేణ దేవదేవస్య సన్నిధౌ ।
నిత్యోత్సవాది కర్మాణి సర్వానిచ యథాక్రమం
భవద్భిరేవ కర్తవ్యం సకలం మమశాసనాత్ ।
ఏవ మార్షాణి దివ్యాని చతుర్ష్వపి జనార్దనం

పూజయిధ్వం యథాశాస్త్రం సంస్కారైః పంచభిర్యుతాః ॥
ఏవమాజ్ఞాప్య సచ్ఛిష్యై శ్రీమద్రామానుజోమునిః ।
మంగళాశాసనంకృత్వా కేసరాఖ్య గిరిం యయౌ ॥
– ఇతి శ్రీభాష్యకార కృత శ్రీకూర్మ దివ్యదేశాగమన కథనమ్ ॥"

ఆవిధంగా దివ్య దేశమైన శ్రీకూర్మంతో బాటు మాపూర్వాచార్యులకు పాంచరాత్రాగమం సంప్రాప్తించినది. ఆనాటినుండి వారు పాంచరాత్రాగమాన్ని అనుసరించి భగవదర్చనం చేస్తూ వస్తున్నారు. పైసాక్ష్యానికి తోడుగా చామర్లవారు అర్చకస్వాములుగా దాదాపు ఆనాటినుండి శ్రీకూర్మంలో ఉన్నట్టు శిలాశాసనాలు కన్పిస్తున్నవి.

శ్రీకూర్మంలోని శ్రీకూర్మనాథుని దేవాలయంలోని బేడాలో శ్రీరామక్రతు స్తంభానికి ఎదురుగా ఉన్న స్తంభంమీది శిలాశాసనం ఇలాఉంది –

" శ్రీశాలివాహన శకసంవత్సరంబులు వెయ్యేడుల నూటముప్పదేడులు వెళ్ళగను ప్రమోదూత హయన వైశాఖ శు॥ తృతీయార్క శుభదినమున మృగశీర్షా నక్షత్ర మేషలగ్నమందు శ్రీకూర్మనాయక శ్రీపదములు సతతంబును పూజ జరిగించ్చు మనుచు చామర్ల సీతారామ మహీసురునకు ముతృగోత్ర భవుదు మండల తంమన్న సుందరపుర వృత్తిన్ సూర్య సోము లెంతకాలముందు రంత పర్యంతము నాత్మ పుణ్య కీర్తు లలర నొసగె. " (శాలి.శక 1130 = 1130+78 = క్రీ.శ.1208 , ఇది విభవ సంవత్సరం. ఇదివెళ్లిన ప్రమోదూత ఆనగా క్రీ.శ. 1210) ఇటువంటి శాసనాలు ఇంకా కన్పిస్తున్నవి.

ఆనాటినుండి శ్రీకూర్మంలో పైజెప్పిన చామర్లవారేగాక, వారిబంధువులగు భద్రం, గోపినంబాళం మొదలగు కుటుంబాలవారు నివసిస్తూ శ్రీకూర్మనాథు నర్చిస్తున్నారు. అంతేగాక 1850 ప్రాంతంలో సింహాచలమున సదరు కుటుంబాలవారు శ్రీసింహాచలేశుని అర్చకులుగా ఉన్నట్లు తాళపత్రలిఖిత సాక్ష్యాలున్నాయి. భద్రం అను ఇంటిపేరు భద్రాచలంనుండి వచ్చినవారు కావడంవలన వచ్చిందని చెప్పబడుతోంది

దీనికి తార్కాణంగా భద్రాచల కల్యాణ ప్రయోగానికీ ఈమా గ్రంధానికీ చాలపోలికలు కన్పిస్తున్నాయి. ఈవిధంగా శ్రీకూర్మ క్షేత్రమాదిగా 11 శతాబ్ది ఉత్తరార్ధంనుండి, ఉత్తరాంధ్రంలో, మావారి ఇంటివిద్యగా వస్తూఉన్న ఈ పాంచరాత్ర ప్రయోగం రానురాను మిగిలిన నేటి ఆంధ్ర తెలంగాణా రాయల సీమ జిల్లాలన్నిటియందు ప్రవర్తిస్తున్నదని తెలుస్తున్నది. భద్రాచల సింహాచల దేవాలయాల ప్రయోగంతో దీనికి దగ్గరిపోలికలున్నాయి.

ఇట్టి ఈగ్రంధసంపద ఈమా ఆంధ్రప్రాంతానికి శ్రీరంగంనుండి, కంచినుండి వచ్చినట్లుగా తాళపత్ర లిఖిత సాక్ష్యములు కన్పిస్తున్నాయి. దొడ్డిపట్ల ఉప్మాకయ్యగారు 1863 ఫిబ్రవరిలో వ్రాసుకొన్న ఉత్సవసార సంగ్రహం అను తాళపత్ర గ్రంధంలో " దుందుభి మాఘ శు॥ సప్తమీ సోమవారం రోజున దొడ్డిపట్ల ఉప్మాకయ్య తన స్వంతం నిమిత్తం వేదమూర్తులయిన ఆరవెల్లి శీతారామయ్యగారున్నూ వుప్మాకయ్య జన ఇద్దరూ శ్రీబొబ్బిలిలో పొందూరివారి ప్రతినిచూచి ఉత్సవసార సంగ్రహం వ్రాసిరి. ఈగ్రంథం ఉత్సవసార సంగ్రహం అనేది ఈదేశంలోకి శ్రీరంగంనుండి (ద్వితీయార్ధం కంచినుండి అని వేరొకచోట) ఇదివరకు ఇంతమటుకు(1838వరకు) వచ్చినది. " – అని వ్రాసుకొన్నారు. చూ. తాళపత్ర ప్రతికృతి... . ఇటువంటి ప్రాచీనగ్రంధసంపద మాకు ఉన్నదని చెప్పడానికి, నేటి ఈఆంధ్ర పాంచరాత్ర ప్రయోగానికి ఆధార గ్రంథాలు, ప్రాచీనములైన తాళపత్ర లిఖితములు అన్నీకాకపోయినా చాలినన్ని లభిస్తున్నాయి.

లభించిన గ్రంథాలలో, కాలనిర్ణయం చేయగలిగిన వానిలో, అతిప్రాచీనమైనవి రేజేటి వారివి. 1821 జు.ఈ వృష మార్గశిర బ.3 జయవారం రేజేటి బలరామయ్యగారు ఆత్మార్థం వ్రాసుకొన్న విష్వక్సేనపూజాదులు నాకు లభించిన అతిప్రాచీనగ్రంధం. (చూడుడు ఈపీఠిక చివర తాళపత్రములు నెం.1) ఇది కోట ఉరట్ల దొడ్డిపట్లవారింట లభించింది. మిగిలిన తాళపత్రగ్రంధాలన్నీ చాలవరకూ 1850 ప్రాంతాలవి. ఈకాలంలోని మాపూర్వులు, ఆనాటికే శ్రీరంగాది దక్షిణదేశ క్షేత్రాలనుండి తమపూర్వులు సంపాదించిన పాంచరాత్ర ప్రయోగాన్ని పటిష్ట పరచుకొన్నట్లు కన్పిస్తున్నది.

నాకు లభించిన తాళపత్ర గ్రంధాలలో అతిముఖ్యమైనవి దొడ్డిపట్ల ఉప్మాకయ్యగారు వ్రాసుకొన్నవి. వీరివ్రాతలవలననే అంధ్ర పాంచరాత్ర స్థితిగతులు వెలుగులోనికి వచ్చాయి. ఆయనముందుచూపు, విషయావగాహన, వ్యాఖ్యాదక్షత, పాండితీప్రకర్ష అనితర సాధ్యం. వీరు ఒకగ్రంథానికి పుత్రిక వ్రాసుకొన్నా, ఒక ప్రయోగానికి వ్యాఖ్య వ్రాసినా, ఒక లేఖ వ్రాసినా, ఒక ప్రతిష్ఠ చేసినా, ఒకరికిగ్రన్థం పంపించినా – ప్రతివిషయాన్నీ ఆనాడు తాళపత్రాలమీద నిక్షేపించారు. దానికి సంబంధించిన అన్ని వివరాలనూ, ముందుముందు నాలాంటివారికి ఉపయోగపడతాయనో ఏమో, అతిజాగ్రత్తగా, సుబోధకంగా, భద్రపరిచారు. (చూడుడు పీఠికచివర తాళపత్రములు నెం.2) ఇంతటి అమూల్య సంపదను ఇంతవరకూ కాపాడి, ఇలా లోకానికి అందించడానికి సహాయపడిన, ఆకుటుంబాలవారికి, ముఖ్యంగా మామేనత్తగారి కుమార్తె తి॥స॥ దొడ్డిపట్ల సావిత్రమ్మగారికి, వారి కుమారుడు రవి అనబడే సూర్య వెంకట

ప్రకాశాచార్యులకు ఆంధ్ర పాంచరాత్రాగమ కుటుంబాలు ఎంతైనా ఋణపడి ఉంటాయి.

అదేవిధంగా బొబ్బిలిలో అటు సోదరకుటుంబమైన భద్రంవారినుండి సేకరించిన గ్రంధాలను, ఇటు తన పూర్వీకులైన చామర్తివారి గ్రంథాలను జాగ్రత్త పరుస్తూ జీవితాంతం ఆగమ పరిశోధన పరిశీలనములను నిర్వహించినవారు మామేనమామ చామర్తి నరసింహాచార్యగారు. వారి సుపుత్రుడు చి॥ చామర్తి సీతారామాచార్యులు ఈనాడు వారింటనున్న ఆతాళపత్ర సంపద నంతటినీ నిండుమనస్సుతో నాకందించి ఈపరిశోధనావకాశాన్ని కలిగించినందుకు కృతజ్ఞుడను.(చూడుడు పీఠికచివర తాళపత్రములు నెం.3)

పాడైపోతున్న పొందూరివారి గ్రంథసంపదను సేకరించి ఉంచడమేగాక, తనతాతగారు అంపోలు అప్పలాచార్యులుగారి నాటి గ్రంథసంపదను కూడ జాగ్రత్తపరచి పరిశోధన నిమిత్తం నాకందించిన పెద్దలు, శ్రేయోభిలాషులు, సుప్రసిద్ధ బొబ్బిలి వేణుగోపాలస్వామి దేవాలయ అమల్దార్, ఆగమపండితులు, శ్రీమాన్ అంపోలు సీతారామాచార్యులు (అబ్బి) గారికి వినమ్రుడనై నమోవాకము లర్పిస్తున్నాను.

ఆంధ్రపాంచరాత్ర ప్రయోగఖ్యాతికి గ్రంథనిర్మాణ దక్షతకూ అనంతర కాలంవారలైనా రేజేటివారు సుప్రసుద్ధులు. వీరి కృషినిచాటిచెప్పే తాళపత్రలిఖిత సాక్ష్యాధారములు దొడ్డిపట్ల ఉప్మాకయ్యగారి ముందుచూపువలన లభిస్తున్నవి. వీరినిమించి కృషిచేసినవారు మరెవరైనా ఉన్నా రనడానికి తగిన లిఖిత సాక్ష్యాధారములు నాకు లభించలేదు. అట్టి రేజేటివారి పాంచారాత్రాగమ కృషికి ఆద్యులు రేజెటి పెదసింగరాచార్యులుగారు, వారి తమ్ముడు దొడ్డిపట్ల ఉప్మాకయ్యగారు. వీరిర్వురి కృషి క్రమమగా విశాఖ జిల్లా ఉప్మాక, కోటఉరట్ల గ్రామాలలో జరిగింది. రేజేటి పెదసింగరాచార్యులుగారి కుమారుడు రంగాచార్యులు అనబడే శ్రీరంగనాయకులుగారి కాలంనుండి రేజేటివారి మకాం కశింకోటకుమారింది. ఆపైన వారికుటుంబాలు వివిధస్థలాలలో అభివృద్ధి నందినవి. అలా ఆపాతకాలంనాటి గ్రంధసంపద చాలవరకూ కశింకోటలో భద్రపరచబడింది. అనతరకాలంలో కశింకోటలో నివశించిన రేజేటివారు గ్రంథ సంగ్రహణ దక్షులూ, జాగ్రత్తపరులూ కావడంవల్ల ఈనాటికీ సుమారు 50 వరకూ తాళపత్రగ్రంధములు వారింట భద్రంగా బీరువాలలో ఉన్నాయి. (చూడుడు అనుబంధం – 2 వేదీవిహారం) అటువంటి గ్రన్థసంపదను నాకు చూపించి, వేదీవిహారాన్ని నాద్వారా పరిష్కరింపజేసి అచ్చువేయించినందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పార్థివసంవత్సర ఉగాది పురస్కారగ్రహీత అయిన రేజేటి శ్రీరామాచార్యులుగారికి శుభాకాంక్షలు, ధన్యవాదములు.

పైమూడు స్థలములు నా గ్రన్థసంపాదనమునకు పరిశోధనమునకూ ముఖ్య స్థానాలైతే, మాసోదరులు కొప్పాక రేజేటి అప్పలాచార్యులు, రోలుగుంట రేజేటి ధర్మాచార్యులు, కామరాజుపేట రేజేటి శ్రీధరాచార్యులు, మామిడాడ రేజేటి వేంకట నరసింహాచార్యులు(చిన్న), రేజేటి వేంకట నరసింహాచార్యులు (పెదబాబు), కాకినాడ రేజేటి నరసింహమూర్తి, వేళంగి రేజేటి రామాచార్యులు, బొబ్బిలి అంపోలు వెంకట రాఘవాచార్యులు, భద్రం వేంకట రమణాచార్యులు మొదలగువారు తమవద్దనున్న ముద్రితాముద్రత గ్రంధాలను అందించి నా ఈ కృషికి దోహదంచేశారు. నిజానికీవిషయాలన్నీ నావేదీవిహార పీఠికలో చెప్పవలసినవీ చెప్పినవే అయినా అవి చాలవరకూ కొన్ని ఆంక్షలవల్ల కత్తిరించబడ్డాయి గనుక ఇక్కడ మరల విన్నవించాను.

ఈగ్రంథ పరిశోధనంలో ఇదంతా ఒక యెత్తైతే, మరొక అర్ధ భాగం (నిజానికిది అర్థ సంబంధమగుభాగమే ) నాకు మాతులసమానులు, సహృదయులు శ్రీమాన్ పొందూరు లక్ష్మణాచార్యులుగారి వల్ల లభించింది. వీరు తమవద్దనున్న గ్రంధాలను నాకు అందించడమే గాక, అడయార్ లైబ్రరీనుండి వారి అల్లుడు చి॥ మురపాక రామశర్మద్వారా అవసరమైన గ్రంధాలను తెప్పించారు. చినజీయరు స్వామివారితో గోష్ఠి భాగ్యాన్ని కలిగించి, వారితో ఆగమవిషయ చర్చకూ, తద్వారా మాయీ కుటుంబాలకు గల ఆగమశాస్త్ర ప్రవేశాన్ని వారిముం దుంచడానికి, వెలుగులోకి తేవడానికి దోహదం చేశారు. నాతోసమానంగా అనేకంటే, పెద్దలు సమర్థులుగనుక, అధిక భారాన్ని వహించారు. వారి సుపుత్రుడు, మాయింటి అల్లుడు చి॥గోవిందాచార్యులు సాహచర్యంలో నేను కుంభకోణం, శ్రీరంగం మొదలగు క్షేత్రాలను దర్శించి అక్కడి కల్యాణగ్రంధాలను పరిశీలించాను. శ్రీమాన్ గోవిందాచార్యులు నాతో సమానంగా కంప్యూటర్ ఏర్పరచుకొన్నాడు, డి.టి.పి చేశాడు, చేయించాడు – నాతోసమానంగా శ్రద్ధచూపించాడు.

ఇక బాలిశాం, చామర్తి జగ్గప్పలాచార్యులు వారి కొమాళ్ళు సహృదయంతో ఈకృషికి సాయపడ్డారు.వారి వద్ద ఉన్న సంహితా సంపద నాకు వెన్ను దన్ను – వారి ఆగమ శాస్త్ర ప్రవేశం నాకు కొండంత అండ. పలుమార్లు వారూనేనూ వారింటివద్ద రాత్రంబవళ్ళు చర్చించాము. శ్రీమాన్ చామర్తి జగ్గప్పలాచార్యులుగారి సంహితావలోకన అవగాహనములు ఈ మా గ్రంధ రచనలో పలుమార్లు ఉపయోగించిన వనుట అతిశయోక్తి కాదు.

సుప్రసిద్ధ అగమ పండితులు, మాకుటుంబాలలో అమెరికా వంటి విదేశానికి ప్రప్రథమ ప్రతిష్ఠాపకులుగా వెళ్ళి నిర్విఘ్నంగా కార్యక్రమాన్ని నిర్వహించినవారు, పాతతరం పాండిత్యానికి ప్రతినిధులు అయిన బరంపురం వాస్తవ్యులు శ్రీమాన్ అంపోలు

కూర్మాచార్యులుగారు వారి కుమాళ్ళు అనంతాచార్యులు మొదలగువారు ఈ గ్రంధనిర్మాణ విషయంలో, ముఖ్యంగా అగ్నిముఖ విషయంలో విస్తృతంగా చర్చించి సహకారాన్నందించారు. పలు విషయాలను శ్రీకూర్మాచార్యులవారి ముఖతః నేను తెలుసుకొన్నాను. అలభ్యములైన కొన్ని పుణ్యాహ శ్లోకములు మొదలగునవి వారినుండి లభించినవి.

ఉరుకులు పరుగులతో ముందుకు సాగుతున్న ఈకాలంలో భగద్రామానుజదత్త పాంచరాత్రప్రయోం ఇంకా మడికట్టుకొని స్థిమితంగా సంప్రదాయ బద్ధంగా నిర్వహింపబడుతోంది అని చెప్పడానికై ఉన్న స్థలం బొబ్బిలి శ్రీవేణుగోపాలస్వామి దేవాలయం. సుప్రసిద్ధ ప్రయోగ దక్షులై, పాతతరాలవారి ప్రతినిధిగా నా అదృష్టంకొద్దీ అక్కడ ఉన్న శ్రీమాన్ అంపోలుసీతారామాచార్యులుగారు ( హవల్దార్) అక్కడి సంద్రాయాన్నీ, నిగూఢములైన చాల అంశాలనూ నాకు వివరించి చెప్పారు. పుస్తకీయములుగా నాకు తెలిసిన చాల అంశములకు వారు ప్రాయోగికములైన సవరణలు, దిద్దుబాట్లు, పూరణలు ఏర్పరచారు. వారి అనుభవ ప్రవేశములు నేటి తరంవారందరికీ ఈపుస్తకంద్వారా చేరడం ముదావహం.

"పురాణమిత్యేవ నసాధుసర్వం ...." అన్నది దృష్టిలోనుంచుకొని గమనిస్తే నేటితరం యువకులలోగూడ మేలు గోచరిస్తున్నది. అలా నాదృష్టికి వచ్చినవారు కాకినాడ పొందూరు గోవిందాచార్య ద్వయం, విశాఖ వాస్తవ్యులు అంపోలు లక్ష్మీనరసింహాచార్యులు (సింహాలు), భోగాపురం వేంకట రమణాచార్యులు అనువారు. వీరినిగురించి నేను రెండుమాటలు చెప్పవలసి ఉంది. నేను చేపట్టిన ఈ గ్రంథనిర్మాణ కార్యక్రమాన్ని తలనొప్పిగా భావించి తప్పించుకొని తిరుగుతున్న యువతరంలాకాక, వేంకటనగరం గోవిందు నాకూడా తిరుగుతూ నాచాదస్తం చాలవరకూ అంటించుకొన్నాడు. జగాన్నాథపురం గోవిందు అతిక్లిష్టములైన అగ్నిముఖ కారికలకు ప్రక్రియను సూచించగలిగాడు. ఈగ్రంథంలో ఉన్న వైకుంఠపార్షద హోమమునగల, సంస్కృత పండితులచే పరిష్కరింపజేయబడిన 108 గాయత్రులను 95 శాతంవరకూ నిర్దుష్టంగా అంపోలు లక్ష్మీనరసింహాచార్యులు భోగాపురం రమణలు పుస్తకాపేక్షలేకుండా ఋషీకేశ్‌లో జరిగిన వైకుంఠనారాయణ యాగంలో చెప్పగలగడం నేను స్వయంగా గమనించాను. " ఆంధ్రులు వేదమంత్రాలలో దిట్టలు, యాజ్ఞీకానికి వారే సమర్థులు, మావద్ద కేవలం తంత్రమే మిగిలింది " అంటూ చెప్పే నేటి శ్రీరంగాది దక్షిణదేశస్థ అర్చకస్వాముల మాటలు ఇటువంటివారివలననే అర్థవంతములయ్యే అవకాశం ఉంది. వయసులో

చిన్నవారైన వారు అహంకరించకుండా మరింత కృషిచేసి ఆంధ్రుల పేరు నిలుపుతారని ఆకాంక్షిస్తున్నాను.

ఈవిషయంలో పైజెప్పినవన్నీ అనుకూల ప్రోత్సాహకాలైతే, కొన్ని ప్రతికూల ప్రోత్సాహకాలుకూడా ఉన్నాయి. అనుకూల్యాలు హృదయాహ్లాద కరములై ముందుకు నడిపిస్తే, ప్రాతికూల్యాలు హృదయ శల్యాలై పట్టువదలని, వదలనీని పట్టుదలనిస్తాయి.

అటువంటి వాటిలో "వి.టి.శేషాచార్యులుగారి ' దేవాలయాలుతత్త్వవేత్తలు' అనుపుస్తకంలోని నంబివిమర్శలు మొదటివి. ఈ గ్రంథంలో శ్రీకాకుళం ప్రాంత పాంచరాత్రులను చిన్నచేసే ప్రయత్నంగా ఇచ్చిన సంకలనాలు, వివరణలు పాంచరాత్రులపై వైఖానసులకు గల వ్యతిరేకాభిప్రాయాన్ని స్పష్టంగా ప్రతిబింబింపజేస్తున్నది.

" మీకుటుంబాలలో స్మార్తానుసరణము ఎక్కువ " అనేవారూ, ' బిల్వం ' అంటేనే స్మార్తం అనుకొనే విజ్ఞత కలిగిన అర్వాచీన అర్చనా పరుల మాటలు, అపహాస్యాలు రెండవ అంశం.

నా పరిశ్రమకు, పరిశోధనకు పైనుదహరించిన క్రియాకలాపాలు నాకుగల పట్టుదల పరిశ్రమలనే ఇంధన ప్రజ్వలనానికి అవసరమగు అగ్నినేర్పచి దోహద పడ్డాయి. అందుకు వారికీ కృతజ్ఞుడను. పైజెప్పిన ఆగమకుటుంబాలలోని ఒకవ్యక్తి ఒక ప్రయోగాన్ని నిర్వహిస్తున్నాడంటే, అతనికి ఆ అంశం క్షుణ్ణంగా తెలుసనీ, అతడా సంప్రదాయంలో పుట్టి పెరిగినవాడు గనుక ఆకార్యక్రమ నిర్వహణమునకు అతడే తగినవాడనీ, ఆప్రాంతీయ సమాజం నమ్ముతూ వచ్చింది – అంతేగాక " అర్చకః సః హరిః సాక్షాత్ చరరూపీ నసంశయః " అనే భావనకూడా సమాజానికి ఉంది – నిన్నటివరకూ. ఇట్టి సామాజక స్థితి, సంప్రదాయం గతకాలపు జ్ఞాపకాలుగా అయ్యే పరిస్థితి నేడు కన్పిస్తున్నది. ఈనాడు ఇటువంటి సంప్రదాయ కుటుంబాలలోని యువత లౌకికోద్యోగాలవైపు ఆకర్షింపబడడంతో ఆయా కుటుంబాల సంప్రదాయనిష్ఠ తగ్గి క్రమంగా ఆగమ పరిజ్ఞానం సన్నగిల్లుతోంది. కులవిద్యల సంప్రదాయం పూర్తిగా పోలేదుగాని, సమాజంలో వేరొకవైపు ' ఏపనైనా ఎవరైనా చేయగలరు, అలా ఎందుకుచేయగూడదు' అన్న ఆలోచన ప్రబలుతున్నది. సంప్రదాయ విద్యా విధానంపోయి, పాశ్చాత్య సంప్రదాయానుసారియగు వ్యవస్థీకృత విద్యా విధానం రావడంతో ఈ ఆగమ విద్యలుకూడా నెమ్మదిగా వ్యవస్థీకృత రూపందాలుస్తున్నవి. నేటికీ చాల ఆలయాలలో అర్చన వంశపారంపర్యంగానేఉంటూ ఆయా ఆగమ విద్యలు సంప్రదాయబద్ధంగానే నేర్వబడుతున్నా, కొన్ని క్రొత్త కుటుంబాలు జీవిక కోసం ఇందులో ప్రవేశించడంతో,

ప్రయోగగ్రంథాలకు పాఠాంతరాలూ, ప్రయోగాంతరాలూ ఏర్పడడం, వారివారి ప్రాపకాలకోసం, ఆధిక్యతలకోసం ఒకరినొకరు ప్రశ్నించుకొనడం, మాదే సరియైనదని ప్రచారంచేసుకొనడం జరుగుతున్నది. అంతేగాక దేవాలయ నిర్వహణ పరిపాలనలు సంప్రదాయవాదులగు వంశపారంపర్య ధర్మకర్తలనుండి, స్వార్థపరులగు పెత్తందార్లకు మారడంతో, నేటి ప్రజా ప్రభుత్వం కల్పించుకొని ఆలయ నిర్వహణ పరిపాలన చేపట్టవలసి వచ్చింది - దేవాదాయశాఖ ఏర్పడింది. సంప్రదాయ బద్ధంగా ఆగమవిద్య నేర్చుకొన్న అర్చకుడుకూడ అర్చక పరీక్షలలో ఉత్తీర్ణుడు కావలసి వస్తోంది. పరీక్షలవల్ల సిలబస్ దానివల్ల పుస్తకాలు కావలసి వస్తున్నాయి. ఆస్తిలా దాచుకోకుండా ముందు అందించినవాని గ్రంథం ప్రమాణమైకూర్చొంటోంది. పూర్వాచార్య ప్రోక్తములైన సంప్రదాయ గ్రంథములు తెరమరుగై నవ్య ప్రయోగాలు బోరవిరుచుకొని సంప్రదాయాన్ని ప్రశ్నిస్తున్నాయి. సంప్రదాయంమీద నమ్మకంతగ్గి, అదిసరియైనదేనా, దానికి ఋజువులు చూపుమని అడిగే పరిస్థితులు నేడు కన్పిస్తున్నాయి. అలా ఋజువులు చూపుమనేవారు సాధారణంగా పాంచరాత్ర సిద్ధాంత భాగంలో కృషిచేసి విషయాన్ని తరచిచూచే ఆ ప్రయత్నంలో లభించిన సంహితలు మొదలగువాటిని పరిశీలించినవారు కావడమూ, ఇటువంటి పరిశ్రమలేక పెద్దలనుండి అనూచానంగా ప్రయోగాన్ని నేర్చుకొని నిర్వహిస్తున్నవారగు అర్చక స్వాములు, యాజ్ఞికులు పైవారిని సమాధాన పరచలేక పోవడం తటస్థిస్తోంది. ఫలితంగా సలక్షణమైన ప్రాచీనప్రయోగం అనుమానింపబడి, పనికిరానిదిగా ముద్రవేయబడే అవకాశం ఏర్పడుతోంది.

దీనికి తార్కాణంగా ఇటీవల లేవనెత్తబడిన కొన్ని సైద్ధాంతికాంశాలను చర్చించడం ఇక్కడ అనివార్యమౌతోంది. ఆగమప్రయోగం మంత్రసిద్ధాన్తానుసారి కావలసియున్నదనీ, పాద్మం మంత్రసిద్ధాన్తానుసారి గాన దానిననుసరించి ప్రయోగ ముండవలెని, కొందరు చేసే 3 కలశల పుణ్యాహవాచనము, ఘంటాపూజ, ఆగమార్థంతు శ్లోకపఠనములు తప్పు అన్నవిధంగా " పాంచరాత్ర పరిశోధనమండలి - నిపుణ సంఘం" వారి విమర్శ. (చూడుడు భగవదారాధనావిధి, పీఠిక, పుట3,17 వగైరా) అనగా విష్ణు పాద్మ కపింజలముల సంపుటి తప్పా? పాద్మం తప్ప మిగిలిన సంహితలు మంత్ర సిద్ధాంతానుసారులు కావా? అసలు ఈ సిద్ధాంత భేదం ఏమిటి? మూడు కలశలతో చేసే భగవాత్పుణ్యాహవాచనం తప్పా? ఈవిషయాలు ప్రాచీనులకు తెలియదా? ఈనాడు ఈపరిశోధనమండలివారే కనిపెట్టారా? ఇందు సాంకర్య దోషమున్నదా? - అను ప్రశ్నలకు నిర్మొఖమాటంగా సమాధానములు వెదుక వలసివచ్చినది. వారివిమర్శకు ధన్యవాదములు - ఫలితంగా ఈసిద్ధాన్త భేదాదులమీద సుమారు 30 పుటల గ్రంథం

తయారైనది. ( దాని పూర్తిపాఠాన్ని నిత్యార్చన గ్రంథంలో ఇవ్వడానికి ప్రయత్నిస్తాను.) ఆ చర్చ కంతటకీ ఇది వేదిక కాదుగాన, అవసరం మేరకు ఇక్కడ నాలుగు మాటలుమాత్రం విన్నవిస్తాను.

ఆగమ, మంత్ర, తంత్ర, తంత్రాంతరములని పాంచరాత్రమున సిద్ధాన్తభేదములు నాలుగు. (పాద్మమున మాత్రము మంత్ర, ఆగమ, తంత్ర, తంత్రాన్తరములను క్రమమున నివ్వబడినది.)

అందు మొదటిదగు **ఆగమసిద్ధాన్తము** ప్రకారము జరుగు ఆరాధనమున నుండు భగవన్మూర్తి వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ రూపమై ఏకపీఠమున నుండును. ఈమూర్తులు సితాసిత అంబరధారులు, అలంకార రహితులు, శయనాసన వర్జితులు, దేవీపరివార హీనులు, యోగాసనులు, సమప్రాధాన్య షాడ్గుణ్య భాజనులు. వీరికి ఉత్సవాదులను చేయపనిలేదు. అట్టి దేవులను పూజించువారు కూడ కర్మ సన్యాసులు కావలసియున్నది. వీరికి మూర్త్యంతరార్చనము నిషేధము. వీరికి వేదములేదు, సావిత్రీమంత్రములేదు. స్వాధ్యాయజపకర్మలులేవు. చతుర్వర్ణములు సమానము. వీరు గోత్ర ప్రవర వర్జితులు. జాతులయందు ఉత్కర్ష అపకర్షలు లేవు. ఫలమందు నిస్పృహులు. కేవల ద్వాదశాక్షర చింతనులు. సూతకాశౌచ వర్జితులు. వీరికి కర్షణాది కర్మలయం దధికారములేదు. ఇందు దేవపూజన మంతయూ మోక్షైక ఫలప్రదము. మౌద్గలాదులగు నీ యేకాయనులకు ప్రాణ నిర్యాణమైన పిదప వారి శరీరమును తాకరాదు, దహించరాదు- పుత్ర పౌత్రాదిరహితమనురీతిని కాష్ఠమువలె బయట వదలి వేయవలెను. ఇది కృతయుగ ధర్మమై ఆయుగాంతమున అంతరించినది. ( అలా కానిచో ఆసలుస్వామితోబాటు అర్చక స్వాములు వారితో ఇతరులు కర్మ సన్యాసులు కావలసి వచ్చియుండెడిది. )

రెండవదగు **మంత్రసిద్ధాన్తము** భోగమోక్ష ఫలప్రదము. ఏకమూర్తి ప్రాధాన్యముకలది. ఇందు శ్రీయాది దేవేరులనుకూడ పరివారవత్ అర్చించవలసి యున్నది. ఉత్సవములు అలంకారములు అధికము. వైదికమార్గము నవలంబించుటచే వేదమంత్రానుసంధానము తప్పనిసరి. మంత్రములకు ఋషిచ్ఛందములుండును. నేడు లభించే పాంచరాత్రాగమ సంహితలన్నియూ మంత్ర సిద్ధాన్తానుసారులేయని పెద్దలు చెప్పుచున్నారు.

పరవ్యూహాది భేదమును వదలి మూర్త్యారాధనముచేయుట కేవల **తాన్త్రికము.** ఇది త్రయీమార్గ గామికాదు. మంత్రములు ఋషి చంద విహీనములు. ధ్వజారోహణ మాసాద్యుత్సవములిందు లేవు.

చక్రాబ్జమండల, కుంభ, ప్రతిమా పావకులయందు యజనము - త్రివక్త్ర చతుర్వక్త్ర అధికాననులలో నొక దేవుని, యోగపీఠస్థుడగువానిని, పరివార యుతుని సేవించుట **తన్త్రాంతరము.** బీజశక్తి అంగ సంయుతములగు మంత్రములు, పిండ మంత్రములు, కళా మంత్రములతో బ్రాహ్మణాదులగు నాలుగు వర్ణములవారు సమర్చించ వచ్చును. వీరికి నిషేకాద్యఖిల క్రియలు తన్త్రాన్తరోక్త మార్గమున చేయవలెను.

ఇక సిద్ధాన్తసాంకర్యము - పూర్వులనుసరించిన ఒక సిద్ధాంతమును వదలి వేరొకదాని ననుష్ఠించుట వలన నరుడు కిల్బిషు డగుననియు, గాన జన్మప్రభృతి ఒకే సిద్ధాంతము ననుష్టించవలె ననియు, వేరు రాద్ధాంతము చేయవలదనియూ, అలా చేసిన, చేయువాడు చేయించేవాడు (కర్తా, కారయితా) ఇరువురూ తమతమ వంశంతోబాటు నశిస్తారని చెప్పబడింది. -- (పాద్మ. చర్యా 21. 25-79)

విష్ణు సంహిత బ్రహ్మోత్స వాధ్యాయమున " మంత్రసిద్ధాన్త మ్మార్గమున నవరత్నములని 9 సంహితలు ప్రసిద్ధములని, అవి పాద్మ, విష్ణు, కపింజల, బ్రహ్మ, మార్కండేయ, శ్రీధర, పరమ, భారద్వాజ, నారాయణ తంత్రములని చెప్పబడినది. ( " మంత్ర సిద్ధాన్త మార్గేషు నవరత్నం ప్రసిద్ధకం । ఏతదుక్త ప్రకారేణ వక్ష్యామి కమలాసన । పాద్మ తంత్రంతు ప్రథమం ద్వితీయం విష్ణు తంత్రకం । కాపింజలం తృతీయంస్యాత్ చతుర్థం బ్రహ్మ సంహితా । మార్కండేయం పంచమంతు షష్ఠం శ్రీధర సంహితా । సప్తమం పరమం తంత్రం భారద్వాజం తథాష్టమం । శ్రేష్ఠం నారాయణం తంత్రం నవరత్నముదీరితం॥ " అను ఈశ్లోకం విష్ణు తంత్రంలోనిదని పారమ సంహిత ప్రస్తావనలో (పుట 39) శ్రీశేట్లూర రాజగోపాలాచార్య వ్రాసియున్నారు)

పైవానిని గమనించిన ఎవరు ఏసిద్ధాంతము ననుసరించుచున్నారో విజ్ఞులు నిర్ణయించగలరు.

ఇక 3 కలశలతో పుణ్యాహ మొనరించుట భారద్వాజ సంహితోక్త ప్రయోగాన్తర్గతము. (వివరములకు చూ...అనుబమధము 3) ఘంటాపూజ ఆగమార్థంతు వంటివి సంహితలు చెప్పినవే. భగవత్కల్యాణాదులయందు, కాలక్రమమున కొన్ని లౌకిక ప్రక్రియలు భక్తజనాహ్లాదమునకై చోటుచేసుకొన్నవి. అట్టి లౌకిక ప్రక్రియలతో కూడిన ప్రయోగములు " భగవత్సాన్నిధ్యాదాయకములై, మన్త్రారాధన నిరపేక్షములై, భక్త జన సమవాయ మాత్రమున పరమాహ్లాదక నిత్యోత్సవ పక్షోత్సవాది విశేష విధులవలన సంపన్నములగు చున్న" వని శ్రీమాన్ ఎంబార్ కృష్ణమాచార్యులు వంటి పెద్దలు చెప్పిన దెంతయూ గమనార్హము. **"అన్యచ్చ మంగళం సర్వం కుర్యాత్ లౌకిక వర్త్మనా"** **అంటూ పాద్మం (క్రియా- 30.30)** అటువంటి వానిని జరిగించుట కధికార

మిచ్చుచున్నది. అగ్నికార్య విధియంతయూ గృహ్యసూత్రానుగుణముగా జరిగించుట కంటె గత్యంతరము లేదుకదా! గాన వీనిని స్మార్త కర్మలని, మానుష యాజ్ఞికములని శంకించుట తగదు.

అంతమాత్రమున గతమంతా మంచిదని గాని, తద్భిన్నమైన దెవ్వరుచెప్పినా వినిపించుకొన వద్దనికాని చెప్పడం ఈవ్రాతల ఉద్దేశంకాదు. శతాబ్దాల తరబడి ప్రచారంలో ఉన్న ఈఆగమ ప్రయోగ పాఠాలలో స్ఖాలిత్యాలుండవచ్చు, కొన్ని చోట్ల గ్రంథం స్థానభ్రంశంపొంది ఉండవచ్చు. జరిగినవానిలో కొన్ని మార్పులు ఏవిధంగానూ సమర్థించడానికి అవకాశంలేనివి కన్పించనూ వచ్చు. అటువంటి వానిని సంస్కరించడము, స్వ పరభేదం చూపకుండా మంచిని గ్రహించడం ఈ గంథ పరిష్కర్త ఉద్దేశమని వినమ్రంగా విన్నవిచేస్తున్నాను. అలాగే పాతదానిని సమూలంగా మార్చి క్రొత్త ప్రతిని వ్రాయడమూ ఈపరిష్కర్త ఉద్దేశంకాదు. సలక్షణమైన ప్రాచీనపాఠం తయారు కావాలన్నదే ఈకృషికి పరమార్థం. ఈవిధమగా వంశపారంపర్యంగా కుటుంబాలలో ఉన్న ప్రయోగ గ్రంథాలు ఈనాడువెలుగు చూడకపోతే, తాము సలక్షణమైనవి సాధికారికమైనవి అని నిరూపించు కొనకపోతే, అవసరార్థం నిన్న మొన్న తలెత్తిన గ్రంథాలు ' ముందువచ్చిన చెవులకన్న వెనువచ్చిన కొమ్ములువాడి ' అన్నసామెతను నిజంచేసే ప్రమాదం ఉంది. ఈవిధంగా ప్రమాదం హెచ్చరించడంవలనా, అవసరం వత్తిడి చెయ్యడంవలనా నేడు సంప్రదాయ ప్రయోగ గ్రంథాల పరిష్కరణ ముద్రణ తప్పనిసరై, ఇంతవరకూ మాకుటుంబాలలో ఎవరూ చేయని ఈపనిని చేయవలసి వచ్చింది.

మాతృకాది గ్రంథ సంపాదనము : -ఈ గ్రంథ సంపాదనమునకు అద్యులు మాపూర్వాచార్యులు. వారు 11 వ శతాబ్ది ఉత్తరార్థమున భగవద్రామానుజులనుండి శ్రీకూర్మక్షేత్రమున వైష్ణవస్వీకార మొనర్చిననాటినుండి ఈప్రయత్నము మొదలైన దనవచ్చును. ఇది మాపూర్వీకులదైన మాసంపాదన మనుటకంటె శ్రీమద్రామానుజులు మాకు, తద్వారా ఆంధ్రులకు ఇచ్చిన వరదాన మనుట సమంజసము.

మొదట మాతండ్రిగారు శ్రీమాన్ రేజేటి రంగాచార్యులుగారు (కామరాజుపేట) 1926 సం॥రంలో వ్రాసుకొన్న కళ్యాణం ప్రతి, కాగితపు బైండు పుస్తకాన్ని, ప్రస్తుతం కామరాజుపేటలో ఉన్న మాతమ్ముడు శ్రీధరాచార్యులునుండి తెచ్చి వ్రాసుకొన్నాను. చామార్తివారు ఆద్యులుకదా అని ఆనాడు రాజమండ్రిలో ఉన్న చామర్తి జగన్నాథాచార్యులుగారి కల్యాణ ప్రతికోసం ప్రయత్నించాను. నేనుచేసేపని ఇష్టంలేదో ఏమో వారు ' మామిడాడలో నాగ్రంథం ఉండిపోయింది' ' అని తప్పించుకొన్నారు.

ఆ తర్వాత కోటఉరట్ల దొడ్డిపట్ల వారి సౌజన్యంతో రేజేటి శింగరాచార్య, దొడ్డిపట్ల ఉప్మాకయ్యగారి ప్రాచీన తాళపత్ర ప్రతులు, బొబ్బిలి చామర్తి సీతారామా చార్యులు, అంపోలు సీతారామాచార్యులు గార్ల సహాకారంతో శ్రీకూర్మాది పూర్వ పాఠాలు తాళపత్రప్రతులు సంపాదించగలిగాను.

మాతాతగారు రేజేటి పెదవేంకట నరసింహాచార్యులు గారి తండ్రి శ్రీరంగనాయకులు అనబడే రంగాచార్యులుగారు వ్రాసుకొన్న కల్యాణం, తాళపత్ర గ్రంథాన్ని, మా పెదతండ్రిగారు సీతారామాచార్యుల (చిట్టిబాబు) గారి కుమారుడు, తమ్ముడు ధర్మాచార్యులనుండి (రోలుగుంట) తీసుకొనివచ్చాను.

బొబ్బిలి వాస్తవ్యులు, ప్రస్తుతం అమెరికా న్యూజెర్సీలో ఉన్న వేంకటేశ్వర దేవాలాయార్చకులు, మాచెల్లెలి భర్త అగు శ్రీమాన్ భద్రం వేంకట రమణాచార్యులు, బొబ్బిలి అంపోలు వేంకట రాఘవాచార్యులు గార్ల నుండి ఇటీవలి కాగితపు ప్రతుల కాపీలను సేకరించాను.

మాపినతండ్రిగారు రేజేటి గోపాలాచార్యులుగారు (వేళంగి) నా ఈ గ్రంధనిర్మాణ ప్రయత్నం సేకరణ దశలో ఉన్నపుడు, నాప్రయత్నాన్ని విని ఎంతో ఆనందించి ఆశీర్వదించారు. మాపూర్వులు, పాంచరాత్ర రేజేటి వంశానికి మూలపురుషులు అగు బలరామయ్యగారి చేతివ్రాతతో ఉన్న తాళపత్ర గ్రంధాన్నిచూచి ఆయన ఎంతో సంతోషించారు. అయన అరోగ్యంసరిగా లేకపోవడం, ఈగ్రంధనిర్మాణం సరిగా మొదలుకాకుండానే అయన పరమపదించడం, నాకేకాదు ఆగమకుటుమబాలకే తీరని లోటు. ఆగమ ప్రయోగాన్ని క్షుణ్ణంగా నేర్చుకొన్నవారు, పాతతరం సంస్కృతపండితులు, ఆగమ ప్రయోగ దక్షులలో అగ్రగణ్యులు అగు శ్రీగోపాలాచార్యులుగారి ముఖతః ఏ విషయమూ తెలుసుకొనే అవకాశం లేనందువల్ల నేను ఈ గ్రంథనిర్మాణ విషయమలో పదిమంది వద్దకు వెళ్ళవలసి వచ్చిందిగాని, అయనే ఉంటే నేను మరొకరి వద్దకు వెళ్ళనవసరం ఏర్పడేదికాదు. వారికుమారుడు నరసింహమూర్తినుండి ముద్రిత పాద్మ విష్ణుతిలక సంహితలను తెచ్చుకొనగలిగాను కాని పైతృకమగు ఆగమ ప్రయోగ విజ్ఞానాన్ని సంపాదించ లేకపోయాను. మా మేనల్లుళ్ళు కాకినాడ గీతామందిరం పొందూరు సత్యనారాయణాచార్యులు, పొందూరు కృష్ణమాచార్యులనుండి కపింజలం విష్ణిసంహిత మొదలగు గ్రంథాలను తెచ్చి ఫోటో కాపీలు చేయించు కొన్నాను. మిగిలిన సంహితలు కొన్నికొనడం కొన్నింటిని తిరుపతి శ్రీమాన్ కె.వి. రామకృష్ణమాచార్యుల వారి సహకారంతో ఫోటోకాపీలు చేయించి తెచ్చుకోవడం జరిగింది.

నాప్రయత్నం ఇలా సాగుతూ ఉండగా నేను చేస్తున్న కృషిని చూచి, సహృదయంతో తనవంతు సాయం అన్నవిధంగా శ్రీమాన్ పొందూరు లక్ష్మణాచార్యులుగారు వారివద్దనున్న కల్యాణగ్రంథాన్ని డి.టి.పి చేయించి ఆ కాగితాలను నాకిచ్చి నీపని కానియ్యమని ప్రోత్సహించారు. ఆనాటినుండి ఈపరిశోధనా కార్యక్రమంలో నాకు ఒక తోడు ఒక అండ లభించింది. వారికుమారుడు, మాతమ్ముడుగారి అల్లుడు అయిన గోవిందాచార్యులుకూడ నాతోపాటు సంహితా సంపాదన విషయసేకరణములయందు చురుకుగా పాల్గొన్నాడు. ఇద్దరం కలిసి తిరుపతినుండి తమిళంతెలిసిన శ్రీ ఎల్. వెంకటేశన్ గారిని తీసుకొని కుంభకోణం, శ్రీరంగం వెళ్ళి అక్కడ కల్యాణ ప్రయోగాన్నిగూర్చిన వివరాలు సేకరించాము. నామటుకు నేను భద్రాచలం, నెల్లూరు మొదలగు ప్రాంతాలకు వెళ్ళి విషయ సేకరణ చేశాను.

**ఇక ఈ కల్యాణగ్రంథానికి సంబంధించిన వివిధాంశాల పరిష్కరణమును ఈక్రింద వివరంగా ఇస్తున్నాను. -**

ఈ భగవత్కల్యాణ మహోత్సవమను ప్రయోగ గ్రంథం మాపూర్వులకు దక్షిణదేశంనుండి సంప్రాప్తించింది. ఈనాటి దక్షిణదేశ ప్రతికీ మా ఈ గ్రంథానికీ పోలికలూ ఉన్నాయి, భేదాలూ కన్పిస్తున్నాయి. ఇవి శతాబ్దాల కాలగతిలో ఏర్పడినమార్పులు. - ప్రాంతీయ ఆచార వ్యవహారాలకూ అభిరుచుల ప్రభావానికి లోనై జరిగిన మార్పులు గా వీనిని పరిగణింప వచ్చును.

మాపూర్వులు తమ ఉపయోగార్థం వ్రాసుకొన్న వాటిలో లభ్యమైన, క్రీ॥శ 1800-1915 మధ్యకాలంనాటి 12 తాళపత్ర ప్రతులను, 1926 నుండి 1990 మధ్య వ్రాసుకొన్న 9 కాగితపు ప్రతులను వానికి సంబంధించిన ఇతర గ్రంథములను పరిశీలించి పాఠపరిష్కరణము చేసియున్నాను.(చూడుడు అధార గ్రంథముల పట్టిక) ఏ ఒక్క గ్రంథమునూ ప్రధాన మాతృకగా పరిగణించక సంహితానుగుణ్యత నిర్దుష్టతలకు ప్రాధాన్య మిచ్చి యున్నాను. ఆయా పాఠముల యందలి అంశములయొక్క ప్రామాణికత్వ విషయమున ఉపయుక్తములగు పాంచరాత్రాగమ సంహితాంశములను అధస్సూచికల యందు అనుబంధములయందూ పొందుపరచినాను. అగ్నికార్య విధివంటి అంశముల సంహితానుగుణ్యతయే కాక శ్రౌత స్మార్తానుసరణమును గూడ, సుప్రసిద్ధ శ్రౌత పండితులు బ్రహ్మశ్రీ చిర్రావూరి శ్రీరామశర్మగారి సహకారముతో, ఇచ్చియున్నాను. (విష్ణు పాద్మ కపింజల పురుషోత్తమ నారాయణ భరద్వాజ విష్ణుతిలకాది సంహితలను క్రియాకైరవ చంద్రికను పరిశీలించిన మీదట ఆగమప్రయోగమున ఆయా విషయములయందు శ్రౌత

స్మార్తానుసరణమును సంహిత లంగీకరించినవనియూ, అవశ్యమని భావించినవనియూ, స్మార్తమన్న పరిత్యాజ్యార్థమని భావించలేదనియూ తేలినది.) ఈమా గ్రంథములపై వచ్చిన ప్రత్యక్ష పరోక్ష విమర్శలకు సమాధానమును కూడ ఇచ్చియున్నాను. సద్విమర్శలను స్వీకరించి ఒకటి రెండు చోట్ల అయావిషయములను సంస్కరించియున్నాను. వివిధ సంహితల యందలి విషయముల నవాగాహన మొనర్చుకొనుటకై, సరిపోల్చుటకై నేను వ్రాసుకొన్న ఆయా సంహితాంశముల సారాంశములను, సంస్కృత శ్లోకాలు చదవడానికి ఇబ్బంది పడే జిజ్ఞాసువులకు పనికివస్తుందని, ఈవిధంగానైనా సంహితాంశములను తెలుసుకొని అర్చక స్వాములు తమకు ఎదురుపడు విమర్శలకు తగిన సమాధానం చెప్పి పూర్వాచార్యుల గౌరవాన్ని నిలుప గలుగుతారని ఆశిస్తూ గ్రంథవిస్తరభీతిని మరచి వానిని అనుబంధములలో ఇచ్చియున్నాను.

ఈవిధముగా తయారుచేసిన గ్రంథమును సంపాదక మండలియందు పేర్కొన్నవారిలోగల పెద్దలకు వ్యక్తిగతముగా వినిపించి, వారినుండి అయా అంశముల సాధుత్వాసాధుత్వములను, ఆయా దేవాలయములయందు జరుగుచున్న క్రియాకలాపములను తెలిసికొని, సాధక బాధకములను చర్చించి సరిచేయుటచే పూర్వాచార్యానుగుణ్యత సంప్రదాయత్వములు సాధింపబడుటయేగాక , ఈనాడు దేవాలయములయందు వివిధకార్యక్రమములను నిర్వహించుచున్న అర్చకస్వాముల కుపయోగకరముగా ఈగ్రంథము తయారైనదని భావించుచున్నాను.

బరంపురం వాస్తవ్యులు, పెద్దలు, గురువులై విద్యార్థులకు ఆగమ పాఠములను చెప్పుచున్న శ్రీమాన్ చామర్తి చినవేంకటాచార్యులవారు తప్ప మిగిలిన వారందరూ నా ఈ ప్రయత్నాన్ని సహృదయమతో ప్రోత్సహించారు.

కల్యాణోత్సవ విధికై పాద్మ, క్రియాకైరవచంద్రిక, పురుషోత్తమ, కపింజల, నారాయణ , విష్ణు సంహితల యందలి ఉత్సవ విధులను యథాశక్తి పరిశీలించితిని. ప్రయోగ నిర్వహణ దక్షులగు పెద్దలనడిగి తెలిసికొంటిని. పాద్మము (చర్యా 11 అధ్యా.) మహోత్సవమును పేరున వివరింపగా, దానినే పురుషోత్తమ సంహిత (24 అధ్యా.) బ్రహ్మోత్సవమనియు, కపింజలము ఉత్సవమను పేరున (23 అధ్యా.) వివరించినవి. క్రియా కైరవ చంద్రిక పూర్తిగా పాద్మము ననుసరించినది. మహోత్సవ బ్రహ్మోత్సవములు ఆయా పదములు సూచిస్తున్న విధమున 9 దినముల పర్యంతంజరిగే పెద్దఉత్సవమును వర్ణించినవి. తొమ్మిది దినములయందు 9 విధములగు వాహనములతో గ్రామోత్సవమే గాక, 9 విశేషోత్సవములుగూడ వర్ణింపబడినవి.( ఈ గ్రంథము నందలి ఉత్సవాంగీకారం 3 వ కారికలో గల (పుట 18) ' అష్టాదశదినే తీర్థ నక్షత్రం కరిష్యే ' అన్న కారికను

గమనిస్తే చాలసంహితలకంటే ఈ ప్రయోగము ప్రాచీనము కావచ్చు ననుభావన కలుగుతున్నది) అటువంటి విశేషోత్సవములయందు మొదటిదినమున జరుగు ఉత్సవము కల్యాణోత్సవమని పురుషోత్తమసంహిత పేర్కొన్నది. పాద్మము దీనిని పాంచాహ్నికముగా వివరిస్తూ పాణిగ్రహణ విధియన్నది (క్రియా 30 అధ్యా). ఏకాహ్నిక త్రయాహ్నికములకు తప్ప మిగిలిన అన్ని ఉత్సవములకూ ధ్వజకర్మ విధించబడినది. ఆయాసంహితలు ధ్వజారోహణవిధిని వేర్వేరు అధ్యాయములయందు చెప్పినవి. (ఆయా అంశములు 9వ అనుబంధమున నివ్వబడినవి.)

ఈ ప్రయోగ గ్రంధము 'శ్రీవిష్ణు పాద్మ కపింజలోక్త' మని చెప్పబడుచున్ననూ ఈ గ్రంధమునం దధికభాగము పురుషోత్తమసంహిత ననుసరించుచున్నది. ఎడనెడ భారద్వాజాది సంహితల ప్రభావముకూడ గలదు. పురుషోత్తమ సంహితను పాద్మము తన 108 సంహితలలో పేర్కొన్నది ( అనంతాఖ్యం మహీప్రశ్నం శ్రీప్రశ్నం పురుషోత్తమం ...' అని పాద్మ.జ్ఞాన 1.101 ) గాన దీనిని పూర్తిగా అర్వాచీనమని తీసివేయ వీలుపడదు. అందుచే పురుషోత్తమ సంహిత యందలి కల్యాణోత్సవ విధియందలి ముఖ్యాంశములను గూడ అనుబంధము 2 న ఇచ్చియున్నాను.

ఈనాటి కాలమానపరిస్థితులను దృష్టిలోనుంచుకొని చాల దేవాలయముల యందు పాంచాహ్నికముగా భగవత్కల్యాణము జరుపబడుచున్నది. నాకు తెలిసినమేరకు భద్రాచలదేవాలయమున, బొబ్బిలి వేణుగోపాలస్వామి దేవాలయమున నేటికినీ నవాహ్నికముగా కల్యాణ మహోత్సవము నిర్వహింపబడుచున్నది. ఈ ప్రాన్తమున, ఉన్నమేరకు, వాహనములతో ఒకదినమున గ్రామోత్సవమును నిర్వహించుచున్నారు. మిగిలిన విశేషోత్సవములలో వనవిహార, సదస్య. మృగయోత్సవముల వంటివి జరుపబడుతూ మొత్తం పాంచాహ్నికంగా భగవత్కల్యాణం జరుపబడుతున్నది. అందుచే చాలపారములలో వాహనోత్సవములకు కారికలు లేవు. బొబ్బిలిలో అంపోలు సీతారామాచార్యులుగారి వద్ద రధోత్సవకారిక లభించగా దానిని పొందుపరచితిని. అన్నీ కాకపోయినా, మహోత్సవమున జరుపవలసిన కార్య క్రమములు చాలవరకూ ఉన్నవి గనుక, కల్యాణ ప్రాముఖ్యతతో దీనిని కల్యాణ మహోత్సవము అనుట సంప్రదాయముగా వచ్చుచున్నది. బాలసీమ వాస్తవ్యులు చామర్తి జగ్గప్పలాచార్యులవారి సూచన మేరకు ఈగ్రంధ నామమును " భగవత్ కల్యాణ మహోత్సవము " గా నిర్ణయించడ మైనది.

ఇట్టి ఈ భగవత్కల్యాణమహోత్సవ గ్రంధమునగల వివిధాంశముల విన్యాసాన్ని ఈ క్రిందనిచ్చు చున్నాను.

**1. విష్వక్సేనపూజ :** - అన్నిపాఠములలో విష్వక్సేనపూజ ముందు కన్పిస్తున్నా మొట్ట మొదట చెప్పబడు సంకల్పమున పుణ్యాహవాచనాంతర్గతముగనే విష్వక్సేనపూజ పేర్కొనబడినది. చాలవరకూ సంహితలుగూడ పుణ్యాహ వాచనమునే ముందుగా చెప్పినవి. ఒక్క శ్రీప్రశ్న సంహిత మాత్రము (31.2-25) మృత్సంగ్రహణమునకు ముందుగా విషక్సేనపూజను ఆపైన పుణ్యాహవాచనమును విధించినది. పాంచరాత్ర సిద్ధాంతమున విష్వక్సేనుడు అనపాయనులలో ఒకడు. ఈయన విష్ణుసేనాధిపతి కూడ. పాంచరాత్రమున వాసుదేవుడే పరతత్త్వము. ఆయనకే అగ్రపూజ. వేరే ఏదేవతనైనా పరివారవత్ అయన తర్వాత పూజించవలసినదే. గాన విష్వక్సేనున కగ్రపూజ పాంచరాత్రాగమ విహితమా ? అన్న ప్రశ్న ఉదయించుచున్నది. విష్వక్సేన ప్రథమపూజనమును బలపరుస్తూ " విష్వక్సేన స్స్మృతానేతా భగవాన్ సర్వకర్మణా । తస్మా న్నాన్యముపాసీత కర్మణా విఘ్న శాంతయే.। ఆరంభే కర్మణాం పుణ్యే ః.విఘ్నానాం ప్రశమాయచ । కుర్యా త్సపరివారస్య విష్వక్సేనస్య పూజనం ॥ " అను శ్లోకం భరద్వాజ సంహితోక్తమని చెప్పబడుచున్నది గాని నేను చూచినంతవరకూ ఈశ్లోకము భారద్వాజ సంహితయందు కన్పించలేదు.

**2. పుణ్యాహవాచనము :** - పుణ్యాహ ప్రక్రియ స్మార్తంలోనూ వైష్ణవాగమ గ్రంథాలలోను ఉన్నది. రెండుచోట్లా అది శుద్ధికార్యక్రమముగనే కన్పిస్తున్నది. వైష్ణవాగమ పుణ్యాహములలో వైఖానసమున (వాసాధికారమున) చెప్పబడిన పుణ్యాహమునకు స్మార్త పుణ్యాహమునకు పోలికలున్నవి. పాంచరాత్రమున (విష్ణుతిలకమున) గల వాసుదేవ పుణ్యాహమునగూడ స్మార్తానుసరణము గలదు.
(పూర్తి వివరములకు చూ.. అను. 3, పుట 280)

ఈగ్రంథమున పూర్వాచార్య ప్రోక్తమగు భగవత్పుణ్యాహము చెప్పబడినది. ఈ భగవత్పుణ్యాహవాచన గ్రంథము చాలవరకూ వాసుదేవ పుణ్యాహ గ్రంథమే - ఒక్క కలశ సంఖ్య, ధర్మ జ్ఞానవైరాగ్యములను వాటి పేర్లు, ఆకలశలకు సంబంధించిన కారికలు, ఒకటిరెండు వేదమంత్రములు తప్ప మిగిలినదంతయూ వాసుదేవపుణ్యాహవాచనమే యథాతథముగానున్నది. గాన భగవత్పుణ్యాహము వాసుదేవ పుణ్యాహమేగాని కేవల స్మార్త పుణ్యాహవాచనము గాదని, పూర్వాచార్యులు తగు కారణములుండుటచే

ప్రక్రియయందు కొన్ని సవరణలు చేసియుండ వచ్చునని విజ్ఞులగు పెద్దలకు వినమ్రంగా మనవిచేస్తున్నాను. ఇది కేవలం మావారే చేసిన మార్పు కాకపోవచ్చునీ, ఈమా పాఠానికి మూలరూపంలా కనిపిస్తున్న పాఠం, కలశల పేర్లతోసహా, అదయార్ లైబ్రరీలోగల M.S 10-i-18 నెంబరుగల ప్రతియందు (నాగరిలిపిలో) ఉన్నదనీ, అనుబంధం 3, పుట 283 నందు ఇవ్వబడిన దాని పూర్తిపాఠాన్ని గమనించవలసినదనీ మనవి.

**3 ఉత్సవాంగీకారము :** - ఇందలికారికలు కొన్ని స్థానభ్రంశము నందినట్లు భావించబడినది. పూర్వ పాఠాలలో " ప్రీయతాం సర్వలోకేశ ... కృతముత్సవం ప్రతిగృహీష్వ । న్యూనాపచారాన్క్షమస్వ । త్వాం నమామి నమామి " అను కారిక, " కమాలాయువతీ కరకమలకలిత ... " అనేకారిక ఈరెండూ గరుడపీఠికపేరుతో ఉన్నవి. వీనిలో ఒక్క గరుడ పటం సముద్ధాప్య అన్నది తప్ప మిగిలినదంతయూ చేయబోయే ఉత్సవాన్ని స్వీకరింపుదని భగవంతుని ప్రార్థించడంగా ఉన్నదిగాని గరుడ పీఠికగా కన్పించదు. ఈకారికల అనంతరం " ద్విజపతిం స్వర్ణపక్షద్వయ ధరం .... పరిగీయమానం అర్ఘ్యపాద్యాదిభిరభ్యర్చ్య ।... " అను గరుడ వర్ణనతో ఒక కారిక, ఆపైన " జయజయ ద్విజేంద్ర । మాతృదాస్య పరిమోచక .... " అను గరుడ గద్య, అపైన సప్తతాళములు, ఖగేశ్వర నవకం అనబడే 9 శ్లోకములు ఉన్నవి. ఇవి గరుడ సంబంధులు.

అర్థవత్ ఇది ఇలా ఉండగా మరికొన్ని విషయాలను గూడ గమనించవలసి యున్నది. పైనాలుగు కారికలకు ముంతుగల గ్రంథము దేవతాహ్వానమనబడు అష్టదిక్పాల గద్యలు. ఆ గద్యలలో ప్రతిగద్యయందూ 1. బలిదానం, 2.చూర్ణిక, 3.గద్య 4. తాళఘోష అనేవి క్రమంగా ఉన్నాయి. పైవాని వలెనే గరుడుని విషయంలోకూడా 1. "ద్విజపతిం" అనేది చూర్ణిక అవాల్సి ( పీఠికఅనిఉంది), 2.జయజయద్విజేంద్ర అనేది గద్య 3. గోఖండాదులు తాళగేయములు. పైగా ఈ అష్టదిక్పాలక గద్యలు గరుడ గద్య చాలవరకూ భరద్వాజ సంహితోక్త వివాహ ప్రయోగం (అదయార్ ప్రతి) యందు కూడ కన్పిస్తున్నవి.

గాన " ప్రీయతాం సర్వలోకేశ...", "కమలాయువతీ..." అనుకారికలు రెండూ ఉత్సవాంగీకారముగా అర్థవత్ కన్పించుటచేతనూ, బొబ్బిలి అంపోలు వేంకట నరసింహాచార్య, అంపోలు సీతారామాచార్యులు గార్ల ప్రతులయందు ఇదే ఉత్సవాంగీకారము పుణ్యాహ వాచనానంతరం కన్పించుటచేతనూ, భరద్వాజ సంహిత

ఉత్సవాంగీకారమును పుణ్యాహానంతరం విధించుటచేతనూ, భద్రాచలమున ఈ " ప్రీయతాం ..." అను కారిక కొన్ని మార్పులతో నిత్యంజరుగు ప్రబోధోత్సవమున ఉండుట చేతనూ-ఈకారికలు రెండింటినీ మృత్సంగ్రహణమునకు ముందు జరుగు పుణ్యాహా నంతరం జరిగించవలసిన ఉత్సవాంగీకారముగా భావించి అక్కడకు మార్చ బడినది.

కుంభకోణముననున్న దేవుడు శార్ఙ్గపాణి. " శార్ఙ్గపాణేర్మహోత్సవోయం " అనేకారిక కొద్దిపాటిమార్పులతో కుంభకోణం వారి గ్రంధముననుండుట ఆగమ ప్రయోగ విషయమునగల ఆంధ్ర దక్షిణదేశ సంబంధమును తెలియజెప్పుచున్నది.

**4. ఋత్విగ్వరణం : –** ఇది ఋత్విజులను వరించుట అనగా ఎంపిక చేసు కొనుట. ( సూర్యరాయాంధ్ర నిఘంటువు వరణమునకు ఎన్నుకొనుట, ఎంచుట , ఋత్విగాదులను పుజించుట , కన్యను వరించుట అనుఅర్ధములనిచ్చినది ఎన్నిక Elect అను అర్ధమున స్థిరపడినది గనుక, Select అను అర్ధమున ఎంపిక వాడబడినది ) ఇదికేవలము ఋత్విగ్వరణమేగాక ఆచార్య వరణముగూడ. వైదిక తాన్త్రిక యాగములయందు యజనాధ్యాపన సమర్ధుడగు వ్యక్తిని ఆచార్యునిగా ఎంపిక చేయుట మొదటిది. మంత్రదీపనమునకు బ్రహ్మనూ, హవన నిర్వహణమునకు హోతలనూ ఎంచుకొనుట ఇందనంతర కార్యక్రమము. కార్యక్రమమంతయూ ఆచార్యుని "అధ్వర్యమున " జరుగవలెననుట యజుర్వేదీయ పరిభాష.

**5.రక్షాబంధనం –** రక్షాసూత్రము, ప్రతిసరము, కౌతుకము, కంకణము అనునవి సంహితలయందు చాలవరకూ సమానార్ధకములుగా వాడబడినవి. " కంకణో నప్రతిసర మిత్యరమాలా" అని అమరకోశము. భరద్వాజ విష్ణుతిలక సంహితలనుండి పూర్వాచార్యులు సేకరించిన రక్షాసూత్ర ప్రమాణ, అర్చనాదివిధులు అనుబంధము 4 పుట285 యందు పొందురచ బడినవి . వివాహప్రయోగమున గల " పద్మప్రియే విష్ణు పత్నీం జితంతయితి ... " అనుకారిక కంకణ బంధనమే. కొందరు ఇక్కడ ఉన్న ప్రతిసరమును ప్రతిసీరము చేసి, తెరయని అర్ధముచెప్పి, తెరపట్టిస్తున్నారు. అంత ఇబ్బంది పడవలసినపనిలేదు. వివరములకు 186 వ పుట చూడగలరు.

**6. పరిషదర్చనం : –** పారిషదులకు చేయు విజ్ఞాపనయుత గౌరవము పరిష దర్చనము. వారికిచ్చు దక్షిణయే పరిషద్దక్షిణ. "అట్టి ఈ పరిషద్దక్షిణనిచ్చు పద్ధతిచే శ్రీమన్నారాయణుడు ప్రీతినందుగాక " అను అర్ధమిచ్చు కారిక ఇందుండుటచే ఈపరిషద్దక్షిణను భగవంతునకు సమర్పించుట కన్పించుచున్నది. ఇది వారివారి అలవాటు కావచ్చు కాని అర్ధవంతముగా కన్పించుటలేదు. ఈ పరిష ద్దక్షిణ అర్చకస్వామి జరిపించు సామాజకమైన పండిత మర్యాద.

**7. ఇడావాచనం** :- ఇడావాచనం భారద్వాజ సంహితోక్తమగు పూర్వాచార్య ప్రయోగము. దీనిని పాద్మాది సంహితలు విధించలేదు. నాందీముఖులగు పితృదేవతలను ఆహ్వానించుట భారతీయులు కల్యాణాదికర్మలయందు చేయు ఒక విలక్షణ సంప్రదాయము. అసలు వివాహమే మానుష /స్మార్త ప్రక్రియ. ఇడావాచనం వంటి వానిని వదలివేస్తేనే, తమిళపదాలనూ తమిళదేశాచారాలనూ అనుకరిస్తేనే, కేవలం వైష్ణవత్వం సిద్ధిస్తుందని భావిస్తే అలానే చేయవచ్చు.

**8. మృత్సంగ్రహణం, అంకురారోపణ, అగ్నిముఖం, ద్వారతోరణాది పూజలు, హోమములు**:- అంకురా ర్పణమునకై మృత్సంగ్రహణము, యాగశాలా లంకరణ పూజాదులు, బీజములకు సంపాతాజ్య సేచనాదులకై అగ్నిముఖ అంకురార్పణ హోమములు, ఆపైన వాస్తు యోగేశ్వర పూజనము, హోమములు జరిగించవలసియున్నది. అగ్నిముఖ విషయమున శ్రౌత/స్మార్తానుసరణము తప్పనిసరి. ఈ విషయంలో వైఖానస ప్రయోగం సుబోధంగా ఉన్నదనుట అంగీకరించవలసిన విషయము.

**9.వాస్తుపూజ** :- కల్యాణోత్సవమున వాస్తుపూజ అలవాటు లేని కొందరు ప్రతిష్ఠకు వాస్తుగాని కల్యాణమున కెందుకు అను తర్కమునకు దిగుచున్నారు. దీనికి నాసమాధానమొకటే. సుమారు 800 సంవత్సరములనుండి పూర్వాచార్యులు కల్యాణమహోత్సవమున వాస్తుపూజ జరిపించుచున్నారు. అందుకు సుమారు 200 సంవత్సరముల ప్రాచీనత గల లిఖితసాక్ష్యములున్నవి. పాద్మ, శ్రీప్రశ్న, పురుషోత్తమ, నారాయణ సంహితలయందు అన్నికార్య క్రమములకూ వాస్తుపూజ అవసరమని చెప్పబడినది.( చూ... వాస్తుపూజ పుట 79, మరియు అను. 8, పుట321) . ఈగ్రంథమున ధ్వజపట ప్రతిష్ఠయందు పటశుద్ధ్యర్థం వాస్తు హోమము చెప్పబడినది. ఎక్కడెక్కడ వాస్తు హోమము చెప్పబడినదో అక్కడక్కడ వాస్తుపూజ చేయవలసియున్నది.

వాస్తుపూజ రెండు విధములుగా చెప్ప బడినది. 1.విగ్రహవాస్తు 2. మండలవాస్తు. భగవత్కల్యాణమున మండలవాస్తు చెప్పబడినది. ఇకవాస్తుమండల రచన. మాపూర్వులు చతుష్షష్టిపద వాస్తుమండలమును అనుసరించుచున్నారు. ఇది భారద్వాజ సంహితోక్తము. (భా.వి.ప్ర. పుట 72). పూర్వాచార్య ప్రయోగానుసరణమున సంప్రదాయత్వము సిద్ధించును గాన చతుష్షష్టి పదవాస్తుమండలమే అనుసరణీయము కాని, సంహితలయందున్నవి గనుక ఇతరప్రక్రియలకు మారుట సంప్రదాయమూకాదు సదాచారమనిపించుకొనదు. వేరెవరైనా చేస్తున్నారంటే అది వారికి పూర్వా చార్య ప్రయోగంగా పరంపరలో వచ్చి ఉండాలి. లేకపోతే అదివారి ధైర్యం అవుతుందేమోకాని సంప్రదాయం మాత్రంకాదు.

శ్లో॥ యస్మిన్ దేశే యథాచారః పారంపర్య క్రమాగతః
శ్రుతి స్మృ త్యవిరోధేన సదాచార స్స ఉచ్యతే॥ (మనుస్మృతి)

ఏదేశంలో పారంపర్య క్రమంగా వచ్చిన ఏ ఆచారం ఉందో అది శ్రుతి స్మృతులకు విరోధముకానిదై సదాచారమగుచున్నది అనికదా ధర్మశాస్త్రం. పారంపర్య క్రమంలో రాకుండా ఎవరో ఒకరు రాసేస్తే అది సదాచారం ఎలా అవుతుంది? పారంపర్య క్రమాగత దేశాచారం ఉండగా ఈనాటి అన్య దేశాచారం సదాచారమెలా అవుతుంది? వైష్ణవాచారం సదాచారం కాకూడదా? కానిదా?

ఒకవేళ అది స్మృత్యుక్తం, స్మార్తం అంతేగాని వైష్ణవం కాదు అందామంటే, **"మహోత్సవస్య కర్తవ్యతా విధానమ్"** అంటూ **జయాఖ్య సంహిత** కూడా ఇదే అంశాన్ని చెప్పింది. " సనక్షత్రం దినం శుభం సౌమ్యగ్రహ సమన్వితమ్ । దేశ కర్తృనృపాదీనా మనుకూలం చ మన్త్రిణః । సమాశ్రిత్య నృపః **కుర్యా త్కర్తా** ధన్యోపి వైష్ణవః ॥ మహానిమిత్తముద్దిశ్య త్రీన్వారాన్ వత్సరంప్రతి । **స్వదేశవిహితేనైవ విధినా చ మహోత్సవమ్ ।** కర్మ బింబం విమానస్థం హిత్వా చక్రాదికంతువా । నృత్తగీత స్వనైర్గీతై ర్వాద్యదాన పురస్సరమ్ । బలికర్మ సమోపేతం భ్రమణీయం సుశాన్తయే । సర్వగ్రామాది వీధినాం కీర్తి పుణ్య ఫలాప్తయే ॥" (జయాఖ్య 20.382-386). అందుచేత జనబాహుళ్యానికి అర్థమయ్యే దేశాచారాన్ని వదలి ససంప్రదాయం పేరుతో ఇతరదేశాచారాలను తెచ్చి రుద్దుమనిచెప్పలేదు.

**10. యోగేశ్వరపూజ** :- ఇదికూడ భారద్వాజ సంహితోక్తమగు పూర్వాచార్య ప్రయోగము. ఇందు యోగపీఠార్చన యోగేశ్వరార్చనములు కనిపించుచున్నవి.

**11. ధ్వజపట ప్రతిష్ఠ - భేరీతాడనము - దేవతాహ్వానము - ధ్వజారోహణము**

1. దీనిలో ధ్వజపట ( గరుడపట) చిత్రణ, కుంభస్థాపన, పూజనము, నేత్రోన్మీలనము, పటశుద్ధి, అంగహోమాదులు, పటాధివాసము, గరుడ న్యాసము, ప్రాణప్రతిష్ఠ అనునవి గలవు.

2. దేవతాహ్వానమునకు అనుగుణముగా భేరీపూజనము, భేరీతాడన విధానము చెప్పబడినది. ఇదంతా ధ్వజ పటమును స్తంభారోహణం చేయించే దినమునకు ముందురోజున చేయవలసిన కార్యక్రమం. ఈ భేరీతాడనం ఉత్సవసేవార్థం వివిధ దేవతలను గ్రామమునకు పిలుచుట కుద్దేశింప బడినదిగా కన్పిస్తోంది.

3. ఆపైన శిబిక యందు గరుడ పటమును పతాకాదులను ఉంచుకొని (కారికలో ధ్వజపతాకాద్యైర్యుతం అనియున్నది. పతాకప్రతిష్ఠ ముందుగనే జరిగినది గాన ఇది

పతాకారోపణము గావచ్చును. ) ధ్రువపీఠమాదిగా ప్రతిద్వారమున ఆయా ద్వారపాలకులకు బలిప్రదాన మొనరించుచూ దిక్పాలకావాహన మొనరించుట.

4. అష్టదిక్పాలక గద్యలు – శేషగద్య.

5. ధ్వజారోహణ – దీనిలో గరుడ పీఠిక, గరుడగద్య, సప్తతాళ గేయములు. ధ్వజారోహణము చెప్పబడినవి.

6. ఖగేశ్వరనవకం – ఖగేశ్వరనవకం అంటూ మాపూర్వాచార్య ప్రయోగంలో 9 శ్లోకాలు "ఖగేశ్వరోవ శ్ర్శియమాతనోతు" అనే మకుటంతో కన్పిస్తూ ఉండగా, అవే శ్లోకాలు ఒక్క " యోదేవదేవస్య" అనేశ్లోకంతప్ప, (ఈశ్లోకం భరద్వాజ సంహితోక్త వివాహప్రయోగంలో ఉన్నది) మిగిలిన 8 శ్లోకాలు మంగళాష్టకములను పేరున. ధ్వజారోహణ సమయంలో, భద్రాచల పాఠంలోనూ, చా.వేం.రా.భట్టాచార్య పాఠంలోనూ ఉన్నవి. ఖగేశ్వరుడు మీకు శుభము కలిగించుగాక అను మకుటముగల ఈశ్లోకములు ధ్వజారోహణమున మంగాళాష్టకములా? మంగళాష్టకములు చూర్ణిక అనేవి వేరుగా పాణిగ్రహణమున సుముహూర్తకాలమున చదవడం ఉన్నదిగదా. సమయమూ సందర్భము. అర్థము సరిపోని వీనిని మంగళాష్టకములనుట సమంజసము కాదని భావించి వానికి ఖగేశ్వర నవకమను పూర్వాచార్యప్రోక్త నామమునే ఉంచి 9 శ్లోకముల నిచ్చితిని.

**12 . వివాహప్రయోగం :-** జయదేవోత్తమా .. అంటూ ధ్రువులకుచేయు విజ్ఞాపనతో ప్రారంభించి బ్రహ్మ బంధనంవరకూ గల పాణిగ్రహణప్రక్రియ సంపూర్ణంగా చర్చించబడి అవసరమగు వివరణలు, అర్థ విశేషాంశములు ప్రక్కపక్క పేజీలలో ఇవ్వబడినవి. అత్యధికంగా భక్తులు సందర్శించేదీ, ఎక్కువగా లౌకిక మార్గంలో నడిచేదీ. శాస్త్ర సంప్రదాయాలతోబాటు జనరంజనము, భక్తజన అనంద పారవశ్యమే ప్రధానంగా గలది గనుక ఈప్రక్రియ ప్రాంతీయ ప్రభావంవలన లౌకికమైన కొన్ని మార్పులకులోనైనది. ఎక్కడి కక్కడ ఆయా విషయములను సహేతుకంగా, సాక్ష్యధారాలతో చర్చించి సరియైనదని భావించిన వానిని సూచించుట జరిగినది. పాణిగ్రహణమునందలి వివిధాంశముల క్రమం ఈక్రింద నీయబడినది.

ధ్రువులకు ఉత్సవ విజ్ఞాపనము – పురుషోత్తమ సంహిత వివాహోగార ప్రవేశానంతరం పాణిగ్రహణ కర్మ విజ్ఞాపనను ( ఉత్సవులకు) విధించినా, భరద్వాజ సంహితోక్త వివాహ ప్రయోగం అదయార్ ప్రతి ( ఇకపైన భ.వి.ప్ర. అ.ప్రతి)ని, కపింజలసంహితను అనుసరించి ఉత్సవ విజ్ఞాపనమును ధ్రువులకు చేయబడినది.

ప్రతిసర బంధనము ధ్రువులకు జరిపించుట భా.వి.ప్ర. అ.ప్రతి ననుసరించి చేయబడుచున్నది. మరల కల్యాణ మండపమున ఉత్సవులకు కంకణ (రక్షా) బంధనము వేరుగా ఉన్నది.

**కల్యాణమండవ బలిప్రదానము** – అనంతరం బలిబింమును పల్లకి నధిరోహింపజేసి 'ఆద్యాశ్చా' దులతో కల్యాణ మంటప బలిప్రదానము జరిపించుట కపింజల ప్రోక్తము.

**ధ్వజస్తంభ ధ్యానము** – 'కనక వర్ణం కనకాచల సన్నిభం ... కుశరోమ విరాజితం, సమస్త దేవగణ పరిసేవితం ... పాతాళాంతరే పాదపీఠం, మర్త్యలోక మధ్య ప్రదేశం , సత్యలోకోత్తమాంగం ...అంతస్సారం ' అనునవిగల ఈకారిక వేదపురుషావాహనకాదు. అర్ధవత్ ధ్వజస్తంభ ధ్యానము . భద్రాచలాది ప్రతులయందు ధ్వజస్తంభ ధ్యానముగనే యున్నది. గాన ఇక్కడనున్న ప్రక్రియ ధ్వజస్తంభ ధ్యానానుగుణముగ మార్చ బడినది. భారద్వాజసంహిత వివాహ ప్రయోగమున "కనకవర్ణం కనకాచల సన్నిభం.." అనునవి చెప్పబడలేదు. వేదపురుషావాహనకు కనకవర్ణాదులకు అర్ధవత్ సంబంధము కన్పించుటలేదు. భద్రాచలపాఠమున కనకవర్ణాదులు స్తంభ ధ్యానములుగ కన్పించుచున్నవి. కనకవర్ణాదులయందున్న "ఊర్ధ్వం దండం – పద్మఛత్ర వలయం – పాతాళాంతరే పాదపీఠం – మర్త్యలోక మధ్య ప్రదేశం – సత్యలోకోత్తమాంగం – అన్తస్సారం –" అనేవి అర్ధవత్ కేవలం స్తంభలక్షణమునకు సరిపోవును గాని వేదపురుష వర్ణనకు ఏ విధముగనూ సరిపోవు. 'పద్మఛత్రవలయం, మహాగిరి గహ్వరనాభీరన్ధ్రం' అనేవి ధ్వజస్తంభమునకుగాని గరుడమూర్తికిగాని సరిపోవు.. కొప్పాక రేజే.చి.సిం వంటి కొన్ని ప్రాచీన పాఠములలో కనకవర్ణాదులలో వేదపురుషావాహనగాని కలశలుగాని లేవు. కనకవర్ణాదులన్నీ ఒక ముద్దగాఉన్నవి. ఇక వేదపురుషావాహనలు ప్రాచీనప్రతులలో ఉన్ననూ దీని అనంతరం విడిగా ఉన్నవి. ఇది ధ్వజస్తంభధ్యానమే యైనచో మూర్తివర్ణన మెందుకు? ఈ పరిస్థితులలో సాత్వత సంహిత (4.7–10) లక్ష్మీతన్త్రము(11.9–18)లలో చెప్పబడిన విశాఖయూపవర్ణనమును గమనించవలసియున్నది. **"అస్తి శ్రీవైకుంఠే ఽప్రాకృతలోకే విశాఖయూపోనామ ధ్వజస్తంభాకారః కశ్చన తేజోరూపీ భగవన్మయః స్తంభవిశేషః ... తత్రాధః ప్రదేశమారభ్య ఉపర్యుపరి చత్వారోభాగాశ్చతురశ్రా వర్తన్తే। ప్రతిభాగ చతుర్ష్వపి పార్శ్వేషు భగవాన్ పరవాసుదేవః వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న ఽనిరుద్ధ రూపేణ క్రమేణ ప్రాగాది దిక్షు అవతిష్ఠతే। తత్ర ప్రథమోభాగః అనిరుద్ధ ప్రధానః ....ఏతాదృశ విశాఖయూప అనిరుద్ధాదేవ పద్మనాభాదయో విభవా అవతీర్ణా ఇతి లక్ష్మీ**

**తన్త్రే ఉక్తమ్।** " – అని వి. కృష్ణమాచార్య పండితులు తమ లక్ష్మీతన్త్రవ్యాఖ్యలో వివరించినదానిని అధారముగాచేసుకొని చూచినచో, ఈ ధ్వజస్తంభధ్యానము వ్యూహదేవతారూపమూ విభవదేవతా ప్రాదుర్భావస్థానమూ అగు విశాఖయూప వర్ణనమేగాని వేరుకాదని తెలియుచున్నది. విశాఖయూపమునకు మధ్యనుండి మీదికెగసినాళము ఆపైన ఏర్పడిన పద్మము వలననే " మహాగిరి గహ్వరనాభీరన్ధ్రం, పద్మచ్ఛత్రవలయం .." అనునవి అర్థవంతములగును. గాన **ఈధ్వజస్తంభధ్యానము పర వ్యూహ విభవ రూపాత్మకమగు విశాఖయూపధ్యానము.**

**వివాహోగార ప్రవేశము** – ఉత్సవులను పల్లకి నధిరోహింపజేసి యుంజాన మంత్రమును పఠిస్తూ వివాహోగార ప్రవేశమొనర్చుట భ.వి.ప్ర. అ.ప్రతి యందునా, భద్రాచల పాఠమున గూడ నున్నవి. గాన ప్రక్రియ తదనుగుణముగా నివ్వబడినది.

**రక్షాబంధనము** – ఇది ఉత్సవులకు చేయు ప్రతిసర బంధనము. భా.వి.ప్ర. అ.ప్రతి ప్రకారం పద్మప్రియే విష్ణు పత్నీం మంత్రములు కంకణ బంధనమునకు విధించబడినవి. కాని ఇక్కడ అర్యమ్ణో అను మంత్రమున కంకణాభిమంత్రణము, ధ్రువంతే, సుమంగలీ మంత్రములతో దేవ దేవేరులకు కంకణ బంధనము చేయబడడం పూర్వాచార్య ప్రోక్త సంప్రదాయం.

**ద్వితీయ యజ్ఞోపవీత ధారణ** – ఇదికూడ పుర్వాచార్య ప్రయోగముగా నిర్వహింపబడుచున్నది. భ.వి.ప్ర. అ.ప్రతి యందు ఇది కన్యావరణమునకు ముందు వివాహోగారమునకు వచ్చిన వెంటనే యున్నది.

**కన్యా వరణము** – బ్రాహ్మణప్రేషణము, ప్రవరలు చెప్పుట భ.వి.ప్ర. అ.ప్రతి యందు గలవు.

**వరపూజ** – మధుపర్కప్రాశనము, చరణం పవిత్ర మంత్రమున పాద ప్రక్షాళణము భా.వి.ప్ర. అ.ప్రతి యందు కన్పించుచున్నవి.

**కన్యాదాన సంకల్పము** – కన్యాదాన సంకల్పము అనుపేరున మహాసంకల్పము చెప్పడం లౌకిక ప్రక్రియ. ఇది భ.వి.ప్ర. అ.ప్రతి యందులేదు. అందు "శ్రీమత్సురాసుర" అను సంకల్పముగలదు.

**కన్యాదానము** – భ.వి.ప్ర. అ.ప్రతి యందు " శ్రీరామచంద్ర వరాయ తుభ్యం .... సీతానామ్నీం కన్యాం అహం సర్వలోక రక్షణ ధర్మ ప్రజాసహత్వ కర్మభ్యః ప్రతిపాదయామి " అనియూ, క్రియాకైరవ చంద్రికయందు " జగత్కారణ భూతాయ

దేవాయ మదీయ గోత్రజాం కన్యాం ప్రజాసహత్వ కర్మభ్యః ప్రతిపాదయామి - ఇతి దేవీం సర్వాభరణ గోభూ సహితాం సహిరణ్యోదకం దేవాయ దద్యాత్ " అనియు చెప్పబడుటచే, ఈగ్రంథమున క్రియాకైరవ చంద్రికా కారికను చేర్చడమైనది .

**మంగళాష్టకములు, చూర్ణిక** - మంగళాష్టకులు చూర్ణిక అనునవి భ.వి.ప్ర. అ.ప్రతియందుకూడ కన్పించుచున్నవి.

**సుముహూర్తము, జీరకధారణ** - ఇదికూడ భ.వి.ప్ర. అ.ప్రతి యందున్నది.

**యుగచ్ఛిద్రాభిషేకం** - ఈసందర్భమున పవిత్ర ద్వయమునుంచుట భా.వి.ప్ర. అ.ప్రతి యందు కన్పించుచున్నది. కాని ఇక్కడ కూర్చకు మంగళసూత్రమును కట్టి వానినుండి జలము పడునట్లు చేయుట సంప్రదాయము.

**అక్షతారోపణం**- ఈగ్రంథమందు కన్పించు అక్షతారోపణ ప్రక్రియ అంతయూ, మంత్రములతో సహా, భ.వి.ప్ర. అ.ప్రతియందు యథాతథముగ నున్నది.

**బ్రహ్మబంధనం** - ఇదికూడ యథాతథంగా భ.వి.ప్ర. అ.ప్రతి యందుగలదు.

**మహదాశీర్వచన ఫలప్రదానములు** - ఇవిలౌకికాచారములు.

**ప్రధాన హోమాదులు** - ప్రధాన, ప్రవేశ, లాజ, తాన్త్రిక, సప్తావరణ, వైకుంఠపార్షద, పరివార దేవతా, శేష హోమాదులు సంహితానుసారులు.

**13. బలిప్రదానము** - ఇది గ్రామబలి - ఆహ్నిక దినములయందు ప్రతిదినము జరుగవలసిన విధి.

**14 . ప్రత్యేకోత్సవములు** : - 1. సదస్యోత్సవం 2. వసంతోత్సవం 3. రథోత్సవం 4. మృగయా యాత్ర- పరకాల వైభవం 5. ఘృతారోపణము 6. చూర్ణోత్సవం - చక్రతీర్థం - ఇవన్నీ సంహితలు విధించినవే.

**౧౫. పూర్ణాహుతి** : - ఇది అగ్నికార్య సంబంధి. చతుస్థానార్చనా విధానమున గల అగ్నియందు స్వామినర్చించుట, ఈఉత్సవమున దీనితో పరిసమాప్త మగుచున్నది. అగ్నికార్య కారికలన్నియూ ఆపస్తంబీయ గృహ్య సూత్రవిధానమున, ప్రసిద్ధ కపర్ది మహర్షి కారికలతో ఈప్రయోగమున నున్నవి.

**16. విసర్జనబలి** : - అహూతులైన అందరు దేవతలను వారివారి స్థానములకు సాగనంపు కార్య క్రమం .

17. పుష్పయాగం :- భగవంతునకు ఉత్సవ పర్యటన శ్రమను పోగొట్టు కార్యక్రమం ఇది. ఇందులో పుష్పయాగ మండలార్చన, ద్వాదశారాధన, సప్త ప్రదక్షిణలు, దర్పణదర్శనం, చివరగా సీతాకవాట బంధనోత్తర ప్రత్యుత్తరాభినయము.

**18. గ్రంధసమాప్తి , అనుబంధములు .** – పైజెప్పిన వివిధ విషయాలకు సంబంధించిన వివరణ, చర్చ, విమర్శ మొదలగునవి సుమారు 16 అనుబంధాలుగానూ, చివరన ప్రత్యేకంగా చోర లక్ష్మీ సంవాదాలువానికి చేసిన తెలుగు గేయానువాదాలు వేరొక అనుబంధాంగానూ ఇవ్వబడ్డాయి.

మొత్తంమీద అంకురారోపణ మొదలుకొని పుష్పయాగ పర్యన్తమున్న ఈ భగవత్కల్యాణ మహోత్సవమున పాంచరాత్రాగమ సిద్ధాన్త విషయములు, శ్రౌతస్మార్త (గృహ్యసూత్ర ) ప్రక్రియలు, లౌకికాచారములు ముప్పేట అల్లుకొనియున్నటుల కన్పించుచున్నది . పాద్మ, పురుషోత్తమ,కపింజల, భరద్వాజాది సంహితలు ఆయా స్మార్త ప్రక్రియలను శంఖమున బోసి తీర్థమొనరించినవి.

విష్వక్సేనపూజ, పుణ్యాహవాచనము, ఋత్విగ్వరణము, రక్షాబంధనము, అంకురారోపణము, అగ్నికార్యం, వాస్తుపూజ, వివాహప్రక్రియ అందలి కన్యాదానాది అంశములు, పూర్ణాహుతి, అనేవి అటు మానుషంలోనూ, ఇటు భగవద్విషయంలోనూ ఉన్నవి. వీనిని గృహ్యసూత్రాలు విధించగా సంహితలు వానిని గ్రహించినవి. సంహిత అగ్నిప్రతిష్ఠాదులను చేయుమని చెబుతుందేతప్ప ఎలాచేయాలో వివరించదు. భక్తజనాహ్లాదమే ప్రాతిపదికగా ' అన్యచ్చ మంగళం సర్వం కుర్యాత్ లౌకిక వర్త్మనా " అంటూ సంహితలు తమ నియమాలను నిరవధికంగా ఎత్తివేశాయి. గాన ఇవి ప్రాంతీయాచారాలకు లోబడి ఉంటున్నాయనడం వాస్తవదూరంకాదు. ఇక్కడ అన్య దేశాచారానుకరణ పొసగదు. ఉత్సవాన్ని ఆనందించే భక్తజనులు వారికితెలియని అన్యదేశాచారాలను అర్థంచేసుకొనలేరు. దక్షిణదేశంలో జీరక ధారణ సుముహూర్తం కాదు – మాంగల్యధారణ అక్కడ సుముహూర్తం . అందుచేత మనం జీరకధారణను మానివేయలేము – వారు అనుసరించరు కూడా. అక్కడివారు లాజహోమానంతరం ' వారణమాయిరాన్ని ' భగవద్విషయమున అనుసంధిస్తారు – సన్నెకల్లు తొక్కించడం, మెట్టెలు పెట్టించడం చేయిస్తారట. ఇదిస్మార్త ప్రక్రియ అని వారు మానివేయడంలేదు – మన మనుసరించడమూ లేదు. వైదిక ప్రక్రియలనుండి, గృహ్య సూత్రములనుండి గ్రహించిన అంశాలకు వానివాని నియమాలను పాటించడం అవసరం. అగ్నికార్యాది విధులకు శ్రౌతం మాతృక. దానిని విధిగా అనుసరించవలసినదేగాని, మనకు తెలియదు

కదా అని ' చతుష్పాత్ర షట్పాత్ర ప్రయోగాలేమిటి - ఏదోఒక పాత్ర" అని అపహాస్యం (భగవదారాధనావిధి, పీఠిక, పుట 16) చేయ గూడదు. వీనిని అతిజాగ్రత్తగా సంహితాను గుణ్యంగా మలచివైష్ణవీకరించాలిగాని, తేలికగా తీసుకొనరాదు. అగ్నికార్యం వంటివానిలో వైష్ణవం విపరీతమై శ్రౌతం/స్మార్తం లోపిస్తే కార్య క్రమానికే మూలచ్ఛేదం ఏర్పడుతుంది. హవన కార్యక్రమమున " కర్మపరిపూరణార్థంజయాది హోమం కరిష్యే " అనుదానిని గుర్తించకుండా, తెలియనివారెవరో కొందరు వైష్ణవాగమ ప్రయోగంలో నమమ అంటూ త్యాగాలు చెప్పారని మొత్తం జయాదులను పనికిరావనడం ఇటువంటిదే. అగ్నికార్యమున జయాదులు తప్పక చేయాలి. పాంచరాత్రం శేష శేషిభావాన్ని గ్రహించడం వలన కేవలంహోమాన్తమున ఉద్దేశ త్యాగములను నిషేధించినదికాని, త్యాగబుద్ధిని వదలివేయమనలేదు - శ్రౌతకార్యక్రమమునే మానివేయమనలేదు. చతుస్థానార్చనకు శ్రౌతం అవసరం.

ఇలాచూస్తే కేవల సంహితానుగుణ్యములుగా మిగిలినవి ఉత్సవాంగీకారము, ధ్వజారోహణ దేవతాహ్వాన బలిప్రదానములు, రథోత్సవ మృగయాత్రా పుష్పయాగ కార్యక్రమములు మాత్రం. లౌకిక విధానానుసరణము, ఊహాపోహ విధానములు భక్తజనాహ్లాదమునకేగదా. భక్త జనాహ్లాదమునకే గదా లౌకిక విధాన మనుసరించు లక్ష్మీ సంవాద చోరసంవాదములు. ఒకచోట అంగీకరించి మరియొకచోట కాదనుట దేనికోసమో? ఇటువంటి స్థితిలో స్వామికి ప్రతిష్ఠాంత కల్యాణమేగాని ప్రతిసంవత్సరమూ కల్యాణమెందుకు అనువారి నేమనవచ్చును. అంతేగాక మనం సంహితలని చెప్పుకొంటున్న పాద్మాదులు తంత్రములు. తంత్రములపని తంత్రమును (ప్రక్రియను) వివరించుట వరకేగాని మన్త్రభాగమును విధించుట గాదు. సంహిత చెప్పలేదని వేదమంత్రాలను వదలివేస్తే, అన్నిటికీ మూలమంత్రం తప్ప మరేమంత్రం అక్కరలేదంటే, ద్రవిడ వేదమే ముఖ్యమంటే, తమిళ దేశంలోవలె కేవలం తంత్రం మాత్రమే మిగిలి పాంచరాత్రం అవైదికమయ్యే ప్రమాదం ఉంది. అర్చకులకు మంత్రం రాదు అన్న వైదికుల మాట, మంత్రంవింటే వైఖానసులనోటే వినాలి అన్న కొందరు పెద్దలపొగడ్త నిజమౌతుంది. ఆచార్యునికి మంత్రవినియోగంలో స్వేచ్ఛ ఉంది. "మంత్రరత్నే నాభిమంత్ర్య" అనేది అందులకే. మాకు వేదమంత్రాలు రావనే ఆత్మ న్యూనతా భావాన్ని మరో తేలిక పద్ధతిచే అధిగమిస్తారుకాని, వేదమంత్రాల నెవరు నేర్చు కొంటారు. వైష్ణవానికి స్మార్తం పరిపూరకం కాని అంటరానిది కాదు. ఇక, పరిశోధకులకు వాస్తవ దర్శనం ప్రధానమని విజ్ఞప్తి. క్రొంగ్రొత్తవాదనలు లేవనెత్తి వాస్తవాన్ని వక్రమార్గానికి మళ్ళించడం, మరగుపరచడం,

తద్వారా లబ్ధి పొందగోరడం మంచిది కాదని విజ్ఞప్తి. సరియైన పరిశోధకుడు నేను చూచినమేరకు నాకు ఇది సరియైనదని తోస్తున్నది, ఇది సరియైనది కాకపోవచ్చు అని చెప్పాలి గాని విధి నిషేధాలను జారీచేస్తే, వారి అధికారానికి లోబడినవారు తప్ప విజ్ఞు లెవ్వరూ వారి ననుసరించరని మనవి. మనం మన పూర్వాచార్యులను గౌరవిస్తే వారిని అనుసరిస్తే, ముందుతరంవారికి మనం పూర్వాచార్యులం కాగలుగుతాం, వారు మనని అనుసరిస్తారు.

సుమారు 800 సంవత్సరాల క్రితం భగవద్రామానుజుల కటాక్షం ఏరూపంలో జరిగిందోతెలియదుకాని, అనాటినుండి మాపూర్వాచార్యులు పాంచరాత్రాగమంలో ఆంధ్రులకు ప్రత్యేకమైన విధివిధానాలను ఏర్పరచుకొని కర్షణాది ప్రతిష్ఠాంతం, ఉత్సవాది ప్రాయశ్చిత్తాంతం కార్యక్రమాలను నిర్వహిస్తున్నారనడంలో సందేహంలేదు.

అట్టిప్రయోగగ్రంథ నిర్మాణ పరిశీలన పరిశ్రమలేగాక పాంచరాత్ర సిద్ధాన్త విషయమునగూడ ఆంధ్రులయొక్క ప్రాధాన్యత కన్పించుచున్నది. అతిప్రాచీనములై రత్నత్రయమని పేరుగాంచిన సాత్వత పౌష్కర జయాఖ్య సంహితలయందలి సాత్వత సంహిత ముద్రణకు ఆధారభూతములగు తాళపత్ర గ్రంథరూప మాతృకలు నాలుగింట రెండు ఆంధ్రాక్షమయ్యములనియూ, మరియొకటి గ్రంధాక్షరియైననూ విశాఖ పట్టణ నివాసియగు శ్రీమాన్ పరవస్తు రంగనాథ స్వామివారి పుస్తకాలయమునందలి తాళపత్రమనియూ తెలియుచున్నది, ( చూ.. ఈసంపాదకునిదే “ సింహాచల చందనోత్సవ పీఠిక) సింహాచల చందనోత్సవ, నిత్యార్చనలకు సాత్వత సంహితాంతర్గత ఆధారముగా సాత్వత సంహిత 26 అధ్యాయము 1869 లో బొబ్బిలిలో నివసించిన చామర్ల అప్పకొండ గారిచే వ్రాయబడిన తాళపత్రమున లభించినది. కపింజల, పురుషోత్తమ, పరమపురుష, నారాయణ సంహితలు తెలుగు లిపిలోమాత్రం లభ్యమౌతున్నవి. ఇవన్నీ తెలుగువారి పాంచరాత్రాగమ ప్రయోగ సిద్ధాన్త ప్రవేశములను, బహుశా స్వతంత్ర ప్రవృత్తినీ తెలియ జేస్తున్నవి.

ఆద్య శ్రీకూర్మ క్షేత్రంలో లభించకపోయినా శ్రీకూర్మంనుండి విడివడి వచ్చిన కుటుంబాలలో, ముఖ్యంగా భొబ్బిలిలో ఆపైన చుట్టుప్రక్కల ప్రాంతాలలో నివసిస్తూ దేవాలయార్చనాదులను నిర్వహిస్తూ జీవించిన భద్రం చామర్తి కుటుంబీకులు, వారికి బంధువులై ప్రతిష్ఠా అర్చనాదులను నిర్వహిస్తూ ఆగమంలో ప్రావీణ్యం సంపాదించుకొని, అందు పరిశ్రమించిన రేజేటి, అంపోలు, పొందూరు, సర్తె గోపినంబాళ మొదలగు కుటుంబములవారు వ్రాసిన, ఆత్మార్థము వ్రాయించుకొన్న తాళ పత్ర గ్రంథాలు లభించడం,

అందునా ఇంగ్లీషు తేదీలతో సహా ఉన్నప్రతులు లభించడం పరిశోధకునిగా నా అదృష్టం. ఆగ్రంథాలనుగాని, ఈ పాంచరాత్రాగమ ప్రయోగ రంగాన్ని కాని ఇంతవరకూ ఎవరూ స్పృశించక పోవడం, అకుటుంబంలో జన్మించిన వ్యక్తిగా వారి కృషిని "ఆంధ్రపాంచరాత్రాగమ ప్రయోగగ్రంథములను" తొలిసారి వెలుగులోనికి తీసుకొనిరాగలగడం నా అదృష్టంగా, కర్తవ్యంగా భావించి ఈకార్యక్రమాన్ని నిర్వహిస్తున్నాను. పెట్టిన ఖర్చులో ఒక్కరూపాయికూడా తిరిగి రాదని తెలిసినా, ఈగ్రంథాలు మావి, మాకు ఖ్యాతి తెచ్చేవి, తొలి సంపాదకునిగా, పరిష్కర్తగా కీర్తి లభిస్తుందన్న కాంక్ష నాచే ఈపనిని చేయిస్తోంది.

గ్రంథములు జాగ్రత్త చేసినవారందరూ బంధువులు కావడంతో గ్రంధావలోక నానికి, అవసరమైనవానిని సేకరించడానికీ నేను ఎక్కువ శ్రమ పడవలసిన అవసరం లేకపోయింది. భగవత్కృపవలన, పెద్దల అశీర్వచనం వలనా తగినంతపెన్షను, క్రొత్తగా ఏర్పడిన బి.ఇడి కాలేజీలో మరల ఉద్యోగం దొరకడంతో అర్థికంగాకూడ ఆలోచించ నవసరం లేకుండ పోయింది. అయితే 1999 లో రిటైరైనప్పటినుండీ పూర్తిగా ఈ పరిశ్రమలో మునిగి పోయిన నాకు , నాసమయంలో కొంతభాగం కాలేజీ పనికి కేటాయించక తప్పలేదు. " ఆపని (బి.ఇడి కాలేజీ పని) ఎవరైనాచేస్తారు, ఈపని మనమే చేయాలి" అంటూ ప్రోత్సహించిన చిన జీయరు స్వామివారి ఆదేశాన్ని కూడ పూర్తిగా పాటించ లేకపోయాను - కారణం, పనులు జరగాలంటే ధనమే సర్వస్వం కాకపోయినా, అదికూడా అవసరం కదా. ఈ గ్రంథాన్ని ముద్రించే విషయంలో దేవాదాయ శాఖ పూను కొంటుందేమోనని, నేనూ ఈవిషయంలో నా సహచరుడు గోవిందాచార్యుడూ హైదరాబాదు వెళ్లి ప్రయత్నించాము. కాని అర్చక సభలలో అధికారులు చెప్పినంత సులభంగా పనిజరిగే ఆవకాశం మాత్రం కన్పించలేదు. వ్రాయడంకంటె ముద్రణవిషయంలో ఎక్కువ మనఃక్లేశం పడవలసి వచ్చింది.

చివరకు కరుణాకరుడైన శ్రీవెంకటరమణుడు నామొరనాలకించాడు. ఒక్క తెలుగులోనేగాక, దేవనాగరి, కన్నడ, తమిళం, ఒరియా లిపులలో లిప్యన్తరీకరణంచేసిన ఈ భగవత్కల్యాణమహోత్సవ గ్రంథాన్ని తన దేవస్థాన ప్రచురణగా మన్నించి అందరినీ అనుగ్రహించాడు. ఈ విషయంలో "దైవం మానుషరూపేణ" అనేదానకి ప్రత్యక్షనిదర్శనంగా ఈ గ్రంథాలనుచూచి అభిమానించి గౌరవించి తగు నిర్ణయం తీసుకొన్న తిరుమల తిరుపతి దేవస్థానం పాలకమండలి అధ్యక్షులు శ్రీమాన్ భూమన కరుణాకర రెడ్డి వారికి కార్యనిర్వహణాధికారి శ్రీమాన్ కె.వి. రమణాచార్య I.A.S వారికి, సంచాలకులు

శ్రీ శైలకుమార్ గారికీ, ముద్రాపకులు శ్రీ వి. సాంబశివ రావు వారివారి కార్యాలయా సిబ్బందికీ కృతజ్ఞతాపూర్వక నమోవాకములు సమర్పిస్తున్నాను.

ఈగౌరవం -

సలక్షణ అస్తపాఞ్చరాత్రప్రయోగానిది,

శతాబ్దాలుగా అరకొరజీవనభృతియైనా అలసత్వం చూపక అహరహం శ్రమించి భగవత్సేవతోబాటు ఈప్రయోగాన్ని అభివృద్ధి చేసిన పూర్వాచార్యులది,

అయాగ్రంథాలను ఇంతవరకూ స్వంత ఆస్తిలా కాపాడి ఈనాడీవిధంగా ఈ సంపాదకుని ద్వారా పరిశోధనకు ప్రచురణకు అందించి అందరకూ అపురూప గౌరవం ఆపాదించిపెట్టిన ఏతద్వంశీయులందరిది – అని మనవి.

ఈ పుస్తక సంపాదనమున పైజెప్పిన అంశములు దాదాపు స్వకీయములు. శ్రమదమాదుల కోర్చి ఈగ్రంథాన్ని నేను సంపాదించానన్నా, పరిష్కరించానన్నా, మావారందరూ దానికి సహకరించారన్నా, సహకరించలేదన్నా అదంతా ఎవరికోసమో చేసినది కాదు. ఈ గ్రంథం వెలుగు చూసేవరకూ చేసిన ఈప్రయత్నం అంతా స్వార్థ పూరితమే.

కాని ఒక ప్రాచీన పాంచరాత్ర ప్రయోగం తొలిసారి వెలుగు చూస్తున్నదని సంతోషిస్తూ తమ మంగళాశాసనములను ప్రసాదించిన పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి చరణ కమలములకు వినమ్రుడనై ప్రణమిల్లు తున్నాను. కొన్ని అగమ విషయ చర్చలలో అభిప్రాయ భేదం కన్పించినా, వాస్తవ దర్శనాసక్తికీ, స్తోమతకూ పెద్ద పీటవేసి గౌరవించిన వారి అవ్యాజ కృపాకటాక్షములతో ధన్యుడనయ్యానని భావిస్తున్నాను.

అదేవిధంగా పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ రంగరామానుజ పెద్దజీయరు స్వామివారు(తిరుపతి) ఈ నా ప్రయత్నాన్ని విని చాల సంతోషించి తమ మంగళాశాసనాన్ని అనుగ్రహించారు. వారికి వినమ్రుడనై నమస్కరిస్తున్నాను.

నా సాహిత్య కార్యక్రమం ఏదయినా ఇంతవరకూ మిత్రులు శ్రీమాన్ డా॥ సముద్రాల వేంకట రంగ రామానుజాచార్య స్వామివారి చేయిపడనిదే పూర్తి కావడంలేదు. 1992 లో కాళిదాస త్రయానువాద సందర్భంగా వారితో కలిగిన పరిచయం నేటికీ కొనసాగుతోంది. అదే విధాంగా డా. బి.వి. ఎస్ మూర్తిగారు. ఈపుస్తకాన్నికూడా వీరు పరిశీలించి భాషావిషయికంగా, అక్కడక్కడ సిద్ధాన్తపరంగా తగిన సలహాల నిచ్చారు.

నిరన్తర కార్య క్రమ వ్యగ్రులై సంతత భక్తజన సందోహ పరివృతులైన చిన జీయర్ స్వామివారి నుండి మంగళాశాసన సంపాదన శ్రీ రంగారామానుజ స్వామివారి

వలన సుగమమై సాకారమైనది. వీరు పూనుకొనకపోతే ఈప్రయత్నమున నేను విఫలుడ నయ్యేవాడిని.

ఈనాప్రయత్నాన్ని విని, మీరు తయారు చేసినది క్రిటికల్ ఎడిషన్, దానిని మీరు తెలుగు లిపిలోకాక నాగరిలో ఇవ్వండి - తిరుపతి సంస్కృత విశ్వవిద్యాలయం తరపున మేము ప్రింటుచేయిస్తాం అని ప్రోత్సహించిన మిత్రులు ప్రొఫెసర్ కందాళై వేంకట రామకృష్ణమాచార్యులవారికి కృతజ్ఞుడను.

ఈనా పరిశోధనకి తమ గ్రంథాలను చూపించి, నిష్కపటంగా నాతో చర్చించి సాయపడిన మిత్రులు, భద్రాచల శ్రీరామ దేవస్థానార్చకులు శ్రీమాన్ కోటి రామకృష్ణ మాచార్యులవారికీ, కుంభకోణం శార్‌ఙ్గపాణి దేవాలయార్చకస్వామి వారి శ్రీమాన్ వి. శేషాద్రి భట్టర్ వారికి, శ్రీరంగదేవాలయ ప్రధానార్చకస్వామి వి. శ్రీనివాస భట్టర్‌వారి కుమారులు నరసింహ భట్టర్ వారికీ, అక్కడే రిటైర్డ్ ఆంధ్రాబ్యాంకు ఆఫీసరు ఐ.ఎస్. విజయ రాఘవన్ గారికీ కృతజ్ఞతాపూర్వక నమోవాకములు. మొదటినుండి ఈ ఆగమ గ్రంథ పరిష్కరణమున తమ అమూల్యమైన సహకారాన్నందిస్తున్న సుప్రసిద్ధ శ్రౌతపండితులు బ్రహ్మశ్రీ చిర్రావూరి శ్రీరామ శర్మ గారికి కృతజ్ఞుడను. వారి సహ కారంతో క్లిష్టమైన అగ్నిముఖాది శ్రౌతభాగం సుసంపన్నమైనది. సహృదయంతో వారు ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రం పరిశీలించారు. అదేవిధంగా తగు సలహాలనూ, ఆశీస్సులను అందించిన శ్రీమాన్ మహేంద్రాడ వేంకట జగన్నాథస్వామివారికి కృతజ్ఞుడను.

ఈ భగవత్కల్యాణమహోత్సవ గ్రంథానికి ఆనాటి పూర్వాచార్యులనుండి నేటి నావరకూ ఇంతమందిమి అక్షరరూపం కల్పిస్తే, శ్రీమాన్ పొందూరు లక్ష్మణాచార్యుల వారొక్కరే ఒకస్థిరరూపం కల్పించడానికి పూనికొన్నారు. ప్రఖ్యాత అగమ పండితులగు వారి తండ్రిగారు శ్రీమాన్ పొందూరు సీతారామానుజాచార్యులుగారి పేరుమీద ఈపుస్తకం పరిష్కరణకయ్యే ద్రవ్యాన్ని వారొక్కరే సమకూర్చారు. ఆవిధంగా డ్రాఫ్ట్ తయారై, దీని ననుసరించి అర్చనాదివిధులను నిర్వర్తిస్తున్న వారందరికీ పంపబడి వారినుండి అభిప్రాయములను, సవరణలను సేకరించి ప్రస్తుత ప్రతి తయారుచేయబడింది ఈమహత్కార్యాన్ని నిర్విఘ్నంగా జరిగించడానికి అటు లక్ష్మణాచార్యులవారినీ, ఇటు నన్నూ

ప్రోత్సహిస్తూ, మావెంటనంటి ఉన్న లక్ష్మణాచార్యపుత్రులు శ్రీమాన్ గోవిందాచార్యుల వారికి అర్చకలోకం ఋణపడి ఉంటుందనడంలో సందేహంలేదు. ఈమా ఉద్యమంలో ప్రత్యక్షంగా పరోక్షంగా సాయపడిన వారందరికీ కృతజ్ఞతా పూర్వకనమోవాకములు.

ఇందలి చిత్రాలు రేజేటి వేంకట రంగనాథ వాణీ వరప్రసాద్ గీసినవి.

ఈపీఠికలో, గ్రంథంలో చెప్పినవానిలో స్వకీయం ఎక్కువగా కనిపించవచ్చు. కాని దాపరికం లేకుండా వివరంగా చెప్పాలని, అది ముందుతరాలవారికి తెలియాలని తాపత్రయం. ఏం చెప్పినా, ఎలాచెప్పినా, ఎందుకు చెప్పినా లేనిదీ కానిదీ ఏదీ చెప్పలేదు - ఏ ప్రలోభానికీ లొంగకుండా, చౌకబారు మెప్పుల కాశపడకుండా, ఉన్నదీ, జరిగిందీ, పూర్వాచార్యులకూ గ్రంథానికీ గౌరవం కలిగించేదీ చెప్పానని భావిస్తున్నాను. సలక్షణమైన గ్రంథం కాల గర్భంలో కలిసి పోకుండా లోకానికి సమర్పించానని భావిస్తున్నాను. ఇందులో ఎవైనా పొరపాట్లు దొర్లితే మన్నించవలసిందిగా సహృదయులగు పెద్దలను ప్రార్థిస్తున్నాను. *ఇందలి మంత్ర భాగం సాధికారికవ· ·ర్దుష్టము అగు వావిళ్ళవారి యాజుష పూర్వ ప్రయోగం వంటి గ్రంథాల ననుసరించి ఇచ్చినది. దీనిలోని కారికలు సుమారు 20 పాఠాలను ఆర్థవత్ గమనించి పరిష్కరించినవి. సాంహితాన్తర్గత సిద్ధాన్త భాగంతో సరిచూడబడింది. గాన మనం కంఠస్థంచేసిన విధంగా కాక ఒక మంత్రంలో భేదం కనిపించినా, ఒక కారిక వేరుగా ఉన్నా వెంఠనే తప్పు అని దానిని దిద్దడం, మాపాఠం కాదనడం వద్దు.*

*తెలిసి ఇందులో ఏ దోషమూ లేదు. సప్రమాణంగా ఇందలి అంశములు లేదా సవరణలు తప్పు అని చూపినట్లయితే, వారు నన్నుమించిన కృషిచేశారని సంతోషిస్తూ, నాది తప్పే అని అంగీకరిస్తాను. నేను సర్వజ్ఞుడనుగాను.*

*పెద్దలు, పండితులు నా ఈ సాహసాన్ని మన్నిస్తారని భావిస్తున్నాను.*

సర్వజిత్ నామ సంవత్సర
కార్తీకశుద్ధ సప్తమీ స్థిరవారం.
17-11-2007.

భవదీయుడు
రేజేటి వేంకట వేణుగోపాలాచార్యులు

# విషయసూచిక

# విషయసూచిక

శ్రీరస్తు　　　　శుభమస్తు　　　　అవిఘ్నమస్తు

# విష్వక్సేనపూజా[1]

శ్లో॥ జ్ఞానానంద మయం దేవం నిర్మలస్ఫటికాకృతిం।
ఆధారం సర్వ విద్యానాం హయగ్రీవ ముపాస్మహే॥

..........

శ్లో॥ ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రక్షసాం
కుర్యాద్ఘంటారవం తత్ర దేవస్థానేషు లాంఛనం॥ [2]

1. శ్రీగురుభ్యోనమః హరిః ఓమ్ - అయం ముహూర్త స్సుముహూర్తోస్త్వితి భవంతో మహాంతోను గృహ్ణంతు। అయం ముహూర్త స్సుముహూర్తోస్తు॥

2. తదేవ లగ్నం సుదినం తదేవ। తారాబలం చంద్రబలం తదేవ। విద్యాబలం దైవబలం తదేవ। లక్ష్మీపతేః తేంఽఘ్రియుగం స్మరామి॥

**యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థోధనుర్ధరః।**
**తత్ర శ్రీ ర్విజయో భూతిః ధృవా నీతి ర్మతి ర్మమ॥**

**స్మృతే సకల కల్యాణ భాజనం యత్ర జాయతే।**
**పురుషస్తమజం నిత్యం వ్రజామి శరణం హరిమ్॥**

---

1. విష్వక్సేనః స్మృతా నేతా భగవాన్ సర్వకర్మణా తస్మాన్నాన్య ముపాసీత కర్మణాం విఘ్నశాంతయే॥ఆరంభే కర్మణాంపుణ్యైః విఘ్నానాం ప్రశమాయ చ కుర్యాత్సపరివారస్య విష్వక్సేనస్య పూజనం॥ - అం.సీ. అధికపాఠం.
మృత్సంగ్రహణమునకు ముందుగా విష్వక్సేనపూజ పుణ్యాహవాచనము చేసి పుణ్యాహజలమున సంబారములను శుద్ధి చేయవలెను - శ్రీప్రశ్న సంహిత (31.2-25)
2. అథోపవిశ్యవై దార్భే కాష్ఠజేవాఽజినాసనే। ఆగమార్థంతు దేవానాం గమనార్థం తు రక్షసాం కుర్యాద్ఘంటారవం తత్ర దేవతాస్థాన లాంఛనమ్। శంఖాది ఘోష సంయుక్తం గేయవాద్యసమన్వితమ్॥ - ఈశ్వర సంహిత 2. 30, 31

సర్వదా సర్వ కార్యేషు నాస్తి తేషా మమంగళమ్ ।
ఏషాం హృదిస్థో భగవాన్ మంగలాయతనో హరిః ॥

లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః ।
ఏషామిందీవరశ్యామో హృదయస్థో జనార్దనః ॥

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహమ్॥

సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధకే ।
శరణ్యే త్ర్యంబికే దేవి! నారాయణి! నమోఽస్తుతే॥

3. శ్రీలక్ష్మీనారాయణాభ్యాం నమ: । శ్రీ సీతారామాభ్యాం నమః । కేశవాది చతుర్వింశతిమూర్తిదేవతాభ్యోనమః । మత్స్యః కూర్మాది దశావతార మూర్తి దేవతాభ్యోనమః । ధర్మా ద్యనంత గరుడ విష్వక్సేన దేవతా భ్యోనమః ।చండాది ద్వారపాలకదేవతాభ్యోనమః । ఇంద్రా ద్యష్టదిక్పాలక దేవతాభ్యోనమః । శ్రీపరాంకుశదాసాది శ్రీమహా భాగవతేభ్యో నమః సర్వేభ్యో మహాజనేభ్యో నమః –ఇతి నమస్కారం కుర్యాత్॥

4. ఆచమ్య – కేశవాయస్వాహా, నారాయణాయస్వాహా, మాధవాయ స్వాహా, గోవిన్ద విష్ణు మధుసూదన త్రివిక్రమ వామన శ్రీధర హృషీకేశ పద్మనాభ దామోదరాయనమః, సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్న అనిరుద్ధ పురుషోత్తమ అధోక్షజ నారసింహ అచ్యుత జనార్దన ఉపేన్ద్ర హరేః శ్రీకృష్ణాయనమః ॥

[3] పృథివ్యాః మేరుపృష్ఠఋషిః । కూర్మోదేవతా । సుతలం ఛందః ।

3. “ పృథివ్యాఃమేరు పృష్ఠ ఋషిః....” అనిమొదలయ్యే సంకల్పం ఋగ్వేదీయము.
“ ఉత్తిష్ఠన్తు భూత పిశాచాః ...” అనేది యజుర్వేదీయ సంకల్పము.

ఆసనే వినియోగః అనంతాసనాయనమః । ప్రణవస్య పరబ్రహ్మ ఋషిః । పరమాత్మా దేవతా । దేవీగాయత్రీచ్ఛందః । ప్రాణాయామే వినియోగః।

ఓం భూః । ఓం భువః । ఓగ్ం సువః । ఓం మహః । ఓం జనః । ఓం తపః ఓగ్ం సత్యమ్ । ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్ । ఓ మాపోజ్యోతి రసోమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్ ॥

5. భగవదనుజ్ఞయా భగవత్ కైంకర్యార్థం శుభేశోభనే ముహూర్తే శ్రీమహావిష్ణోః అజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే,[4] శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భారతవర్షే, భరతఖండే, మేరోర్దక్షిణ దిగ్భాగే, ఆగ్నేయకోణే, ఆన్ధ్రదేశే, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన పార్థివనామ సంవత్సరే ఉత్తరాయణే, శశిరఋతౌ, మాఘమాసే, శుక్లపక్షే, దశమ్యాం శుభతిథౌ, భౌమవాసరే, శుభనక్షత్రే శుభయోగే, శుభకరణ ఏవంగుణవిశేషణ[5] విశిష్టాయాం శుభతిథౌ – అస్య యజమానస్య...... గోత్రస్య, ధర్మపత్నీసమేతస్య, సకుటుంబస్య క్షేమ స్థైర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం, రాజారాష్ట్రాభివృద్ధ్యర్థం –

6. అస్య శ్రీపాంచరాత్ర ద్వాదశలక్ష ప్రమాణ శాస్త్ర దివ్యాగమ శ్రీవిష్ణు పాద్మ కపింజల సంహితోక్త ప్రకారేణ శ్రీరుక్మిణీ సత్యభామాసమేత

---

4. ఆద్యబ్రహ్మణః ద్వితీయ ప్రహరార్థే – రేజే. బల

5. పూర్వోక్త మాసపక్ష తిథ్యాదయః సాధకశ్చ గుణవిశేషణ విశేషాః, న తు అధికరణ సప్తమ్యన్తాః – ఇతి వ్యాఖ్యాతం దేవపూజారహస్యే (పుట 59)

శ్రీవేణుగోపాల భగవంత ముద్దిశ్య శ్రీవేణుగోపాల భగవత్ ప్రీత్యర్థం, పాంచాహ్నిక ధ్వజారోహణ దివ్యకల్యాణ మహోత్సవాంగత్వేన, మూలయాగ బలిస్నాన తీర్థయాత్రాది షడ్బేర నియమేన యథోక్తోత్సవేషు, షోడశ క్రియా సూచన, అంకురార్పణ, వాస్తుహోమ, కుంభస్థాపన, బింబాభిషేక, మండపప్రవేశ, అగ్నిసంస్కార, మహాహోమ, శాంతిహోమాది క్రియాకలాపాని, యథాకాలే కర్తవ్యాని కర్మాణి కర్తుకామః, కుణ్డ మణ్డప విమాన గోపుర ప్రాసాద యాగోపకరణాది సమస్త ద్రవ్యశుద్ధ్యర్థం, ఆలయప్రాకార స్థూపీ మండప సింహాసన మహాపీఠ ఉపపీఠ ధ్వజస్తంభ నృత్యమండప కల్యాణమండప యాగశాలాద్యనేక మండప ⁶సర్వత్ర సంయుజనాది యేయే యవంతిశయ యవంతికాంబరభేద వితాన ధ్వజపతాక ప్రాకార పచనాలయ వాహన మండప బింబశుద్ధి ద్రవ్యశుద్ధి వాహనశుద్ధి తత్తత్కర్మాంగ శుద్ధ్యర్థం, సంభవతా నియమేన సంభవతా ప్రకారేణ సంభవద్భిః ద్రవ్యైః, పూర్వాచార్యానుగ్రహాత్, భగవత్పరాయణస్య నిత్యముక్తైః శ్రీవైష్ణవై ర్భాగవతైస్సహ, భగవత్పుణ్యాహవాచనం కరిష్యే–

ఆదౌ నిర్విఘ్న పరిసమాప్త్యర్థం విష్వక్సేన పూజాం కరిష్యే --

7. విష్వక్సేనం తండులో పరినిధాయ ।

"అథక ప్రమాణ తండులైః ధాన్యపీఠం ప్రకల్ప్య । తస్మిన్ పద్మమష్టదళాత్మకం లిఖిత్వా । నవసంఖ్యాక దర్భైః కృత కూర్చం కర్ణికాయాం నిక్షిప్య । తస్మిన్ సూత్రవతీయుతం విష్వక్సేన మావాహయేత్" [7] ॥

6. దౌ.ఉ, రేజే.బల పూర్వప్రతులు పాం.ల ప్రతి కూడా ఇదే పాఠం

7. నారా.సం.య.7.8,9 (పాత్రస్థ తండులోపరి కూర్చం పవిత్రం వా నిధాయ ॥ఓం అగ్నేయో యస్మాద్భూజా మహేత్వా విశ్వేసదాత్వం మహితోను శంభోవైరాజంతే సుహుతం నిధత్తామ్ ॥ (వైఖానసప్రతిష్ఠా పుట.66)

ఆగ్నేయమిత్యావాహనమ్।

ఆగ్నేయం యస్మా ద్విజామహే త్వావిశం సదాప్త
మహితో నిశంభో వైరాజంతే సుకృతం నిధత్వా।
విష్వక్సేనాయ విద్మహే వేత్రహస్తాయధీమహి
తన్నః శాంతః ప్రచోదయాత్ ॥

8. శ్రీ విష్వక్సేన మావాహయామి। హరిమావాహయామి।
శాన్తమావాహయామి। అమిత మావాహయామి।

9. ధ్యాయామి –

విష్వక్సేనం సకలవిబుధ ప్రౌఢసైన్యాధి నాథమ్।
ముద్రాచక్రే కరతలయుగే శంఖదండౌ దధానమ్॥

మేఘ శ్యామం సుమణిమకుటం పీతవస్త్రం శుభాంగమ్।
ధ్యాయేద్దేవం దళిత దనుజం సూత్రవత్యాసమేతమ్॥ [8]

విష్వక్సేనం చతుర్బాహుం శంఖచక్ర గదాధరమ్
తర్జన్యా వామతస్సర్వాన్ భర్జయన్తం దివౌకసాన్ ॥

వన్దే వైకుంఠ సేనాన్యం దేవం సూత్రవతీ సఖమ్
య ద్వేత్రశిఖరస్యాంతే విశ్వమేతద్వ్యవ స్థితమ్ ॥

యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్
విఘ్నా న్నిఘ్నంతి సతతం విష్వక్సేనం త మాశ్రయే ॥

శ్రీ విష్వక్సేనాయనమః – ధ్యాయామి।

8. "దేవీంచ విష్వక్సేనస్య వామపార్శ్వే ప్రతిష్ఠితామ్ ।నామ్నాసూత్రవతీం కుర్యాత్కమలామివలక్షితామ్" – పాద్మ.క్రియా. 22.41; "సూత్రవతీ జయాసహిత శ్రీవిష్వక్సేనాయనమః" – అని వైఖా.ప్రతిష్ఠ. పుట. 67,68

10. ప్రతద్విష్ణుస్స్తవతే త్యాసనమ్ -

**ప్రతద్విష్ణు స్స్తవతే వీర్యాయ మృగోనభీమః కుచరోగిరిష్ఠాః ।**

**యస్యో రుషు త్రిషు విక్రమణేషు అధిక్షయన్తి భువనాని విశ్వాః ॥**

శ్రీ విష్వక్సేనాయనమః ఆసనార్థం హరిద్రాక్షతాన్ సమర్పయామి ।

11. త్రీణిపదేతి పాద్యమ్ [9]-

**త్రీణిపదా విచక్రమే విష్ణుర్గోపా అదాభ్యః తతో ధర్మాణి ధారయన్ ॥**

శ్రీ విష్వక్సేనాయనమః పాదయోః పాద్యం సమర్పయామి ॥

12. విష్ణోః కర్మాణీ త్యర్ఘ్యం[10]

**విష్ణోఃకర్మాణి పశ్యతయతో వ్రతానిపస్పసే। ఇంద్రశ్చ యుజ్యస్సఖా॥**

శ్రీ విష్వక్సేనాయనమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి ॥

13. శన్నోదేవీ రిత్యాచమనీయమ్-

**శన్నోదేవీరభిష్టయ ఆపోభవంతుపీతయే**

**శం యో రభిస్రవంతు నః ॥**

శ్రీ విష్వక్సేనాయనమః ముఖే ఆచమనీయం సమర్పయామి ॥

14. ఆపోహిష్ఠేతి స్నానమ్-

**ఆపోహిష్ఠా మయో భువస్తాన ఊర్జే దధాతన । మహేరణాయ చక్షసే। యోవ శ్శివ తమో రస స్తస్య భాజయ తే హనః । ఉశతీ రివ మాతరః । తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ। ఆపో జనయథా చనః ॥**

---

9. 1. "విష్ణ్వాదిషుదేవేషు అర్ఘ్యపాద్యాచమనాదిక్రమేణ, అన్యేషు ఈశవిఘ్నేశ్వరాదిషు పాద్యార్ఘ్య ఆచమనాదిక్రమేణ ఉపచారాన్ దద్యాత్"- తన్త్రసముచ్చయ విమర్శినీ 7.74

2. ఆద్య యావాహయేద్దేవ మాసనం చ ద్వితీయయా । పాద్యం తృతీయా చార్ఘ్యం చతుర్థ్యాన్ వితరే దృచా ॥" - పాద్మ.చర్యా.6.5

10. త్రిర్దేవ ఇత్యర్ఘ్యం - భద్రం.శ్రీ

శ్రీ విష్వక్సేనాయనమః స్నానం సమర్పయామి ।

15. స్నానానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి ॥

16. యువం వస్త్రాణీతి వస్త్రమ్ [11]

**యువం వస్త్రాణి పీవసా వసాథే । యువో రచ్ఛిద్రా మంతవో హ సర్గాః । అవాతిరత మనృతాణి విశ్వా ఋతేన మిత్రా వరుణా సచేథే ॥**

శ్రీ విష్వక్సేనాయనమః వస్త్రయుగ్మం సమర్పయామి

17. సోమస్యే త్యుత్తరీయమ్

**సోమస్య తనూరసి తను వ మ్మేపాహి స్వామా తనో రావిశ ॥**

శ్రీ విష్వక్సేనాయనమః ఉత్తరీయం సమర్పయామి ।

18. బ్రహ్మేదేవానామితి లలాటే ఊర్ధ్వపుణ్డ్రమ్ -

**బ్రహ్మే దేవానాం [12] పదవీః కవీనా మృషిర్విప్రాణాం మహిషో మృగాణామ్ ఈ । శ్యేనో గృధ్రాణాగ్ం [12] స్వధితి ర్వనానాగ్ం సోమః పవిత్ర మత్యేతిరేభన్ ॥**

శ్రీ విష్వక్సేనాయనమః లలాటే ఊర్ధ్వపుణ్డ్రం సమర్పయామి ॥

19. యజ్ఞోపవీత మితి యజ్ఞోపవీతమ్ -

**యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతే ర్యత్సహజం పురస్తాత్ । ఆయుష్య మగ్ర్యం ప్రతి ముఞ్చ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః ॥**

---

11. అభివస్త్రా ఇతి వస్త్రం - భద్రం .శ్రీ

12. కవీనాం పదవీః = కవులలోశ్రేష్ఠుడు, వనానాం స్వధితిః = వనములకు పరశువు .

శ్రీ విష్వక్సేనాయనమః యజ్ఞోపవీతం సమర్పయామి ।

20. గంధద్వారామితి గంధమ్ –

గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ।
ఈశ్వరీగ్ంం సర్వభూతానాం తా మి హోపహ్వయే శ్రియమ్ ॥
శ్రీ విష్వక్సేనాయనమః దివ్య శ్రీచందనం సమర్పయామి ॥

21. ఆయనేతేతి పుష్పం –

ఆయనే తే పరాయణే దూర్వారోహంతు పుష్పిణీః ।
హ్రదాశ్చ పుణ్డరీకాణి సముద్రస్య గృహా ఇమే ॥
శ్రీ విష్వక్సేనాయనమః పుష్పం సమర్పయామి ॥

22. కాండాత్కాండా ఇతి దూర్వాక్షతాన్ –

కాండా త్కాండా త్ప్రరోహంతి పరుషః పరుషః పరి ।
ఏవానో దూర్వే ప్రతను సహస్రేణ శతేనచ ॥

యా శతేన ప్రతనోషి సహస్రేణ విరోహసి ।
తస్యాస్తే దేవీష్టకే విధేమ హవిషా వయమ్ ॥

అశ్వక్రాన్తే రథకాన్తే విష్ణు క్రాన్తే వసుంధరా ।
శిరసా ధారయిష్యామి రక్షస్వమాం పదేపదే ॥
శ్రీ విష్వక్సేనాయనమః దూర్వాక్షతాన్ సమర్పయామి ।

23. చామన్తికా వకుళ చంపక పాటలాబ్జ పున్నాగ జాజి కరవీర రసాల పుష్పైః । [13]మరువ ప్రవాళ తులసీదళ మల్లికాభిః త్వాం పూజయామి। జగదీశ్వర మే ప్రసీద ॥

13. బిల్వప్రవాళ – రేజే బల, భద్రం.కృ పాఠాలు.

శ్రీ విష్వక్సేనాయనమః। ఓం సకలవిబుధ ప్రౌఢ సైన్యాధినాథాయ నమః । ఓం ముద్రధరాయనమః । ఓం చక్రధరాయనమః । ఓం శంఖధరాయనమః। ఓం దండధరాయ నమః। ఓం మేఘ శ్యామాయ నమః। ఓం సుమణిమకుటాయ నమః। ఓం పీతవస్త్రధరాయ నమః। ఓం శుభాంగాయనమః। ఓం దళిత దనుజాయ నమః। ఓం సూత్రవతీ సమేతాయనమః - నానావిధ పరిమళ పుష్పైః పూజయామి॥

24. వనస్పత్యురితి ధూపమ్ ॥

**వనస్ప త్యుద్భవై ర్దివ్యై ర్నానాగంధైః సుసంయుతః ।**
**ఆఘ్రేయస్సర్వ దేవానాం ధూపోయం ప్రతిగృహ్యతామ్ ॥**

శ్రీ విష్వక్సేనాయనమః ధూపమాఘ్రాపయామి ।

25. ఉద్దీప్యస్వ ఇతి దీపమ్ [14] –

**ఉద్దీప్యస్వ జాతవేదోపఘ్నం నిరృతిం మమ ।**
**పశూగ్‌శ్చ మహ్యా మావహ జీవనంచ దిశోదిశ* ।**
**మానోహిగ్ం సీ జ్జాతవేదో గామశ్వం పురుషమ్ జగత్**
**అభి భ్రదఘ్న ఆగహి శ్రియామా పరిపాతయ ।**
**సంమ్రాజంచ విరాజం చా భి శ్రీర్యాచనో గృహే ।**
**లక్ష్మీరాష్ట్రస్య యా ముఖేతయా మాసగ్ం సృజామసి॥**

శ్రీ విష్వక్సేనాయనమః దీపం దర్శయామి॥

ధూపదీపానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి ।

26. నైవేద్యమ్–

14. సాజ్యం త్రివర్తి ఇతి దీపం – భద్రం శ్రీ * దిశోదిశ – తైత్తరీ.ఉ.4.22

ఓం భూర్భువస్సువః[15] తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి ధియోయోనః ప్రచోదయాత్॥ ........పరిషించామి ।

అమృతమస్తు అమృతోపస్తరణమసి ।

శ్రీ విష్వక్సేనాయనమః గుడఖణ్డ నైవేద్యం సమర్పయామి- ఓం ప్రాణాయస్వాహా । ఓం అపానాయస్వాహా । ఓం వ్యానాయ స్వాహా । ఓం ఉదానాయస్వాహా । ఓం సమానాయస్వాహా । ఓం బ్రహ్మణేస్వాహా ॥

27. మధ్యే మధ్యే పానీయం సమర్పయామి ।

28. అమృతాపిధానమసి ఉత్తరాపోశనం సమర్పయామి ॥

29. హస్తౌ ప్రక్షాళయామి -పాదౌప్రక్షాళయామి

30. ముఖవాసనార్థం తాంబూలమ్ -[16]

పూగీఫలైశ్చ కర్పూరై ర్నాగవల్లీ దళైర్యుతమ్ ।
ముక్తా చూర్ణేన సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్ ॥
శ్రీ విష్వక్సేనాయనమః తాంబూలం సమర్పయామి ॥

---

15. 1. విష్వక్సేనాయనమః స్వాహేతి నైవేద్యం నివేద్య -విష్వక్సేనాయ విద్మహే వేత్ర హస్తాయధీమహి తన్నో విష్వక్సేనః ప్రచోదయాత్ - శ్రీవిష్వక్సేన దేవతాభ్యోనమః గుడోపహార నైవేద్యం సమర్పయామి -భద్రం.శ్రీ
2. ఓంభూర్భువస్సువరితి నైవేద్యమ్ - ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి ధియోయోనః ప్రచోదయాత్.........పరిషించామి, శ్రీవిష్వక్సేనాయనమః, అమృతోపస్తరణమసి - రేజే.బల.
3. నైవేద్యం సమర్పించునపుడు "శ్రీమతే విష్వక్సేనాయనమః యధాభాగశః ఇదం గుడనైవేద్యం సమర్పయామి ఓం భూర్భువస్సువః ......" - వేదోక్త పంచసంస్కార విధి,తె.కం.గోపాలాచార్య పే.నెం.4

16. విచక్రమే పృధివీతి తాంబూలం-భద్రం.శ్రీ, పర్ణం వనస్పతేతి తాబూలమ్- భద్రం.కృ, ముఖవాసం తాంబూలమ్ - భద్రం.శ్రీ పాఠం . 'ఆమోదీ ముఖవాసనః'- అమరం.

31. అతోదేవా [17] ఇతి సువర్ణమంత్రపుష్పమ్-

**అతో దేవా అవంతునో యతో విష్ణుర్విచక్రమే । పృథివ్యా స్సప్త ధామభిః । ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదం । సమూఢ మస్యపాగ్ం సురే ॥**

శ్రీ విష్వక్సేనాయనమః సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి ॥

**మన్త్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన ।**
**యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తు తే ॥**

32. అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా చ భగవాన్ సర్వాత్మకః శ్రీ విష్వక్సేన స్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవతు ॥

33. ఉత్తరేకర్మ ణ్యవిఘ్నమ స్త్వితి భవన్తో మహాన్తోనుగృహ్ణంతు -
॥ ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు ॥

34. శ్రీ విష్వక్సేన ప్రసాదం శిరసా గృహ్ణామి ॥

35. విష్వక్సేనం యథాస్థాన ముద్వాసయామి -

**యజ్ఞేన యజ్ఞమయజంతదేవా స్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ । తేహనాకం మహిమానస్సచన్తే । యత్రపూర్వే సాధ్యాస్సన్తి దేవాః ॥**

36. శోభనకాలే పునరాగమనాయచ ॥

// ఇతి విష్వక్సేనపూజా // ★

---

17. యజే దేవమితి మన్త్రపుష్పమ్ - భద్రం.శ్రీ

★ భద్రం.శ్రీ పాఠంలో విష్వక్సేనపూజ అయిన వెంటనే ఋత్విగ్వరణం ఆపైన పుణ్యాహం మొ॥వి కలవు

# భగవత్
# పుణ్యాహవాచనమ్ [1]

(ఈ భగవత్పుణ్యాహవాచనం స్మార్తానుసారి కాదు. ఎవరూ స్వతన్త్రంగా కల్పించినదీకాదు. అదయార్ లైబ్రరి ఎమ్.ఎస్. 10.I.18 లో భరద్వాజసంహితోక్త ప్రతిష్ఠా ప్రయోగమున (నాగరి లిపి) ఈ భగవత్పుణ్యాహవాచన మూలములు కలశలపేర్లతో సహా స్పష్టముగా కన్పిస్తున్నవి. అదయార్ ప్రతి పాఠం అనుబంధము-3, పే.నెం.241 నందు ఇవ్వబడినది.)

1. ఓం ధర్మం జ్ఞానం చ వైరాగ్యం[1] కలశ త్రయనామకమ్ । పుణ్యాహ కలశస్థానే లిఖేచ్చక్రం త్రికోణకమ్ । తత్పురస్తా ల్లిఖేచ్చక్రం షట్కోణం తారకాశ్రయమ్ । మంగళద్రవ్యం నిక్షిప్య పుణ్యాహ స్థానలక్షణమ్ । వాసుదేవ పరాదేవ వాసుదేవ పరాయణమ్ । వాసుదేవ పరం జ్ఞానం వాసుదేవ పరం తథా । వాసనా ద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్। సర్వభూత నివాసోసి వాసుదేవ నమోస్తుతే ॥

2. తద్విష్ణోః పరమంపదమితి మంత్రేణ అన్యకలశే [2] అక్షతాన్ నినీయ - **తద్విష్ణోపరమంపదగ్ం సదాపశ్యన్తి సూరయః । దివీవ చక్షురాతతమ్। తద్విప్రాసో విపన్యవో జాగృవాన్ సస్సమింధతే । విష్ణోర్యత్పరమం పదమ్ ॥**

---

1. ఆరభ్యచోత్తరేదిక్షు దక్షిణే పూర్వమేవ వా । పునః ఉత్తరే దేశే విలిఖేచ్చక్రం త్రికోణకమ్॥ధర్మం చ ఉత్తరే దేశే జ్ఞానం చ దిశిదక్షిణే । వైరాగ్యం పూర్వదిగ్భాగే కలశాన్ స్థాపయేద్బుధః॥ - బ్రహ్మపురం అం.కూ. ప్రతి నుండి.
- త్రిపాదస్యోపరి న్యసేత్-వైఖా.పుణ్యాహం
- భద్రాచల పాఠంలో కూడా 4 కలశలతో, వానికి వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ నామములతో, 'షట్పూర్వదిగ్భాగే దక్షిణేచక్రమండలం, త్రికోణ మండలం సౌమ్యే, ప్రతీచ్యాం పద్మకం చరేత్' అని నాలుగు మండలములతో పుణ్యాహవాచనమున్నది. (అనుబంధము 3 చూదుడు.)




2. "తస్య కుంభస్య పరితః ఏకాయన విదో న్యసేత్ । సూర్యమండల మధ్యస్థ హరేర్దక్షిణ హస్తతః । సహస్రారం సమావాహ్య కుంభే నారాయణం స్మరన్ । సంపూజ్య గంధపుష్పాద్యైః ఫలాదీని నివేదయేత్ । దర్భైస్సుష్టు ఘటైస్సార్థం పుణ్యాహం వాచయేద్గురుః ॥" -శ్రీప్రశ్న సంహిత. 21-26,27.

3. వ్యాహృతి [3] మంత్రాణాం కలశత్రయేషు పునరుదకం సంస్కార్య ।

**ఓం భూస్స్వాహా ఓం భువస్స్వాహా ఓం సువస్స్వాహా**

**ఓం భూర్భువస్సువ స్స్వాహా ॥**

భగవాన్ మంగళం శ్రేష్ఠం వాసుదేవ పరాయణం । ఋచావా యుజుషావాపి సామ్నావాపి తద్దైవ చ। సర్వం తదర్చకాధీన మచ్ఛిద్రాయ జగత్పతే ॥

4. అగ్నిమీళేతి మంత్రేణ ఉత్తరస్థిత కలశే [4] అక్షితాన్ నినీయ ।

**అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం హోతారం రత్న ధాతమమ్॥**

5. ఇషేత్వేతి మంత్రేణ దక్షిణ స్థితకలశే అక్షతాన్ నినీయ ॥

**ఇషేత్వోర్జేత్వా వాయవస్థో పాయవస్థ దేవోవస్సవితా**

**ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణ ఆప్యాయధ్వ మఘ్నియా**

**దేవభాగ మూర్జస్వతీః పయస్వతీః ప్రజావతీ రనమీవా**

**అయక్ష్మామావస్తేన ఈశత మాఘశగ్ంసో రుద్రస్య హేతిః**

**పరివో వృణక్తు ధ్రువా అస్మిన్ గోపతౌస్యాత**

**బహ్వీ ర్యజమానస్య పశూన్ పాహి ॥**

6. అగ్న ఆయాహీతి, శన్నోదేవీరితి ద్వాభ్యాం మంత్రాభ్యాం పూర్వస్థితకలశే[5] అక్షతాన్ నినీయ॥

**అగ్న ఆయాహివీతయే గృణానో హవ్యదాతయే ।**

**నిహోతా సత్సిబర్హిషి ॥**

3. మహావ్యాహృతి– రే.బల. (వ్యాహృతి,మహావ్యాహృతిమన్త్రములకు చూ...అను..3 పుట284 )

4. ఉత్తర స్థిత కలశే – రే.బల,అం.వేం.న.

5. పూర్వ స్థిత కలశే – అం.వేం.న

శన్నోదేవీ రభిష్టయ ఆపోభవంతు పీతయే।
శం యో రభిస్రవంతు నః॥

7. అస్య శ్రీ పాంచరాత్ర ద్వాదశలక్షప్రమాణశాస్త్ర దివ్యాగమ శ్రీవిష్ణు పాద్మ కపింజల సంహితోక్త ప్రకారేణ[6] సంభవతా నియమేన సంభవతా ప్రకారేణ సంభవద్భిః ద్రవ్యైః పూర్వాచార్యానుగ్రహాత్ భవవత్ పరాయణస్య నిత్యముక్తైః శ్రీ వైష్ణవైః భాగవతైస్సహ భగవత్ పుణ్యాహం వాచయిష్యే। [7]

8. [8] ఓం నమో భగవతే శ్రీమన్నారాయణాయ ఓం భగవతోబలేన భగవతో వీర్యేణ భగవత స్తేజసా భగవత్ కర్మణి భగవతానుధ్యాతః భగవతానుగృహీతో భగవత్కర్మకరిష్యామి। తత్ భగవతాఽనుమన్యతాం। శ్రీమన్నారాయణోఽస్య భగవాన్-

9. పవిత్రం నారాయణః `పవిత్రం శతధారగ్ం సహస్రధార మపరిమితధార మచ్ఛిద్ర మనంత మదిష్ఠ మచ్యుత మపరిమితం పరమం పవిత్రమ్। [9]

10. ఓం భగవాన్ నారాయణః పునాతు। ఓం భగవాన్ వారాహః పునాతు। ఓం భగవాన్ నారసింహః పునాతు। ఓం భగవాన్ వామనః పునాతు।

---

6. భారద్వాజ సంహితోక్త ప్రకారేణ - రేజే.చి.సిం ( భగవత్పుణ్యాహవాచనం విషయంలోఈ చినసింగరాచార్యులు గారి భారద్వాజసంహితోక్త ప్రకారేణ అను పాఠమే సరియైనదని ఈపరిశోధనలో ఋజువైనది.)

7. భగవత్పుణ్యాహం వాచయిష్యే - రే.బ, భద్రం.కృ, రే॥గో పాఠాలు.

8. భద్రం శ్రీ,రే.సింగ.మొదలగు పాతపాఠాలలో పుణ్యాహవాచనం ఇక్కడ నుండే ప్రారంభం.

9. 'మచ్ఛిద్ర మరుమనిష్ట మక్షయ మచ్యుత మనన్తమ పరమం పదం' అను రే.బల., 'మచ్ఛిద్రమపరిమితం పరమంపదం' అను భ.శ్రీ. పాఠాలను " మచ్ఛిద్ర మనంత మదిష్ఠ మచ్యుత మపరిమియం పరమం పవిత్రం" అని (భ.సం.అడయార్ ప్రతి ప్రకారం) సరిచేయడమైనది.

ఓం భూర్భుస్సువరో మిత్యుచార్య - ॥ ఓం భూర్భుసువరోమ్ ॥

భగవత్ పుణ్యాహం భవంతోబ్రువంతు-॥ ఓంభగవత్పుణ్యాహమ్ ॥

11. భగవాన్మగళం శ్రేష్ఠం వాసుధేవ పరాయణం । ఋత్విగ్భిశ్చ యథాయజే ్ణయథాయజ్ఞో మహీయతే । య యిదం సర్వ దేవానాం భగవాన్ వేదపారగః । భగవాన్ పుత్రపౌత్రశ్చ దీర్ఘమాయు రవాప్ను యాత్॥

వాసుదేవో భగవాన్ । వారాహో భగవాన్ ।

నారసింహో భగవాన్ । వామనో భగవాన్ ।

12. ఏషాసా పరాకృతి [10] ఏషత్పరంబ్రహ్మ । ఏషప్రభవః । ఏష ఆత్మ । చతుర్విధ స్సర్వజ్ఞః । సర్వజన సర్వదర్శీ సర్వేశ్వరేశ్వరో సర్వశక్తిః సమృద్ధిమాన్ । వశీ స్వాధీనో అనాదిరనంతో వ్యపగత నిద్రా భయక్రోధో నిరవద్యో నిరధిష్ఠో భగవాన్ శ్రీరామః ।

13. అద్భి ర్దీర్ఘమాయురస్త్వితి పశ్చిమ ద్వౌ కలశౌ [11] స్వామినః ముఖసమ ముధృత్య। అద్భిర్దీర్ఘ మాయురస్తు । శివం పానీయమస్తు సుమనస

---

10. 1. ఇవి ఏకాయనవేద వాక్యములు-"కానిచిద్వాక్యా న్యేకాయనశాఖా వాక్యతయా శ్రుతప్రకాశికాయాం సముదాహ్రియన్తే - సర్వజ్ఞః సర్వదర్శీ సర్వేశ్వరః సర్వశక్తి సమృద్ధిమానే వావృద్ధి రన్యాన ఆద్యో వశీ స్వాధీనో అనాదిరనంతో వ్యపగతనిద్రా భయక్రోధతన్ద్రీ వ్యపగతేచ్ఛాతమః క్లమ వ్యాధిర్నిర్దోషో నిరధిష్ఠో నిరవద్యః యే భగవన్తం వాసుదేవమేవం విదుస్త ఏవం తం విదుః" అని ఎంబార్ కృష్ణమాచార్య జయాఖ్య సంహితా ప్రస్తావన (పే.నెం.40)

2. " ఏషాసా పరాప్రకృతి ఏషత్పరం బ్రహ్మ ఏషప్రభవ ఏషాత్మ ఓం చతుర్విధ స్సర్వజ్ఞ స్సర్వదర్శి సర్వేశ్వర సర్వ శక్తి సమృద్ధిమాన్ వశీ స్వాధీనో అనాదిరనన్తో వ్యపగత నిద్రాభయక్రోధో తన్ద్రీ నిరవధిష్ఠో నిరవద్యః యేభగవన్తం వాసుదేవమేవం విదుః, యేనైవం విదుర్నతే విదుః " - (క్రి.క్రై.చం (రాకా వ్యాఖ్యా) పే.నెం.260

11. దక్షిణోత్తర కలశౌ - భారద్వాజ సంహిత ప్రయోగం (అడయార్ ప్రతి)

సౌమనస్యమస్తు । సుమనస భగవాన్ [12] శ్రీరామః సుమనస భగవాన్ వారాహః । సుమనస భగవాన్ నారసింహః । సుమనస భగవాన్ వామనః ।[13]

14. అక్షతై రక్షతంచాస్తు ॥ [14]

అక్షతమరోగం కుశలం భగవాన్ శ్రీరామః । అక్షతమరోగం కుశలం భగవాన్ వారాహః । అక్షతమరోగం కుశలం భగవాన్ నారసింహః । అక్షతమరోగం కుశలం భగవాన్ వామనః । అస్మిన్ గ్రామే ఏషాం గణానాం రాజ్ఞాం అస్మాకం కుశలం భగవాన్ శ్రీరామః ।

15. పురుషోవర్ధతామితి ద్వౌ కలశోదకం పూర్వ కలశే నిక్షిప్య [15] ।

ఓం పురుషోవర్ధతామ్ । సత్యోవర్ధతామ్ । అచ్యుతోవర్ధతామ్ । అనంతోవర్ధతామ్। భగవాన్ శ్రీరామోవర్ధతామ్ । భగవాన్ వారాహోవర్ధతామ్ । భగవాన్ నారసింహోవర్ధతామ్ । భగవాన్ వామనో వర్ధతామ్ । ఓం పురుషశాంతిరస్తు ॥

---

12. "తతః 'సుమనస' అపిచ 'సౌమనస్యం' ఇతి ప్రోక్త్వా చ ఉద్ధరేత్ 'అస్తు' ఇతి క్రియాం , ఉద్ధరేత్ 'సుమనష్షీం' భగవద్వాసుదేవయోః ప్రథమాం తతః ఉధృత్య కరోత్వితి తతః పరమ్" - అని విష్ణుతిలకం. గాన సుమనసోపి సౌమనసస్యమస్తు సుమనసోభగవాన్ ...మొ॥గు పాఠాలను "సుమనస స్సౌమనస్యమస్తు సుమనస భగవాన్ .." గా సరి చేయడమైనది.- ఎడిటర్.

13. "విష్ణుతిలకం ప్రకారం ఇటువంటి వాని యందు"శ్రీరామః కరోతు" అంటూ 'కరోతు' లు ఉండాలి.

14. "అక్షతైరక్షతం చాస్తుచ అక్షతం పునరుద్ధరేత్ అరోగం కుశలం చేతి భగవద్వాసుదేవయోః కరోత్వితినవముధృత్య..'' అని వి.తి(5.55,56) గాన''అక్షతమరిష్టంచాన్తు, అక్షతమరోగంచాస్తు..." ఇత్యాది పూర్వపాఠాలను ''అక్షతైరక్షతంచానస్తు''గా సరిచేయడమైనది.

15. విష్ణుతిలకం ప్రకారం "ఏషగతిర్భగవాన్.." ఇత్యాదులు ముందుండి ఆ తర్వాత "ఓం పురుషోవర్ధతాం.." ఇత్యాదులు ఉండాలి. భద్రం శ్రీ.పాఠంలో అలాగే ఉన్నాయి.(చూడుడు అనుబంధము 3 పుట 276)

16. భగవతః శ్రీరామస్య మాంగళ్య ఆయురారోగ్య ధనధాన్యాని సంపద్యంతామ్ । ఏషగతిర్హరిర్భ గవానితి దక్షిణ కలశోదకం పూర్వకలశే నిక్షిప్య -

ఏషగతిర్హరిర్భగవాన్ శ్రీరామః । ఏషగతిర్హరిర్భగవాన్వారాహః ।
ఏషగతిర్హరిర్భగవాన్ నారసింహః । ఏషగతిర్హరిర్భగవాన్ వామనః ।

17. ఓం పురుషఃప్రీయతా మిత్యుత్తర కలశోదకం పూర్వకలశే నిక్షిప్య-

ఓం పురుషః ప్రీయతామ్ । ఓం సత్యః ప్రీయతామ్ । ఓం అచ్యుతః ప్రీయతామ్ । ఓం అనంతః ప్రీయతామ్ । భగవాన్ శ్రీరామః ప్రీయతామ్ । భగవాన్ వారాహః ప్రీయతామ్ । భగవా న్నారసింహః ప్రీయతామ్ । భగవాన్ వామనః ప్రీయతామ్ । భగవతీ హరిణీ [16] ప్రీయతామ్ । భగవతీ శ్రీః ప్రీయతామ్ ।

18. లాంగలి శుద్ధయే ప్రద్యుమ్న శుద్ధయేచాస్తు ।
ఇతి ఈశాన్యదిశి దక్షిణకలశోదకం నిక్షిప్య-

**॥ మహాపురుషః శాంతిరస్తు ॥**

19. అనిరుద్ధశుద్ధయే కర్మణి శుద్ధయేచాస్తు ।
తత్కలశోదకం నైఋతిభాగే నిక్షిప్య -

**॥ మహాపురుషః శాంతిరస్తు ॥**

16. భగవతీ హరిణీ ప్రీయతాం అని - రే.బల, భగవతాహరిః అని - భద్రం.కృ. పారాలు. "హరిణి, శ్రీ" ప్రయోగాలు భారద్వాజమున , ఆం.సీ. ప్రతులయందు లేవు. వైఖానస ప్రతిష్ఠయందు సర్వదేవార్చనమున (పే.217) - యజ్ఞవేదిపై "మధ్యే విష్ణుం దక్షిణే శ్రియం ఉత్తరే హరిణీం ...." అని ఉన్నది. మూలప్రకృతి రూప అయోనిజ సంకల్పతనయ భృగుపుత్రి యగు శ్రీదేవిని, విష్ణుపురాణమహిషి ప్రకృత్యంశ సంభూత సంకల్పతనయ కాశ్యప పుత్రియగు హరిణిని విష్ణువునకు వివాహమొనర్చుట వైఖానసమున చెప్పబడినది.(వైఖా.ప్రతిష్ఠ.పే.నెం.254) , హిరణ్యవర్ణాం హరిణీం - అని శ్రీసూక్తం.

20. భగవతః సర్వం న్యూనాతి రిక్తం యావద్వర్ష శతం సంపూర్ణమస్తు ।
ఓం యజమానాయ జగత్కుటుంబినే సర్వదాలోక సంరక్షణార్థాయ శుద్ధి వృద్ధి అభ్యుదయకర్మణి శ్రీవైష్ణవ ఆశీర్వచన మపేక్షమాణాయ కర్తాచార్యాయుష్మతే స్వస్తి । స్వస్తి భవన్తో బ్రువన్తు –

॥ ఓగ్ం స్వస్తి ॥

21. స్వస్తి ప్రీణాతు ప్రీయతామిత్యుత్తరకలశోదకం పూర్వకలశేనిక్షిప్య –

ఓం స్వస్తి ప్రీణాతు ప్రీయతాం భగవాన్ శ్రీరామః । స్వస్తి ప్రీణాతు ప్రీయతాం భగవాన్ వారాహః । స్వస్తి ప్రీణాతు ప్రీయతాం భగవాన్ నారసింహః । స్వస్తి ప్రీణాతు ప్రీయతాం భగవాన్ వామనః ।

ఓం శాంతిరస్తు । తుష్టిరస్తు । పుష్టిరస్తు । వృద్ధిరస్తు । అవిఘ్నమస్తు । ఆయుష్యమస్తు । ఆరోగ్యమస్తు । అచల మహదైశ్వర్య సమృద్ధిరస్తు । భగవత్పుణ్యాహ సమృద్ధిరస్తు ॥ ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

22. ఓం శుద్ధయే రాఘవో వోఽస్తు వారాహః శుద్ధయే సదా । శుద్ధయే నారసింహో ఽస్తు వామనః శుద్ధయేసదా । కర్మణః శుద్ధయేచాస్తు విష్ణుః సర్వత్ర సంస్థితః । దోషాణాం హరణాయాస్తు సదాసింహాకృతి ర్మమ । విఘ్నానాం హరణాయాస్తు విష్వక్సేనో జనార్దనః[17] । సర్వత్ర రక్షణాయాస్తు గదా చక్రాదయస్సదా । యాగ ఏష స్సురేశస్య నగర గ్రామవాసినామ్ తుష్టయే పుష్టయేచాస్తు ఆయు రారోగ్య సిద్ధయే ।

---

17. దోషాణాం హరణాయాస్తు విష్వక్సేనో గణేశ్వరః – అని భద్రం.శ్రీ పాఠం. (జయాఖ్య సంహిత బాహ్యయాగవిధి ప్రారంభమున " తత్రాదౌ స్వమంత్రేణ గణేశం పూజయేత్ ద్విజః " అనుటచే ఈ పాఠము ప్రాచీనమని భావింప వలసియున్నది. (జయాఖ్య. 13వ పటలం 97వ శ్లోకం) " విష్వక్సేనో గణేశ్వరః ఇతి ఈశాన్యదిశి దక్షిణకలశోదకం నిక్షిప్య "–భారద్వాజసంహిత ప్రతిష్ఠావిధి అడయార్ ప్రతి.

గురూణాం సాధకేంద్రాణాం పంచకాల రతాత్మనాం। అశేష పుత్ర మిత్రాణాం దాసీదాస గవామపి । వేదశాస్త్ర సమాధీనాం సంతు త్రాణాయ సర్వశః। అవిఘ్న మనిశంచాస్తు దీర్ఘమాయుష్య మస్తు నః। సమాహిత మనశ్చాస్తు సంపద శ్చోత్తరోత్తరం। పుణ్యాహం శుద్ధయే చాస్తు రాఘువాద్యాశ్చమూర్తయః। శంఖ చక్ర గదా పద్మైర్యుక్త స్సర్వేశ్వ రేశ్వరః। నారాయణః సురేశోఽయం కర్మణాం పూరణాయచ। న్యూనాధికానాం శాంత్యర్థం ప్రీయతాం భగవాన్విభు।

23. ఓం బ్రాహ్మణేష్వమృతగ్ం హితం। యేనదేవాః పవిత్రేణ। ఆత్మానం పునతే సదా। తేన సహస్రధారేణ। పావమాన్యః పునంతు మా। ప్రాజా పత్యం పవిత్రమ్ । శతోద్యామగ్ం హిరణ్మయమ్ । తేన బ్రహ్మవిదో వయమ్। పూతం బ్రహ్మ పునీమహే। ఇంద్రస్సునీతి సహమాపునాతు। సోమః స్వస్త్యా వరుణ స్సమీచ్యా। యమోరాజా ప్రమృణాభిః పునాతుమా। జాత వేదా మోర్జయంత్యా పునాతు ॥

24. ప్రాచ్యాందిశి రాఘవోమార్జయంతామ్ । దక్షిణాయాందిశి వారాహో మార్జయంతామ్ । ప్రతీచ్యాందిశి నారసింహో మార్జయంతామ్ । ఉదీచ్యాందిశి వామనో మార్జయంతామ్ । ఊర్ధ్వాయాం దిశి మహాపురుషో మార్జయంతామ్।

25. ఇతి ఏతేభ్యః శ్రీ వైష్ణవేభ్యః భగవన్తం శ్రీమన్నారాయణముద్దిశ్య శ్రీమన్నారాయణ భగవత్ప్రీత్యర్థం భగవత్పుణ్యాహవాచ మంత్రజప దక్షిణాం యజమానస్య మనసోత్సాహపరిమితం భగవదాచార్య ప్రీతిం కామయమానః । [18]

18. భగవదాచార్యోపేతం కామయమానః - భద్రం శ్రీ. ప్రతి

ఏ తేభ్య స్సంప్రదదే - న మమ ॥

26. వాస్తోష్పతేతి ప్రోక్షణమ్ ॥[19]

వాస్తోష్పతే ప్రతిజానీ హ్యస్మాన్ త్స్వావేశో అనమీవో భవానః ।
యత్వే మహే ప్రతి తన్నో జుషస్వ శంన ఏధి ద్విపదే శం చతుష్పదే॥
వాస్తోష్పతే శగ్మయా సగ్ం సదాతే సక్షీ మహిరణ్వయా గాతు మత్యా।
అవఃక్షేమ ఉతయోగే వరం నో యూయం పాత స్వస్తిభిఃస్పదానః ।
అమీవహా వాస్తోష్పతే విశ్వారూపాణ్యావిశన్ సఖా సుశేవ ఏధి నః॥

శుభగ్ం శుభం॥

27. స్వస్త్యయనం తార్క్ష్య మరిష్ట నేమిః మహద్భూతం వాయసం దేవతానామ్ । అసురఘ్న మింద్రసఖం సమత్సు బృహద్యశోనావ మివారుహేమ । అగ్ం హోముచ మాంగిరసం గయంత్యః స్వస్త్యాత్రేయం మనసాచ తార్క్ష్యమ్ । ప్రయతపాణి శ్శరణం ప్రపద్యే । స్వస్తి సం బాధే ష్వభయం నో అస్తు॥

**॥ శుభగ్ం శుభమ్ ॥**

**ఇతి పుణ్యాహవాచనమ్ ॥[20]**

(అం.సీ.(బొబ్బిలి) పాఠంలో విష్వక్సేనపూజ పుణ్యాహవాచనముల అనంతరం ఉత్సవాంగీకారం చెప్పబడియున్నది)

---

19. వాస్తోష్పతేతి మన్త్రేణ భగవద్బింబం సంప్రోక్ష్య - అం.సీ.ప్రతి. ("పుణ్యాహం రాఘవాద్యాశ్చ మూర్తయః శుద్ధయేచ అస్తు " అను ముందు పేజీలోని పుణ్యాహకారిక (22) దీనికి అనుగుణముగా నున్నది.

20. మాతృక "రేజేటి బలరామయ్యగారి తాళపత్ర ప్రతి ( క్రీ.శ.1821 వృషనామ సంవత్సరమున) యథామాతృకగా వ్రాసుకొన్నది."

# ఉత్సవాంగీకారః

1. [1]ప్రీయతాం సర్వలోకేశ శ్రీవత్స కృత లక్షణ । భృత్త్యైశ్చ పరివారైశ్చ గచ్ఛన్ మిత్ర గణైస్సహ శ్రీమన్నారాయణ భగవన్ । నూపుర పీతాంబర శ్రీవత్స కౌస్తుభ మకర కుండల కిరీట కేయూర హార సుదర్శన పాంచజన్య గదా శార్‌ఙ్గ పద్మధర । కనక కమల కల్హార తులసీ పున్నాగ జాతీ సహస్రపత్రకమల నానావిధ పరిమళ మిళిత కుసుమ మాలాలంకృత । సురాసుర వర మణిమకుట మణిగణ కిరణ రంజిత చరణ కమల । లక్ష్మీ మనోహర వక్షస్థల । భోగీంద్ర భోగ శయన । తత్ఫణామణి మయూఖ ప్రకాశమాన దివ్యవిగ్రహ । మునిజన సానుగ్రహ। రత్నాకర కుమారికా రత్నగర్భాద్యఖిల మహిషీ సమాలంకృతోభయపార్శ్వ। సువర్ణ వాహన । అర్ణవ శయన । చూర్ణీకృత రుక్మమయ చక్రధర । విశాల పుండరీకాక్ష । దేవదేవేశ । భక్త వత్సల । భక్తైరస్మాభిః కృతం ( శ్రీసీతాసమేత శ్రీరామచంద్ర ) దివ్యకళ్యాణ మహోత్సవ మనుగృహాణ। అజ్ఞాతాన్ న్యూనాపచారాన్ క్షమస్వ । క్షమస్వ । త్వాం నమామి । నమామి ॥

2. [2]కమలాయువతీ కరకమల లాలిత కనక కమల దుకూల పటల పరిధాపిత భుజపరిఘ చతుష్టయస్య, భుజబల మథిత మధుకైటభ

---

1. అం.సీ, అం.వేం.న పాఠాలు, భా.సం.వి.ప్రయోగం ప్రకారం, ఉత్సవాంగీకారం పుణ్యాహం అయిన తర్వాత, నిత్యార్చనానంతరం ఉన్నది. మిగిలిన పాఠాలలో ధ్వజారోహణ తర్వాత కనిపిస్తున్నది. కమలాయువతీ అంటూ ఈనాడు చాల పాఠాలలో గరుడపీఠికగా పేర్కొనబడుతున్నది భా.సం.వి.ప్రయోగమున ఉత్సవాంగీకారాంతర్భాగంగా ఉన్నది. గాన భా.సం.వి.ప్రయోగం ప్రకారం పై రెడింటినీ కలిపి ఉత్సవాంగీకారముగా ఇవ్వబడినది. ముందున్న ధ్వజారోహణం జయజయ ద్విజేంద్ర అను గరుడ గద్యతో ప్రారంభం అవుతుంది.

2. "కమలా యువతీ కరకమల లాలిత కనక కమల దుకూల పటల పరివాసిత భుజ పరిఘచతుష్టయ, భుజబలమథిత సకలనిశాచర శ్రీరామచంద్ర భగవన్ అముత్సవం ప్రతి గృహ్ణీష్వ " – అంటూ ఈ పాఠం కొద్దిపాటి మార్పులతో భద్రాచలమున నిత్యం చేసే ప్రబోధోత్సవమున ఉన్నది. కాని అందు "శార్‌ఙ్గపాణేర్మహోత్సవోయం" లేదు. కుంభకోణమునందలి దేవాలయమున స్వామి శార్‌ఙ్గపాణి. కుంభకోణం వారి పాఠం కూడా దీనికి చాల దగ్గరగా ఉన్నది. కుంభకోణమున ఇది మహోత్సవమున చెప్పబడినది. (చూడుడు.అను.15 పే.నెం.370)

దశవదన పురోగమ సకల నిశాచర నికరస్య, దివసముఖసమయ సతత సకల సురవర మణిమకుటనికర లంబచుంబిత చరణ సరసీరుహ యుగళస్య, మత్స్యః కూర్మ వరాహ నారాసింహ వామన (త్రివిక్రమ) భార్గవరామ దాశరథిరామ యాదవరామ బౌద్ధ కల్క్యాదీనాం ప్రాదుర్భావ దళ కేసరీ పరిపాలిత జగత్రయస్య, నిష్కలస్య, పుష్కర సదృశ నయనస్య, శ్రీ పురుషోత్తమస్య , దేవదేవస్య, రుక్మిణీ సత్యభామా సమేత శ్రీగోపాలకృష్ణస్య, శ్రీమన్నారాయణస్య, శార్ఙ్గపాణే ర్మహోత్స వోఽ యం ।

3. అస్యైదేవ దేవస్య అష్టాదశదినే (నవదినే) తీర్థ నక్షత్రం కరిష్యే ॥

అథాతోద్యఖిల సుషిరాది వాద్యైరాఘోష్య ।

గరుడ లక్షణ విలక్షిత ధ్వజపట సముత్థానాయ, తదంగ భూత తురంగ రథ గజ హయ ఛత్ర వరపతాక పరంపరా మంబరాణి సంశ్రయంతాం । నృత్తగీతవాద్యనిపుణ భక్తజన స్సమాహూయంతాం। సకల శీతల వాలుకా తోరణాదిభి ర్ద్వారాణ్యలంక్రియన్తాం । బ్రహ్మేంద్రాగ్ని యమ నిర్ఋతి వరుణ వాయు కుబేర ఈశానాదిభిః, గుహో విఘ్నేశాదిభి, రుద్రైః ఏశాదిభిః, ఆదిత్యైర్ద్వాదశాదిభిః, అష్టవసుభిః, సప్తఋషిభిః, శుభముని గణైః భృగ్వంగిరో మరీచ్యత్రి పులస్త్య పులహక్రతు వశిష్ఠ సిద్ధ దక్షాదిభిః, సిద్ధ సాధ్య గరుడ గంధర్వ కిన్నర కింపురుష యక్షరాక్షస పన్నగైరన్యైశ్చ దుర్గా భద్రకాళీ జ్యేష్ఠా రోహిణ్యాద్యప్సరోగణ స్త్రీ దేవతాదిభిః మహోత్సవే సేవ్యతామ్ ॥

4. అనేనోత్సవేన భగవన్నారాయణః సుప్రసన్నో భవేత్ । సకల జగతా మఖిల దురిత శమనమస్తు । సర్వత్ర మేఘః పర్జన్యో వర్షతు । చతుస్సాగర పర్యన్తం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు । రాజా విజయా భవతు । విట్ఛూద్రాణాం శుభంభవతు । అస్మిన్ గ్రామే సుభిక్షంభవతు॥

# ఋత్విగ్వరణమ్

1. ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమతః ---- గోత్రస్య -----భగవంత ముద్దిశ్య ------ భగవత్ప్రీత్యర్థం, పాంచాహ్నిక ధ్వజారోహణ దివ్యకల్యాణ మహోత్సవాంగత్వేన ఋత్విగ్వరణాఖ్యం కర్మకరిష్యే ॥

2. ఆచార్యం వరయేత్పూర్వం సర్వతన్త్ర ప్రదీప్తయే ।
సర్వమంత్ర ప్రదీపార్థం బ్రహ్మాణం తదనంతరమ్ ॥
సమిచ్చరూ చ హోతారౌ క్షీరాది ద్రవ్య హోతృకమ్ ।
ఋగాది చతురో వేదాన్ మూలమంత్రం చ ద్వాదశమ్ ॥
ద్వయమంత్రం బింబమంత్రం చ గీతాం భగవతో హరేః
రామాయణం చ విష్ణోశ్చనామసహస్రకం తథా ॥
ప్రాణప్రతిష్ఠా మంత్రం చ యంత్రాధిష్ఠాన దైవతమ్ ।
మంత్రం చ వరయేత్ హోతౄన్ వస్త్రచందన భూషణైః ॥

3. యజుశ్శాఖాధ్యయన సంపన్నం ........ గోత్రజం ........... శర్మాణం అస్మిన్ పాంచాహ్నిక ధ్వజా రోహణ దివ్యకల్యాణ మహోత్సవకర్మణి, సర్వ తంత్ర క్రియాకరణార్థం ఆచార్యం త్వాం అహం(యజమానోహం) వృణే । [1]

---

1. యజనాధ్యాపనౌయుక్తో యాగే వైదికతాన్త్రికే నిత్యయాజీ జితక్రోధః ఆచార్యో నుగ్రహోన్ముఖః॥ - విష్ణు.సం-29.83॥ "ఆచార్యం, యజమానోహం త్వాం వృణే " - అని యజమానిచే చెప్పించవలె. అదే విధముగా మిగిలిన వారికి కూడా చేయవలె. నలుగురు ఆచార్యులను, 16 మంది ఋత్విజులను, తగినట్లుగా పరిచారకులను నియమించవలెనని పాద్మ.చర్యా.11.24,25. యజుర్వేదికి అధ్వర్యుడని, సామవేదికి ఉద్గాతయని, ఋగ్వేదికి హోతయని పేర్లు.- అమరం . అగ్నీధ్రాదులగు 16 మంది ఋత్విజులకు యాజకులని పేరు. ఋతౌ వసంతాది ఋతువులందు యజ్ఞము చేయువాడు ఋత్విజుడు. యజ దేవపూజాదౌ - దేవపూజ చేయువాడు యాజకుడు.

వృతోస్మి । ------ ॥ కరిష్యామి ॥

4. ఋక్శాఖాధ్యయన సంపన్నం ......గోత్రజం .......శర్మాణం అస్మిన్ పాంచాహ్నిక ధ్వజా రోహణ దివ్యకల్యాణ మహోత్సవ కర్మణి సర్వ మంత్ర ప్రదీపార్థం బ్రహ్మాణం త్వామహం వృణే ।
వృతోస్మి ।--------- ॥ కరిష్యామి ॥

5. సామశాఖాధ్యయన సంపన్నం ........ గోత్రజం ........... శర్మాణం అస్మిన్ పాంచాహ్నిక ధ్వజారోహణ దివ్యకల్యాణ మహోత్సవ కర్మణి, సమిద్ధోతారం త్వామహం వృణే ।

వృతోస్మి ।-------------- ॥ కరిష్యామి ।

6. యజుశ్శాఖాధ్యయన సంపన్నం ........ గోత్రజం ........... శర్మాణం అస్మిన్ పాంచాహ్నిక ధ్వజారోహణ దివ్యకల్యాణ మహోత్సవ కర్మణి, చరుహోతారం త్వామహం వృణే ।

వృతోస్మి ।-------------- ॥ కరిష్యామి ।

7. యజుశ్శాఖాధ్యయన సంపన్నం ........ గోత్రజం ........... శర్మాణం అస్మిన్ పాంచాహ్నిక ధ్వజా రోహణ దివ్యకల్యాణ మహోత్సవ కర్మణి, ..... పారాయణార్థం త్వామహం వృణే ।

( మూలమంత్రజపార్థం/ ద్వాదశాక్షరీమంత్రజపార్థం/ ద్వయమంత్రజపార్థం/ గీతా పారాయణార్థం/ శ్రీమద్రామాయణ పారాయణార్థం/ విష్ణు సహస్రనామ పారాయణార్థం )

వృతోస్మి ।-------------- ॥ కరిష్యామి ।

॥ ఇతి ఋత్విగ్వరణం ॥

# రక్షాబన్ధనమ్

1. సుపర్ణేన కృతం సూత్రం తండులోపరి విన్యసేత్ ।

విష్ణోరరాట మంత్రేణ సప్తవారాధి మంత్రితమ్-

**విష్ణో రరాటమసి విష్ణోః పృష్ఠమసి విష్ణోః శ్నప్త్రేస్థో**

**విష్ణోః స్స్యూరసి విష్ణోః ధ్రువమసి వైష్ణవమసి విష్ణవేత్వా ॥**

2. ప్రాణానాయమ్య ॥=॥=॥ గోత్రస్య ॥=॥=॥ భగవంతముద్దిస్య ॥=॥=॥ భగవత్ ప్రీత్యర్థం పాంచాహ్నిక ధ్వజారోహణ దివ్యకళ్యాణ మహోత్సవం కర్మ కరిష్యమాణస్య ధ్వజారోహణ ప్రభృతి పుష్పయాగ పర్యంతం తన్మధ్యే తత్తద్కర్మకరణ యోగ్యతా సిధ్యర్థం రక్షాసూత్ర బంధనం కరిష్యే -

3. రక్షాసూత్రదేవతాభ్యో నమః ధ్యానా వాహనాది షోడశోపచార పూజాం కరిష్యే- (షోడశోపచార పూజా)

4. జితంత ఇతి మంత్రేణ బధ్నీయాత్ భగవతః కరే [1] --

**జితం తే దక్షిణతో వృషభ ఏధి హవ్యః ఇంద్రోజయాతి**

**న పరాజయాతి అధిరాజోరాజ సురాజయాతి ॥**

5. సుమంగలీరితి మంత్రేణ శ్రీభూమిభ్యాం తథాచరేత్ -

**సుమంగలీ రియం వధూ రిమాగ్ం సమేతపశ్యత**

**సౌభాగ్య మస్యై దత్వా యాథాస్తం విపరేత న ॥**

6. దేవస్య దక్షిణే హస్తే దేవ్యోర్వామకరే తథా, ఆచార్య కర్మకర్తౄణాం బృహత్సామేతి మంత్రతః -

---

[1] జితం త ఇతి బధ్నీయాత్ కౌతుకం దక్షిణే కరే । ఆచార్యస్యాపి కర్తవ్యం తథా కౌతుక బంధనమ్ -విష్ణు.సం. 20-56

బృహత్సామ క్షత్రభృత్ వృద్ధ వృష్ణియం త్రిష్టుభౌజ స్సతతముగ్రవీరమ్
ఇంద్రస్తోమేన పంచదశేన మధ్యమిదం వాతేన సగరేణ రక్ష ॥

రకారం రమతేపుంసాం క్షకారం క్షేమమేవచ
రేఫా క్షకార యోగేన రక్షాసూత్రం విదుర్బుధాః ॥

తద్ధారణా దశౌచంతు న ప్రాప్నోతి న సంశయః ॥ [2]

॥ ఇతి రక్షాబంధనమ్ ॥

## అథ పరిషదర్చనమ్



2 కర్మస్య రక్షణార్థాయ స్థానస్య విజయాయచ । రక్షా బన్ధంతు కర్తవ్యం సూతకాశౌచ వర్జనం ॥ - భాలసీమ చా.జగ్గప్ప. పారం.

3.రక్షాబన్ధనానంతరం ద్వారతోరణాంతరాళ పతాకదేవతా పూజలు బాలసీమ వారి పారంలో కన్పిస్తున్నవి. "ధారయిత్వా కౌతుకాని కుర్యాత్పరిషదర్చనం" - పురు.సం. 12.10.

( ప్రతిసరబంధనము కౌతుకబంధనము రక్షాబంధనము కంకణ బంధనము అని క్రమముగా ఈ పేర్లు మారుతూవచ్చినవి. శబ్దవత్ భేదమున్నప్పటికి ఇవన్నీ సమానార్థకములుగా వాడబడుచున్నవి. రక్షాసూత్రము స్వర్ణ / కార్పాసాది తన్తువులచే ఏర్పరచవలసి యున్నది. అట్టి రక్షా సూత్రమును తండులముల యందుంచి నూతన వస్త్రమున ఆచ్ఛాదనమొనర్చి, దేవుని సముఖమునందుంచి, పుణ్యాహవారితో ప్రోక్షణమొనర్చి, తంతువును పూజించి ఆచార్యుడు తన రెండు చేతుల అంగుష్ఠానామిక లతో గ్రహించి సమ్మార్జనమొనర్చి విధ్యుక్తముగా కరమున బంధించవలెను. భరద్వాజ, విష్ణుతిలక, కపింజలాది సంహితలయందు ఈ ప్రక్రియ విస్తృతముగావర్ణింపబడుటయే గాక వివిధబింబములకు, విష్వక్సేన ఖగేశ్వర పరివారాది దేవతలకు, ఆచార్య ఋత్విక్పరిచారకాదులకు, వేర్వేరుగా ఎన్ని తంతువులతో రక్షాసూత్రము ఏర్పరచవలెనో, వాని అధిదేవత లెవ్వరో మొదలగు అంశములు వివరముగా చెప్పబడినవి పూర్వాచార్యులచే తాళపత్రగ్రంథముల లిఖించబడిన అట్టి అరుదైన అంశములు సేకరించి అనుబంధము 4, న ఇవ్వబడినవి )

# పరిషదర్చనమ్

1. ఓం అత్రోపవిష్టానా మేతేషాంభగవద్భాగవతాచార్యాణాం సభాసన్నిధౌ విజ్ఞాపనా మయాక్రియతే । మామనుగ్రహాణ । మదాననేన[1] శ్రూయతామ్ ॥

2. అస్య శ్రీ భగవతో మహాపురుషస్య దేవదేవస్య .......... గోత్రస్య .......... భగవంత ముద్దిస్య .......... భగవత్ ప్రీత్యర్థంపాంచాహ్నిక ధ్వజారోహణ దివ్యకళ్యాణ మహోత్సవం కర్మ కరిష్యమాణస్య ధ్వజారోహణ ప్రభృతి పుష్పయాగ పర్యంతం తన్మధ్యే తత్తత్కర్మకరణ యోగ్యతా సిధ్యర్థం మయా సమర్పితాం ఇమాం పరిషద్దక్షిణాం అల్పీయసీమపి యథోక్త దక్షిణా మివ స్వీకృత్య ॥

3. అస్య శ్రీ పాంచరాత్ర ద్వాదశలక్ష ప్రమాణ శాస్త్ర దివ్యాగమ శ్రీ విష్ణు పాద్మ కపింజల సంహితోక్త ప్రకారేణ సంభవతా నియమేన సంభవతా ప్రకారేణ సంభవద్భిః ద్రవ్యైః పూర్వాచార్యానుగ్రహాత్ శ్రీ భగవతో మహాపురుషస్య దేవదేవస్య ధ్వజారోహణ ప్రభృతి పుష్పయాగ పర్యంతం తన్మధ్యే తత్తత్కర్మకరణ యోగ్యతా సిద్ధిర్భూయాదితి భవంతో మహాంతోను గృహ్ణంతు ॥

4. అనేన పరిషద్దక్షిణా విధానేన భగవాన్ సర్వాత్మకః శ్రీమన్నారాయణః ప్రీయతామ్ ॥

॥ ఇతి పరిషత్ ॥



---

1. మదాననేన శ్రూయతాం- రే.రం.పాఠం . అవధానేన శ్రూయతాం -పా .

# ఇడావాచనమ్ [1]

(ఇడావాచనాన్ని భరద్వాజ సంహిత ఋత్విగ్వరణానంతరం విధించింది.)

1. అథ దేవతాహ్వాన విధిరుచ్యతే । [2]

2. శాలితండుల కాంస్య పాత్రే హరిద్రాక్షత సంయుక్త దూర్వా తాంబూలాదికం నిక్షిప్య । ప్రాణానాయమ్య

3. శ్రీ .......భగవత్ ప్రీత్యర్థం పాంచాహ్నిక ధ్వజారోహణ దివ్యకళ్యాణ మహోత్సవాంగత్వేన ఇడావాచన పూర్వక మభ్యుదయం కర్మ కరిష్యే -

4. ఆశ్వలాయనశాఖాయాం ఆపస్తంబశాఖాయాంవా సవైదిక సూక్త మంత్రజపం కుర్యాత్ ।

ఓం ఇడా దేవహూ ర్మనుయజ్ఞనీః బృహస్పతి రుక్థామదాని । శగ్ంసిష ద్విశ్వేదేవా స్సూక్తవాచః పృథివీమాత ర్మామహిగ్ంసీ ర్మధు మనిష్యే మధు జనిష్యే మధు వక్ష్యామి మధు వదిష్యామి మధుమతీం దేవేభ్యో వాచముద్యాసగ్ం శుశ్రూషేణ్యాం మనుష్యేభ్య స్తం మా దేవా అవన్తు శోభాయై పితరోఽనుమదన్తు॥

॥ ఇడ ఏహి ॥

ఓం ఇడా మగ్నే పురుదగ్ంసగ్ం సనిం గోశ్శశ్వత్తమగ్ం హవమానాయ సాధ స్యాన్న స్సూనుస్తనయో వి జావాగ్నే సా తే సుమతి ర్భూ త్వస్మే ॥ ॥ అదిత ఏహి ॥

---

1. అభ్యుదయైకం తతః కుర్యాదిడావాచన పూర్వకం అంకురానర్చయేద్ధీమాన్ వాస్తుపూజాం తతః క్రమాత్ - భ.సం 7 అధ్యా. 7 శ్లో

2. చాలవరకూ అన్నిప్రతులూ దీనిని దేవతాహ్వానమని పేర్కొని "ఇడావాచన పూర్వక మభ్యుదయం" అని వర్ణించినవి. ఇది భరద్వాజ సంహిత వర్ణనతో సరిపోతోంది. పాద్మ, క్రియాకైరవచన్ద్రికాదులు ఇడావాచనాన్ని చెప్పలేదు. పూర్వాచార్యప్రయోగముగా దీనిని గ్రహించవచ్చునది.

ఓం ఈడామహై దేవాగ్ం ఈడే న్యాన్నమస్యామ నమస్యాన్ యజామ యజ్ఞియా నిత్యాహ మనుష్యావా ఈడేన్యాః పితరో నమస్యా దేవాయజ్ఞియా దేవతా ఏవ తద్యథాభాగం యజతి ॥

॥ సరస్వ త్యేహి ॥

5. ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ [3] - దీనామవిత్రయవత్ । ఇత్యుక్త్వా తత్రదేవతాః సగుణావతారస్య శ్రీమన్నారాయణస్య నాందీ ప్రపితామహీ పితామహీ మాతరః అచ్యుత గోత్రస్య నాందీముఖాః నాందీ, నాందీ ప్రపితామహ పితామహ పితరః అచ్యుత గోత్రస్య నాందీముఖా। నాందీ శుభదో విష్ణుః భగవత్ప్రసాదం।

( సాంకల్పికో విధిః )

నాందీ ఉభాభ్యా ముభాభ్యాం విష్ణు భక్తానాం బ్రాహ్మణానాం హిరణ్యేన తోషయిష్యే-

శ్రీ ...... దేవస్య దివ్యకల్యాణ మహోత్సవ మండపే శోభనం భవిష్యతి। దేవాశ్చ పితరశ్చ సమ్యక్ సహితాః అంతర్హితాస్సన్తః అద్భిర్భూయాదితి ఆగచ్ఛ తాగచ్ఛ తాగచ్ఛత । ఇడఏహి । అదితఏహి । సరస్వత్యేహి ॥

6. దివ్యకల్యాణ మహోత్సవ యుగ్మాస్సన్తు। శోభన మంటపే ఆగచ్ఛ తాగచ్ఛ తాగచ్ఛత ।

॥ ఇత్యభ్యుదయైక విధిః॥



---

3. ప్రణోదేవి నుండి ఉన్న ఈ 5వ కారిక అంతా రే.శ్రీరం పాఠంలో లేదు. మిగిలిన అన్ని ప్రతులలో ఉన్నది. ఇది భారద్వాజ సంహితోక్త ప్రతిష్ఠా విధియందలి ఇడావాచనమున కూడ ఉన్నది.

# మృత్సంగ్రహణమ్

( యత్రాంకురార్పణ ముక్తం తత్రైవ మృత్సంగ్రహణం కుర్యాత్ ।)[1]

1. ప్రాణనాయమ్య । ఏవంగుణ విశేషణ విశిష్టాయాం ॥=॥=॥ గోత్రస్య ॥=॥=॥ భగవంత ముద్దిస్య ॥=॥=॥ భగవత్ ప్రీత్యర్థం పాంచాహ్నిక ధ్వజారోహణ దివ్యకళ్యాణ మహోత్స వాంగత్వేన ప్రథమదివసే పూర్వకర్మాఽంగ మృత్సంగ్రహణాఖ్యం కర్మ కరిష్యే -

2. ఆచార్య ఋత్విగ్భిః పరిచారకైస్సహ ఖనిత్రమాదాయ శాకున సూక్తంపఠన్ గ్రామస్య ఈశాన దిశం[2] గత్వా ।

**అనుహవం పరిహవం ............ సుమనాభవ ॥**

తత్రలోష్ఠాది రహిత శుచిస్థలే దశతాల మాత్రం గోమయేనానులిప్య ।

3. దధిక్రావణ్ణ ఇతి ప్రోక్ష్య ।

**దధిక్రావ్ ణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః**
**సురభినో ముఖాకరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్ ॥**

4. భూమిర్భూమ్నేతి మంత్రేణ సువృత్తమండల [3] ముల్లిఖ్య ॥

**భూమిర్భూమ్నా ద్యౌ ర్వరిణాన్తరిక్షం మహిత్వా । ఉపస్థే తే దేవ్యదితేఽ గ్ని మన్నాద మన్నాద్యా యా దధే । ఆయ గౌః పృశ్నిరక్రమీ దసన న్మాతరం పునః । పితరంచ ప్రయంత్సువః। త్రిగ్ంశద్ధామవిరాజతి వాక్పతఙ్గాయ శిశ్రియే । ప్రత్యస్య వహ ద్యుభిః । అస్య ప్రాణాదపాన త్యన్తశ్చరతి రోచనా । వ్యఖ్య న్మహిష స్సువః**

---

1. చూడుడు మృత్సం.విధి.క్రి.కై.చం. 8 పరిచ్ఛే.పుట.28, శ్రీపురు.సంహి.అ.12, శ్రీప్రశ్నసంహి. అ.31
2. దిశం ప్రాచీముదీచీం వా అథవా ప్రాగుదగ్దిశమ్ - ఈశ్వర సంహిత 10-129
3. భూమిర్భూమ్నేతి భూలోకవత్ వర్తుల ముల్లిఖ్య -వైఖా.ప్రతి.పుట 75
   ఖనిత్రం = త్రవ్వునది, లోష్టము = ఇనుపతుప్ప

యత్వా క్రుద్ధః పరోవప మన్యునా యదవర్త్యా। సుకల్పమగ్నే తత్తవ పున స్త్వోద్దీపయామసి । యత్తే మన్యుపరో ప్తస్య పృథివీ మను దధ్వసే। ఆదిత్యా విశ్వే త ద్దేవా వసవశ్చ సమాభరన్ ॥

5. తన్మధ్యే మహీందేవీమితి"ధ్రువబేర బాహుసమాం ఊర్ధ్వవక్త్రాం నిరృతి పాదాం ఈశాన్య శిరస్కాం ద్విభుజాం శాయితాం కల్పయిత్వా"[4]।

**మహీం దేవీం విష్ణుపత్నీం మజూర్యాం ప్రతీచీ మేనాగ్ం హవిషా యజామ। త్రేధా విష్ణు రురుగాయో విచక్రమే । మహీం దివం పృథివీ మంతరిక్షమ్ । వషట్తే విష్ణవాస అకృణోమి తన్మే జుషస్వ శిపివిష్ట హవ్యమ్। వర్ధం తుత్వా ప్రష్టుతయో గిరోమే యూయం పాత స్వస్తి భిస్సదానః।**

6. ఆపోహిష్ఠేతి ప్రోక్ష్య । ఏకాదశోపచారై రభ్యర్చ్య । పుణ్యాహం వాచయిత్వా[5]।

7. కూర్చేన పశ్చమే చక్రం విష్వక్సేనమథోత్తరే ప్రాగ్భాగే గరుడం యామ్యే ఖనిత్రే శేషం (లిఖిత్వా) అర్చయేత్ [6]॥

8. ఆచార్యః ప్రాఙ్ముఖో భూత్వా। ఆత్మానం గరుడం స్మృత్వా[7]। లలాట బాహు స్తన జఠరేషు మేదినీ మంత్ర ముచ్చరన్ ధ్యాత్వా।

**మేదినీ దేవీ వసుంధరా స్యాత్ వసుధాదేవీ వాసవీ బ్రహ్మవర్చసః పితౄణాం శ్రోత్రం చక్షుర్మనః దేవీ హిరణ్యగర్భిణీ దేవీ ప్రసోదరీ**

---

4 పురు సంహిత 12.13-19శ్లో. 5. రే.శ్రీరం. పారం

6 శ్రీప్రశ్న సంహిత - 12.16,17.

7 ఆత్మానం పగరం స్మృత్వా - అని వైఖా.ప్రతిష్ఠ (పే.79)

**సదనే సత్యాయనే సీద । సముద్రవతీ సావిత్రీ ఆనోదేవీ మహ్యంగీ మహోధరణి మహోద్య తిష్ఠత్ । శృంగేశృంగే యజ్ఞేయజ్ఞే విభీషణీ । ఇంద్రపత్నీ వ్యాపినీ సరసిజ ఇహ । వాయుమతీ జలశయినీ శ్రియంధారాజా సత్యంతో పరిమేదిని సోపరిధత్తంగాయ । విష్ణుపత్నీం మహీందేవీం మాధవీం మాధవ ప్రియామ్ । లక్ష్మీ ప్రియసఖీం దేవీం నమామ్యచ్యుత వల్లభామ్ । ధనుర్ధరాయ విద్మహే సర్వసిద్ధ్యైచ ధీమహి। తన్నోధరా ప్రచోదయాత్ ॥**

9. భూవరాహ అష్టాక్షరీ మహామన్త్ర జపమ్ -

అస్య శ్రీ భూవరాహ[8] మంత్రస్య । భార్గవ ఋషిః । అనుష్టుప్ ఛ్ఛందః । ఆది వరాహో దేవతా ఓం బీజం । భూః శక్తిః । క్లోం కీలకం। శ్రీభూవరాహ ప్రీత్యర్థే జపే వినియోగః ॥

ఓం ఏకదంష్ట్రాయ అంగుష్టాభ్యాం నమః ఓం వ్యోమోల్కాయ తర్జనీభ్యాం నమః । ఓం తేజోరూపాయ మధ్యమాభ్యాం నమః । ఓం విశ్వరూపాయ అనామికాభ్యాం నమః । ఓంక్రోడరాజాయకనిష్టికాభ్యాం నమః । ఓంమహాదంష్ట్రాయ కరతలకరపృష్ఠాభ్యాంనమః ।

ఓం ఏకదంష్ట్రాయ హృదయాయ నమః । ఓం వ్యోమోల్కాయ శిరసేస్వాహా । ఓం తేజోరూపాయ శిఖాయై వౌషట్ । ఓం విశ్వరూపాయ కవచాయహుమ్ । ఓం క్రోడరాజాయ నేత్రత్రయాయవౌషట్ । ఓం మహాదంష్ట్రాయ అస్త్రాయఫట్ ।

భూర్భువస్సువరోమితి దిగ్బంధః।

8. ధ్యానంయజ్ఞవరాహమూర్తిని. భూవరాహ మన్త్రమున న్యాసము.- శ్రీమన్నారా. సంహి.యు.వై 7-86.87. వైఖా.ప్రతి పుట-78.

ధ్యానం:-

శ్రీశం జగత్పావన యజ్ఞమూర్తిం దంష్ట్రా మయూఖై ర్విలసత్ కలపోలమ్।
దేవ్యా ధరణ్యా సహితం మహేశం వారాహ మాద్యం ప్రణమామి నిత్యమ్॥

ఆపాదాజ్జాను దేశా దథ కనక నిభం నాభిదేశాదధస్తాత్
ముక్తాభం, కంఠదేశే తరుణ రవినిభం, మస్తకే నీలభాసమ్ ।
ఈడే హస్తైర్దధానా రథచరణ ధరౌ ఖడ్గ ఖేటం గదాఖ్యమ్
శక్తిర్దానాభయోచ క్షితిచరణలసత్ దంష్ట్రమాద్యంవరాహమ్ ॥

10. అష్టాక్షరీం చ ద్వాదశవారం జపిత్వా ।

" ఓం నమోనారాయణాయ "

11. వరాహానుష్టుభం షోడశ వారం జపిత్వా -

భూవరాహ మహోత్సాహ సర్వ సంపత్ప్రదాయక
శత్రూన్ సంహర మాం రక్ష శ్రియందాపయ సర్వదా ॥

"ఓం నమో భూవరాహాయ" ఇతి వరాహ మూర్తిం ధ్యాయన్-

12. త్వాం ఖనామీతి కుక్షౌ ఖనిత్వా । అన్యాంగేషు నిఖనేత్ [9] ॥

త్వాంఖనామి పృథివీ త్వద్భర్తృ శాసనా న్మృదాయుక్తాభవ ।
దేవానాం దేవస్య తస్యేదం వైష్ణవంభవనం దేవవాహినీం పాంశూన్
ప్రేష్యామి సమృద్ధయేఽభి వృద్ధయే। యస్సఖా విష్ణోర్వరదో వరాణాం।
కర్తా చమూనాం శుచిశ్శుచీనాం వీరో వీరాణా మాగమిష్యంతు ।
త్వగ్ం సర్వం కారయ । వరదో వరస్య త్వత్ప్రసాదాత్సిద్ధోహం సిద్ధిం

9. ముఖేచ సర్వ దోషఘ్నం బాహ్వోర్బహు సువర్ణదం । స్తనయోః కులవృద్ధిశ్చ జఠరే సర్వసంపదః ॥ - బాలసీమ.చా.జగ్గప్ప.పాఠం

**గచ్ఛామి । త్వామేవ విఘ్నార్థమవిఘ్నంభవతు । సిద్ధం సుక్రమాస్సంతు। సునీతాశ్చాపః సూచయంతాం సూచయంతే శుభాశుభం। వరుణ శ్శుభాశ్శుభం । పాతుమాం వరుణో నిత్యోరక్తాంబరో జలేశ్వరః। అమిత త్వ త్ప్రసాదేన సర్వేదేవాః ప్రసీదంతు । ఆయాతు భగవాన్ బ్రహ్మో అస్మిన్ లోకే హితం కరః । నిత్యోస్మి నిర్మలే పద్మే రమ్యతా మృషిభిస్సహ । ఇదం బ్రహ్మణా పూర్ణం । తమారుహ్యా దేవాః సూచయంతి దేవాః ॥**

## మృత్సంగ్రహణమ్

13. హేమాది పాత్రే మృదం సంగృహ్యా ॥ నవేన వాససాచ్ఛాద్య ॥ యేభూతాః ఇతి తస్మిన్ గర్భే అన్న పిండం నిక్షిప్య ॥

*(ఆయా పాత్రలకు మూలమంత్రమున నూతన వస్త్రము చుట్టి, నది ఇసుక, గోకులముల గోమయముతోనహా యానము నెక్కించవలెను. చూ.. పుట 256,257 )*

**యేభూతాః ప్రచరన్తి దివానక్తం బలిమిచ్ఛంతో వితుతస్య ప్రేష్యా। తేభ్యోబలిం పుష్టికామో హరామి । మయిపుష్టిం పుష్టిపతిర్దదాతు ॥**

తదష్టదిక్షు ఇంద్రాది క్రమేణ బలి ప్రదానం కుర్యాత్ । .............
గర్తం పూరయిత్వా ।

14. తన్మృత్పాత్రం యానే గజే రథేవా సమారోప్య । శాకున సూక్తాదికం పఠన్ - అంకురారోపణ మండపం గత్వా । విధినాంకురారోపణం కుర్యాత్ ॥

॥ ఇతి మృత్సంగ్రహణమ్ ॥



# అగ్ని ముఖమ్ [1]

(ఈ అగ్నిముఖం అంకురార్పణ హోమార్థం గనుక అంకురార్పణకు ముందు ఇవ్వ బడినది)

ప్రాణాయామం - సంకల్పం :- ప్రాణానాయమ్య । అథ కళ్యాణ మణ్డపాది తత్తద్ద్రవ్య శుద్ధ్యర్థం, ద్వార తోరణాంతరాళ పతాక దేవతా హోమార్థం, వాస్తు హోమార్థం, యాగమండపాధిప యోగీశ్వర హోమార్థం, అంకురారోపణ హోమార్థం అగ్ని ప్రతిష్ఠాపనం కరిష్యే ॥ ఇ తి సంకల్ప్య....

<u>కుండనిర్మాణం:-</u>

1. ఏకహస్త ప్రమాణం త్రిమేఖలం చతురశ్రం యోనినాభిసమాయుక్తం కుండం [2] నిర్మాయ-

[3] ***అథాగ్నే ప్రతిష్ఠావిధిం వ్యాఖ్యాస్యామః।***

**వ్యాఖ్య ॥ ఏకహస్త మితి ముష్వ్యంగుల ప్రమాణేన చతుర్వింశత్యంగుల విస్తారాయామం చతురంగుల విస్తారోన్నత మేఖలా త్రితయ యుతం చతురశ్రం మూలమారభ్య పంచదశాంగులాయత యోని సహితం ముఖే షడంగుల చతురంగులాయామ త్ర్యంగుల నహన నాభి సమాయుక్తం కుండమ్ । తన్మధ్యే షోడశాంగుల విస్తారాయామ ప్రాదేశమాత్ర నిమ్నం ఖనిత్వా । వాసుదేవాధిదైవతం చతురశ్ర మాహవనీయ కుండం కుర్యాత్ ॥** [3]

---

1. అగ్నికార్యవిధి -కపింజల సం. 16వ అధ్యా., నారాయణ సం.యజ్ఞ. 11.1-187, పురు.సం. 11వ అధ్యా పాద్మ సం.చర్యా4 అధ్యా., క్రి.కై.చం-29వ పరి. పుట 138-140 ., విష్ణుతిలకం -5వ అధ్యా. చూడుడు.అను..6 అగ్నిప్రతిష్ఠా కర్తవ్యా స్వసూత్రోక్త విధానతః - పురు.సంహి.22.25 అనుటవలన ఆయా అర్చకస్వాముల గృహ్యసూత్ర విధానమునునసరించి అగ్నిప్రతిష్ఠ చేయవలెను.

2. తూర్పున చతురస్రమున ఆహవనీయము, దక్షిణమున చాపకుండమున దక్షిణాగ్ని, పశ్చిమమున వృత్తకుండమున గార్హపత్యము, ఉత్తరమున త్రికోణకుండమున సభ్యాగ్ని, ఈశాన్యము లేదా ఆగ్నేయమున చతురశ్రమున అవసథ్యాగ్నిని ఏర్పరచవలె. యజమాని ఇచ్ఛానుసారము అవసథ్యాగ్నిరహితముగ నాలుగు అగ్నులను గాని, సభ్య అవసథ్యాగ్ని రహితముగా అగ్నిత్రయమునుగాని, ఒక్క ఆహవనీయమునుగాని కల్పించ వచ్చును. -పాద్మ.చర్యా.మహోత్సవవిధి 11.14-29 శ్లో.

3. ఈ అగ్నికార్యవిధి చాల ముఖ్యమైనది గాన మా పూర్వాచార్యులు శ్రీమాన్ దొడ్డిపట్ల ఉప్మాకయ్యగారు 1836 ప్రాంతంలో తాళపత్రంపై వ్రాసిన అగ్నికార్యవ్యాఖ్య ఇక్కడ ఇవ్వబడుచున్నది. ఈ వ్యాఖ్య 36వ కారిక వరకూ మాత్రమే లభించింది. ఆయా అంశములను సక్రమముగా గురుముఖతః నేర్చుకొని ఆచరించ వలసియున్నది.

(కుండము పొడవు వెడల్పులు 24 ముష్టంగుళములు, 4 అం.ల వెడల్పు 4 అం.లు ఎత్తు గల మూడు మేఖలలు, మొదలు నుండీ 15 అం.ల యోనికి ముఖమందు 6 అం.లు 4 అం.లు ఆయామముతో 3 అం.ల విస్తారముగల నాభితో కూడిన కుండమును నిర్మించవలె. దాని మధ్య 16 అం.ల చదరముతో ప్రాదేశమాత్ర (బొటనవ్రేలు చూపుడు వ్రేలుతో ఏర్పడు జాన) నిమ్నమును త్రవ్వవలె. ఆవిధముగా వాసుదేవాధిదైవతమగు ఆహవనీయ చతురశ్ర కుండమును ఏర్పరచవలెను. )

## 2. తత్పశ్చిమే ఉపవిశ్య ।

**వ్యాఖ్య ॥ తత్కుండస్య పశ్చాద్భాగే ఉపవిశ్య । అథవా దక్షిణే యోనిర్యది ఉదఙ్ముఖ ఉపవిశేత్ ॥**

(కుండమునకు పడమటి భాగమున తూర్పు ముఖముగా కూర్చొనవలెను. ఒకచో కుండమునకు దక్షిణయోని ఉన్నచో ఉత్తరముఖముగా కూర్చొనవలెను. యాగశాలా ద్వారమున చండ ప్రచండులను, మధ్య గరుడుని అర్చించి లోపల ప్రవేశింపవలెనని అగ్నికి పశ్చిమమున పూర్వాగ్రములుగా 3 దర్భలు వేసి దానిపై కూర్మాసనముంచి అందు ప్రాఙ్ముఖుడై కూర్చొనవలెనని - క్రి.క్రై.చం)

## 3. సన్మార్జన లేపనే కృత్వా ।

**వ్యాఖ్య ॥ ద్వాదశాక్షర మన్త్రేణ ద్వాదశ సంఖ్యయా కూర్చేన కుండం సమ్మార్జ్య । తత్కూర్చ మగ్నికోణే నిరస్య । హస్తం ప్రక్షాళ్య । దర్భద్వయేన గోమయేన గంధోదకేనవా హరిద్రేణవా లేపనం కృత్వా । తద్వయ మగ్ని కోణే నిరస్య । కరం ప్రక్షాళ్య ॥**

(ద్వాదశాక్షర మన్త్రమున 12 దర్భల కూర్చతో కుండమును సమ్మార్జనము చేయవలె. ఆకూర్చను ఆగ్నేయ కోణమున వదిలి వేయవలెను. చేయికడుగుకొనవలెను . రెండుదర్భలతో గోమయమున గాని, గంధోదకమున గాని, హరిద్రోదకముగాని లేపన మొనర్పవలె. ఆ దర్భద్వయమును కూడ అగ్ని కోణమున వదలి వేయవలెను. చేయి కడుగుకొనవలెను.

కుండ అష్టాదశసంస్కారములు ప్రతిష్ఠాప్రయోగమున పూర్తిగా చెప్పబడినవి. నారాయణ సంహిత చెప్పినదిగాని, క్రి.క్రై.చంద్రిక అగ్నికార్యవిధి యందు కుండ అష్టాదశ సంస్కార ములను విధించ లేదు. సమ్మార్జన లేపనములు ప్రాగారభ్యముగా ప్రాదక్షిణ్యముగా చేయ వలెను.)

## 4. కుశ కూర్చేన కుండం సంప్రోక్ష్య ।

**వ్యాఖ్య ॥ అవాగగ్ర బ్రహ్మకూర్చేన ఆధార పతాక హస్తేన జల మాదాయ । కుండం సంప్రోక్ష్య ॥**

(కొన క్రిందకు ఉండునట్లుగ బ్రహ్మకూర్చను ధరించి ఆధార పతాక హస్తములతో జలమును గ్రహించి కుండమును సంప్రోక్షణ మొనరింపవలెను. పుణ్యాహవాచన మొనర్చి తత్పుణ్యాహజలమున ఓం భూర్భువస్సువః అను మన్త్రమున రెండు దర్భలతో ప్రోక్షణమును అభ్యుక్షణమును క్రి.కై.చం.విధించినది. అరచేతిని బోర్లించి నీళ్ళు చల్లుట అవోక్షణము, అరచేతిని పైకి ఉంచి నీళ్ళు జల్లుట ప్రోక్షణము, పిడికిలితో నీటిని జల్లుట అభ్యుక్షణము. క్రి.కై.చం., నారాయణ, పురు. సంహితలు కుండ సంస్కారానంతరం పాత్రాసాదనమును చెప్పినవి.)

## 5. తన్మధ్యే తండుల చూర్ణేన చతురశ్రం కృత్వా ।

**వ్యాఖ్య ॥ తత్కుండమధ్యే ప్రాదేశమాత్రం చతురంగులోన్నతం శాలిచూర్ణేన స్థండిలం కృత్వా॥**

(ఆ కుండమునకు మధ్యయందు ప్రాదేశమాత్రమగు (అంగుష్ఠతర్జనులతో ఏర్పడిన జానతో ఏర్పడు చదరము) స్థండిలమును శాలి చూర్ణముతో (బియ్యపుపిండి) కల్పించవలెను.)

<u>ఉల్లేఖనం</u> :-

## 6. త్రిభిర్దర్భై ర్దక్షిణత ఆరభ్య ఉదగాయితాః ప్రాగగ్రాః త్రిస్రః పశ్చాద్దర్భై రిత్యాది లిఖిత్వా ॥[4] రేఖామన్త్రాః - ఓం సాత్వికాయనమః । ఓం రాజసాయనమః । ఓం తామసాయనమః ఇతి లిఖిత్వా । ఉల్లేఖన దర్భాన్ వారుణ్యాం నిరస్య । హస్తౌ ప్రక్షాళ్య ।

**వ్యాఖ్య॥ దర్భత్రయేణ దక్షిణతః ఆరభ్య ఉదక్సంస్థాః ప్రాగగ్రాః త్రిస్రః రేఖాః లిఖిత్వా । తతః పశ్చాదారభ్య ప్రాక్సంస్థాః ఉత్తరాగ్రాః త్రిస్రో రేఖాః లిఖిత్వా ॥**

---

4.పాద్మము,క్రి.కై.చం.అష్టాక్షరితో 3 రేఖలు గీయుమని విధించినది. శ్రీకూర్మాది ప్రాచీనప్రతులు ఈ రేఖలను సాత్విక, రాజస, తామసములతో లిఖించుమన్నవి.

( ఆశాలిచూర్ణముపై మూడుదర్భలతో ప్రాగగ్రములగు 3 రేఖలను దక్షిణమున ఆరంభించి ఉత్తరమునకు, ఉదగగ్రములగు 3 రేఖలను పశ్చిమమున ప్రారంభించి తూర్పునకు లిఖించవలెను.[5] )

## 7. అవాచీన పాణినా అద్భిరవోక్ష్య ।

**వ్యాఖ్య ॥ జలమాదాయ కరతల మవాక్కృత్వా । సబ్రహ్మ కూర్చేన పాణినా ప్రోక్షణం తదవోక్షణం తత్ కృత్వా॥ (అవాక్కరోభ్యుక్ష్య - తృణంనైరృత్యాంనిరస్య - అనునదికూడ కొన్నిపాఠములయందు కన్పించుచున్నది)**

(బ్రహ్మకూర్చతో నున్న బోర్లించిన అరిచేతితో నీటిని జల్లుట అవోక్షణము గాన అటుల చేయవలెను. (ఉల్లేఖన దర్భలను ప్రాగగ్రములుగాబియ్యపుపిండిపైనుంచి అభ్యుక్షణమైనతర్వాత నైరృతి మూలన ఆదర్భలను పడవేయవలెను అని కొన్ని పాఠములు)

## 8. శేషతోయ ముత్సృజ్య ।[6]

వ్యాఖ్య ॥ అవోక్షణ శేషతోయ ముత్సృజ్య ।

(అవోక్షణము చేయగా మిగిలిన జలమును వదలి వేయవలెను. ఒక పాత్రతో జలమును గ్రహించి అందు సుమారు సగభాగము నీటిని బ్రహ్మకూర్చతోనున్న చేతిలో

---

5."ప్రాచీఃపూర్వ ముదక్సంస్థం దక్షిణణారంభ మాలిఖేత్ । అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభ మాలిఖేత్" - పడమర నుండి తూర్పునకు గీయవలసిన3 రేఖలను 1. దక్షిణ 2. మధ్య 3.ఉత్తర భాగముల యందున, దక్షిణము నుండి ఉత్తరమునకు గీసిన 3 రేఖలను 4. పశ్చిమ 5. మధ్య 6. తూర్పు భాగముల యందున ప్రక్క పటము నందు చూపినరీతిని కుండమున లిఖించవలెను.




6. ఏడవ కారిక అవోక్షణమైన తర్వాత 10వ కారిక అగ్ని ప్రతిష్ఠ ఉండవలెనని, ఆపైన 8,9 కారికలు శేషతోయో త్సర్జనాదులు ఉండవలెనని చిర్రావూరి శ్రీరామశర్మగారు. కిక్రైచం ద్రిక, నారాయణాది సంహితలుఅవోక్షణ, శేషతోయోత్సర్జన, అన్యతోయములను చెప్పలేదు.

పోసుకొని బోర్లించిన అరచేతితో అవోక్షణ మొనరించి మిగిలిన నీటిని పైకి చల్లుట (శ్రౌత సంప్రదాయము.)

**9. అగ్నేరుత్తరతః పూర్వతోవా౽న్యతోయ ముపదధ్యాత్ ।**

**వ్యాఖ్య ॥ కర్మ సంపూర్త్యర్థం సాక్షతోదక కలశం అగ్నేరుత్తరతః పూర్వతోవా సంస్థాపయే దిత్యర్థః । అగ్నిః తత్కలశం దృష్ట్వా న పలాయితో భవతి । అన్యథా పలాయితో భవతీతి ।)**

(కర్మ సంపూరణమునకై అక్షతలతో కూడిన ఉదకముగల కలశను అగ్నికి ఉత్తరమున లేదా తూర్పున ఉంచవలెను. ఆకలశను చూచిన అగ్ని పారిపోడు. లేనిచోపారిపోవునని చెప్పబడినది. (పాత్రను పరిస్తరణలకు వెలుపల ఉంచవలెను.)

<u>అగ్ని ప్రతిష్ఠ :-</u>

**10. పాత్ర ద్వయేనాగ్నిమాదాయ/ (గ్నింసువాసినీభ్యామాదాయ)। భూర్భువస్సువరోమితి పాణిభ్యాం అగ్నిం ప్రతిష్ఠాప్య**

**" ఓం భూర్భువస్సువరోమ్ ।"**

**వ్యాఖ్య ॥ రాక్షస భయాదగ్నేరాచ్ఛాదనం కర్తవ్యమ్ ॥**

( రెండు పాత్రలతో అనగా ఒక పాత్రలో అగ్నినుంచి వేరొక పాత్రను దాని పై కప్పియుంచిన (సువాసినులు అగ్నిని తీసుకొని రాగా) "భూర్భువస్సువరోం"అను మన్త్రమున రెండు చేతులతో ప్రతిష్ఠించవలెను. రాక్షసభయమున అగ్నికి ఆచ్ఛాదనము.(పాత్రద్వయేన అగ్నిమాదాయ అనునది శ్రౌతసంప్రదాయము - ఏ అగ్నికైనా సంబంధించినది.)

**11. అగ్నేరానయ పాత్రయోః అక్షతోదకం నినీయ । సమిచ్ఛలాకాదిభిరగ్నిం ప్రజ్వాల్య॥** **వ్యాఖ్య ॥ తస్యార్థస్తు స్పష్టఏవ ।** ( దీని అర్థము స్పష్టము )

(అగ్నిని తెచ్చిన పాత్రలలో అక్షతలను నీటితో విడువ వలెను.)

**లక్ష్మీనారాయణధ్యానం -**

**[7] కుండమధ్యే సర్వాభరణ భూషితాం లక్ష్మీం రక్తమాల్యాంబరధరాం ఋతుస్నాతాం విచింతయేత్। తతః సర్వలక్షణ సంయుతం చతుర్భుజం విశాలాక్షం కోమలం పీతవాససం శంఖ చక్ర గదా పద్మ ధారిణం కంజ పాణినం పద్మపాదం శ్రీవత్సవక్షసం శ్యామలం శాంతం చంద్రాననం హారకేయూర కిరీట ధారిణం నారాయణం కుండ మధ్యే ధ్యాత్వా - అభ్యర్చ్య**

(**కర్మానుగుణ అగ్నిధ్యానం** - ఇక్కడ బాల యువ వృద్ధాగ్ని ధ్యానాలలో ఏది వర్తిస్తుందో దానిని అనుసరించవలెను.. చూడుడు అను. - 6 అగ్నిధ్యానవిధి.)

**1. ద్విముఖం చైక హృదయేత్యగ్నిం ధ్యాత్వా।**

**"ద్విముఖం చైక హృదయం చతుశ్శ్రోత్రం ద్వినాశికమ్।**

**ఆస్యద్వయం చ షణ్ణేత్రం పింగళం సప్తహస్తకమ్।**

---

7. ఇది అధికపాఠం. ఉప్మాకయ్యగారి అగ్నికార్య వ్యాఖ్యయందు చెప్పినది వృద్ధాగ్ని - అందుకే " కుండమధ్యే లక్ష్మీం ....." మొ॥నవి లేవు. కాని శ్రీకూర్మాది అన్ని ప్రతులలో ఈ లక్ష్మీసహిత నారాయణ ధ్యానం ఉన్నది. పాద్మం అగ్నికార్య విధియందు లక్ష్మీనారాయణ ధ్యానం లేదు. శ్రీమన్నారాయణసంహిత అగ్నిజనన విధియందు ల.నా. ధ్యానాన్ని విశేషంగా చెప్పి 'గ్రామ్య ధర్మప్రకారం' ఆలోచింపవలెనని (లక్ష్మీనారాయణ సంయోగోత్పన్నముగా అగ్నిని భావించుట) చెప్పినది. క్రి.కై.చంద్రిక స్వతంత్రించి "లక్ష్మీనారాయణ సంయోగోత్పన్నమగు అగ్నిని " ధ్యానించుటను చెప్పి , ఆపై అగ్నిమథనాదులను చెప్పినది. లక్ష్మీనారాయణ ధ్యానం బాలాగ్నికి (మంథనాగ్నికి)సంబధించినది. క్రి.కై.చం, విష్ణుతిలక, పాద్మాదుల ప్రకారం "ద్విశీర్షికం సప్తహస్తం.." అనేది బాలాగ్ని ధ్యానం. "అరణి మథితమగు బాలాగ్నిని కాని, సూర్యకాన్త జన్యమగు యువాగ్నిని కాని, శ్రోత్రియాగార సంపాదితమగు వృద్ధాగ్నిని కానిచేకొని ఓంభూర్భువస్సువః అనిప్రోక్షించి 'దివ్యాగ్ని'ని ధ్యానించవలెనని, ... కర్మానుగుణమగు అగ్నిని ధ్యానించవలెనని " -క్రి.కై.చం.(p139, 143) చెప్పుచున్నది.. ఇక్కడ వివాహం గృహ్యసూత్రానుగుణంగా జరిగించవలసి ఉన్నందున లౌకికాగ్ని(వృద్ధాగ్ని)ని ప్రతిష్టించుట జరిగినటుల కన్పించుచున్నది. నిత్యాగ్నిః వృద్ధఇత్యుక్తః ఉత్సవాగ్నిర్యువాభవేత్ । దీక్షాశాన్తి ప్రతిష్ఠాగ్నిః బాల ఇత్యభిధీయతే ।- క్రి.కై.చం.అధ్యా. 29.

ఉపవీత సమాయుక్తం సర్వాభరణ భూషితమ్। 1

ధూమధ్వజం లోహితాక్షం సప్తార్చి స్సర్వకామదమ్।

ఆత్మాభిముఖమాసీన మేవం ధ్యాయేద్ధుతాశనమ్॥ "

2. రమిత్యగ్ని బీజేన కుండమధ్యే అగ్నిం సంప్రోక్ష్య। సప్తహస్త ఇతి ధ్యాత్వా - ఓం రం ఓం।

(కుడి అరచేతిలోఎడమ చూపుడువ్రేలితో రం అను బీజమును వ్రాసి ఆ అరచేతితో అగ్నినభిమంత్రించ వలెనని బాలిశాం చా.వేం.రా.భ.పాఠం. అగస్త్యభగవాన్ ఋషిః , రం బీజం, స్వాహా శక్తిః, స్వధా కీలకం, స్వస్తిపూర్ణముఖాయ న్యాసం, చత్వారి శృంగా ఇతి ధ్యానం - అని వైఖానసం. చత్వారిశృంగా అనేది శ్రౌత, స్మార్త అగ్ని ధ్యానం. అన్ని పాఠాలలో కన్పిస్తున్నది.)

"చత్వారి శృంగా త్రయోఅస్యపాదా ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య।

త్రిధాబద్ధో వృషభో రోరవీతి మహోదేవో మర్త్యాగ్ం ఆవివేశ।

సప్తహస్త శ్చతుశ్శృంగ సప్తజిహ్వో ద్విశీర్షకః।

త్రిపాత్ప్రసన్న వదన స్సుఖాసీన శ్శుచిస్మితః।

స్వాహాంతు దక్షిణే పార్శ్వే దేవీం వామే స్వధాం తథా।

బిభ్రద్దక్షిణ హస్తైస్తు శక్తిమన్నం స్రుచం స్రువమ్।

తోమరం వ్యజనం వామైర్ఘృతపాత్రం తు ధారయన్।

మేషారూఢం జటాబద్ధం గౌరవర్ణం మహౌజసమ్।

8. సాక్షతోదకపాణినా అగ్నింప్రదక్షిణం కృత్వా। ఆత్మనః పురతో న్యసేత్। - అం.వేం.రా. ప్రతి.ఏషహిదేవమన్త్రమును పురు., నారా. సంహితలు విధించినను క్రి. క్రై.చం చెప్పలేదు.

**ధూమ ధ్వజం లోహితాక్షం సప్తార్చిస్సర్వకామదమ్ ।**
**ఆత్మాభిముఖ మాసీన మేవం ధ్యాయేద్ధుతాశనమ్ । "**

**12.** ఏషహి దేవేన[8] సాక్షతోదక మాత్మనః పురతః విసృజేత్ ।
ఏషహిదేవః ప్రదిశోను సర్వాః పూర్వోహిజాతః స ఉ గర్భే అంతః ।
సవిజాయమానః సజనిష్యమాణః ప్రత్యఙ్ముఖా స్తిష్ఠతి విశ్వతో ముఖః ॥

**వ్యాఖ్య ॥ అగ్నిః ఉదకం దృష్ట్వా భీత్యాభిముఖో భవతి । అక్షతోదక విసర్జనం ।**

(ఏషహిదేవ మన్త్రమున అక్షతలతో కూడిన ఉదకమును తనకెదురుగా (కుండమునకావల) వదిలి పెట్టవలెను. అగ్ని ఉదకమును చూచి భీతితో అభిముఖమగునని వ్యాఖ్య. అనగా కుడిచేతితో ప్రదక్షిణముగా త్రిప్పి కుండమునకు తూర్పున మేఖలా మధ్యమున వదలిపెట్టవలెను. ఈ ప్రక్రియ అగ్ని అభిముఖమగుటకుద్దేశించినది గాన ఋత్విజుడు ఈ ఉదకమును తాను కూర్చున్న వైపునగాక తనకెదురుగ కుండమున కావలి వైపున విసర్జించ వలెనని తాత్పర్యము. తూర్పునగాని, దక్షిణయోనియైనచో హోత ఉత్తరముఖుడుగా నుండును గనుక ఉత్తరమునగాని విడువవలెనని తె.కం.గోపాలాచార్య. (పే.నెం.22)

**13.** ప్రాఙ్ముఖాగ్నే మమ అభిముఖోభవ సుముఖోభవ సుప్రసన్నోభవ వరదోభవ । యథోక్త జిహ్వయా హవిర్గృహాణ – ఇతి సంప్రార్థ్య ।

**వ్యాఖ్య ॥ యయా జిహ్వయా యద్ధవిః గ్రాహ్యం తద్ధవి స్త జ్జిహ్వయా గృహీతవ్యం - ఇత్యర్థః**

( ప్రాఙ్ముఖుడవగు ఓఅగ్ని నాకు అభిముఖుడవు కమ్ము. సుముఖుడవు కమ్ము, సుప్రసన్నుడవు కమ్ము, వరదుడవు కమ్ము, యేజిహ్వతో దేనిని గ్రహించవలెనో ఆజిహ్వతోడనే దానిని గ్రహించుము. (కొన్ని పాఠములయందు "మమ" కన్పించుటలేదు. కొందరు'అభిముఖోభవ, సుముఖోభవ...'అంటూ భగవంతునివైపు చేతులు త్రిప్పడం జరుగుతోంది మిగిలినవన్నీ చేసినవిధంగా హోత అగ్నిని తన కభి ముఖుడవు కమ్ము అని ప్రార్థించుటయే సరిపోతుంది. అలాకాకపోతే ప్రతిసంస్కారము భగవంతునిచేతికి తగిలించి చెయ్యవలసివస్తుంది.)

**14.** కుశ కూర్చేన అగ్ని గాయత్ర్యా కుండం సంప్రోక్ష్య ।

'రుద్రనేత్రాయ విద్మహే శక్తిహస్తాయ ధీమహి తన్నో వహ్నిః ప్రచోదయాత్ ।'

**వ్యాఖ్య ॥ అథోగ్ర బ్రహ్మకూర్చేన ఆధార పతాక హస్తేన అగ్నిగాయత్ర్యా కుండం సంప్రోక్ష్య । తద్గాయత్రీ రుద్రనేత్రాయేతి ।**

( కొన క్రిందకుంచిన బ్రహ్మకూర్చతో ఆధార పతాక హస్తములతో అగ్నిగాయత్రితో కుండమును సంప్రోక్షించవలెను. ఆ అగ్ని గాయత్రి రుద్రనేత్రాయ .... అనునది.

**15.** పరిసమూహ్య ।

**వ్యాఖ్య ॥ అగ్నేః పరితః ప్రాదక్షిణ్యేన ప్రాగుదగగ్రేణ దర్భత్రయ యుతేన సోదకేన పాణినా కుండస్య ఊర్ధ్వమేఖలాయాః అగ్నికోణమారభ్య ఈశానాన్తం । తతః నిరృతిమారభ్య అగ్నేయాన్తం । తతః నిరృతిమారభ్య వాయవ్యాన్తం । వాయవ్యమారభ్య ఈశానాన్తం ఆలేపన వత్ అగ్నేః ప్రాదక్షిణ్యేన కుండం సమ్మార్జ్య ।** (కరేణ తోయమాదాయ ప్రాగాదారభ్య ప్రదక్షిణమ్ పరితో మార్జనం య త్తదాహు పరిసమూహనం - అనిగ్రంధాన్తరము -ఎడిటర్)

( అగ్నిచుట్టూ ప్రదక్షిణముగా ప్రాగుదగగ్రములగు 3 దర్భలతో కూడిన సోదకపాణితో కుండముయొక్క ఊర్ధ్వమేఖల యందు ఆగ్నేయమునుండి ఈశాన్యము వరకు, నిరృతి మొదలు ఆగ్నేయము వరకు, నిరృతి మొదలు వాయవ్యము వరకు, వాయవ్యము మొదలు ఈశాన్యము వరకు ఆలేపనము వలె కుండమును ప్రదక్షిణముగా సమ్మార్జనమొనరింపవలె.

(అన్తమన్తమున పరిసమూహనము,అచక్రాయస్వాహా.....అని షడంగన్యాసమును - క్రి.కై.చం.చెప్పినది. పూర్వాచార్యులీ న్యాసాదులను ప్రతిష్ఠాప్రయోగమున చెప్పియున్నారు. ప్రతిష్ఠ యందుచెప్పి ఇక్కడ చెప్పకపోవుటకుగల కారణమాలోచించినచో వివాహప్రక్రియ ముఖ్యముగా స్మార్తవర్త్మనా జరిగించవలసి యుండుటయే అని తోచుచున్నది.)

## పరిషేచన

**16. తూష్ణీం పరిషిచ్య ।**

వ్యాఖ్య ॥ మన్త్రోచ్చారణం వినా పరిషేచనం కృత్వా ।

( మంత్రోచ్చారణ లేకుండ పరిషేచన మొనరింపవలెను.)

**17. ఆహవనీయాయ నమః ఇత్యష్టదిక్షు అక్షతైరలం కృత్య - ఆహవనీయాయ నమః । గార్హపత్యాయనమః । దక్షిణాగ్నయేనమః । సభ్యాయనమః అవసథ్యాయనమః । రత్నాగ్నయేనమః । దావాగ్నయేనమః । సప్తజిహ్వాయనమః । - ఇతి**

వ్యాఖ్య ॥ ఆహవనీయాయనమః ఇత్యాది సప్తజిహ్వాన్తం కృత్వా ।

( పిడికిట హరిద్రాక్షతలు తీసుకొని అగ్నికి ఎనిమిది దిక్కులయందు ఊర్ధ్వమేఖలపై ఆహవనీయాదులను పలుకుచూ పిడికిలి క్రింది భాగముతో కొలదిగ విడచుచూ అక్షతలతో అగ్ని నలంకరించవలెను. తూర్పుమొదలు ఈశాన్యాంతం అక్షతలను అలకరించవలె. (అలంకరణను క్రి. కై.చం.చెప్పలేదు. " అగ్నయేనమః హుతవహాయనమః .." అనునది స్మార్త పాఠం. ప్రస్తుత " ఆహవనీయాయనమః ...." అనునది పురుషోత్తమసంహితానుసారి.)

**18. త్రిః పరిషిచ్య ।**

వ్యాఖ్య ॥ పరిషేచన మన్త్రం వినా త్రివారం పరిషేచనం కృత్వా ।

(పరిషేచన మన్త్రము లేకుండా 3 సార్లు పరిషేచన చేయవలెను)

## పరిస్తరణలు

**19. దక్షిణోత్తరైః ఉత్తరాధరైః ప్రాగుదగగ్రైః దర్భై రగ్నిం పరిస్తృణాతి ।**[9]

వ్యాఖ్య ॥ స్పష్టం

(19 నుండి 23 వరకూ గల ఈకారికలు పరిస్తరణలుంచు

9. ' గ్రంధీకృతాగ్రా నద్వంద్వాన్ ప్రాగుదగ్వనాన్ కుశాన్ । ఏకాదశపరాన్ మన్త్రైర్వాసుదేవాదిభిః క్రమాత్ ।ప్రాగాది దిక్షు సంస్తీర్య ద్రవ్యాగ్నోరన్తరే గురుః" - వి.తి. - 5.215 శ్లో

విధానమును సూచించునవి. 19,20,21,22 లు సూచనలు. చతుష్షష్టిభిదర్భైరగ్నిం పరిస్తృణాతి అని అం.వేం.న పాఠం. సంప్రదాయము కూడ. ఒక్కొక్క పరిస్తరణకు 16 దర్భల చొ॥న 4 పరిస్తరణలకు 64 దర్భలు ఉండవలెనని, 16 దర్భలను తీసుకొని అన్ని కొనలనూ కలిపి ముడివేసి, అందులో ఒక దర్భతో చుట్టి పరిస్తరణలను తయారు చేయుట సంప్రదాయము. దీనికి అనుగుణముగా కొన్నిసంహితా వచనములు కన్పించుచున్నవి. తె.కం.గోపాలాచార్య స్వామివారు కూడ దీనినే చెప్పిరి. వీనిని ఉత్తరాగ్రములుగా తూర్పున, ప్రాగగ్రములుగా దక్షణమున, ఉత్తరాగ్రములుగా పశ్చిమమున, ప్రాగగ్రములుగా ఉత్తరమున ఉంచవలెను. దక్షిణదిశనున్న పరిస్తరణల మొదళ్ళు పైకిని, ఉత్తరదిశనున్న పరిస్తరణల మొదలు కొన క్రిందకున్నూ ఉండవలె. కాని క్రి.కై. చం., పురు., నారా., పాద్మములు అద్వంద్వాన్ ఏకాదశపరాన్, గ్రంథీకృతాన్..అంటూ చెప్పచున్నవి. చూడుడు అను..6.పుట 265)

## పాత్రాసాదనమ్

## 20. అగ్నేరుత్తరతో ద్వౌ దర్భౌ పాత్రాసాదన మాస్తీర్య ।

**వ్యాఖ్య ॥ పాత్రాధికరణార్థం అగ్నేరుత్తరే దర్భద్వయం సంస్థాప్య ।**

( పాత్రలనుంచుటకు అగ్నికి ఉత్తరమున రెండు దర్భలనుంచవలెను.

ఉప్మాకయ్యగారి వ్యాఖ్య రెండు దర్భలనే చెప్పచున్నది. పాత్రాసాదనకు 12 దర్భలని (ఎన్నిపాత్రలైనా) సంప్రదాయము, పౌష్కరవిధి కన్పించుచున్నది. శ్రౌత సూత్ర కారులు "పాత్రాసాదనకు ఇన్ని దర్భలని సంఖ్యను విధించలేదు" అని తెలియు చున్నది. పాద్మ, పురు. సంహితలు 8 దర్భలని చెప్పచున్నవి. విష్ణుతిలక, నారాయణ సంహితలు అగ్నికి ఉత్తర పార్శ్వమున ప్రాగగ్రదర్భల యందు పాత్రాసాదనమని చెప్పచున్నవి. "...అగ్నేరుత్తరపార్శ్వతః ద్విధా దర్భాన్ సమాస్తీర్య పాత్రాసాదన మాచరేత్ ॥" అని పురుషసంహిత 29. 9,10. గాన, రెండువరుసలుగా 6,6దర్భలనుంచు విధానము అనుసరించబడుచున్నదని తోచుచున్నది.)

## 21. అగ్నేర్దక్షిణతః బ్రహ్మాసనార్థం త్రిభిః దర్భైరాస్తీర్య ।

( అగ్నికి దక్షిణమున బ్రహ్మాసనమునకై 3 దర్భలనుంచవలెను.

("అగ్నేర్దక్షిణతః కూర్చే దర్భద్వాదశ నిర్మితే । చతుర్ముఖం భుజద్వంద్వం సాక్షమాలా కమండలుం" అని వి.తి. (5.224) చెప్పగా, పౌష్కరం బ్రహ్మాసనానికి 3 దర్భలను విధిస్తున్నది. "సప్తదర్భకృతం కూర్చం కుశత్రయకృతాసనే । వినిక్షిప్య చతుర్వక్త్రం బ్రహ్మాణం తత్ర పూజయేత్ । - అని నారా.సం.య.వై.11.84,85. 3 దర్భలను ఆసనముగా వేసి అందు 7 దర్భలతో కట్టిన కూర్చ నుంచి అందు బ్రహ్మావాహన మొనర్పవలెను.)

## 22. వాసుదేవాయనమః ఇతి చతుర్దిక్షు దర్భమన్త్రాః - వాసుదేవాయనమః ।సంకర్షణాయ నమః । ప్రద్యుమ్నాయ నమః। అనిరుద్ధాయనమః । - ఇతిదర్భైర్దిక్షు నిధాప్య ।

**వ్యాఖ్య ॥ ఏతన్మన్త్రోచ్చారణ పూర్వకం అగ్నేఃప్రాదక్షిణ్యేన పరిస్తరణాని నిక్షిప్య ।**

(వాసుదేవాది మన్త్రములను ఉచ్చరించుచూ తూర్పునుండి ప్రదక్షిణముగా అగ్ని చుట్టూ పరిస్తరణలు ఉంచవలెను.

## 23. దర్భైర్దిక్షు నిధాప్య ।

**వ్యాఖ్య ॥ పూర్వోక్త మన్త్రోచ్చారణపూర్వకం చతుర్దిక్షు దర్భాన్నిక్షిప్య । చరుహోమే అష్టపాత్ర ప్రయోగం । అన్యత్ర షట్పాత్ర ప్రయోగ ఏవ । తద్యథా -**

(ముందు చెప్పిన మన్త్రములనుచ్చరించుచూ నాల్గు దిక్కులయందు దర్భలనుంచవలె. చరువుతో హోమము చేయువలసియున్న అష్టపాత్ర ప్రయోగము. కానిచో షట్పాత్ర ప్రయోగము - అది ఈ విధము -

## 24.దర్వ్యాజ్య స్థాల్యౌ ప్రోక్షణ పూర్ణపాత్రే ఇధ్మ స్రువావితి ।

**వ్యాఖ్య ॥ స్పష్టం**

( దర్వీ మాజ్యస్థాలీం ప్రోక్షణీం ప్రణీతి మిధ్మ మితరదర్వీమ్ - అని స్మార్తానుక్రమణిక పుట 14. దర్వి (ప్రధానదర్వీ), ఆజ్యస్థాలి(ఆజ్యపాత్ర), ప్రోక్షణపాత్ర(ప్రోక్షణార్థం నీటినుంచుపాత్ర), పూర్ణపాత్ర (ప్రణీతిపాత్ర) , ఇధ్మము (ఇధ్మములు 15, 3పరిధులు, 2 అఘారసమిధలు, 1అనుయాజ సమిధ

10. "కేశవాది ద్వాదశనామ మన్త్రాన్ ద్వయం ద్వయం పాత్రాణి ద్వంద్వశః స్థాప్య - అథవా మూలమన్త్రతః । పవిత్ర ప్రోక్షణాంతేతు గ్రహణం మూలమన్త్రతః । షట్పాత్రాది ప్రయోగేషు మన్త్రం మూలం సముచ్చరేత్ " - రే.రం.ప్రతి

మొత్తం 21 కలిపి కట్టిన కట్ట - స్మార్తమున అనుయాజ సమిధ ఉండదు గాన మొత్తం20 అగును, శ్రౌతమున అనుయాజ సమిధ ఉన్నందున 21.) , స్రువము (ఇతరదర్వీ) - అనునవి షట్పాత్రములు (ప్రధానదర్వి అనగా స్రుక్కు, ఇతర దర్వి యనగా స్రువము ఇధ్మమనగా పాలాశముగాని, ఖాదిరముగాని 15+1=16 పుల్లల కట్ట. దీనిని 8 దర్భలతోకట్టవలెను. చూ. పుట 304.

"తేషు చరోః ప్రోక్షణాభాజనం,దర్వ్యాజ్యస్థాల్యౌ, ప్రోక్షణపూర్ణపాత్ర, ఇధ్మ స్రువావితి " అనగా 1. చరుపాత్ర, 2. ప్రోక్షణపాత్ర, 3. దర్వి , 4 ఆజ్యస్థాలి, 5.పూర్ణపాత్ర, 6.ఇధ్మము, 7.స్రుక్కు 8.స్రువము. - అని బాలసీమ చా వేం.రా.భ.పాఠం " తేషు చరోః ప్రోక్షణభాజనం దర్వ్యాజ్యస్థాల్యౌ ప్రోక్షణ పూర్ణపాత్ర ఇధ్మ స్రువావితి." - అని రే.అ.న. పాఠం)

## 25. ద్వంద్వం న్యంచి । అధో ముఖాని పాత్రాణి ప్రయునక్తి । [10]

**వ్యా ॥ దేవతా విషయే పాత్రద్వయాసాదనం । మనుష్యే కర్మణి యుగపదాసాదనం । పైతృకే ఏకైక పాత్రాసాదనం కర్తవ్యం । ఏతాని పాత్రాణి అధో ముఖాని కృత్వా ।**

( పాత్రాసాదనము - దేవతా విషయమున రెండేసి చొ॥న, మనుష్యకర్మయందు అన్నీ ఒకేసారి, పితృకర్మయందు ఒక్కొక్కటి చొ॥న పాత్రలనుంచుట కర్తవ్యము. ఆయా పాత్రలను అధోముఖములుగా, ద్వంద్వం రెండేసి చొ॥న, న్యంచి బోర్లించి దర్భలపై ఉంచవలె. రెండు వరుసలు గానున్న దర్భలపై కుడివైపున దర్వి , ఎడమన ఆజ్యస్థాలి, వీనికి తూర్పున దర్భలపై మరల కుడిని ప్రోక్షణ పాత్ర, ఎడమన పూర్ణపాత్ర (ప్రణీత పాత్ర), అదే విధముగా కుడిని ఇధ్మము, ఎడమను స్రువము ఉంచవలెను.)

### పవిత్రమ్

## 26. తతః సమౌసాగ్రౌ ద్వౌ దర్భౌ ప్రాదేశమాత్రౌ పవిత్రే కుర్యాత్ । ఏవం పవిత్రే కృత్వా అద్భిరనుమృజ్య ।

**వ్యాఖ్య ॥ మూలా దగ్రాన్తం అద్భిః సమృజ్య । రౌద్ర రాక్షసపైతృక నైరృతి భేదన, ఛేదన నిరసన ఆత్మాభిస్పర్శనాని చ కృత్వా అప ఉపస్పృశేత్ ।**

( అపైన సమములు కొనలుకలవి అగు రెండు ప్రాదేశమాత్రముగ్గు (బొటనవ్రేలు చూపుడు వ్రేలితో ఏర్పడిన జాన) దర్భలను పవిత్రముగా

చేయవలెను. వానిని నీటియందు శోధించవలె. (ఇక్కడ రెండు దర్భలతో పవిత్రము చేయబడుచున్నది గనుక అంతట'పవిత్రే' అని ద్వివచనము వాడబడుచున్నది.పైతృకమున ఒక దర్భతోనే పవిత్రము చేయబడుతుంది. రెండు దర్భలను పవిత్రము చేసి తడుపవలెను.అప ఉపస్పర్శన వివరములకు అను. 14 పుట 364చూడుడు.)

## ప్రోక్షణ పాత్ర సంస్కారః

**27. ప్రోక్షణపాత్రే నిధాయ ।** **వ్యాఖ్య ॥ పవిత్రం ప్రోక్షణపాత్రే నిక్షిప్య ।**

ఆ పవిత్రము(రెండు దర్భలతోచేసినది)ను ప్రోక్షణ పాత్రయందు ఉంచవలెను.)

**28. ప్రోక్ష్య ।** **వ్యాఖ్య ॥ బ్రహ్మకూర్చేన సంప్రోక్ష్య ।**

( బ్రహ్మకూర్చతో సంప్రోక్షణ మొనరింపవలెను. బ్రహ్మకూర్చకు 24 దర్భలు - మూలమున అగ్రమున ఒక్కొక్క అంగుళము వదలి వేణి ఆకారముగల పవిత్రగ్రంథివంటి గ్రంథిని ఏర్పరచవలెను. పురు.సంహిత 11.39,40. చూ..అను 6. పుట 304. అట్టి బ్రహ్మకూర్చతో ప్రోక్షణ మొనరింపవలెను.)

**29. అపరేణాగ్నిం పవిత్రాన్తర్హితే పాత్రే అప ఆనీయ ।**
**అస్త్రమన్త్రేణ తత్తోయ మభిమన్త్ర్య । వాసుదేవం సమ్పూజ్య ।**

**వ్యాఖ్య ॥ తత్ ప్రోక్షణపాత్రం అగ్నేః పశ్చిమే సపవిత్రం నిక్షిప్య । అత్యన్త విహారోపచారః । న దక్షిణతః । తస్మిన్ అక్షతోదకం నినీయ ।**

( పవిత్రముతో కూడియున్న ఆ పోక్షణపాత్రను అగ్నికి పశ్చిమమున ఉంచవలెను. ఎక్కువగా త్రిప్పవలెను - దక్షిణమునకు కాదు. దానియందు అక్షతోదకమును ఉంచవలెను. వాసుదేవుని పూజించవలెను. ఆ నీటిని అస్త్ర మన్త్రమున అభిమన్త్రించవలెను.

పవిత్రాన్తరితే అని అం.వెం.న.పాఠము. కుండమునకు బయట ఉంచవలెనని శ్రౌతము. ఉత్తరతః ఉపచారః అని శ్రుతి. ఉత్తరము నుండి పశ్చిమమునకు పాత్రను తెచ్చునపుడు - న దక్షిణతః - దక్షిణమునకు వెళ్లరాదు

అని తాత్పర్యము. అందులకే వ్యాఖ్యయందు "ఉత్తరత: విహరోపచార: అనుట సమంజసమగునని చి.శ్రీరామశర్మగారు.)

**30.** హస్తయో రంగుష్ఠోప కనిష్ఠికాభ్యాం ఉదగ్రగ్రే గృహీత్వా । ప్రాచీ స్త్రిరుత్పూయ । స పవిత్రేణ పాణినా పాత్రాణి సమృజ్య ।

**వ్యాఖ్య ॥ హస్తయో ర్విద్యమానాభ్యాం అంగుష్ఠోప కనిష్ఠికాభ్యాం ఉత్తరాగ్రే గృహీత్వా । పశ్చిమ మారభ్య ప్రాక్సమాప్తిః । త్రివారం ఇత్థం కృత్వా ।**

(పవిత్రమును ఉత్తరాగ్రముగా రెండు చేతులయొక్క అంగుష్ఠ అనామికల మధ్యన గ్రహించి పశ్చిమము నుండి ప్రారంభించి తూర్పునకు సమాప్తమగునటుల, మరల పశ్చిమము నుండి ప్రాక్ సమాప్తి...ఇటుల ముమ్మారు త్రిప్పవలెను. ఆ పవిత్రముతో పాత్రలను స్పృశించవలెను. వాని నామములను ఉచ్చరిస్తూ స్పృశించవలెనని ప్రోక్షించవలెనని క్రియాకైరవ చంద్రిక.)

**31.** పాత్రాణ్యుత్థానాని కృత్వా । ఇధ్మంచ విస్రస్య । కమండలోదకేన త్రిః ప్రోక్ష్య ।

**వ్యాఖ్య ॥ స పవిత్రేణ పాణినా పాత్రాణి సంస్పృశ్య । పాత్రాణి ఊర్ధ్వముఖాని కృత్వా । ఇధ్మ బంధనం కించి ద్విస్రస్య । కమండలోదకేన త్రిః ప్రోక్ష్య ।**

( పవిత్రము ధరించిన చేతితో పాత్రలను స్పృశించవలెను. పాత్రలను ఊర్ధ్వ ముఖములుగ జేయవలె. ఇధ్మమునకున్న బంధనమును కొంచెము వదులు చేయవలెను. కమండలోదకమున ముమ్మారు ప్రోక్షించవలెను.)

**32.** సర్వత్ర బ్రహ్మకూర్చేన ఇతః పరం ప్రోక్షణం । శేషం పరిత్యజేత్ ।

**వ్యాఖ్య ॥ స్రుక్ స్రువాది పాత్రాణి స్వకమండలోదకేన త్రివారం సంప్రోక్ష్య । ఏతత్ పాత్రప్రోక్షణ వ్యతిరిక్తప్రోక్షణేషు సర్వేషు బ్రహ్మకూర్చేన ప్రోక్షణం కర్తవ్యమ్ । అస్మిన్ స్రుక్ స్రువాది ప్రోక్షణేతు ఏతత్ పవిత్రేనైవ ప్రోక్షణం కర్తవ్యమ్। తత్ ప్రోక్షణ శేషం పరిత్యజేత్ ।**

(ఇకపైన అన్నిటియందూ బ్రహ్మకూర్చతోనే ప్రోక్షణము. ఈ స్రుక్ స్రువాది ప్రోక్షణ మాత్రం ఆ పవిత్రముతోనే చేయవలెను. ప్రోక్షణీం పరిత్యజేత్ - అం.వేం.స)

<u>ప్రణీతావాహనమ్</u> (పూర్ణపాత్ర సంస్కారమ్)

**33.** తతః పూర్ణపాత్ర మాదాయ । ప్రస్తరే నిధాయ । (పూర్ణపాత్రయే ప్రణీతిపాత్ర)

**వ్యాఖ్య ॥ స పవిత్రం పూర్ణ పాత్రం ముష్టి ప్రమాణ దర్భేషు నిక్షిప్య ।**

( పవిత్రముతో కూడియున్న పూర్ణ పాత్రను ముష్టి ప్రమాణమైన దర్భలయందుంచవలెను ఈశాన్య దర్భవిష్టరమున అని క్రిశైచం ప్రస్తరమనగా పిడికెడు దర్భలు (12 దర్భలు) పరచినది)

**34.** ప్రోక్షణ పాత్రవత్ కృత్వా । **వ్యాఖ్య ॥ స్పష్టం ।**

( ప్రోక్షణ పాత్రకు చేసిన విధముగా చేయవలె (అనగా 28 నుండి 30 కారికల కార్యక్రమము మరల జరుపవలెను చావేంరాభ, అంకూ వంటి కొన్ని పారముల యందు 28 నుండి 30 వరకు ఉన్న కారికలు ఇక్కడ మరల వ్రాయబడినవి )

**35.** ముఖసమ ముద్ధృత్య । ఉత్తరేణాగ్నిం దశాంగుళమాత్రే దర్భేషు నిధాయ ।

**వ్యాఖ్య ॥ అగ్నికుండాదారభ్య దశాంగులం ఉత్తరం దూరే దర్భాస్తరణే నిధాయ ।**

( సపవిత్రమగు ప్రణీతపాత్రను (పూర్ణపాత్రను) ముఖముకు సమానముగా పైకి ఎత్తవలెను అగ్నికుండము నుండి ఉత్తరముగా 10 అంల దూరమున దర్భాన్తరణమున ఉంచవలెను (ఆఢకార్ధమాన తండులములయందు 8 కుశలపైనని నారాయణసంహిత)

**36.** దర్భైః ప్రచ్ఛాదయేత్ । తస్మిన్ వాసుదేవం ధ్యాత్వా । అభ్యర్చ్య ।

**వ్యాఖ్య ॥ స్పష్టం**

(దర్భలతో కప్పవలె (దర్భాస్తరణమున పాత్రనుంచి పైన 8 దర్భలను కప్పవలెను) అందు వాసుదేవునర్చించవలెను )

<u>బ్రహ్మార్పనమ్</u>

**37.** తతోగ్నేర్దక్షిణతః అస్మిన్ ప్రకృతే కర్మణి త్వం బ్రహ్మాభవ । బ్రహ్మణః

ఇదమిద మాసనం - ఇతి దర్భాక్షత్తైరాసనం కృత్వా । గంధాదిభిరభ్యర్చ్య ।

(ఆపైన అగ్నికి దక్షిణమున " ఈప్రస్తుత కర్మయందు నీవు బ్రహ్మవగుము " అంటూ బ్రహ్మను 3 దర్భలతోకల్పించిన ఆసనమునందుంచిన 7 దర్భల కూర్చయందు ఆవాహన చేయవలెను. - నారా.సం.య.11.84,85. (12 దర్భల కూర్చ ఆసనమునకని విష్ణుతిలకము 5.224.) (21వ కాలిక ఇక్కడ ఉండాలి.) బ్రహ్మను గంధాదులతో అర్చించవలెను.

<u>ఆజ్య సంస్కారః</u>

ఆజ్యపాత్రం సమాదాయ । తస్మిన్ మూలమన్త్రేణ విష్ణుగాయత్ర్యా ఆజ్యం న్యసేత్ ।

38. ఆజ్యంవిలాప్య । అగ్నేః పశ్చాదాజ్యస్థాల్యాంచ పవిత్ర మంతర్ధాయ । తత్ర ఆజ్యం నినీయ । అగ్నేరుత్తరతో అంగారా న్నిరూహ్య । తేష్వంగారేష్వాజ్య మధిశ్రిత్య । జ్వలతాదర్భేణ శోధయిత్వా ॥

(ఆజ్యమును విలాప్య అనగా కరుగపెట్టవలెను. దీనికి నేతిని తెచ్చిన పాత్రను వేడిచేయడం ఆచారం. అగ్నికి పశ్చిమమున ఆజ్యస్థాలి యందు పవిత్రము ఉంచవలెను. అందు ఆజ్యమునుంచవలెను. అగ్నికి ఉత్తరమున అంగారమును (నిప్పను) నిరూహ్య (ఉంచవలెను). దానిపై ఆజ్యపాత్రనుంచవలెను. వెలుగుచున్న దర్భతో శోధించవలెను. (ఆజ్యమున ప్రతిఫలింప చేయవలెను.)

39. ద్వే దర్భాగ్రే పవిత్ర వత్ సగ్గ్ం స్కృత్య । (ద్వే దర్భాగ్రే ప్రచ్ఛిద్య । ప్రక్షాళ్య । ప్రత్యస్య నవఖేన ఛినత్తి । ఆజ్యే ప్రాస్య । [11]) యుగపదాజ్యే క్షిప్త్వా । ద్వయ మన్త్రేణ దర్భాగ్రే ప్రత్యస్య ।

"శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే । శ్రీమతే నారాయణాయ నమః" అనేది ద్వయమన్త్రం. ప్రత్యసనము ద్వయమన్త్రమున చేయవలెనని

11. భద్రం.ర, అం.వేం.రా. పాఠాలు.

నారాయణ సహిత. రెండు దర్భాగ్రములను పవిత్రమువలె సంస్కరించవలెను. (ఆ దర్భాగ్రములను త్రెంపవలె - గోళ్ళతోకాదు - ప్రోక్షణపాత్ర నీటితో కడుగవలె - ఒత్తవలె - ఆజ్యమున ప్రాసనమొనర్చవలె(పడవేయవలె) . ఆజ్యమును దొంగిలించు మధుగంధకులను పేరుగల రాక్షసులను పారద్రోలుటకై ఈరెండు దర్భాగ్రములను,ఒకేసారి, ఆజ్యమునునుంచవలె.)

## పర్యగ్నికరణమ్

**40.పునర్జ్వలతా దర్భేణ చరుణాసహ త్రిః పర్యగ్ని కృత్వా। ఆజ్యముత్తరత ఉద్వాస్య। అంగారాన్ ప్రత్యూహ్య।**

(తిరిగి వెలుగుచున్నదర్భతో చరువుతోనహా ఆజ్యమునకు ఎర్యగ్నికరణమొనర్చవలెను.(3 సార్లు ప్రదక్షిణముగా త్రిప్పవలె.) ఆజ్యమును ఉత్తరమునకు జరపవలెను. నిప్పును తిరిగి అగ్నియందుంచవలెను.)

**41.ఉదగ్రాభ్యాం పవిత్రాభ్యాం పునరాహార మాజ్యం త్రిరుత్పూయ। (ప్రాగారభ్య పశ్చాన్ నీత్వా పునః ప్రాగేవ సమాప్తిః) పవిత్ర గ్రంథిం విస్రస్య। ప్రక్షాళ్య। ప్రాగగ్ర మగ్నౌ పవిత్రే అనుప్రహరతి।**

(ఉదగగ్రములుగా నున్న పవిత్రములను, పునరాహారం అనగా తిరిగి వెనుకకు వచ్చునట్లుగా ఆజ్యమున 3 సార్లు కదుపవలె (రెండు చేతుల అంగుష్ఠానామికలతో ఉదగగ్రముగా పవిత్రమును గ్రహించి, పాత్రయందు తూర్పున ప్రారంభించి పశ్చిమమునకు తెచ్చి మరల తూర్పునకు కదిపిన ఒకసారియగును) ఆ పవిత్ర గ్రంథిని విప్పవలెను. కడుగవలె - ప్రాగగ్రముగా అగ్నియందు అనుప్రహరతి అనగా అనుసరించి వేయవలె, అనగా అగ్రము మొదట అంటుకొను విధమున వేయవలెను.)

## దర్వీమార్జనమ్

**42.స్రుక్ స్రువౌ వామదక్షిణ హస్తాభ్యామాదాయ। యుగపదగ్నౌ ప్రతితప్య।**

(స్రుక్కును స్రువమును క్రమముగా వామదక్షిణ హస్తములతో గ్రహించవలెను. ఒకేసారి అగ్నియందు వేడి చేయవలెను. స్రుక్స్రువములకు దర్వీ ఇతర దర్వీలని పేరు. నారాయణసంహిత ఉష్ణోదక మార్జన చెప్పినది.)

**43. వామంగులౌ స్రుక్ స్రువౌ ధృత్వా ।**

(వామాంగుళులయందు స్రుక్ స్రువములను ధరించవలెను.)

**44. స్రువం దర్భాగ్రైః సమృజ్య । అంతరతో భ్యాకారం సర్వతోబిల మభి సమాహృత్య ।**

(మొదట స్రువమును దర్భాగ్రములతో సమ్మార్జన మొనర్చవలెను. స్రుక్ స్రువమార్జనకు 4 దర్భలను పురుషసంహిత (31-16,17) చెప్పగా , 3 దర్భలను సంప్రదాయము విధించుచున్నది. 5 కుశల కూర్చతోనని నారాయణసంహిత. ఈ సమ్మార్జన అంతరతోభ్యాకారం అనగా స్రువగర్తమునకుగల ఆకారమునననుసరించి లోపల దర్భాగ్రములతో సమ్మార్జనమొనర్చవలెను.)

**45. దర్భమూలై ర్దండ స్థానం హస్తం సంమృజ్య ।**

(దర్భమూలములతో దండస్థానమును, హస్తమును మార్జన మొనరించవలెను. )

**46. మధ్యమం గుల్భాం ప్రదక్షిణీ కృత్య ।**

(దర్భమధ్యమములతో దండగుల్భమును ప్రదక్షిణముగా మార్జన మొనరింపవలెను.)

**47. స్రుక్ స్రువౌ వ్యుత్క్రమేణ ధృత్వా ।**

(స్రుక్ స్రువములను ఒకదాని స్థానమున కింకొక దానిని మార్చి ధరించవలెను.)

**48. తైరేవ దర్భైః స్రుచమగ్రైః అంతరతో భ్యాకారం సర్వతో బిలమభిసమాహృత్య ।**

(అవే దర్భలతో స్రుచగర్తమునననుసరించి లోపలమార్జించవలె.)

**49. దర్భమధ్యైరుపరి ప్రాచీం సంమృజ్య । అధోభాగే ప్రతీచీం సంమృజ్య।**

(దర్భల మధ్యభాగములతో స్రుక్‌నకు పైన తూర్పునకు మార్జన,

అధోభాగమున పశ్చిమమునకు మార్జన.)

**50.** దండం పూర్వవత్సంమృజ్య ।

(దండమునకు ముందువలె మార్జనమును చేయవలెను.)

**51.** పునః పూర్వవత్ ప్రతితప్య । ప్రోక్ష్య । ఆజ్యపాత్రోత్తరతో నిధాయ ।

(స్రుక్ స్రువములను ముందువలే వేడి చేయవలెను, ప్రోక్షణమొనర్చవలె, ఆజ్యపాత్రకు ఉత్తరమున ఉంచవలెను.)

**52.** తాన్ దర్భాన్ అద్భిః సగ్గ్ం స్పృశ్య । అగ్నౌక్షిపేత్ ।

(ఆదర్భలను ప్రోక్షణపాత్ర నీటియందు ముంచి, అగ్నియందు ఉంచవలెను.)

## పరిధి ప్రక్షేపణమ్

**53.** తతః పరిధీన్ పరి దధాతి ।

అంగుష్ఠాగ్రపర్వ స్థౌల్యం ప్రాదేశత్రయ పరిమితం పశ్చాదుదగ్రం నిధాయ । తర్జన్యగ్రపర్వ స్థౌల్యం ప్రాదేశత్రయా త్కించిద్దీర్ఘం దక్షిణతః ప్రాగగ్రం నిధాయ । మధ్యమాంగుళిపర్వస్థౌల్యం ప్రాదేశత్రయా త్కించిన్న్యూనం ఉత్తరతః ప్రాగగ్రం నిధాయ । మధ్యమ పరిధిముప స్పృశ్య – కనిష్ఠి కాంగుళి పర్వస్థౌల్యౌ ప్రాదేశత్రయ పరిమితౌ (ద్వే) ఆఘార సమిధౌ పురస్తా దూర్ధ్వే నిధాయ ॥

(3 పరిధులను సుమారు 3 ప్రాదేశముల పొడవుగల సమిధలతో క్రింది విధముగ ఏర్పరచవలెను-

1. మధ్యమపరిధి - కుండమునకు పశ్చిమమున బొటనవ్రేలు లావు
 3 ప్రాదేశములపొడవు గలది - ఉదగ్రముగను,
2. దక్షిణపరిధి - కుండమునకు దక్షిణమున తర్జనిలావు
 3 ప్రాదేశములకు కొంచెము ఎక్కువ పొడవు గలది - ప్రాగగ్రముగను,
3. వామపరిధి - కుండమునకు ఉత్తరమున మధ్యమాంగుళి పర్వ స్థౌల్యము
 3 ప్రాదేశములకుకొంచెము తక్కువ పొడవుగలది - ప్రాగగ్రముగను ఉంచవలెను.
4. మధ్యమపరిధికి తాకించి చిటికెన వ్రేలు లావు 3 ప్రాదేశముల పొడవుగల

అఘారసమిధలు రెండింటిని తూర్పున పైన ఒకేసారిగా ఉంచవలెను

(అఘారసమిధలను ఆగ్నేయ ఈశాన కోణములమందు ఊర్ధ్వాగ్రములుగ నమర్చవలెనని -వి.తి.5.243. క్రి.కై.చం.(పే.నెం.141)కూడా ఇదే అభిప్రాయమైననూ అగ్రముల విషయమున మౌనము వహించినది.)

**పరిషేచనమ్** (పూర్వ పరిషేచనమ్)

**54. అదితేஉను మన్యస్వే త్యగ్నిం పరిషిచ్య ।**
**అదితేஉను మన్యస్వ । అనుమతేஉను మన్యస్వ । సరస్వతేஉను మన్యస్వ । దేవ సవితః ప్రసువ ।**

(1.నైరృత్యాదాగ్నేయాన్తం, 2.నైరృత్యాది వాయువ్యాన్తం, 3.వాయువ్యా దీశానాన్తం, 4.తిరిగి ఆగ్నేయాదిగా చుట్టూ ప్రదక్షిణముగా నీటిని క్రమంగా అదితేన్వాదులతో పూర్వపరిషేచన మొనరింపవలెను. ముడిచిన అరచేత జలమునుంచి, పైకెత్తియుంచిన అరచేతితో, అరచేతి చిటికెన వ్రేలి వైపునుండి, జలము పడునట్లు దక్షిణమున, పశ్చిమమున, ఉత్తరమున, ఈశాన్యమాదిగా ప్రదక్షిణముగ చుట్టూ అదితేను మన్వస్వాది మంత్రములతో (ప్రోక్షణపాత్ర నీటితో) పరిషేచన మొనర్చవలెను.)

**ఇధ్మా ధానమ్.**

**55. ఏకాం అవశిష్యానామికాగ్ర పర్వ స్థౌల్యాని పంచదశేధ్మదారు ణ్యాదాయ।** (తదవశిష్ట అనుయాజ సమిధం ప్రణీతాముఖే నిధాయ ।) **ఆసనాత్కించి దుత్థాయ । ఇధ్మమభిఘార్య, ఇధ్మ మలంకృత్య, స్వయమలంకృత్య, బ్రహ్మాణమలంకృత్య । ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీ ........ప్రీత్యర్థం అస్మిన్ హోమ కర్మణి బ్రహ్మన్ ఇధ్మ మాధాస్యే -**

**॥ అథత్స్వ ॥**

(ఇధ్మమునగల 16 సమిధలలో ఒకదానిని వదలి 15 సమిధలను తీసుకొనవలెను. (అటుల వదలిన అనుయాజ సమిధను ప్రణీతపాత్ర ముందు

ఉంచవలె.) ఆసనము నుండి లేచి ఇధ్మమును అభిఘరించవలె. అలంకరించవలె. తానలంకరించుకొనవలె. బ్రహ్మనలంకరిచవలె. ఈ శుభతిథి యందు శ్రీ.......భగవత్ ప్రీతి కొరకు, ఈ హోమకర్మయందు ఓ బ్రాహ్మణులారా ఇధ్మమును ఆధాస్యే అగ్నియందుంచుచున్నాను అని ఋత్విజుడనగా బ్రాహ్మణులు ఆధత్స్వ ఉంచుడు అని చెప్పదురు.)

(ఈ అనుయాజ సమిధను శేషహోమ మందు హోమము చేయవలెనని నారాయణ సంహిత. యు.వై.కాండ.11.162.)

## 56. ఆజ్యసిక్తేధ్మం తూష్ణీం అగ్నౌ దధ్యాత్ ।
## ఇధ్మాధాన ముహూర్తః సుముహూర్తః అస్తు ।

(ఆజ్యమున తడుపబడిన ఆ ఇధ్మమును "తూష్ణీం" అనగా మంత్రోచ్చారణ లేకుండ (ప్రజాపతిని ధ్యానించుచూ) అగ్నియందుంచవలె. ప్రజాపతికి సంబంధించిన ఆహుతులను తూష్ణీం అనగా మంత్రోచ్చారణ లేకుండా, లేదా వైఖానసమున చెప్పినవిధముగా ఉపాంశునా - (కంఠ రవమున గాక మనసులో చెప్పుకొన్నవిధమున మెల్లని మాటలతో) "ప్రజాపతయ ఇదం" అని చెప్పవలసి యున్నది. దీనికి సంబంధించిన గాథ యజుర్వేదమున గలదు. మనస్సు, వాక్కు పోటీపడి ఎవరుగొప్పో తేల్చుకొనుటకై బ్రహ్మనాశ్రయించినవి. బ్రహ్మ సంకల్పప్రాధాన్యతచే మనసే ప్రధానమని అందుచే మనసే గొప్పదని చెప్పుటచే కోపించిన వాక్కు బ్రహ్మకు ఆహుతినిచ్చు సమయమున తాను పలుకనని శపథము చేసినది. "తస్మా న్మనసా ప్రజాపతయే జుహోతి" - అని శ్రుతి. ఇధ్మాధాన ముహూర్తము సుముహూర్తమగుగాక.)

**ఆఘారహోమః** (దీర్ఘధారగా తిన్నగా(వంకరలేకుండ) ఆజ్యముతో చేయు

12. ప్రథమాఘార హోమశ్చ ప్రధానాహుత్యనంతరమ్ । యద్యోతంతు తత్సర్వం స్రువేణోక్తం కపర్దినా ద్వితీయాఘార హోమశ్చ ప్రధానాహుతయస్తథా । ఆజ్యభాగౌతు సర్వత్ర స్రుచా హోమం కపర్దినా॥ -అని కపర్దిమహర్షికారిక)
13. "శేషభూతస్య జీవస్య పారతంత్ర విరోధతః । ఉద్దేశ త్యాగౌ హోమాన్తే నకుర్యాత్ విష్ణు కర్మణి॥ - అను శుకప్రశ్న సంహితా వచనము ననుసరించి ' ప్రజాపతయేదం' అనిమాత్రమే చెప్పి, హోమాన్త త్యాగములగు 'న మమ' అనువానిని విష్ణు కర్మ యందు ఉపయోగించరు .

హోమము అఘార హోమము)

**57.** తతః స్రువేణాద్య మాదాయ । స్రుచం సంపూర్య । పునః స్రువేణాజ్యమాదాయ ॥

(స్రువమున అజ్యము గ్రహించి ఎడమచేతనున్న స్రుక్కును పూరించి, తిరిగి స్రువముతో అజ్యమును గ్రహించవలె.)

**58.** స్రువేణ వాయువ్యకోణమారభ్య అగ్నేయకోణ పర్యన్తం ప్రథమాఘారమ్[12] (తూష్ణీంహుత్వా)

ప్రజాపతయేస్వాహా । ప్రజాపతయ ఇదమ్ ।[13]

(కుడిచేతనున్న స్రువముతో వాయువ్యకోణము నుండి ఆగ్నేయకోణపర్యన్తం మనస్సులో "ప్రజాపతయేస్వాహా । ప్రజాపతయ ఇదం ।" అని ధ్యానించుచూ ప్రథమాఘారమును ఇవ్వవలె.)

**59.** తతః స్రుచా -

నైరృతి కోణమారభ్య ఈశానకోణపర్యన్తం ద్వితీయాఘారమ్ ।

ఇంద్రాయ స్వాహా । ఇంద్రాయ ఇదమ్ ।

(ఎడమచేతనున్న అజ్యపూరిత స్రుక్కును కుడిచేత గ్రహించి నైరృతికోణము నుండి ఈశానకోణపర్యన్తము కంఠరవమున "ఇంద్రాయ స్వాహా ఇంద్రాయ ఇదం" అని పలుకుచూ ద్వితీయాఘారమును ఇవ్వవలె. (వివరములకు చూ అను...6)

<u>చక్షుర్హోమః :</u> (చక్షువులని భావించి ఇచ్చు రెండు అహుతులు.) (అజ్యభాగములు)

**60.** తతః స్రువేణ చతుర్గృహీత్వాజ్యమాదాయ । స్రుచం సంపూర్య ।

( ఏకం ద్వేత్రీణిచత్వారి) ఈశానదేశే

ఓం అగ్నయేస్వాహా । అగ్నయ ఇదమ్ ।

**61.** పునః సృవేణ చతుర్గృహీత్వాజ్య మాదాయ సృచం సంపూర్య-

(ఏకం ద్వే త్రీణి చత్వారి) దక్షిణ పూర్వదేశే

## ఓం సోమాయ స్వాహా। సోమాయ ఇదమ్ ।

(యత్ర యత్ర స్రుచోహోమః తత్ర తత్ర స్రువేణాజ్యమాదాయ స్రుచం సంపూర్య)

(కుండమున ఈశాన్యమున ఆగ్నేయమున అగ్నియొక్క చక్షువులను బుద్ధితో ఆహుతులనిచ్చు చక్షుర్హోమము.

1.సువముతో "ఏకంద్వేత్రీణి చత్వారి" అని నాలుగుసార్లు ఆజ్యమును స్రుక్కునందు గ్రహించి "అగ్నయేస్వాహా అగ్నయ ఇదం" అనుచు అగ్నియం దీశాన్యమున హోమమొనర్చవలెను.

2. సువ్రముతో "ఏకంద్వేత్రీణి చత్వారి" అని నాలుగుసార్లు ఆజ్యమును స్రుక్కునందు గ్రహించి "సోమాయస్వాహా సోమాయ ఇదం" అనుచు అగ్నియం దాగ్నేయమున హోమమొనర్చవలెను.)

**అగ్నిముఖమ్** (మధ్యన ముఖమని (నోరు) భావించి ఇచ్చు ఆహుతి)

## 62. ఏకం, మధ్యే అగ్నయే స్వాహా ॥ సమం పూర్వేణ ॥ ఇదమగ్నిముఖం సర్వత్ర సాధారణం కృత్వా ।-

(మధ్యన అగ్నియొక్క ఆస్యమను బుద్ధితోనిచ్చు ఒకఆహుతి. ఆజ్యమును నాలుగుసార్లు గ్రహించి (భూరాది వ్యాహృతులతోనని క్రిక్రై.చం) మధ్యన ఓం అగ్నయేస్వాహా అగ్నయ ఇదం అని స్రువముతో ఒక ఆహుతినివ్వవలె. ఈ మూడు ఆహుతులు "సమం పూర్వేణ" అనగా కుండమున అగ్నియందు తూర్పున సమానదూరమున నొనర్చవలయునని విధి. ఇది అగ్నిముఖము సర్వహోమములయందు సాధారణముగ చేయవలసినది.)

## 63. యథోపదేశం ప్రధాన హుతీర్హుత్వా । యస్మిన్ కర్మణి యాః ప్రధానాహుతయః తస్మిన్ కర్మణి తాఏవ హుత్వా -

**1. అతోదేవా 2. ఇదంవిష్ణు 3. త్రీణిపదా 4. విష్ణోఃకర్మాణి 5. తద్విష్ణోః**

(ఆయా కార్యక్రమములయందు ఉపదేశించిన ప్రధనాహుతుల నొనరింపవలెను. ఏయే కర్మలకు యేవి ప్రధానాహుతులో ఆయాకర్మలయందు

వానిని మాత్రమే హుత మొనర్చవలె. క్రింద నిచ్చిన అతోదేవా మొదలైనవి ప్రస్తుత కర్మకు విధింపబడిన ప్రధానాహుతులు చా.వే.రా.భ., అం.వేం.న., అం.కూ ప్రతులు ఈ ప్రధానాహుతులను చెప్పినవి.)

జాతదోష శాన్తి । ( జాతదోష శమనార్థం మన్త్రపూర్వకముగా నిచ్చు ఆహుతి)

**64.** **త్వమగ్నేద్యుభిరితి సూతదోషోపశమనార్థం స్రువేణాజ్యం హుత్వా - "త్వమగ్నే ద్యుభి స్త్వమాశు శుక్షణి స్త్వమద్భ్యః త్వమశ్మ నస్పరి । త్వం వనేభ్యః త్వమోషధీభ్య స్త్వన్నృణాం నృపతే జాయసే శుచిః స్వాహా ॥"**

వైష్ణవీకరణం ।

**65.** **సంస్కారాజ్య భాగాంతే అగ్నేర్వైష్ణవ సిధ్యర్థం పంచసూక్తాని[14] ప్రతిఋచం హుత్వా -**

**"సహస్రశీర్షా పురుషః, సహస్ర శీర్షందేవం, హిరణ్య వర్ణాం, భూమిర్భూమ్నా, నీళాందేవీం "**

(పైనిచ్చిన సంస్కారములు, ఆజ్యభాగములు (చక్షుర్హోమ, అగ్నిముఖాహుతులు ఆజ్యభాగములు) జరిగించిన వెనుక అగ్నికి వైష్ణవత్వ సిద్ధికై పంచసూక్తములను ప్రతిఋక్కునకు హవనమొనర్చవలె. పంచసూక్త హోమము, ఔపాసన హోమములు అనుబంధము -1 న ఇవ్వబడినవి.)

**ఇతి అగ్నేః వైష్ణవత్వ విధిః॥**

---

14. -అగ్నే ర్వైష్ణవ సిధ్యర్థం పంచసూక్తై ర్నుమేత్క్రమాత్ - పురు.సం. 24.93,
- అతోదేవా, ఇదం విష్ణు రిత్యాజ్యేన సమృద్ధి ర్జుహోతి -వైఖా.ప్రతి. P.106 (చూ.అను-6)
- అష్టోత్తరశతంవారాన్ ద్వాదశాక్షరవిద్యయా వైష్ణవాగ్నిశ్చ కర్తవ్యం గర్భాధానాదికే ద్విజైః ॥ అగ్నౌచ కల్పయేద్దేవం యోగపీఠాదికం క్రమాత్ । షోడశంసమిధం హుత్వా మూలమన్త్రేణ మన్త్రవిత్ । జుహుయా త్స్రువేణాజ్యం చరుంవై మూలమన్త్రతః । షోడశాహుతయ స్త్వేవం హోతవ్యాస్తదనన్తరం॥
- నారా.సం యు.కాం. 11.110-112
- "గర్భాధానాది షోడశవ్రతానుద్దిశ్య క్రమేణాజ్యేన ప్రణవేన షోడశాహుతీర్హుత్వా, షోడశసంస్కార సిధ్యర్థం షోడవ సమిధ మాదాయ మూలమన్త్రేణహుత్వా। అష్టాక్షరేణ చరుణా షోడశాహుతీర్హుత్వా" - అని ప్రతిష్ఠాప్రయోగం - రేజే. శ్రీరం

## అగ్నిప్రతిష్ఠాపన విధౌ అష్టోత్తర శత దర్భ ప్రమాణశ్లోకాః -

అగ్నిషోడశభిర్ద ర్భైః పురతస్తు పరిస్తరేత్ । పరిస్తరణ మన్యేషా మేవం సంఖ్యావిధీయతే। పాత్రాణాంచ ద్విషట్కంస్యాత్ ప్రణీతాసాదనంతథా। అష్టభిశ్చాదనం కుర్యాత్ త్రిభి ర్బ్రహ్మాసనస్యచ । ద్వౌదర్భౌ పవిత్రేచ తథా ప్రత్యసనస్యచ । పర్యగ్నికరణే శ్చైకం జ్వలనస్త్వైక ఉచ్యతే । ఉల్లేఖనంత్రిభిర్దర్భై రేవ మష్టోత్తరంశతం । సమ్మార్జనం త్రిభిర్దర్భైః అగ్నికోణే పరిత్యజేత్ । లేపనార్థంతు ద్వౌ దర్భౌ తస్యాం దిశి నిరస్యచ । ఇధ్మం బధ్వాష్టభిర్దర్భైః త్రిభిః పరిధిరుచ్యతే । తాలద్వయ ప్రమాణేన బ్రహ్మకూర్చన్తు కారయేత్ । ద్వాత్రింశ దుత్తమం ప్రోక్తం చతుర్వింశస్తు మధ్యమమ్। వింశ ద్దర్భై రధమం ప్రోక్తం బ్రహ్మకూర్చస్య లక్షణం తాలద్వయ ప్రమాణేన అంగుళ గ్రంథి సంయుతమ్। పంచాంగుళాగ్రం కుర్వీత బ్రహ్మకూర్చ కమండలే విన్యసేద్ధోమరక్షార్థం స్వర్ణరజ్జుకృతం శుభమ్ ॥

- కామరాజుపేట రే॥రం ప్రతినుండి

సమ్మార్జనమునకు 3 దర్భలు (ఆగ్నేయ నిరసనము)

లేపనమునకు 3 దర్భలు (ఆగ్నేయ నిరసనము )

ఇధ్మబంధనమునకు 8 దర్భలు, పరిధికి 3 దర్భలు

బ్రహ్మకూర్చ 2 తాలముల పొడవు (సుమారు 16 అం.లు)

32 దర్భల బ్రహ్మకూర్చ ఉత్తమము, 24తో మధ్యమము, 20 అధమము. గ్రంథి 1 అం., అగ్రం 5 అం.లు గలిగి స్వర్ణ రజ్జువుతో చేసిన బ్రహ్మ కూర్చ శుభకరము (స్మార్త కపర్దికారికలలోను బాలిశాం వారి పాఠంలోను కొద్దిపాటి అక్షర భేదంతో 108 దర్భలకు సంబంధించినంతవరకు ఉన్న ఇదే శ్లోకం కన్పిస్తున్నది. మిగిలిన ఉల్లేఖనం సమ్మార్జనంపాదాలు కేవలం రే॥రం ప్రతిలో మాత్రం లభ్యమౌతున్నవి.)

(బాలిశాంచా॥ జగ్గప్పగారి పాఠంలోని శ్లోకం పౌష్కరసంహితాన్తర్గతంగా చెప్పబడినది)

| | |
|---|---|
| పరిధులు 4 × 16 | - 64 |
| పాత్రాసాదనం | - 12 |
| ప్రణీతాసాదనమ | - 12 |
| బ్రహ్మాసనం | - 3 |
| పవిత్రం | - 2 |
| ప్రత్యసనం | - 2 |
| పర్యగ్నికరణం | - 1 |
| జ్వలనం | - 1 |
| | ~~108~~ |

**ఇదం విష్ణు రితిప్రోచ్య పూర్ణాహుతి మథాచరేత్ । నదహే త్పరిధీన్ దర్భాన్ దేవా న్నోద్వాసయేత్స్థితాన్। ప్రత్యహం ధారయే దగ్నిం యావత్తీర్థ దినావధి । అహోరాత్రంతు ప్రతిదినం జుహుయా దుక్తవర్త్మనా॥**

**-- పాద్మ. చర్యా. 11. 88, 89.**

# అంకురార్పణమ్

ప్రాణానాయమ్య । ఏవం గుణవిశేషణ విశిష్టాయాం ............... గోత్రస్య ............. భగవంతముద్దిస్య .......... భగవత్ ప్రీత్యర్థం పాంచాహ్నిక ధ్వజారోహణ దివ్యకల్యాణ మహోత్సవాంగత్వేన అంకురారోపణాఖ్యం కర్మకరిష్యే [1] --

## అంకురారోపణ మండల రచనా

2. పాలికా ఘటిక శరావాన్ యథాలాభలక్షనాన్ సంపాద్య । బీజాన్యేకస్మిన్ (నవ, పంచవా నవధాన్యా నేకస్మిన్ [2] ) పాత్రే అనీయ ।

*3. అష్టతాలాయుత [3] చతురస్రతండుల వేదిషు, తంతు [4] తన్వన్నితి నవ*

---

1. పాతపాఠములో 12 పాలికలు, 12 ఘటికలు, 12 శరావములతో 36 పాత్రల అంకురార్పణము చెప్పబడినది ఆర్వాచీనపాఠములలో నవపాలి కాంకురార్పణమున్నది పాద్మసంహిత మహోత్సవ విధియందు కనీసం 36 పాత్రల అంకురార్పణమును విధించుటచేతను, క్రి.కై.చం.(24 అధ్యా పేజి. 185) 'త్రివర్గేషు పాలికాది పాత్రేషు ఉత్సవాంకురార్పణం కృత్వా' అని విధించుటచేతను, పూర్వాచార్య ప్రయుక్తమగు 36 పాలికల అంకురార్పణము, కపింజలోక్తము (21.10-16) ఇక్కడ గ్రహింపబడినది పై రెండింటికి నడుమ గల కొద్దిపాటి భేదమున గమనించగలరు 36 పాత్రల అంకురార్పణము అం. అష్ట. ప్రతిలో కూడ చెప్పబడినది. "ప్రత్యేక ముత్తమం సంఖ్యా షట్ త్రింశా, మధ్యమా రమే । షోడశ స్యు, ర్హీనసంఖ్యా త్వష్టౌ, హీనమతో నహి॥ సర్వార్థే పాలికావాపి హ్యష్టౌ, విత్తానుసారతః । దేవతానాం ప్రతిష్ఠాది కార్యే యుగ్మాస్తుపాలికా ॥ <u>భక్తబింబ ప్రతిష్ఠాది</u> మనుష్యాణాంతు శోభనే అయుగ్మాః స్యుః పాలికాద్యా స్తేషాం భేదం కదాచన ॥" -శ్రీప్రశ్న 19 32-34. (చూడుడు-అను.5)
2. అం.అష్ట. పాఠం
3. తాలప్రమాణమునగాని సార్థతాల ప్రమాణమునగాని 64 కోష్ఠములతో నిర్మించవలసిన అంకురార్పణ మండలము పటమున చూపబడినది. సూత్రాస్ఫాలనము మొ॥వి పటమున చూపిన విధముగా (చూ..కపింజల షట్త్రింశత్ పాలికాంకురార్పణ మండలము, అను.5 పుట) వేయవలె. దీనికి సంబంధించిన మంత్రయుక్తములగు కారికలు ప్రతిష్ఠాంకురార్పణమున గలవు (పాలికా కంఠమున దూర్వా, సహదేవీ, అశ్వద్ధ పల్లవములను పురు.సం(13.12-13) విధించినది. "దూర్వా మశ్వత్థపత్రంచ శిరీషం బిల్వపత్రకం । తాసాం మూలేతు బధ్నీయాత్ శ్వేతసూత్రేన వేష్టయేత్" - అని గ్రంథాంతరము
4. తంతుంతన్వ, బ్రహ్మజజ్ఞాన, మోషణః పరా, తత్వాయామి, సోమమన్త్రములను, సోమకుంభమును, కరకమున సుదర్శనమును, అష్టదిక్కులయందు కలశలను, వానియందు దిక్పాలకావాహనమును పురుషో సం విధించినది (1313-18)

నిచక్షేత సుషణం భిద్యమానం
మధ్యేబాహు మదధ త్సుదర్శనమ్
విష్ణోరిదం భూరిదం భూరితేజః
ప్రదర్శయతి దివానక్తం భిభృజుస్తర్జనా సహ॥
ప్రతేవిష్ణు రబ్జచక్రేచ సుదర్శన మావాహయామి-
ప్రతేవిష్ణురబ్జచక్రేపవిత్రే జన్మాం బోధించర్షిణీ దర్పయేష్ణః
మూలేబాహో ర్దదతే పురాణా లింగాన్యంగే తావకా మర్పయన్తి॥

- బాలసీమ పాఠం )

12. ఆయసవలయే నమోస్తు సర్పేభ్య ఇతి వాసుకీ మావాహయామి ॥

నమో అస్తు సర్పేభ్యో యేకేచ పృథివీమను । యేఅంతరిక్షే యేదివి తేభ్యః సర్పేభ్యోనమః॥

13. తంతురజ్జుషు అంతశ్చరతి భూతేష్వితి త్రిమూర్తిమావాయామి ॥

అంతశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు ।
త్వంయజ్ఞః త్వంవషట్కారః త్వమింద్రః త్వగ్ంరుద్రః
త్వంవిష్ణుః త్వంబ్రహ్మ త్వంప్రజాపతిః
త్వం తదాప ఆపో జ్యోతీ రసోమృతం
బ్రహ్మభూర్భువస్సువరోమ్ ॥

14. ఘంటాయాం అజ మావాహయామి ॥

అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం బహ్వీం ప్రజాం జనయన్తీగ్ం సరూపాం। అజోహ్యేకో జుషమాణోనుదే జహాత్యేనాం భుక్తభోగామజోన్య॥

15. కుశమాలికాయాం సరస్వతీ మావాహయామి ॥

ప్రణోదేవీ సరస్వతీ వాజేభి ర్వాజినీవతీ । ధీనామ విత్ర్యవతు ॥

– ఇత్యర్చయిత్వా॥

ముద్గాన్నం నివేద్య। పానీయాచమనముఖవాసాని దత్వా। గరుడం క్షమాప్య॥

# ఖగేశ్వర నవకమ్[1]

1 శ్లో॥ శ్రీ మత్సుధావార్ధిసుతాధినాథ పాదారవిందార్చన తత్పరశ్రీః।
సవైనతేయో వినతాతనూజః। ఖగేశ్వరోవ శ్శ్రియ మాతనోతు ॥

2 శ్లో॥ సుదీర్ఘనాసాపుటచారు వక్త్రః। ప్రసన్ననేత్రాంబుజ కాంతిరమ్యః।
అనన్య సాధారణ విక్రమాఢ్యః। ఖగేశ్వరోవ శ్శుభ[2] మాతనోతు ॥

3 శ్లో॥సువర్ణవర్ణో భుజగోపవీతీ। నాగాంతకో విష్ణు రథస్సుపర్ణః।
ప్రహ్లాద వద్భాగవతాగ్రగణ్యః। ఖగేశ్వరోవ శ్శ్రియ మాతనోతు ॥

4 శ్లో॥ధర్మః ప్రసంగ గ్రథితాన్తరాత్మా। జగద్ధితానంత గుణాంబురాశిః।
స్వపక్ష విక్షోభిత దిక్తటాంతః। ఖగేశ్వరోవ శ్శుభ మాతనోతు ॥

5 శ్లో॥దర్వీకరేంద్రా భరణాంచితాంగో। మనోజ్ఞసౌవర్ణ కిరీటధారీ।
మహానుభావో భగవాన్ప్రసన్నః। ఖగేశ్వరోవ శ్శ్రియ మాతనోతు ॥

6 శ్లో॥ తార్క్ష్యో గుణాఢ్యో బలవాన్ కృపాలుః। సత్యవ్రతః కామచరో గుణజ్ఞః
శ్రుతి స్మృతిజ్ఞో రుచిరో నితాంతః। ఖగేశ్వరోవ శ్శుభ మాతనోతు ॥

7 శ్లో॥ బ్రహ్మేంద్ర రుద్రామర సిద్ధసాధ్య। గంధర్వవిద్యాధర మాననీయః।
సుధాసముద్ధారణ కార్యకర్తా। ఖగేశ్వరోవ శ్శ్రియ మాతనోతు ॥

8 శ్లో॥ యోదేవదేవస్య పదారవిందం ధృత్వా విముక్తో భవద ప్రమేయః।
సవైనతేయో వినతాత్మజోసౌ। ఖగేశ్వరోవ శ్శుభ మాతనోతు ॥

9. శ్లో॥ విజ్ఞాన సంపన్న మతిప్రపన్నో। లక్ష్మీకటాక్షాంచిత పుణ్యమూర్తిః
హరిప్రియో వైష్ణవధర్మవేదీ। ఖగేశ్వరోవః శ్రియమాతనోతు॥

---

1.చాల ప్రతులు ఖగేశ్వరనవకమను పేరుతో ఈ 9 శ్లోకములనిచ్చినవి. అం.కూ., చా.వేం.రా.భ., భద్రాచల పాఠములు మాత్రం మంగళాష్టకములను పేరున ఇందులో ఉన్న ("యోదేవదేవస్య"తప్ప.) 8 శ్లోకముల నిచ్చినవి. భా.సం.వి.ప్ర అడయార్‌ప్రతి మంగళాష్టకములని పేర్కొనినా అందు ఈ 'యోదేవదేవస్య' ఉన్నది.

2."శ్శుభమాతనోతు." భా.సం.వి.ప్ర. పేజి. 181.

17. స్వస్తి । సమస్త దేవగణ మౌళిరత్న కిరీట ప్రభాపటల విరాజమాన నిజపద యుగళస్య, నూపుర పీతాంబర శ్రీవత్స కౌస్తుభ మకరకుండల కేయూర హార సుదర్శన పాంచజన్య గదా పద్మాంకిత పరిశోభితస్య, కనక కమల కల్హార తులసీ పున్నాగ జాతీ చంపక మల్లికాహ్రీబేరాది నానావిధ పుష్పమాలాలంకృతస్య, లక్ష్మీమనోహర వక్షస్థలస్య, భోగీంద్ర భోగశయనస్య దివ్య కల్యాణ మహోత్సవ సేవార్థం– ప్రాసాదస్యాగ్రభాగే , బలిపీఠ గోపుర యోర్మధ్యదేశే, ఆధారశక్తి కూర్మాధిష్ఠిత హిరణ్యరత్న బీజోషధి మేఖలోద్భాసిత చతుర్భద్రపీఠోపరి, అష్టదళకర్ణికామధ్యేప్రతిష్ఠిత, దర్భమాలాంకృత ప్రమాణ నిర్మిత శుభస్తంభలగ్నఫలకత్రయమధ్యారోపిత ధ్వజదండాగ్ర మండిత ఘంటా ప్రోథసూత్రేణ[1] ఘటిత సశిఖర పుచ్ఛత్రయాయామ పరిమాణామాది వాజిత[2] లంబిత సలక్షణం ధ్వజం, ఛత్రచామరాద్యలంకృతం, శ్రీవత్సా ద్యష్టమంగళ సుదర్శన పాంచజన్య శార్ఙ్గాద్యాయుధ, బ్రహ్మాది సకలదేవతా పుంజపంజరయుతం, ఇంద్రాగ్ని యమాది లోకపాలక సేవితం, దేవఋషి పితృదైత్య దానవ యక్ష రాక్షస భూత ప్రేత పిశాచ కిన్నర మరుద్గణ మాతృగణ కుమారగణ వృష్టిగణ కూష్మాండగణ నక్షత్రగణ రాశి సహితాష్టాదశగణ పరివేష్టితం – ధ్వజారోహణం కరోమి ॥

18. తతః జయగోవిందేతి గరుడపటం బధ్వా । దర్భమాలా మావేష్ట్య। గరుడ కబళాని పంచవార మూర్ధ్వం క్షిపేత్ । తత్కబళం అప్రజాయా స్త్రియాయాం దద్యా ద్యది సద్యః పుత్రం లభేత్ । ధ్వజాయ నిత్యం సన్ధ్యాకాలే బలిహరణా నంతరం నైవేద్యం దాతవ్యం । ధ్వజారోహణ తంత్ర స్సమాప్తః ॥

అథపాణిగ్రహణ ప్రయోగః ॥

 

1. ఘంటాప్రోథసూత్రం - గంటలుకట్టేత్రాడు. 2. వాజాః పక్షాః ఇత్యమరః.

18వ కారిక చామర్తి భరద్వాజ వివాహ ప్రయోగములోనిది.

# అర్థం, విశేషాంశములు

1. జయదేవోత్తమా అంటూ ఆచార్యుడు (గర్భాలయమున) భగవంతునకు విజ్ఞాపనము చేయుచున్నాడు. (ఈ విజ్ఞాపనను కపింజలసంహిత విధించింది - ఆవాహ్య పూజ యేద్దీయాన్ కార్యం విజ్ఞాపయేత్ శనైః కపింజల సంహిత, ఉత్సవవిధి - 13.9)

   ఓ దేవ దేవోత్తమా ! జయము ! దివ్యప్రబంధ విజ్ఞాపనము, పురాణ స్తోత్రము, మంత్రపఠనము జరుపబోవుచున్నాము. ఓభగవాన్ ! నారాయణా ! భక్తవత్సలా ! కరుణానిధే! సకలలోక నాయకా ! దేవతలు, పశు పక్ష్యాదులు, మనుష్యులు, స్థావరములు అను భేదమున చి దచి ద్రూపముతో నొప్పువాడా ! సకలజీవన నియామకా ! సకల జగత్ స్వామీ ! శ్రీమన్నారాయణా ! అర్చామూర్తియగు ధ్రువబేర రూపముననూ, ఉత్సవ విగ్రహ రూపముననూ నీ దివ్య కళ్యాణ మహోత్సవమును మాకనుగ్రహింపుడు. అవధరింపుడు. అని ప్రస్తుతము జరుగు కార్య విజ్ఞాపనము.

2. ఇది ప్రతిసరబంధనం లేదా కంకణ బంధనానికి ముందు సంకల్పం. (ప్రతిసరబంధనం మొదట ధ్రువులకు జరిగించబడుతున్నది. ఉన్నచో యాగబింబమునకుకూడ జరిపించవలె. ఉత్సవులకు తర్వాత కళ్యాణమండపమున ప్రతిసర బంధనము జరిపించబడుతుంది.) అట్టి భగవత్స్వరూపుడగు మహా పురుషునకు ఈనాటి రాత్రి శుభప్రదమగు వివాహము జరుగబోవుచున్నది.

3. దేవీదేవులకు ప్రతిసర బంధనము - పద్మప్రియే మంత్రమున శ్రీదేవికి వామహస్తమున, విష్ణుపత్నీం మంత్రమున భూదేవికి వామహస్తమున, జితంత మన్త్రమున స్వామికి దక్షిణహస్తమున కంకణ బంధనము జరిపించబడుతుంది. పద్మప్రియే, విష్ణుపత్నీ మంత్రములు భారద్వాజ సంహిత వివాహప్రయోగం ఆదయార్ ప్రతి యందు చెప్పబడినవి. జితంత మన్త్రము కపింజలము (13.12) విధించినది.)

   తామరతీగవంటి శరీరముతో, పద్మపత్రములవంటి నేత్రములతో, హస్తమున పద్మమును ధరించి పద్మమునందు గూర్చొనియున్న, ఓ పద్మప్రియా! విష్ణుమనోనుకూలవగు ఓ విశ్వప్రియా ! నీ పాదపద్మములు నాకు చేరువ కావలెను.

   విష్ణుపత్ని, మాధవి, మాధవప్రియ, లక్ష్మీప్రియసఖి, అచ్యుతుని దేవేరియు యగు భూదేవికి నమస్కరించుచున్నాను.

   దక్షిణః = ఇతరుల కార్యములను శీఘ్రముగా జేయువాడవగు, తే = నీకు, జితం = జయమగుగాక, హవ్యః = హవ్యము, ఋషభ = ప్రవేశించుచున్నదై, ఏధి = వృద్ధివందుగాక, ఇంద్రోజయాతి = ఆ దేవుడు జయమందుగాక, నపరాజయాత = ఎన్నడును అపజయమంద కుండుగాక, అధిరాజః = మహారాజాధిరాజగు ఆ పరమేశ్వరుడు, రాజసురాజయాతి = రాజరాజగు ప్రసిద్ధి నందుగాక. (అధర్వ-6.10.98.1)

   ఉత్సవ విజ్ఞాపనము ధ్రువులకు గాన గర్భాలయమున చేయవలసియున్నది. 'శ్రీమన్నారాయణ ధ్రువార్చారూప" అని 1వ కారికలో పాఠాంతర్గతముగా ఉన్న సూచనయే ఇందుకు నిదర్శనము. అంతేగాక భారద్వాజ సంహితోక్త వివాహ ప్రయోగము (అడయార్ ప్రతి) కూడ మొదట ధ్రువులకు యాగబింబమునకు ప్రతిపర బంధనమును చెప్పి, ఆపైన బలిబింబమును యానము నెక్కించుకొని ఆద్యాశ్చ కర్మజాశ్చాదులతో బలిప్రదానము చేసి, బలిబింబమును తిరిగి ఆలయమునకు చేర్చి, కల్యాణ కౌతుకమును యానమెక్కించుకొని, యుంజాన మన్త్రముతో వివాహాగారమున ప్రవేశింప వలెనని చెప్పుచున్నది. చూ అను. 2. పుట 266

# పాణిగ్రహణమ్

**ఉత్సవ విజ్ఞాపనమ్** (గర్భాలయమున ధ్రువబింబమునకు)

1. అథ యాగబింబమాదాయ। ధ్రువాగ్రే విన్యస్య। అర్ఘ్యాద్యుపచారై రభ్యర్చ్య- జయదేవోత్తమ దివ్యప్రబంధ వాచాకైంకర్య పురాణస్తోత్ర మంత్రపఠనాని కారయిత్వా భగవ న్నారాయణ। భక్తవత్సల। కరుణానిధే। సకలలోకనాయక। దేవ తిర్యక్ మనుష్య స్థావరభేద। చిదచిల్లక్షణ ప్రపంచరూప। సకల భూతాత్మక। సకలజీవ నియామక। సకల జగత్స్వామిన్। శ్రీమన్నారాయణ ధ్రువార్చారూప। ఉత్సవవిగ్రహ ముఖేన దివ్యకల్యాణ మహోత్సవ మనుగృహాణ। అవధారయ। ఇతి ప్రకృతకార్యం విజ్ఞాప్య

**ప్రతిసర బంధనమ్** (ప్రతిసర బంధనం - ధ్రువ యాగబింబములకు)

2.ప్రాణానాయమ్య - ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ, అస్య శ్రీ భగవతో మహాపురుషస్య దేవదేవస్య ......... గోత్రస్య ............. భగవంతముద్దిశ్య ...... భగవత్ ప్రీత్యర్థం, అస్యాం రాత్రౌ వివాహమంగళం కరిష్యమాణః॥

**3. పద్మప్రియే, విష్ణుపత్నీం, జితంత ఇతి ప్రతిసర మాబధ్య -**

**పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదలాయతాక్షి।**
**విశ్వప్రియే విష్ణు మనోనుకూలే త్వత్పాద పద్మం మయి సన్నిధత్స్వ॥**

**విష్ణుపత్నీం మహీందేవి మాధవీం మాధవ ప్రియామ్।**
**లక్ష్మీప్రియసఖీం దేవీం నమా మ్యచ్యుతవల్లభామ్॥**

**ధనుర్ధరాయవిద్మహే సర్వసిద్ధ్యైచ ధీమహి తన్నోధరా ప్రచోదయాత్।**

**జితంతే దక్షిణతో వృషభ ఏధి హవ్యః। ఇంద్రోజయాతి**
**నపరాజయాత అధిరాజోరాజ సురాజయాతి॥**

4. బలిబింబమును పల్లకియందుతీసికొనిపోయి, వివాహవేదికకు నాలుగుదిక్కులయందు భూతబలి ప్రదానము జరిగింపబడుచున్నది.

5. ఈ "ఆద్యాశ్చాది"శ్లోకములు తన్త్రసముచ్చయమున(5.136-140) మండపబలిదాన సమయమున చెప్పబడినవి. దాని ననుసరించినదనువిధమునగల కపింజల (12.131-136)శ్లోకములివి -"స్థాపయిత్వా సమభ్యర్చ్య బలిం కుర్యాత్సమంతతః ॥ పూర్వాదిషు యథాన్యాయం ఇమం మంత్రముదీ రయేత్। ఆద్యాశ్చ కర్మజాశ్చైవ యేభూతాః ప్రాగ్దిశి స్థితాః। ప్రసన్నాః పరితుష్టాశ్చ తేఽపి గృహ్ణం త్విమంబలిం ॥ ఇన్ద్రాది సోమపర్యన్తం బలింకుర్యా ద్విశేషతః ॥ ఆగ్నేయాదిషుకోణేషు ఇమంమంత్ర ముదీరయేత్ । వృక్షేషు పర్వతాగ్రేషు యే విదిక్షుచ సంస్థితాః ॥ భూమ వ్యోమ్నిస్థితాయేచ తే ఽపి గృహ్ణం త్విమం బలిం । వినాయక(కాః) క్షేత్రపాలో(లాః) యేచాన్యే బలికాంక్షిణః ॥ పూతనాద్యాపిశాచాశ్చ (పూర్వాద్యాః పార్షదాస్సర్వే) తేఽపి గృహ్ణం త్విమంబలిం।" (బ్రాకెట్లలోనున్నవి తన్త్రసముచ్చయమున (5.140) పాఠభేదము). గాన కపింజల వచనానుసారము పూర్వాచార్య ప్రయోగమునకు ప్రస్తుత వివరణమీయబడినది.

ఆద్యాశ్చ = మొదటినుండి ఉన్న, కర్మజాశ్చ = కర్మలవల్ల పుట్టిన, ప్రాగ్దిశ స్థితా = తూర్పున నున్న, ఏ భూతాః = ఓ భూతములారా, పనాన్నా పరితుష్టాశ్చ = పనన్నములైయున్ననూ తృప్తినందియున్ననూ, తే అపి = మీరుకూడా, ఇమం బలిం - ఈ పూజను (బలి - 1. కప్పము, 2. పూజార్థమైన కానుక విధివి హితమైనది, 3. చామర దండము, 4. బలిచక్రవర్తి) గృహ్ణంతి = తీసుకొనవలె,

6. క్షేత్రపాలురు, వినాయకులు మొదలగువారు,పూర్వపార్షదులందరు, వృక్షములయందు, పర్వతాగ్రములయందు, విదిక్కులయందు, భూమ్యకాశములయందునను వసించు భూతములు, శంఖపాలాది భక్తులు, కల్యాణాగార రక్షకులు - అందరికొరకు ఈ పూజను చేయుచున్నాము - అందరూ సత్వరమే దీనిని గ్రహించవలెను.

త్రివిక్రమక్రమాక్రాంత = మూడులోకములను మూడడుగులచే ఆక్రమించిన త్రైలోకేశ్వరుడవగు ఓ కేశవా ! నీ అనుగ్రహముతో, తే = నీకు, ఇదం తోయం = ఈ జలము, పాద్యం అస్తు = పాద్యమగుగాక - అని ప్రసన్నార్ఘ్యము నివ్వవలె. "తారసావిత్రికామ్నాయా ద్యణుభిః పరితోష్య తమ్ । ప్రసన్నాయ ప్రసన్నార్ఘ్యం ప్రదద్యాత్ ప్రశ్రయాన్వితః॥ వివరణమ్ - తార సావిత్రికేతి నిత్యస్వాధ్యాయబుధ్యా జపాభిధానం సావిత్రీ తత్సవితురీయం గాయత్రీ, ఆమ్నాయమనవః స్వవేదగత సూక్తానువాకాదిరూపాః. ఆదిశబ్దేన తాన్త్రిక మన్త్రగ్రహణమ్ యథా విష్ణో జితన్తమూలత్రయ పంచాది ..." - (తన్త్ర.స.7.120) అనుదానిననుసరించి ప్రసన్నార్ఘ్యమును మూలమన్త్రమున సమర్పించడమైనది.

(ముడి బియ్యం పిడికిలితో ఆయా స్థలములయందు కుప్పగా వేసి ఉద్ధరిణితో నీళ్లు పోయడము ఆద్యాశ్చాది మన్త్రములతో జరుపవలసిన బలిదాన ప్రక్రియ అని సంప్రదాయము. ఆపైన స్వామికి అర్ఘ్యం పాద్యం సమర్పించవలె.)

## కల్యాణమండప బలిప్రదానమ్

**4. బలిబింబం యానమారోప్య । ప్రాణా నాయమ్య । కల్యాణ మంటపాశ్రిత భూత బలి ప్రదానం కరిష్యే । ఇతి సంకల్ప్య ।**

5. ఆద్యాశ్చ కర్యజాశ్చైవ యేభూతాః । ప్రాగ్దిశి స్థితాః
పసన్నాః పరితుష్టాశ్చ తేఽపి గృహ్ణం త్విమంబలిమ్ ॥

(ప్రాగ్దిశ స్థితాః అన్నచోట దక్షిణేస్థితాః, పశ్చిమేస్థితాః, ఉత్తరేస్థితాః, అని మార్చుచూ . నాల్గుదిక్కులయంద భూతబలినివ్వవలె.)

6. వృక్షేషు పర్వతాగ్రేషు యేవిదిక్షుచ సంస్థితా ।
భూమౌవ్యోమ్ని స్థితాయేచ తేఽపి గృహ్ణం త్విమం బలిమ్॥
వినాయకాః క్షేత్రపాలాః యేచాన్యే బలికాంక్షిణః ।
పూర్వాద్యాః పార్షదా స్సర్వే తేఽపిగృహ్ణం త్విమంబలిమ్॥
శంఖపాలాది యే భక్తాః కల్యాణాగార రక్షకాః ।
తేభ్యోబలిం ప్రదాస్యామి సర్వే గృహ్ణంతు సత్వరమ్ ॥

(ఆగ్నేయాది నాల్గు విదిక్కులయందు భూమ్యాకాశములయందు గల భూతములకు, వినాయకులకు క్షేత్రపాలురకు, పూర్వాద్యులగు పార్షదులకు, కల్యాణాగార రక్షకులగు శంఖపాలాది భక్తులకు బలినివ్వవలె. ఆపైన భగవంతునకు అర్ఘ్యమివ్వవలె.)

త్రివిక్రమ క్రమాక్రాంత త్రైలోక్యేశ్వర కేశవ ।
త్వత్ప్రసాదా దిదం తోయం అర్ఘ్యం తే ఽస్తు జనార్దన॥
' ఓం నమోనారాయణాయ నమః '

- ఇతి ప్రసన్నార్ఘ్యం ।

7 బారద్వాజసంహిత వివాహ ప్రయోగమున "కనకవర్ణం కనకాచల సన్నిభం " అనునవి చెప్పబడలేదు వేదపురుషావాహనకు కనకవర్ణాదులకు అర్థవత్ సంబంధము కల్పించుటలేదు భద్రాచలపాఠమున కనకవర్ణాదులు స్తంభ ధ్యానములుగ కల్పించుచున్నవి కనకవర్ణాదులయందున్న "ఊర్ధ్వం దండం - పద్మచత్ర వలయం - పాతాళాంతరే పాదపీఠం - మర్త్యలోక మధ్య ప్రదేశం - సత్యలోకోత్తమాంగం - అన్తస్సారం -" అనేవి అర్థవత్ స్తంభలక్షణమునకు సరిపోవును గాని వేదపురుష వర్ణనకు ఏ విధముగనూ సరిపోవు ' పద్మచత్రవలయం, మహాగిరి గహ్వరనాభీరన్ధ్రం' అనేవి అటు ధ్వజస్తంభమునకుగాని గరుడమూర్తికిగాని సరిపోవు కొప్పాక రేజేటి సిం వంటి కొన్ని ప్రాచీన పాఠములలో కనకవర్ణాదులలో వేదపురుషావాహనగాని కలశలుగాని లేవు కనకవర్ణాదులన్నీ ఒక ముద్దగా 7వ కారికలో వలె ఉన్నవి ఇక వేదపురుషావాహనలు ప్రాచీనప్రతులలో ఉన్ననూ దీని అనంతరం విడిగా ఉన్నవి ఇది ధ్వజస్తంభధ్యానమే యైనచో మూర్తివర్ణనమెందుకు? ఈ పరిస్థితులలో సాత్వత సంహిత(4 7-10)లక్ష్మీతన్త్రము(11 9-18)లలో చెప్పబడిన విశాఖయూపవర్ణనమును గమనించవలసియున్నది **"అస్తి శ్రీవైకుంఠే అప్రాకృతలోకే విశాఖయూపోనామ ధ్వజస్తంభాకారః కశ్చన తేజోరూపీ భగవన్మయః స్తంభవిశేషః ... తత్రాధః ప్రదేశమారభ్య ఉపర్యుపరి చత్వారోభాగాశ్చతురశ్రా వర్తన్తే। ప్రతిభాగ చతుర్ష్వపి పార్శ్వేషు భగవాన్ పరవాసుదేవః వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ రూపేణ క్రమేణ ప్రాగాది దిక్షు అవతిష్ఠతే। తత్ర ప్రథమోభాగః అనిరుద్ధ ప్రధానః। ....ఏతాదృశ విశాఖయూప అనిరుద్ధాదేవ పద్మనాభాదయో విభవా అవతీర్ణా ఇతి లక్ష్మీ తన్త్రే ఉక్తమ్ ।** " - అని వి కృష్ణమాచార్య పండితులు తమ లక్ష్మీతన్త్రవ్యాఖ్యలో వివరించినదానిని అధారముగాచేసుకొని చూచినచో, ఈ ధ్వజస్తంభధ్యానము వ్యూహదేవతారూపమూ విభవదేవతా ప్రాదుర్భావస్థానమూ అగు విశాఖయూప వర్ణనమేగాని వేరుకాదని తెలియుచున్నది విశాఖయూపమునకు మధ్యనుండి మీదికెగసినాళము ఆపైన ఏర్పడిన పద్మము వలననే ' మహాగిరి గహ్వరనాభీరన్ధ్రం, పద్మచ్ఛత్రవలయం " అనునవి అర్థవంతములగును గాన ఈధ్వజస్తంభధ్యానము పర వ్యూహ విభవ రూపాత్మకమగు విశాఖయూపధ్యానము

కనకవర్ణముతో, కనకాచల సమమగు కాంతితో, చతుర్భుజములతో, చతుర్బాహువులతో, నాల్గు నాసికలతో , ఎనిమిది చెవులతో, పెద్దకంఠము విశాలహృదయము గలిగి ఏకపాదమున, మూడు మేఖలలపై శోభిల్లుచు, పైకెత్తబడిన దండముగలిగి, పద్మచ్ఛత్రవలయముతో, తూర్పుముఖమున రక్తవర్ణమున సుప్రసన్నమగు ముఖముతోడను -

రాక్షసులను సంహరించు తీక్షణములగు కోరలు గలిగిన భయంకరమగు ముఖముతోనున్నను, సుప్రసన్నమునగు దక్షిణ ముఖము తోడను -

శ్వేతవర్ణముతో, వెండికొండవంటి కాంతి గల ఊర్ధ్వ కేశములతో, కుండలాలంకృతమై వరుణాధి పత్యమున నున్న పశ్చిమముఖము తోడనూ -

పీతవర్ణమున నానావిధమణిగణములతో వెలుగులిడు మకుటముతో, ప్రశాన్తము సుప్రసన్నము, ప్రసాద అనుగ్రహకరమూనగు ఉత్తరముఖము తోడనూ (విలసిల్లు ధ్వజస్తంభమున)-

## ధ్వజస్తంభ ధ్యానమ్

(ఈధ్వజస్తంభధ్యానము సాత్వత, లక్ష్మీతన్త్రముల యందు చెప్పబడిన
**పర వ్యూహ విభవ రూపాత్మక విశాఖయూప ధ్యానము.)**

7. ధ్వజస్తంభ సమీపం గత్వా । ధ్యానం ....

**కనక వర్ణం, కనకాచల సన్నిభం, చతుర్ముఖం, బాహ్వష్టకం, అష్టనేత్రం, చతుష్టయనాసాగ్రపుటశ్రవణాష్టకం, బృహత్కంఠం విస్తీర్ణహృదయం , ఏకపాదం, త్రిమేఖ లోపరి శోభితం, ఊర్ధ్వదండం, పద్మఛత్రవలయం, పూర్వముఖం, రక్తవర్ణం, సుప్రసన్నం-**

**దక్షిణముఖం, ధూమ్రవర్ణం, దైత్యసంహార దంష్ట్రాకరాళ వదనం, సుప్రసన్నం-**

**పశ్చిమ ముఖం, శ్వేతవర్ణం, రజతాచల సన్నిభం, ఊర్ధ్వకేశం, కుండలాలంకృతం, సుప్రసన్నం -**

**ఉత్తరముఖం, పీతవర్ణం, నానామణిగణోజ్వల మకుటం, సుప్రశాంతం, ప్రసాదానుగ్రహకరం, సుప్రసన్నం -**

**కుశరోమ విరాజితం, సమస్త దేవగణ పరిసేవితం, దైత్యదానవ భయంకరే పాతాళాంతరే పాదపీఠం, మర్త్యలోక మధ్య ప్రదేశం, సత్యలోకోత్తమాంగం, సహస్రకో ట్యర్కతేజసం, మహాగిరిగహ్వరనాభీ రంధ్రం, చతుర్దశభువనాగార మహోదరం, విష్ణుజిహ్వాద దీర్ఘోరు భుజ జాను జంఘాంగుళి నిభం, అంతస్సారం, పూర్వా ద్యష్టభుజ అంజలి ముసల ఖడ్గ శంఖ చక్ర గదా పద్మ హస్తం, సుప్రసన్నం -- ధ్యాయేత్ ॥**

---

కుశలవంటి రోమములతో నొప్పుచూ, సమస్త దేవగణములచే సేవింపబడుచూ, పాతాళాంతరమున పాదపీఠము, మర్త్యలోకమున మధ్యప్రదేశము, సత్యలోకమున శిరస్సు గలిగి, సహస్రకోటి సూర్యుల తేజమున వెలుగుచూ, మహాగిరి గహ్వరము వలెనున్న నాభీరంధ్రముతో, చతుర్దశ భువనాకారముననున్న మహోదరముతో, అంతటను వ్యాపించిన జిహ్వతో, దీర్ఘములగు భుజ జాను జంఘ అంగుళి నఖములతో, అంతస్సారముగలిగి, పూర్వాది అష్ఠ భుజములయందు (క్రమముగా) అంజలి (2), రోకలి (1), ఖడ్గ (1), శంఖ, చక్ర, గదా, పద్మ (ఒక్కొక్కటి. మొత్తం-8) ములను దాల్చిన వాడు, అగు సుప్రసన్న ధ్వజస్తంభరూపమును ధ్యానింపవలెను.

**(ధ్వజస్తంభధ్యానమునకు సరిపోని విష్ణుపార్షదేశ్వరం వంటివానిని ఇందు చేర్చలేదు)**

8. వివాహ వేద్యాః చతుర్దిక్షు చతుర్వేదపురుషా వాహనార్థం ఆకలశేష్వీతి మంత్రేణ కలశాం చతురాసాద్య ఇమమ్మే గంగేతి జలం నిక్షిప్య / పంచత్వక్ పంచపల్లవ పంచరత్నాని నిక్షిప్య / పాఠాంతరం-రే.రం) ప్రతిదిక్కునకు విడివిడిగా ఈ ప్రక్రియ జరిపించవలసి ఉన్న దిగాన విడివిడిగా చెప్పడం పూర్వ పాఠం. కుదించి సూత్రప్రాయంగా చెప్పడం రే.రం. పాఠం.

పంచత్వక్కులు = మర్రి, మేడి, రావి, జువ్వి, మామిడి. పంచపల్లవములు = మేడి, జమ్మి, మారేడు, మోదుగ, రావి. పంచరత్నములు = నీలము, వజ్రము, పద్మరాగము = మౌక్తికము, ప్రవాళము (సూర్యరాయాంధ్రము)

కలశేషు = కలశములయందు, ఆధావతి =పరుగిడుచున్నది (సోమలత), (దానికొరకు) పవిత్రే = పవిత్రములు , (అధ్వర్యుల చేత) పరిషిత్యతే = బాగుగా తడుపబడుచున్నవి, ఉక్థై = స్తోత్రములచేత, యజ్ఞేషు = యజ్ఞములయందు, వర్ధతే = వృద్ధిపొందుచున్నది. (ఋ 9-18-4) ( మన్త్రార్థములు ఋగ్వేద ప్రయోగరత్నం ఆధారంగా ఇవ్వబడినవి. )

గంగే = ఓ గంగానదీ ! యమునే ! సరస్వతీ ! సుతుద్రీ ! పరుష్ణీ ! అసిక్న్యా = అసిక్నీ నదితోకూడిన, సుషోమయా (నదీ), ఆర్జీకియే (నదీ), మే = నా యొక్క ఇమం స్తోమం = ఈ స్తోత్రమును, అసతచ = అంగీకరించుడు, శృణుహి = వినుడు. (ఋ 10-75-5)

9. యజ్ఞస్యదేవమ్ = యజ్ఞదైవమును, ఋత్విజమ్ = ఋత్విజుడును, హోతయును, పురోహితుడును (అగు) అగ్నిని, ఈడే = ప్రార్థింతును. ఋగ్వేదపురుషుని ఆవాహన చేయుచున్నాను.

10. వివాహవేదిక దక్షిణ దిక్కున కలశనుంచి యజుర్వేదమును ధ్యానించవలెను.

(హే పలాశ !) ఇషే = అన్నముకొరకు, త్వా = నిన్ను, (నరకుచున్నాను), ఊర్జే = రసముకొరకు, త్వా = నిన్ను, (సరిచేయుచున్నాను) ; (ఓ దూడలారా), వాయవః = వెళ్ళువారు, స్థ = కండు, ఉపాయనః = వచ్చిన వారలై, స్థ = ఉండుడు, వః = మిమ్ము, సవితా = ప్రేరకుడైన, దేవః = పరమేశ్వరుడు, శ్రేష్ఠతమాయ = మిక్కిలి శ్రేష్ఠమైన, కర్మణే = కర్మకొరకు, ప్రార్పయతు = ప్రేరణ చేయుగాక ; హే అఘ్నియా= ఓ గోవులారా, దేవభాగం = దేవేంద్రున కీయదగిన దధిరూపమైన భాగము, ఆప్యాయధ్వం= వృద్ధిపొందించుడు, ఊర్జస్వతీః = అత్యంత రసము కలిగినట్టియు, పయస్వతీః = ఎక్కువ పాలు కలిగినట్టియూ, ప్రజావతీః = బహుసంతానము కలిగినట్టియూ, అనమీవా= క్రిమిదోషములు లేనట్టియు, అయక్ష్మాః = ఇతర రోగములు లేనట్టియు, (వారు కండు) ; వః= మిమ్ము, స్తేనః= చోరుడు, మా ఈశత = అపహరింప సమర్థుడు కాకుండుగాక, అఘసంసః = క్రూరజంతువు, మా ఈశత = అపహరింప సమర్థుడు కాకుండుగాక ;

## వేదపురుషావాహనమ్

8. వివాహవేద్యాశ్చతుర్దిక్షు చతుర్వేద పురుషావాహనార్థం ఆకలశేష్వేతి మంత్రేణ కలశా శ్చతుర ఆ సాద్య । ఇమంమేగం గేతి జలం, ఋవతిభీమేతి పంచత్వక్, ప్రవోయజ్ఞేతి పంచపల్లవాన్, సహిరత్నానీతి పంచరత్నాని నిక్షిప్య।

ఆ కలశేషు ధావతి పవిత్రే పరిషిచ్యతే। ఉక్థైర్యజ్ఞేషువర్ధతే ॥

ఇమం మే గంగే యమునే సరస్వతి సుతుద్రి స్తోమగ్ంసచతా
ప రుష్ణియా అసిక్నియా మరుద్వృధే వితస్తయా ర్జీకియే।
శృణుహ్యా సుషోమయా ॥

ఋవతీ భీమో వృషభస్తం విశ్వయా శృంగే శశానో హరిణీవిచక్రః
అయోనిపోస్మ సుకృతం నిషీదతి త్వగ్వతి నిర్ణిగవ్యయే ॥

ప్రవో యజ్ఞేషు దేవయంతో అర్చం ద్యావా పృథివీ ఇషుధ్యై।
ఏషాం బ్రహ్మాణ్యసమాని విప్రా విష్వగ్వియంతి వనినో నశాఖా ॥

సహిరత్నాని దాశుషే సువా తే సవితాభగః।
తంభాగం చిత్రమీమహే సఖిభ్యః॥

9. అగ్నిమీళేతి మంత్రేణ పూర్వస్థిత కలశే అక్షతాన్ నినీయ -

అగ్నిమీళే పురోహితం యజ్ఞస్యదేవ మృత్విజం। హోతారం రత్నధాతమమ్ ॥ -హరిపాదారవింద సేవాతురం। ఇంద్రదైవత్యం ఋగ్వేదపురుష మావాహయామి।

10. ఇషేత్వేతి మంత్రేణ దక్షిణ స్థితకలశే అక్షతాన్ నినీయ-

ఇషేత్వోర్జేత్వా వాయవస్థో పాయవస్థ దేవోవస్సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణ ఆప్యాయధ్వ మఘ్నియా దేవభాగ మూర్జస్వతీః పయస్వతీః ప్రజావతీ రనమీవా అయక్ష్మామావ స్తేన ఈశత మాఘశగ్ంసో రుద్రస్య హేతిః పరివో వృణక్తు ధ్రువా అస్మిన్ గోపతౌస్యాత బహ్వీ ర్యజమానస్య పశూన్ పాహి॥

రుద్రస్య = రుద్రుడనుపేరుగల దేవునియొక్క, హేతి = ఆయుధము, వః = మిమ్ము, పరివృణక్తు = అంతటను విడచుగాక ; అస్మిన్‌గోపతౌ = ఈ గోస్వామియందు, ధ్రువాః= స్థిరమైనవారును, బహ్వీః = అనేకులుగను (సంతానముచే), స్యాత్ = కందు ; (హే పలాశ !) యజమానస్య = యజమానుని యొక్క పశూన్ = పశువులను, పాహి = రక్షింపుడు. యజుర్వేదుపురుషుని ఆవాహనచేయు చున్నాను.

11. వివాహవేదిక పశ్చిమదిగ్భాగమున ఆయామంత్రములతో పూర్వమువలెనే కలశమునుంచి, జలము నింపి, పంచత్వక్ పంచపల్లవములను, పంచరత్నములను ఉంచవలెను. సామవేదపురుషుని ఆవాహన చేయుచున్నాను...

12. వివాహ వేదిక ఉత్తరదిగ్భాగమున ఆయామంత్రములతో కలశారాధనమును పూర్వమువలెనే జరుపవలెను. దేవీః = ఎల్లరకు ఆనందమును ప్రకాశమును ఇచ్చు దేవుడు, ఆపః = సర్వవ్యాపకుడైయున్నాడు, (అతడు) అభీష్టయ = ఇష్టమగు, పీతయే = పూర్ణానంద ప్రాప్తికొరకు, నః = మనకు, శం భవంతు = కల్యాణ కరుడగుగాక. అధర్వణ వేదపురుషుని ఆవాహన చేయుచున్నాను.

బలిబింబమును దేవాలయమున ప్రవేశింపచేయవలెను. ఆపైన కల్యాణకౌతుకమును (లేదా ఉత్సవ బింబమును) యానముపైనుంచుకొని –

13. యుంజాన మన్త్రమును పఠించుచూ వివాహాగారమునకు స్వామిని తోడ్కొనిరావలెను.

(యుంజాన మంత్రము తైత్తరీయ సంహితలోనిది. శుక్లయజుః కాణ్వసంహిత (12 అధ్యా. 1-4 మంత్రములు, పే. 98) యందు కొద్దిపాటి భేదముతో ఉన్నది. ఈ యుంజాన మంత్రము భద్రాచలంవారి పాఠంలోకూడా ఉన్నది. (స్మార్తంలో వరుడు శాకున సూక్తాలు చదువుతూ వివాహాగారమునకు వస్తాడు.)

యుంజానః యోగి, మనః = మనస్సును, ప్రథమం = మొదట, సవితా తత్త్వాయ = పర్మేశ్వరుని తత్త్వము కొరకు, ధియమ్ = బుద్ధియందు, (నిలిపి), అగ్నిం = అగ్నిని, జ్యోతిః = (అతని) ప్రకాశముగ, నిచాయ్య = నిశ్చయించి, పృధివ్యా = పృధివియందు, అద్యాభరతు = తనలో ధరించును. సవితుః = భగవంతుడైన, దేవస్య = దేవునియొక్క సవే = అనంతైశ్వర్యము నందు, స్వర్గాయ = స్వర్గప్రాప్తి కొరకు, శక్త్యా = శక్తికొలది, మనసా యుక్తేన = మనస్సుచే లగ్నము చేసి, వయః = మనము (ఉండవలెను.) యుక్త్వాయ మనసా = (అటుల) మనస్సుతో ధరించిన వారైన, దేవాన్ = యోగుల పైన, స్వర్యతో = శుద్ధభావముతో, దివం = దివ్యమగు, బృహజ్యోతి = (తన) అనంత ప్రకాశమును, సవితా = భగవంతుడు ప్రసువాతి తాన్ = ప్రకటన మొనర్చును. బృహత = అధికముగా, విపశ్చితః = విశేషముగా జూచుచూ నెరుగు వారగు, విప్రాః = విప్రులు, ఉత = అట్లే, మనః = మనస్సును, ధియం = బుద్ధిని, విప్రస్య = భగవంతుని యందు, యుంజతే = యుక్తము చేయుచున్నారు.

- యజుర్వేదం యమాధి పత్యం సుప్రసన్నం। యజుర్వేదపురుష మావాహయామి।

11. అగ్న అయాహీతి మంత్రేణ పశ్చిమస్థిత కలశే అక్షతాన్నినీయ -

అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే।

నిహోతా సత్సిబర్హిషి॥

-సామవేదం వరుణాధిపత్యం సుప్రసన్నం, సామవేదపురుష మావాహ యామి।

12. శన్నోదేవీ రితి మంత్రేణ ఉత్తరస్థిత కలశే అక్షతా న్నినీయ -

శన్నోదేవీ రభిష్టయ ఆపోభవంతు పీతయే శం యో రభిస్రవంతు నః॥

- -అధర్వణవేదం। కుబేరాధి పత్యం। సుప్రసన్నం।అధర్వణవేదపురుష మావాహయామి।

--- **బలి కౌతుకం దేవాగారం ప్రవేశయేత్।**

13. అథకౌతుక దేవం యానమారోప్య - యుఞ్జానః ప్రథమమితి వావాహా గారమేత్య।

యుఞ్జానః ప్రథమం మనస్తత్వాయ సవితా ధియః

అగ్నిం జ్యోతి ర్నిచాయ్య పృథివ్యా అద్యాభరత్

యుక్త్వాయ మనసా దేవాన్ సువర్యతో ధియాదివం

బృహజ్యోతిః కరిష్యత స్సవితా ప్రసువాతితాన్

యుక్తేన మనసా వయం దేవస్య సవితు స్సవే

సువర్గే యాయ శక్త్యై యుఞ్జతే మన ఉత యుఞ్జతే

ధియో విప్రా విప్రస్య బృహతో విపశ్చితః విహోత్రా దధే

వయునావిదేక ఇన్మహీ దేవస్యసవితుః పరిష్టుతిః॥

14. కల్యాణ మండపమునకు వచ్చి విష్వక్సేనపూజ పుణ్యాహవాచనములను జరిపించిఇ పరిషదర్చనమొనరింపవలెను.

ఆపైన ప్రాణాయామము చేసి సంకల్పము - పైన జెప్పిన గుణవిశేషణములతోగూడిన శుభతిధి యందు శ్రీ భూ సమేత శ్రీమన్నారాయణ భగవాను నుద్దేశించి, ఆ శ్రీమన్నారాయణుని ప్రీతి కొరకు, ఏతాసు = వారియందు, ధర్మ = ధర్మకార్య నిర్వహణము, ప్రజా = సంతానము, సంపత్యర్థం = సంపన్నమగు నిమిత్తము, ( శ్రీభూదేవులనే ఉద్దేశమైనచో - ఏతయోః అని ఉండవలెను.) లక్ష్మీ అనునీ కన్యను (ఆపైన భూదేవికి కూడ ఇట్లే చెప్పవలెను.), ఉద్వాహయిష్యే = పెండ్లిచేయుచున్నాము.

15. అర్యమ్ణో అగ్ని అనుమంత్రముతో ప్రతిసరము నభిమంత్రించవలెను.

శ్వశ్ర్వః = అత్తగార్లు (మా ఇద్దరి తల్లులు), దేవరాశ్చ = బావమరుదులు (మా ఇద్దరి తోబుట్టువులు), అర్యమ్ణ = సర్వవ్యాపకుడగు భగవంతుని అనుగ్రహము వలన, అగ్నిం= అగ్నిని, క్షిప్రం = శ్రీఘ్రముగ, పరియంతు = చుట్టూ అవరించి యుందురుగాక, ప్రతీక్షంతాగ్ం= జాగరూకులై చూతురు గాక.

16. కంకణాధిష్ఠాన దేవతకు శోడశోపచార పూజ నొనర్పవలెను.

17. ధ్రువంత మంత్రముతో స్వామికి కుడిచేతికి, సుమంగళి మంత్రముతో అమ్మవార్ల ఎడమ చేతులకు రక్షాసూత్రమును కట్టవలెను.

(ఓ రాజా) తే = నీ యొక్క రాష్ట్రమును, రాజా వరుణః = ప్రకాశించు వరుణుడు, ధ్రువం = స్థిరముగా, ధారయతు = పోషించుగాక, దేవోబృహస్పతిః = దేవతలయందు బృహస్పతి, ఇంద్రుడు, అగ్ని, తే = నీయొక్క (దేశమును), ధ్రువమ్ = స్థిరముగా (ధరించుగాక)ఇయాంవధూః = ఈ వధువు, సుమంగలీః = శోభనమంగళ స్వరూపిణి, ఇమాం= ఈమెను, సమేత = మంగళదృష్టితో, పశ్యత = పరికించుడు, అస్యై= ఆమెకొరకు, సౌభాగ్యమును, దత్వా = ఇచ్చి, యధాఃత్వం = మీరు యథా పూర్వక ముగా (రావలయును), వి పరేత న = పరాఙ్ముఖులు గావలదు. (ఋ. 10-85-33)

18.ఆపః = పాదా అను మంత్రముతో స్వామి పాదములను కడుగవలెను (ప్రోక్షించవలెను)

పాదావనే జనీః = పాదములను కడుగుటవలన జనించిన, ఆపః = ఉదకములు, మే = నా యొక్క ద్విషంతం = శత్రువును, నాశయంతు = సంహరించుగాక, అస్మిన్ కులే = ఈ నావంశమందు, బ్రహ్మవర్చసి = బ్రహ్మవర్చస్సు గలవాడను, అసాని = అయ్యెదను.

19 (స్వామికి) ఆచమనము - యజ్ఞోపవీతధారణకై సంకల్పము .

చతుర్దశ భువనాధీశ్వరుడు, దేవదేవోత్తముడు, జగత్కుటుంబియునగు ఆ శ్రీమన్నారాయణుడు జగద్రక్షణార్థము, శ్రీ మన్నారాయణుని లీలావిభూతియగు సకల చేతనముల యొక్క విష్ణుభక్తుల యొక్క క్షేమము, స్థైర్యము, విజయము, అభయము,

14. విష్వక్సేనం ప్రపూజ్య। పుణ్యాహం వాచయిత్వా।తతః పరిషత్ ప్రకరణమ్।

ప్రాణానాయమ్య। ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్ ............ గోత్రస్యశ్రీ ........... భగవంత ముదిశ్య। ............ భగవత్ ప్రీత్యర్థం, ఏతాసు ధర్మ ప్రజా సంపత్యర్థం ......కన్యా ముద్వాహయిష్యే॥

**రక్షాసూత్రబంధనమ్** (ఇప్పుడు రక్షాసూత్రబధనం ఉత్సవులకు - రక్షాసూత్రమన్నా ప్రతిసరమన్నా కంకణమన్నా సమానార్థకాలు)

15.అర్యమ్ణో అగ్నిమితి ప్రతిసరమభిమంత్ర్య॥

అర్యమ్ణో అగ్నిం పరియంతుక్షిప్రం। ప్రతీక్షంతాగ్ం శ్వశ్ర్వోదేవరాశ్చ॥

16.రక్షాసూత్ర దేవతాభ్యోనమః ధ్యానావాహనాదిషోడ శోపచార పూజాం సమర్పయామి -

17.ధ్రువంత ఇతి దేవస్య దక్షిణ కరే సుమంగలీరితి దేవ్యోర్వామకరే బధ్నీయాత్॥

ధ్రువంతే రాజా వరుణో ధ్రువం దేవోబృహస్పతిః॥
ధ్రువంత ఇంద్ర శ్చాగ్నిశ్చ రాష్ట్రంధాయతాం ధ్రువం।

సుమంగలీః ఇయం వధూః ఇమాగ్ం సమేతపశ్యత।
సౌభాగ్యమస్మై దత్వా యా థాస్తం విపరేతన॥

**ద్వితీయయజ్ఞోపవీత ధారణమ్**

18. ఆపః పాదా ఇతి పాదౌ ప్రక్షాళ్య।

ఆపః పాదా వనేజనీ ర్ద్విషంతం నాశయంతుమే
అస్మిన్కులే బ్రహ్మవర్చస్యసాని॥

19. అచమ్య॥

పృథివ్యాః మేరుపృష్ట ఋషిః.......... భగవంతముద్దిశ్య....... భగవత్ ప్రీత్యర్థం। అస్యచతుర్ధశ భువనాధీశ్వరస్య। దేవదేవోత్తమస్య। జగత్ కుటుంబినః జగద్రక్షణార్థం, శ్రీమన్నారాయణ లీలా విభూతీనాం, సకలలోకానాం, సకల

ఆయురారోగ్యములు, ఐశ్వర్యము అభివృద్ధి పొందుటకు, సమస్త మంగళములు కలుగు నిమిత్తము, అభ్యుదయ మందు నిమిత్తము, ఆయువు కోరిన కోర్కెలు ఫలవంతమగుటకు- భగవంతుని ఆజ్ఞచేత, భగవన్మంత్ర సాధనములవలన, భగవాతాధీనుడనై. భగవంతుని ప్రీతికొరకు -

ద్వాదశ లక్ష శ్లోక విస్తృతమగు శ్రీపాంచరాత్ర శాస్త్ర దివ్యాగమమందలి శ్రీ విష్ణు పాద్మ కపింజల సంహితలలో చెప్పిన విధముగా - వివాహాంగభూతమగు ద్వితీయ / స్వర్ణ యజ్ఞోపవీత ధారణము జరిపించుచున్నాము.

20. గంధద్వారాం అను మంత్రముతో యజ్ఞోపవీతము నభిమంత్రించవలెను.

గంధద్వారాం = వాసనవలన తెలిసికొనదగిన, దురాధర్షాం = దుష్టున కవమానింప సాధ్యముకాని, నిత్యపుష్టాం = ఎల్లప్పుడు పంటలతో పుష్టిగానున్న, కరీషిణీం = గోమయములతో కూడిన, ఈశ్వరీం సర్వభూతానాం = సర్వభూతములకు యజమానియైన, శ్రియం = సేవించదగిన, తాం = ఆ భూరూపయగు దేవిని, ఇహ = ఇక్కడకు, ఉపహ్వయే= ఆహ్వానించుచున్నాను. (త్రై.ఆ. 10-1-10)

21.యజ్ఞోపవీతాధిష్ఠాన దేవతకు షోడశోపచార పూజ చేయవలెను.

22.యజ్ఞోపవీతం గొప్పది, పవిత్రమైనది. ప్రజాపతేః = బ్రహ్మతో, యత్ = ఏది, పురస్తాత్ = అన్నిటికంటే ముందుగా, సహజమ్ = పుట్టినటువంటిది, ఆయుష్యం = దీనిని ధరించుట వలన ఆయువు పెరుగును, అగ్ర్యం = అగ్రజాతికిది ప్రధానము. ప్రతి ముంచ = మనస్సునందలి మాలిన్యమును పోగొట్టునది, శుభ్రం = శుద్ధమైనది, యజ్ఞోపవీతము నాకు బలము తేజము అగుగాక. యజ్ఞోపవీతమును ధరింపజేయవలెను.

23." మదర్థం" నా కొరకు కన్య నన్వేషింపుడని (నిశ్చయించుడని) వరుడు ఎనిమిది మంది బ్రాహ్మణులను పంపవలెను. " నా కొరకు కన్యను వరింపుడు " - అని వరుడు పలికి కన్య కొరకు బ్రాహ్మణులను పంపవలెను.

వీరిని ' వరులు ' అనుట ప్రాచీన సంప్రదాయం. "సుహృదస్సమవేతాన్ మన్త్రవతో వరాన్ ప్రహృణియాత్" - అనేది ఆపస్తంబ గృహ్యసూత్రం. శృత శీలవేద విత్త సంపన్నాం సమవేతాన్ కార్యకుశలాన్ వరాన్ ప్రహృణియాత్ అనేది దీని వివరణ. ఇక్కడ వరాన్ అనగా - వరుని కొరకు కన్యనెన్నుకొనుటకేగు బ్రాహ్మణులని అర్థం. ఇలా పంపడం కన్యా వరణం. ఇక్కడ కన్యావరణ దక్షిణలు బ్రాహ్మణులకు ఇచ్చి పంపుతారు. '...ద్వే చత్వారో ష్టాదయోవా వరేణ తత్పిత్రాదినా వా" అని ఋగ్వివాహ ప్రయోగము.

24. తే = వారు (ఆ బ్రాహ్మణులు) కన్యాదాతను చేరి అడుగుదురు.

25.అనంత వేదాధ్యాయియు, అచ్యుత --- గోత్రుడు, పరబ్రహ్మ శర్మ మునిమనుమడు, నారాయణ శర్మ పౌత్రుడు, ప్రద్యుమ్న శర్మ పుత్రుడును అగు వరాయ = వరుని కొరకు (కన్యనర్థించుచున్నాము. ).

చేతనానాం, విష్ణు భక్తానాంచ క్షేమ స్థైర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం, సమస్త మంగళావాప్త్యర్థం, అభ్యుదయార్థంచ ఆయుష్కామార్థ ఫలసిద్ధ్యర్థం, భగవదాజ్ఞయా, భగవ త్కైంకర్యార్థం, భగవన్మంత్రసాధనైః భగవతాధీనోహం, భగవత్ ప్రీత్యర్థం ... అన్య శ్రీపాంచరాత్ర ద్వాదశలక్ష ప్రమాణ శాస్త్ర దివ్యాగమ శ్రీవిష్ణు పాద్మ కపింజల సంహితోక్త ప్రకారేణ వివాహాంగభూత స్వర్ణయజ్ఞోపవీత ధారణం కరిష్యే।

20. గంధద్వారా మిత్యభిమంత్ర్య।

గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణమ్
ఈశ్వరీగ్ం సర్వభూతానాం త్వామిహో పహ్వయే శ్రియమ్॥

21. యజ్ఞోపవీత దేవతాభ్యోనమః ధ్యానావాహనదాది షోడశోపచార పూజాం సమర్పయామి।

22. యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతే ర్యత్సహజం పురస్తాత్
ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥

## కన్యావరణమ్

23. (వరః) మదర్థం కన్యాం వృణీధ్వమిత్యష్టౌ బ్రాహ్మణాన్ ప్రేషయిత్వా -
"మదర్థం కన్యాం వృణీధ్వం"

24. తే (బ్రాహ్మణాః) కన్యాదాతారం గత్వా। బ్రువతే .....

25. అనంత వేదాధ్యాయినే,

అచ్యుత పరబ్రహ్మ నారాయణ నిరాకార సాకార పంచార్షేయ ప్రవరాన్విత -
అచ్యుత గోత్రస్య। పరబ్రహ్మ శర్మణో నప్త్రే
అచ్యుత „ „ అచ్యుత గోత్రస్య। . నారాయణ శర్మణః పౌత్రాయ,
అచ్యుత „ „ అచ్యుత గోత్రస్య। ప్రద్యుమ్న శర్మణః పుత్రాయ.
అచ్యుత „ „ అచ్యుతగోత్రోద్భవాయ
శ్రీమన్నారాయణ శర్మణే వరాయ

(అనంత వేదాధ్యాయినే నారాయణశర్మణే వరాయ = అనంత వేదాధ్యాయి నారాయణశర్మయనెడి వరునికొరకు అని ఇక్కడ వరుడు వేదాధ్యాయియో కాదో చెప్పవలసి యున్నది - కారణ మేమనగా వరుడు వేదాధ్యాయి యైనదో మధుపర్కమును గోసహితముగా (సహగవా) ఇవ్వవలెను, కానిచో గోవు లేకుండ (వినాగవా) ఇవ్వవలెనని అపస్తంబ గృహ్య సూత్రం. చూ.. అను.. 14, పేజి, 364)

26.(దీనికి కన్యాదాత) సౌభాగ్య సగోత్రోద్భవులైన విశ్వంభర శర్మ మునిమనుమరాలు, రత్నాకరశర్మ మనుమరాలు, క్షీరార్ణవశర్మ పుత్రికయగు శ్రీలక్ష్మి అను పేరు గల కన్యను వృణీధ్వం = వరింపుడు (అని చెప్పును).

27.దానికా బ్రాహ్మణులు లోకకల్యాణమునకై వరించుచున్నాము అని అంగీకరింతురు.

28.దానికా కన్యాదాత వరింపుడు తస్మైమదాస్యామి= ఆతనికొరకు ఇచ్చుచున్నాను అని వాగ్దానము చేయును.

29.కన్యాదాత కొన ఉత్తరమున కుండునట్లుగా కూర్చను నారాయణునకు సమర్పించవలెను.

(గృహ్యసూత్రానుసారం కూర్చ అనగా ఆసనము. దీనికి విష్టరమని పేరు. స్మార్త కారికావళిలో గృహ్యేది తేన విధినైవహి ...... అంటూ వరుని గృహ్యసూత్రానుసారం కూర్చ, మధుపర్కం, మొ॥నవి ఇవ్వవలెను - అని విధింపబడినది.) విష్ణుగాయత్రితో అభిమంత్రించవలెను. ఉత్తరాగ్ర కుశాసనంమీద వరుడు , పశ్చిమముఖుడుగాకూర్చొనవలె. కన్యాదాత ప్రాఙ్ముఖుడుగా నుండును .

30.ఇమమ్మే గంగే అను మంత్రముతో మంత్రస్నానము చేయించవలెను.

31.మధువాతా అను 3 మంత్రములతో పాత్రయందున్న పెరుగు తేనెలను చూచి ఉంగరపు వ్రేలు బొటనవ్రేలు కలిపి వానితో పాత్రలోని పెరుగు తేనెలను మూడుసార్లు ప్రదక్షిణముగ కలియబెట్టవలెను. తూర్పు, దక్షిణము, పశ్చిమము, ఉత్తరము అను దిక్కులయందు చల్లవలెను. (స్మార్తమున ఇక్కడ వేర్వేరు మంత్రములున్నవి.) (మధుపర్కము దధిమధు సమ్మిశ్రమని అపస్తంబ గృహ్యసూత్రం. చూ. అను...12, పే. 353)

ఋతాయతే = యజ్ఞమును కోరు (యజమానునికొరకు), వాతాః = వాయువులు, మధు = మధురమైన కర్మఫలములను, క్షరింతి = ఇచ్చుచున్నవి. నః = మాకు, సింధవ= నదులు, ఓషధీః = ఓషధులు, మాధ్వీః = మాధుర్యము గలవై సంతు = ఉండుగాక.

నః = మాకు, నక్తం మధు = రాత్రి మధురము, ఉత = ఇంకా, ఉషసి మధుమత్= పగలు మధురము, పార్థివగ్ం రజః మధుమత్ = పృధివీ రజము మధు మంతము, పితాద్యౌః మధు = తండ్రి వంటి ఆకాశము మధురము (అగుగాక).

నః = మాకు, వనస్పతిః మధుమాన్ = వనదేవత (మూలికలు), మధుమంతుడు, సూర్యః మధుమాన్ = సూర్యుడు మధుమంతుడు, అస్తు = అగుగాక,నః = మాకు,

26. (కన్యాదాతా).........

సౌభాగ్య విశ్వంభర నిరాకార సాకార త్రయార్షేయ ప్రవరాన్విత -

సౌభాగ్యస గోత్రస్య । ..........విశ్వంభర శర్మణో నప్త్రీం,

సౌభాగ్య " " సౌభాగ్యస గోత్రస్య । ...... ..రత్నాకరశర్మణః పౌత్రీం,

సౌభాగ్య " " సౌభాగ్యస గోత్రస్య । ... .....క్షీరార్ణవశర్మణః పుత్రీం,

సౌభాగ్య " " సౌభాగ్యసగోత్రోద్భవీం .

శ్రీలక్ష్మీనామ్నీం కన్యాం వృణీధ్వమ్॥

**27. (బ్రాహ్మణాః) లోకకల్యాణార్థం వృణీమహే।**

**28. (కన్యాదాతా) వృణీధ్వం-తస్మై దాస్యామి। ఇతి**

**<u>వరపూజా</u>** (కన్యాదాతా ప్రాఙ్ముఖః - వరః పశ్చిమముఖః)

**29.ఉత్తరాగ్రం కూర్చం నారాయణాయ దద్యాత్।**

**విష్ణు గాయ త్ర్యాభిమంత్ర్య।**

**నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి।**

**తన్నో విష్ణుః ప్రచోదయాత్ ।**

**30. ఇమమ్మేగంగేతి మంత్రస్నానమ్।**

**ఇమమ్మే గంగే యమునే సరస్వతి సుతుద్రి స్తోమగ్ం సచతా పరిష్ణియా**

**అసిక్నియా మరుద్వృధే వితస్తయా ర్జీకియే। శృణుహ్యా సుషోమయా॥**

**31. మధువాతాఇతి దధిమధు సమ్మిశ్రం సువర్ణపాత్రే నిధాయ।**

**మధువాతా ఋతాయతే మధుక్షరన్తి సింధవః।**

**మాధ్వీర్నస్సం త్వోషధీః। మధునక్త ముతోషసి**

**మధుమత్పార్థివగ్ం రజః। మధు ద్యౌ రస్తు నః పితా।**

**మధుమాన్నో వనస్పతి ర్మధుమాగ్ం అస్తు సూర్యః।**

**మాధ్వీర్గావో భవంతున ః ।।**

గావ= ఆవులు, మాధ్వీః భవంతు = మధురములగు పాలనిచ్చునవి అగుగాక.

32. యన్మధున అను మంత్రము చదివి 3 సార్లు ప్రాశన చేయించవలెను.

యత్ మధున = యే తేనె యొక్క పరమమ్ = గొప్పదియును, అన్నాద్యం = అన్నమును జీర్ణము చేయు, మధునః తేన మధవ్యేన = తేనె యొక్క ఆ మాధుర్యము చేత, అహమ్ = నేను, అన్నాద్యః మధవ్యం = అన్నము తినగలవాడను, అందరిచే కోరదగినవాడను, అసాని = అయ్యెదను. ఈమంత్రముతో ఒకమారు మంత్రంలేకుండా రెండుమార్లు మధుపర్కప్రాశనమొనరించవలెను.

అమృతా పిధానం = అమృతమును మరపించు దానవు, అసి = అయితిని – అని (నీరు త్రాగవలెను.) ఆచమనమును సమర్పించవలెను. (అమృతోపస్తరణమసీ త్యపః పీత్వా – ద్విరాచమ్య – యన్మధున ఇతి మధుపర్కం, సకృన్మంత్రేణ – ద్విః తూష్ణీం – అమృతాపిధానమసి ఇత్యపః పీత్వా, హస్తం ప్రక్షాళ్య, ద్విరాచమేత్.... *గా మభిమంత్రయేత్ – ఓముత్సృజతే త్యుచై ర్వరో బ్రూయాత్, ఓ ముత్సృజత – అని యాజుషం పుట – 178-180)*

33. చరణం పవిత్రం అను మంత్రముతో పాదప్రక్షాళనము చేయవలెను.

ఈ చరణము కడు పవిత్రము - కడు పురాణము, వితతం = మిక్కిలి వ్యాపించి యున్నది, ఏన పూతః = దీనిని కడిగి పవిత్రుడయిన వాడు, దుష్కృతాని తరతి = దుష్కర్మలను తరించును, పవిత్రేణ శుద్ధేన తేన = పవిత్రములు శుద్ధములు అగు అట్టి చరణములచే పవిత్రుడై, అతి పాప్మానం అరాతిం = అతిపాపాత్ముడు శత్రువు (కూడ), తరేమ = తరించును. (ఇతిపాదౌ ప్రక్షాళ్య-ఆచమ్య- అనేది రే.రం. అధిక పాఠం.) పాదప్రక్షాళనానంతరం ఆచమనం చేయించవలసి యున్నది.

34. ఓం ఉత్సృజత క్ష్మ(గోవును) వదిలిపెట్టవలెను.

గౌః క్ష్మఈ ఆవుదూడ, ధేను భవ్యా = యోగ్యమగు ఆవు కాగలదు, రుద్రాణాం మాతా = రుద్రులకు తల్లియు, వసూనాం దుహితా = వసువులకు కూతురు, ఆదిత్యానాం స్వసా = ఆదిత్యులకు సహోదరి, అమృతస్య నాభిః = యజ్ఞము యొక్క ముఖ్యస్థానము, విడిచిపెట్టవలెను.

(దాత గౌః అని ఆవుదూడును చూడవలెను. వరుడు గౌర్ధేను భవ్యా .. అమృతస్య నాభిః అని చెప్పి, పిబతూదకం (నీరు త్రాగించవలసినది), తృణాన్యత్తు (గడ్డి వేయవలెను) - ఓ ముత్సృజత ఇతి ఉచ్చైః వరః బ్రూయాత్ (వదలివేయండి అని గట్టిగా వరుడు చెప్పవలెను) - అని యాజుషం పుట.180. వరుడు కోరినచో గోవును హింసించి దానివపతో వపాహోమం చేయడం కృతయుగాచారం.ఇది ఆలంభపక్షం. 'అశ్వాలంభం గవాలంభం సన్యాసం పలపైతృకం। దేవరాచ్చ సుతోత్పత్తిః కలౌ పంచ విసర్జనమ్" అనునది ఆధారంగా నేడు గవాలంభము నింద్యము గాన, గాం విసర్జయేత్ అని చెప్పబడుచున్నది. ఇది ఉత్సర్జనపక్షం. ఇందు మన్త్రజపముచెప్పబడినది. అదే గౌర్ధేనుభవ్యా..మానుషమున గల ఈకారికకు ఆచార్యుడు పోకచెక్కను కుడిచేతి బొటనవ్రేలి గోటితో పైకెగురవేసి విసర్జించవలసియున్నది. ఇలా పోకచెక్క నెగురవేయుట ఆచార సిద్ధము - కారణము లభింపలేదు.)

35. కన్యాదాన సారాంశము

(కన్యాదాన సంకల్పంపై చర్చ, వివరణము అనుబంధము.10, పుట.331. లో ఇవ్వబడినవి.)

మహాశక్తివంతుడు శ్రీమ దాదినారాయణుడు అగు మహాపురుషుడు సర్వమును భరించుచుండగా, మహాజలరాశి మధ్య తిరుగుచున్న అనేక

32. యన్మధున ఇత్యుత్తరవాక్యోచ్చారణ పూర్వకం త్రిః ప్రాశయిత్వా -

యన్మధునో మధవ్యం పరమమన్నాద్యం వీర్యం తేనాహం మధునో

మధవ్యేన పరమే ణాన్నాద్యేన వీర్యేణ పరమోన్నాదో మధవ్యో సాని।

సకృన్మం త్రేణ। ద్విస్తూష్ణీం॥

అమృతాపిధానమసి।

33. చరణం పవిత్ర మిత్యుక్త్వా॥

చరణం పవిత్రం వితతం పురాణం యేనపూత స్తరతి దుష్కృతాని।

తేన పవిత్రేణ శుద్ధేన పూతా అతిపాప్మాన మరాతిం తరేమ॥

-- ఇతి పాదౌ ప్రక్షాళ్య। ఆచమ్య।

(గౌః దాతా ప్రాహ)

34. గాం విసర్జయేత్॥ (ఈకారిక వరుడు చెప్పవలసినది)

గౌర్ధేను భవ్యా మాతా రుద్రాణాం దుహితా

వసూనాగ్ం స్వసాదిత్యానా మమృతస్య నాభిః।

ఓం ఉత్సృజత ఇతి ఉచ్చైః। "ఓం ఉత్సృజత"

(వధూవరయో రన్తరే నూతన కౌశేయ పట మాస్తీర్య ।)

కన్యాదాన సంకల్ప ముక్త్వా --

<u>కన్యాదాన సంకల్పః</u> (మహాసంకల్పః)

35. శ్రీ మదచింత్యానంత సంతన్యమాన, అనన్య నివార్య వీర్యస్య, అఖిలలోక పరిపాలన పరాయణస్య, మహాజలౌఘమధ్యే, పరిభ్రమమాణానాం అనేక కోటి బ్రహ్మాండానాం ఏకతమే వ్యక్తా వ్యక్త మహదహంకార పృథి వ్యాపస్తేజో వాయు రాకాశా ద్యావరణై రావృతే,

అస్మిన్ మహతి బ్రహ్మాండ ఖండమండలే, ఆధారశక్తి కూర్మానంతా దృష్టదిగ్గజో పరివేష్టితస్య, అతల వితల సుతల ప్రతల మహాతల తలాతల రసాతల సప్తపాతాళాది లోకానా ముపరితలే,

బ్రహ్మాండములలో నొకటియై - వ్యక్తము అవ్యక్తము మహత్తు అహంకారము భూమి నీరు తేజము ఆకాశములను 7 ఆవరణములతో నున్న బ్రహ్మాండఖండమునకుమధ్య - ఆదివరాహము, ఆదికూర్మము, ఆదిశేషుడు మొదలగు ఆధారశక్తులకు పైన అష్టదిగ్గజములపై ప్రతిష్ఠింపబడి, అతలాది సప్తపాతాళలోకములకు పైన, సత్యలోకమునుండిక్రిందకుగల ఊర్ధ్వ లోకములలో అన్నిటికంటె క్రింద నున్నదియు - వలయమువలె చక్రవాళ పర్వత మధ్యభాగమున నుండి ఆవలయమున నాళమువలెనున్న ఆదిశేషుడు తన సహస్ర ఫణములచే మోయుచున్నదియూ నగు-

పంచాశత్కోటియోజన విస్తీర్ణముగల భూమండలము - లవణ ఇక్షు సురా సర్పి మొదలగు సముద్రములు, క్రమముగా జంబూ ప్లక్ష కుశ క్రౌంచాది ద్వీపములకు వలయములవలె ప్రకాశించుచుండగా -

అందుగల లక్షయోజన విస్తృమగు జంబూద్వీమున గల .........సహస్ర యోజన విస్తృతమగు భారత వర్షమున, భరత ఖండమున ........అంటూ, అందుగల నదులనూ, పట్టణములనూ, పర్వతములనూ, పుణ్యక్షేత్రములనూ చెప్పి, బ్రహ్మణః ద్వితీయ పరార్ధే అంటూ కాలగణనంతో మహాసంకల్పము పూర్తియగు చున్నది. (పరార్థద్వయసంఖ్యాత - రెండుపరార్ధములచే లెక్కించబడిన)

36. మమ = నాయొక్క జన్మప్రభృతి = పుట్టుకమొదలకొని, బాల్య యౌవన కౌమార వార్ధకముల యందు, జ్ఞానాజ్ఞానత = తెలిసిగాని తెలియకగాని, మనోవాక్కాయ కర్మకృత = మనస్సుచే వాక్కుచే శరీరముచే, కర్మలచే చేయబడి, ఆవృత్త= మరలమరల జరుగు, అనావృత్త = మరల మరల జరుగని, ప్రకీర్ణక = విరివియగునవి, అగు, సమస్త దురిత క్షయాయ = అన్ని పాపములు నశించుట వలన,

గంగా వాలుకాభిః = గంగా నదియందలి ఇసురేణువులచేత, సప్తర్షిమండల పర్యతం, కృత = ప్రోవుబడిన , రాశే = రాశినుండి, ఏకైక వాలుకా = ఒక్కొక్క ఇసుకరేణువు, అపకర్షణ క్రమేణ = తీసివేయు క్రమమున, సర్వరాశి అపకర్షణ = రాశి అంతయు తరుగజేయుటకు, సమ్మితకాలే = సరిపడు కాలమునందు, మయాసహా= నాతోబాటుగా, దశ పూర్వేషాం=పది ముందుతరముల వారూ, దశ అపరేషాం = పది వెనుకతరములవారూ అగు, సర్వేషాం పితౄణాం = అందరు పితరులకు, శాశ్వత విష్ణులోకే = శాశ్వతముగా విష్ణులోకమునందు, నివాస సిద్ధ్యర్థం = నివాసము సిద్ధించుట కొరకు,

37. యవధాన్యముచే చంద్రమండల పర్యంతము ప్రోవుబడిన రాశినుండి ఒక్కొక్క యవను తీసివేయు క్రమమున రాశియంతయు తరుగచేయుటకు, సరిపడు కాలమునందు, నాతో బాటుగా, మావంశమునందలి పది ముందుతరములవారూ, పది వెనుక తరములవారూ అగు అందరు పితరులకు శాశ్వతముగా విష్ణులోకమునందు నివాసము సిద్ధించుట కొరకు,

38. తిలలచే సూర్య మండలము వరకు ప్రోవుబడిన రాశినుండి ఒక్కొక్క తిల తీసివేయు

భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనోలోక, తపోలోక, సత్యలోక సప్తకస్య అధోభాగే,

అనేకఫణిరాజిరాజశేషస్య సహస్రఫణామణి మండలమండితే, దిగ్దంతి శుండాదోర్దండ మండితే, లోకాలోకాచల వలయితే,

లవ ణేక్షు సురా సర్పి ర్దధి క్షీర స్వాదూద కార్ణవ పరివృత, జంబూ ప్లక్ష కుశ క్రౌంచ శాల్మలీ శాక పుష్కరద్వీప ద్వీపితే,

ఇంద్రద్వీప కుశ తామ్రపర్ణి గభస్తి నాగ సౌమ్య గంధర్వ చారణ భారతయుతే - నవమఖండే, తత్కులాచలేభ్యః,

చలితకాళిందీ, నర్మదా, గోదావరీ, కృష్ణవేణీ, తుంగభద్రా ప్రభృతి అనేక పుణ్యనదీభిః,

సహస్ర ప్రసరే, కురు పాంచాల మత్స్యదే శాంగ వంగ కళింగ మగధ మద్ర మాళవ నేపాళ చోళ గౌళ మళయాళ సింహళ ద్రవిడ ద్రావిడ కర్ణాట లాట కిరాట మరాట పాండ్య పుళింద దశార్ణవ భోజ బాహ్లిక బర్బర కేకయ కోసల కుంతల సావీర సౌరాష్ట్ర మహారాష్ట్రాది షట్పంచాశ ద్దేశ విరాజితే -

పంచాశత్కోటియోజనవిస్తీర్ణ భూమండలే -

సుమేరోర్నిషధ హేమకూట హిమవ ద్వింధ్యాచలానాం, హరివర్ష కింపురుషయో ర్దక్షిణే -

నవసహస్ర యోజనవిస్తీర్ణ మలయాచలా దుత్తరే --

సువర్ణ ప్రస్త ప్రాంశు శుక్త్యా వర్తన రమణక మోహారక పాంచజన్య సింహాలంకేతి నవఖండాత్మకే, కర్మభూమౌ -

*సమవేత పుణ్యక్షేత్రేషు - శ్రీరంగ వృషగిరి సత్యవ్రత యదుగిరి పాండురంగ శ్రీమదహోబల ప్రభృతి భగవద్దివ్యదేశానాం -

తామ్రపర్ణీ కావేరీ పయస్వినీ కృతమాలా బాహుదా సువర్ణముఖీ కృష్ణాది నదీనాం చ ఉత్తర దేశే-

శ్రీమద్గోదావర్యా ఉత్తరదేశే, కాశ్యాది నిఖిల పుణ్యక్షేత్రాధిక..........క్షేత్రే హిమవాన్మేరో ర్దక్షిణ దిగ్భాగే - శ్రీశైలస్య సకలజగత్ సృష్టినాథస్య పరార్థద్వయ సంఖ్యాత వర్షశతజీవినో

* ఇక్కడ అన్ని పాఠాలలో సామ్యోవతీ పుణ్యక్షేత్రే అని వ్రాయబడినది. ఇది అర్థవంతంగా కన్పించనందున సమవేత పుణ్యక్షేత్రేషు అని సరిచెయదమైనది.

క్రమమున రాశి అంతయు తరుగజేయుటకు సరిపడు కాలమునందు, నాతో బాటుగా, మావంశమునందలి పది ముందుతరములవారూ, పది వెనుక తరములవారూ అగు అందరు పితరులకు శాశ్వతముగా విష్ణులోకమున నివాసము సిద్ధించుట కొరకు,

(మినుములచే ధ్రువమండలము వరకు ... గోరోమములతో నక్షత్ర మండలము వరకు..., అను కారికలు కూడ కొన్ని పాఠములయందు కన్పించుచున్నవి.)

39. మూడురెట్లైన అగ్ని ష్టోమాది క్రతువుల ఫలము సిద్ధించుటకు,

40. పన్నెండు లక్షల ప్రమాణముగల గ్రంధమగు శ్రీ పాంచరాత్ర శాస్త్ర దివ్యాగమాంతర్గత శ్రీ విష్ణు పాద్మ కపింజల సంహితలయందుచెప్పిన విధమున, పాంచాహ్నిక దివ్యకల్యాణాంగభూత సాలంకృత కన్యాదానము చేయపూను కొంటిమి.

41. మంచి గంధము, పూలు, వస్త్రములు, ఆభరణాదులతో కన్యా వరుని అలంకరింపవలెను.

42. హిరణ్య గర్భ అను మంత్రముతో కుశ పుష్ప అక్షతలతో కూడిన హిరణ్య ఫలోదకమును, గృహీత్వా- వరుడు తీసుకొనవలెను. *(అనగా - కన్య దోసిలియందు కుశ పుష్ప అక్షతలు బంగారము ఫలము ఉంచి ఉదక ధారా పురస్సరముగా దానము చేయవలెను.)*

(ఈ హిరణ్య గర్భ మంత్రము స్మార్త పాఠాలలో కనిపించుటలేదు. ఆగమంలో, శ్రీ కూర్మం ప్రతి వంటి పూర్వపాఠాలలో వివాహ ప్రధాన హోమంలో చెప్పబడింది. కన్యాదానము వద్ద ఈ మంత్ర వినియోగము లేదు. కాని రేజేటివారి పూర్వ పాఠములలో కన్యాదానము వద్ద, ప్రధానహోమమున, రెండుచోట్ల ఈ మంత్ర వినియోగము గలదు.)

హిరణ్య గర్భ మంత్రము ఋగ్వేదమున చాల ప్రధానమైన మంత్రము. "ప్రపంచంలో మొట్టమొదటి గ్రంథం ఋగ్వేదం. అటువంటి ఋగ్వేదంలో మొదటిసారిగా భగవంతుడొక్కడే అని ప్రతిపాదించిన మంత్రం ఇది ..." అంటూ మేక్స్ ముల్లర్ పండితుడు ఈ మంత్రాన్ని ఎంతగానో ప్రశంసిస్తాడు. అటువంటి మంత్రాన్ని ఉపయోగించి వరునకూ నారాయణునకు అభేదం చూపి కన్యాదానం చేయడం మన ఆచారసంపదాయాల గొప్పదనం. బహుశా - దీనిని గ్రహించేయే కావచ్చు, రేజేటివారు ప్రధానహోమంలో ఉన్న ఈ మంత్రాన్ని కన్యాదాన సమయంలో కూడా చేర్చి తమ గ్రంధాలలో వ్రాసుకొని ఉంటారు.

అగ్రే = సృష్టికి పూర్వము, హిరణ్యగర్భః = హిరణ్యగర్భుడు, సమవర్తత=(అపరమాత్మ వల్లనుండియే) పుట్టెను, జాతః = అటులపుట్టిన హిరణ్యగర్భుడు, భూతస్య=భూతములకు, పతి= ప్రభువు, ఏకః = ఒక్కడే, ఆసీత్ = అయిఉండెను, సః = ఆపరమాత్మ, పృథివీం = భూమిని, ఉత= మరియు, ఇమాం ద్యాం = ఈ అంతరిక్షమును, దాధార = ధరించియుండెను, కస్మై దేవాయ = (అటువంటి) ప్రజాపతి కొరకు (కః = ప్రజాపతి, కస్మై = ప్రజాపతికొరకు), హవిషా = హవిస్సును, విధేమ = ఇచ్చెదను, ( ఋ. 8-7, 3-1)

బ్రహ్మణః ప్రథమ పరార్ధా నంతరం ద్వితీయపరార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భారతవర్షే, భరతఖండే, మేరో ర్దక్షిణ దిగ్భాగే, ఆగ్నేయకోణే, ఆంధ్రదేశే, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన శ్రీ ......... నామ సం॥రే॥ .......అయనే, .........ఋతౌ, .......మాసే, ..........పక్షే, .........శుభతిథౌ, వాసరః ......వాసరే,శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణ ఏవం గుణవిశేషణవిశిష్టాయాం శుభతిథౌ .... గోత్రస్య శ్రీ ........... భగవంతముద్దిశ్య ......... భగవత్ ప్రీత్యర్థం --

36. మమజన్మప్రభృతి బాల్య యౌవన కౌమార వార్ధకేషు, జ్ఞానాజ్ఞానత మనో వా క్కాయ కర్మ కృత, ఆవృత్త, అనావృత్త, ప్రకీర్ణ కాద్యంత సమస్త దురిత క్షయాయ, గంగావాలుకాభిః సప్తఋషి మండల పర్యన్తం కృతరాశే ర్వర్ష సహస్రావసానే, ఏకైక వాలుకా పకర్షణ క్రమేణ, సర్వరా శ్యపకర్షణ సమ్మిత కాలే, మయాసహ దశపూర్వేషాం దశాపరేషాం మద్వంశ్యానాం సర్వేషాం పితౄణాం శాశ్వత విష్ణులోకే నివాస సిద్ధ్యర్థం,

37.యవై శ్చంద్రమండల పర్యంతం కృతరాశే ర్వర్ష సహస్రావసానే, ఏకైక యవా పకర్షణ క్రమేణ, సర్వరా శ్యపకర్షణ సమ్మితకాలే, మయాసహ దశపూర్వేషాం దశాపరేషాం మద్వంశ్యానాం సర్వేషాం పితౄణాం శాశ్వత విష్ణులోకే నివాస సిద్ధ్యర్థం,

39.త్రిగతోగ్నిష్టోమాది క్రతు ఫలసిద్ధ్యర్థం -

40. అస్య శ్రీపాంచరాత్ర ద్వాదశలక్ష ప్రమాణశాస్త్ర దివ్యాగమ శ్రీ విష్ణు పాద్మ కపింజల సంహితోక్త ప్రకారేణ పాంచహ్నిక ధ్వజారోహణ దివ్యకల్యాణ మహోత్సవాంగత్వేన సాలంకృత కన్యాదానం కరిష్యే -

41.కన్యావరయోః సుగంధ కుసుమ వస్త్రాభరణాదిభి రలం కృత్య -.....

42.హిరణ్యగర్భ ఇతిమంత్రేణ కుశపుష్పాక్షతోదకైః హిరణ్యఫలోదకం గృహీ త్వా

43. ఆపైన కన్యాదాత మంత్రమును చెప్పుచున్నాడు. (కన్యాదాత మంత్రమును పఠిస్తూ ఉదకధారాపూర్వకముగా వరుని హస్తమందు కన్యాదానమొనర్చును.)

ఓ నారాయణా స్వరూపుడా ! కనకవర్ణముతో, కనకాభరణములతో ఉన్న కన్యను తుభ్యం= నీకొరకు, దాస్యామి = దానము చేయుచున్నాను. దత్తా = అటుల దానము చేయబడిన ఈమె, దేవం సమాశ్రయేత్ = దేవుడవగు నిన్ను ఆశ్రయించియుండుగాక.

ఓ కన్యా ! నాముందు దేవిపార్శ్వమున, అన్నివైపుల ఉందుము. నిన్ను దానము చేయుట మోక్షసాధనము. భూమి, (విశ్వంభరా = భూమి, విశ్వంభరః = విష్ణువు - అమరం) పంచభూతములు, సర్వదేవతలు దీనికి సాక్షులు, తస్మాత్ = అందుచేత, విష్ణులోకప్రాప్తి కొరకు ఈమెను నేను ప్రదాస్యామి = ఇచ్చుచున్నాను. లక్ష్మి అను పేరుగల ఈ కన్యను, యథాశక్తి అలంకరించిన దానిని, దాస్యామి = ఇచ్చుచున్నాను, దత్తా = అటుల దానము చేయబడిన ఈమె, దేవం సమాశ్రయేత్ = నారాయణ స్వరూపుడవగు నిన్ను ఆశ్రయించి యుండుగాక ! దానమీయబడిన ఈ కన్య నారాయణస్వరూపుడవగు నిన్ను ఆశ్రయించి యుండుగాక అను అర్థమునిచ్చు ఈ భారద్వాజ సంహితా ప్రయోగము చాల అర్థవంతముగా కనిపిస్తున్నది. 'దత్తా దేవీం సమాంశ్రయ' అను అలవాటులో నున్న పాఠానికి ఏదోలా అర్థం కిట్టించవలసి వస్తుంది.

44. క్రియాకైరవచంద్రికయందు ప్రాణిగ్రహణ విధిః ఉచ్యతే అని వివరిస్తూ వరహగురుడు - ఉద్వాహ కౌతుకబంధము, సంకల్పము చెప్పి, "జగత్కారణ భూతాయదేవాయ మదీయ గోత్రజాం కన్యాం ప్రజాసహత్వ కర్మభ్యః ప్రతిపాదయామి ...ఇతి దేవీం సహిరణ్యోదకం దేవాయ దద్యాత్ " - అంటూ హోమాదులు, ఘృతారోపణం మాత్రం విధించి యున్నాడు. ఆపైన " **లౌకికేన మార్గేణ అన్యత్ సర్వమపి విధాయ**" అనిచెప్పి, "**జామదగ్న్యాది దేవీనాం ఉద్వాహం స్మార్త వర్త్మనా కుర్యాత్**" అని చెప్పాడు. (చూ. పుట. 84,85 క్రి.కై.చం.). క్రి.కై.చం రాకా వ్యాఖ్యాకారులు కూడ జామదగ్న్యాది అనగా "**శ్రీరామ, బలరామ, కృష్ణాదయః తేషాం దేవ్యాః సీతా, రేవతీ, రుక్మిణ్యః తాసాముద్వాహం స్మృత్యుక్త వర్త్మనా- స్వసూత్రోక్త మార్గేణ లౌకిక పథా కార్య ఇతి భావః** " అని వివరించారు. (పుట. 274) అందుకే ఈ భగవత్కల్యాణ ప్రయోగమున స్మార్తంలో చెప్పబడినవి చాలవరకూ భగవద్విషయంలో కూడ అనుసరిస్తూ వస్తున్నారు. ఈ 44 కారిక చాల ముఖ్యమైనది. యాజమానునిచే చేయించ తగినది. గనుక అదనముగా చేర్చదమైనది. ఇది క్రి.కై.చం. వంటి భట్టీయమునందలిదని త్రోసివేయుట సాధ్యముగాదు - *" దద్యాచ్చ దేవీం దేవాయ వారిపూర్వం యథావిధి । యజమానః సువర్ణోర్వీం గవాది సహితాం తదా । స్వగోత్రనామ్నా కథితా మిమాం శ్రియ మనుత్తమాం " అను పాద్మ వచనానుసారి ఇది. - (పాద్మ, క్రియా 30. 8,9)*

45 కన్యాదానము సద్గుణవంతమగుటకు సాలగ్రామ హిరణ్య గో భూ దానములు చేయవలెను.

46 (ఓ ద్రవ్యమా) త్వా = నిన్ను, సవితః దేవస్య ప్రసవే = ప్రేరకుడైన దేవునియొక్క ప్రేరణవలన, అశ్వినోః బాహుభ్యాం = అశ్వినీదేవతలు బాహువుల చేతను, పూష్ణో హస్తాభ్యాం = సూర్యదేవత చేతులచేతను, ప్రతి గృహ్ణాంతు = తీసికొన వలసినది, అని దాత పలికి కన్యాదానము చేసినట్లు యాజుష స్మార్త పాఠం (త్రై.సం 1-1-4) ఈ కన్యాదానమువలన సర్వాత్మకుడగు భగవంతుడు ప్రీతినందుగాక

హిరణ్య గర్భ స్సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్ ।
స దాధార పృథివీం ద్యా ముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ॥

43. తతః కన్యాదాన మంత్రః ॥

కన్యాంకనక సంపన్నాం కనకాభరణైర్యుతాం ।
దాస్యామి విష్ణవేతుభ్యం దత్తా దేవం సమాశ్రయేత్ ॥
కన్యే మమాగ్రతో భూయాః కన్యే మే దేవిపార్శ్వయోః
కన్యేమే సర్వతో భూయాః త్వద్దానం మోక్షసాధనం ॥
విశ్వంభరా పంచభూతాః సాక్షిణ్య స్సర్వదేవతాః
తస్మా దస్యాః ప్రదానేన విష్ణులోక జిగీషియా
లక్ష్మీ నామ్నీ మిమాం కన్యాం యథాశక్తి విభూషితాం
దాస్యామి విష్ణవే తుభ్యం దత్తా దేవం సమాశ్రయేత్ ॥

44. *"జగత్కారణ భూతాయ దేవాయ, మదీయ గోత్రజాం కన్యాం ప్రజా సహత్వ కర్మభ్యః ప్రతిపాదయామి - ఇతి దేవీం సర్వాభరణ సువర్ణ గో భూ సహితాం సహిరణ్యోదకం దేవాయ దద్యాత్"*

45. కన్యాదాన సాద్గుణ్యార్థం సాలగ్రామదాన హిరణ్యదాన గోదాన భూదానాని కరిష్యే-

సాలగ్రామ శిలాచక్రే భువనాని చతుర్దశ
యస్మాత్ తస్మాత్ ఛ్ఛివంమేస్యా దతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

46. దేవస్యత్వా సవితుః ప్రసవే అశ్వినోర్బాహుభ్యామ్
పూష్ణో హస్తా భ్యాం ప్రతిగృహ్ణామి ॥ (ఇది ప్రతిగ్రహణమంత్రం)

అనేన కన్యాదానేన భగవాన్ సర్వాత్మకః శ్రీమన్నారాయణః ప్రీయతామ్॥

17 ఆపైన సుముహూర్తకాలమున మంగళాష్టకములను పఠించవలెను. - చూర్ణికను జపించవలెను.

1. వ్యాస, పరాశర, శుక, ప్రహ్లాద, గరుడ, శివ, ధ్రువ, పుండరీక, హనుమాన్, భీష్మ, అంబరీష, శేష,అక్రూర, వశిష్ట, నారద, బ్రహ్మ, విభీషణాదులగు భక్తులు మీకు శుభము చేకూర్తురు గాక.

2. శ్రీకృష్ణుడు, దయాపరుడు, భువనాధీశుడు, పుణ్యాత్మకుడు, శ్రీనాధుడు, లక్ష్మీదేవి సోదరుడగు చంద్రుని మించిన ముఖముగల ప్రభువు, పంకజలోచనుడు, అంటూ అసంఖ్యాకముగా ఉన్న అతని అనంతనామములు సర్వమంగళకరమలగుచూ మీకు ఎల్లవేళలా శుభము చేకూర్చుగాక.

3. శ్రీదేవి, సరస్వతి, గిరిజ, అహల్య, మండోదరి, పాంచాలి, లోపాముద్ర, సీతా, శచి, రోహిణి, తారా, భూదేవి, అరుంధతి, కౌసల్యా మొదలగు పుణ్యస్త్రీలు మీకు ఎల్లప్పుడు శుభములను చేకూర్చుగాక.

4. గంగ, భోగవతి, కాళింది, భాగీరధి, నర్మద, గాయత్రి, భవనాశని, గుణవతి, కన్యానది, గోమతి, కాళీ, వేగవతి, సువర్ణముఖి, గోదావరి, గండకి, కావేరీ, కుముద్వతి మొదలగు నదులు (సరితః) మీకు శుభము చేకూర్చుగాక.

5. పద్మ, భాగవత, భవిష్యత్, అగ్ని, వరాహ, గరుడ, బ్రహ్మ, విష్ణు, వామన, నారద, బ్రహ్మాండ, శివ, కూర్మ, మత్స్య, మార్కండేయాది పురాణములన్నియూ మీకు శుభమును కూర్చుగాక.

6. కాంభోజ, కళింగ, వంగ, మగధ, కాశ్మీర, భోజ, నేపాళ, నిషధ, కొంకణ, కురు, సౌవీర, సౌరాష్ట్ర, చోళ, అంగ, కరనాట, లాట, యవన, ప్రాగ్జ్యోతిష (నేపాల్), కోసల, గాంధారాది సమస్త దేశములు మీకు శుభము చేకూర్చుగాక.

7. ఏకాదశ స్థానముననున్న సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, రాహువు, కేతువు అను నవగ్రహములు, శుభకరములగు నక్షత్ర లగ్న యోగ తిథులునూ మీకు ఎల్లప్పుడు మంగళమొనర్చుగాక.

47. తతః సుముహూర్త కాలే మంగళాష్టకాని పఠిత్వా చూర్ణికాం జపేత్।

శ్రీ మద్వ్యాస పరాశరార్జున శుకాః ప్రహ్లాద నాగాంతకాః
శ్రీకంఠ ధ్రువ పుండరీక హనుమద్ భీష్మాంబరీషాదయః
శేషాఽ క్రూర వశిష్ఠ నారద పయోజాతాసనా భాగ్యదాః
ఏ తే భాగవతా విభీషణముఖాః కుర్వంతు వాం మంగళమ్ ॥ .1

శ్రీకృష్ణశ్చదయా పరశ్చ భువనాధీశశ్చ పుణ్యాత్మకః
శ్రీ నాథశ్చ ముఖారవింద విజిత శ్రీసోదరశ్చ ప్రభో
శ్రీ మత్పకంజలోచనస్య బహుధా ఽ నంతాని నామానివ
నానామంగళకారణాని సతతం కుర్వంతు వాం మంగళమ్ ॥ 2.

శ్రీదేవీచ సరస్వతీ చ గిరిజా ఽ హల్యాచ మండోదరీ
పాంచాలీ ఘటసంభవస్య రమణీ సీతా శచీ రోహిణీ
తారా సాగరమేఖలా గుణవతీ దేవస్ను షాఽ రుంధతీ
కౌసల్యాది సమస్తపుణ్యవనితాః కుర్వంతు వాం మంగళమ్ ॥ 3.

గంగాభోగవతీ కళిందతనయా భాగీరథీ నర్మదా
గాయత్రీ భవనాశనీ గుణవతీ కన్యానదీ గోమతీ
కాళీ వేగవతీ సువర్ణవదనా గోదావరీ గండకీ
కావేరీచ కుముద్వతీచ సరితః కుర్వంతు వాం మంగళమ్ ॥ 4

పద్మం భాగవతం భవిష్య దనలం వారాహకం గారుడమ్
బ్రాహ్మం వైష్ణవ వామనేచ మహితే శ్రీనారదీయంశుభమ్
బ్రహ్మాండం శివ కూర్మకం చ విలస న్మైత త్పురాణానివా
మార్కండేయముఖానిమాత్స్యమనిశంకుర్వంతువాం మంగళమ్॥ 5

కాంభోజశ్చ కళింగ వంగ మగధా కాశ్మీర భోజౌ మురుః
నేపాళో నిషధశ్చ టెంకణ కురూ సౌవీర సౌరాష్ట్రకాః
చోళాంగౌ కరనాట లాట యవనాః ప్రాగ్జ్యోతిషం కోసలః
గాన్ధారాది సమస్తదేశవనికాః కుర్వంతు వాం మంగళమ్ ॥ 6.

8. దేవేంద్రాది సమస్త దేవగణములు, సద్విప్రులయొక్క వారి శిష్యులయొక్క ఆశీస్సులు, అన్నివిధములా ఆద్యములగు ఋగాదినిగమములు మన్వాది స్మృతులు, మందారము మొదలగు కల్పతరువులు, కోర్కెలను తీర్చు చింతామణి కామధేనువులు, షట్ఛాస్త్రములు, మొదలగునవి మీకు శుభమును చేకూర్చుగాక.

48. స్వస్తి అష్టాశీతి సహస్రాణాం ద్విజ గురు దైవత్యానాం చతుర్దశ భువనానాం ..... అంటూ యాజుష స్మార్త పాఠం కన్పిస్తోంది. 88 వేల ద్విజ గురు దేవతలకు శుభము అని దీనికి అర్థం. ఆగమ పాఠాలన్నీ "స్వస్త్యష్టాశీతి సహస్రాణాం చతుర్దశ భువనానాం అనేక కోటి బ్రహ్మాండానాం," అంటూ దేవతలను చెప్పుకువచ్చాయి. ఈచూర్ణిక భారద్వాజ సంహితోక్త వివాహ ప్రయోగానికి దగ్గరగా నున్నది. కాబట్టి, " త్రిష్వాసితం గవీనం తద్గావోయత్రాశితాః పురా, గావః అశిత అస్మిన్నితి ఆశితమ్ – ఆవులు మేపబడిన స్థలం లేదా ఆవులునిలచినచోటు – అమరం " – అనుదాని ప్రకారం ప్రస్తుత పాఠానికి ఆశితి సహస్రం అని చెప్పవలసి ఉంటుంది, లేదా ద్విజగురు దైవత్యానాం చేర్చవలసి ఉంటుంది.

49. అఘోరచక్షు ధ్రువంతేరాజా అనుమంత్రములతో బాగుగా నలగగొట్టి, బెల్లముతో గలిపి, ముద్దజేసిన జీలకర్ర ముద్దను వధూవరులు ఒకరి శిరస్సుపై మరియొకరు ఉంచుకొనవలెను. (జీరక ధారణము ఆచారసిద్ధము)

(వృషభోనభీమో అని శుక్ల యజుః కాణ్వ సంహిత. (పుట. 171), ...వృషభోనయిధ్మో అని యాజుష స్మార్త మంత్ర పాఠం (పుట. 60.) ..... శివా పశుభ్యః ... వీరసూః ....... అని ఋగ్వేద పాఠం ... శివాపతిభ్యః ...... జీవసూః ...... అని యాజుష స్మార్త పాఠం. పుట. 182)

(ఓ వధూ నీవు) అఘోరచక్షుః = సౌమ్యమైన (భయము కలిగింపని) కనులు కల దానవుగా (స్వపతి విషయమున) ఏధి = అగుము, అపతిఘ్ని = పతిని పోగొట్టని దానవుగను, పతిభ్యః = భర్తకును బావలకును మరదులకును- సుమనాః = మంచి మనస్సుతో కూడిన దానవుగను, సువర్చాః = మంచికాంతిగల దానవు గను, శివా = శుభము కలిగించు దానవుగను, జీవసూః = సజీవులగు సంతానము గలదానవుగను, దేవకామా = దేవతల నారాధించుదానవుగను, స్యోనా = సుఖించుదావనవుగను, నః = మా యొక్క ద్విపదే = మనుష్యులకు, చతుష్పదే = పశువులకు, శం = శుభమునిచ్చు దానవుగా, భవ = ఉండుము. (కృష్ణ యజుర్వేద "పతిభ్యః" అను బహువచన ప్రయోగమునకు బావగార్లు, మరదులు అని హరదత్తాచార్యునివ్యాఖ్య. )

(ఆపస్తంబుడు చతుర్థ్యాం సమీక్ష్యేత ... అని వధూవరులు ఒకరినొకరు బాగుగా చూచుకొనడమే (సమీక్షణము) సుముహూర్తమని చెప్పియున్నాడు. దాని

ఆదిత్యశ్చ సుధాకరశ్చ ధరణీ పుత్రశ్చ చంద్రాత్మజః
దేవార్యశ్చ బృహస్పతి ర్భృ గుసుతో ఛాయాసతీ నందనః
రాహుఃకేతు రితిగ్రహా నవశుభా ఏకాదశస్థా స్సదా ।
నక్షత్రాణిచ లగ్నయోగతిధయః కుర్వంతు వాం మంగళమ్ ॥ 7.

దేవేంద్రాది సమస్తదేవత గణాః సద్విప్రశిష్యాశిషః
మన్వాది స్మృతయో ఋగాది నిగమా వాద్యాశ్చ నానావిధాః
మందారాది సమస్త కల్పతరవ శ్చింతామణిః సర్వశః
షట్ఛాస్త్రాణి చ కామధేనురనిశం కుర్వంతు వాం మంగళమ్ ॥ 8.

## 48.చూర్ణిక

స్వస్త్యష్టాశీతి సహస్రాణాం (ద్విజగురు దైవత్యానాం) చతుర్దశ భువనానాం అనేక కోటి బ్రహ్మాండానాం, ఇంద్రాగ్ని యమ నిర్ఋతి వరుణ వాయు కుబేర ఈశానాద్యష్టలోక పాలకానాం, అనవరత జటాకోటి మణిమయాను మండిత జాజ్వల్యమాన నారాయణ పాదారవింద దర్శన సందోహానాం, త్రయ త్రింశత్కోటి దేవతానాం, పరాశరాత్రేయ కాస్యప మరీచి వామదేవ నారద జాబాలి వశిష్టగౌత మాపస్తంబ బోధాయన కాశ్యప మరీచి వామదేవ నారద జాబాలి వశిష్ట గౌతమ ఆపస్తంబ బోధాయన హిరణ్యకేశి జైమి న్యాంగిరస కుంభోద్భవ కపిల శౌనక వరతంతు యాజ్ఞవల్క్య భృగ్వాది మునీనాం, గర్భమందిర, శుకనాసికా, స్థూపీ, మధ్యరంగ, మహదాస్థాన, సాధోంతరాళ, గోపుర, ప్రాకార, పచనాలయ, వాహనమండప, నృత్యమండప, కేతుస్తంభ, యాగశాలా ద్యనేక మండప రత్నవేదికాది మహామండపానాం। వాజపే యాతిరాత్ర, ...., అశ్వమేధ, నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవ, మహామహోత్సవానాం, ఋ గ్యజు స్సామా ధర్వణ నాలాయిర ప్రబంధ తర్కవేదాంత మీమాంసా శబ్ద శాస్త్రాణాం, భారత రామాయణ భాగవతా ద్యష్టాదశపు రాణాదీనాం, కనక రత్న మౌక్తిక దుకూల విచిత్రాంబర వలయ గంధపుష్పాక్షత కుంకుమ గోరోచన కర్పూర తాంబూలాదీనాం అనేక శోభన ద్రవ్యాణాం; స్వస్తి పుణ్యాహవాచన మంకురార్పణ వాస్తుహోమ

కనుగుణముగా మంగళప్రదమగు జీరక ధారణము ఆచార ప్రాప్తమైనది. జీరకనుంచుటకై ఇరువురూ తమతమ తలలనెత్తి ఒకరిముఖ మొకరు తప్పనిసరిగా చూచుకొనుట (వారుబాలురైనను) జరుగనుగాన ఈ ఆచార మేర్పడియుండవచ్చును.)

1. సగుడమిశ్రిత జీరక = గుడముతో కలిపిన (నలగగొట్టి కలిపిన) జీలకర్ర
2. సగుడ జీరక = బెల్లముతో నున్న జీలకర్ర
3. జీరకగుడం = జీలకర్రతో నున్న బెల్లము అని అర్థము.

– గాన అర్థవత్ మొదటి రెండు పదప్రయోగములకు క్రమప్రాధాన్యత అనిచెప్ప వచ్చును.

50. ఆవరణముగానున్న వస్త్రమును (అపాస్య) తొలగించవలెను. లక్ష్మీదేవిని చూడవలెను.

ఆరణవస్త్ర విషయంలో అన్వయం కుదరక రకరకాల వివరణలు ఇస్తూవస్తున్నారు.

- ఆవరణ వస్త్రం అంటే - మనం తెరపడుతున్నాము గనుక, తెర అని అర్థం చెపుతున్నాము (ఆవరణ శబ్దానికి మధ్య గోడవలె ఉండే తెర (యవనిక) అనే అర్థం ఉన్నదా ?
- ఆగమంలో కాని, యాజుష స్మార్తపాఠంలోకాని "ఆవరణ వస్త్రం అపాస్య" అనగా తీయడమేతప్ప పట్టవలసినదిగా యెక్కడా చెప్పబడలేదు. దీనికి కారణం ఆలోచించవలసి ఉన్నది.
- ఇలా చెప్పలేదని, ఆవరణమును తెర అనుకొని, తియ్యడం ఉన్నది కనుక పట్టడం ఉండాలని, దానిని ఎక్కడో ఒక దగ్గిర తగిలించాలి కనుక, పాణిగ్రహణం ప్రారంభంలో పద్మప్రియే విష్ణుపత్నీం జితంతయితి ప్రతిసర మాబధ్వా అను దానిలో ఉన్న ప్రతిసరమును ప్రతిసీరముగా మార్చుకొని, అక్కడ మూడుమంత్రాలతో ముగ్గురికీ ప్రతిసరం కట్టవలసి ఉండగా నిరంకుశంగా ప్రతిసీరం (ప్రతిసీరమనగా తెర) పట్టిస్తున్నారట.
- మరొక ప్రక్క ఆధునికులు కొందరు కన్యాదాన సంకల్ప సమయమున వధూవరయో రంతరే నూతన కౌశేయపటమాస్తీర్య అనుదానిని చేర్చారు.
- ఈ అపార్థాలకు పరిష్కారమార్గం విజ్ఞులు ఆలోచించాలి - దానికి ఈ క్రింది సూచన పరిశీలనీయము

ఆవరణ వస్త్రం అంటే మధ్యను అడ్డుగా పట్టే తెరకాదు - ఆవరించి ఉన్న వస్త్రం. ఇది దేనినావరించి యున్నది? దీనికి సమాధానం ఉత్తరాది సంప్రదాయంలో లభిస్తుంది. వధువుకు ముఖంచుట్టూ, ముఖం కనిపించకుండా మేలిముసుగు ఉంటుంది. (వధూవరుల ముఖాలు కనిపించకుడా ముఖంముందు పూలదండలు వేలాడునట్లు కట్టడం కూడా ఉన్నది) సమీక్షణానికై ఈ ఆవరణవస్త్రాన్ని వరుడు తొలగించి వధువు ముఖమును చూస్తాడు. గాన ఆవరణ వస్త్ర మసాప్య అనేది సరిపోతుంది. ఆవరణ వస్త్రం యెప్పుడూ ఉండేదే గనుక వేరేగా కట్టడం/పట్టడం చెప్పనక్కరలేదు. ఇక్కడ సమీక్షణం పరస్పర ముఖావలోకనమైనా, వరుడు వధువు యొక్క ముఖం చూడడానికే ప్రాధాన్యత. అందుకే స్మార్తంలో అఘోరచక్షు మంత్రం వరుడు చదువుతూ వధువు ముఖాన్ని చూస్తాడు. ఆగమంలో కూడా ఆవరణ వస్త్ర

భేరీతాడన యాగోపకరణ కుంభస్థాపన దేవతాహ్వాన దేవతామహోత్సవ అష్టోత్తర శతసంహితాసార, లగ్నశ్చ తిథివార నక్షత్ర లగ్న హోరా ద్రేక్కాణ నవాంశ ద్వాదశాంశ త్రింశాంశ త్రింశదంశకానాం, నిరంతర మనుకూలానాం, సర్వే గ్రహా స్సనక్షత్రాః శుభ ఏకాదశ స్థాన ఫలదా స్సుముహూర్తా స్సుప్రసన్నా వరదా భవన్తు -

**49. అఘోర చక్షు, ధ్రువంతేరాజా ఇతి సగుడమిశ్రిత జీరకాన్ పరస్పరం శిరసి నిక్షిప్య -**

అఘోర చక్షు రపతి ఘ్న్యేధి శివా పతిభ్య స్సుమనా స్సువర్చాః॥
జీవసూ ర్దేవకామా స్యోనా శన్నోభవ ద్విపదే శం చతుష్పదే॥
ధ్రువం తేరాజా వరుణో ధ్రువం దేవో బృహస్పతిః।
ధ్రువం త ఇంద్ర శ్చాగ్నిశ్చ రాష్ట్రం ధారయతాం ధ్రువమ్॥

**50. ఆవరణవస్త్ర మపాస్య - శ్రీలక్ష్మీం దృష్ట్వా। ఆశుశ్శుశాన ఇత్యాసనం -**

ఆశుశ్శుశానో వృషభోన ఇధ్మో ఘనాఘనః క్షోభణ శ్చర్షణీనామ్।
సంక్రందనో నిమిష ఏకవీరః శతగ్ం సేనా అజయత్సాక మింద్రః॥

**51.శిరః ప్రదేశే, హిరణ్యం, పాత్రే నిధాయ। హిరణ్యవర్ణా శ్శుచయ ఇతి స్నాపయిత్వా।**

---

మపాస్య - శ్రీలక్ష్మీం దృష్ట్వాఅని ఉన్నది. గాన ఆవరణ వస్త్రం అనగా మేలిముసుగు అనుకొంటే ముందుగా ఎక్కడ పట్టాలి అన్న సమస్య ఉండదు.

ఆశుశ్శుశాన అను మంత్రముతో ఆసనము సమర్పించవలెను. వరుడు ఆసనముపై పశ్చిమముఖుడుగా కూర్చొనవలెను. (తై. సం. 5-4-651 )

51.(శిరః ప్రదేశే హిరణ్యం పాత్రే నిధాయ. అనే పాఠాన్ని, శిరోపదేశే హిరణ్య పాత్రే పవిత్ర ద్వయం నిధాయఅనే భ.సం.వి.ప్ర. పాఠాన్ని గూడ గమనించవలసి ఉన్నది. 'ఆర్యమ్ణఇతి యజుషా తస్యాశిరసి కుశేణ్వం నిధాయ । ఇణ్వం నామ కుంభదారణార్థం తృణపుంజః । శేనస ఇత్యుచా ఇణ్వే దక్షిణ యుగ ఛ్ఛిద్రం ప్రతిష్టాప్య । శంతే హిరణ్య మిత్యు— ఛిద్రే హిరణ్య నిధానం । యాః పూర్వ మానీతా ఆపః తాభిః సువర్ణసహితాభిః హిరణ్య వర్ణాఇతి పంచ ఋచ ఉక్త్వా తై స్నాపయతే వధూం।" అని ఆపస్తంబగృహ్యసూత్రం.

ఈ విషయాలన్నిటికీ ప్రతీకగా కూర్చకు బంగరు మంగళ సూత్రమును చుట్టి దానిమీదుగా జలమును ప్రోక్షించడం పూర్వాచార్య ప్రయోగం అని గమనించవలసి యున్నది.

1. పసిడికాంతులను వెదజల్లుచూ, పరిశుద్ధములై, పవిత్రమొనరించు, ఆపః = ఉదకములు, అవద్యం = పాపమును, హిత్వా = పోగొట్టి, ప్రచక్రముః = ప్రవహించు చున్నవి, యాసు = వేనియందు, పవిత్రా ః వితతా ః = పవిత్రములై వ్యాపించినవగు, శతం = (నదీ) శతమున్నదో, తాభిః = ఆ ఉదకములచేత, (నిన్ను), పునాతు = పవిత్రురాలను చేయుగాక.

2. యాసు = వేనియందు, కశ్యపః జాతః = కశ్యపుడు పుట్టెనో, యాసు అగ్నిః = వేనియందు బడబాగ్ని పుట్టెను, యా = ఏవి, అగ్నిం = బడబాగ్నిని, గర్భం దధిరే = గర్భమున ధరించినవో, తాః = ఆ హిరణ్యవర్ణాఃశుచయః పావకా ఆపః, తేనీకు, శం శ్యోనా = శుభము సౌఖ్యము, భవంతు = అగుగాక.

3. యాసాం = ఏ ఉదకములకు, రాజా వరుణః = రాజగు వరుణుడు, జనానాం = జనుల యొక్క సత్యా నృతే అవపశ్యన్ = సత్యాసత్యములను చూచుచూ, మధ్యే యాతి = మధ్య సంచరించుచున్నాడో, యా అగ్నిం గర్భందధిరే = ఏవి అగ్నిని గర్భమందు ధరించినవో, తాః ఆపః = ఆ ఉదకములు, శం (దీనికి వేదమున శగ్ం అని ఉచ్చారణ) = శుభమును, స్యోనా = సౌఖ్యమును, భవంతు = అగుగాక.

4. యాసాం = వేనియొక్క, భక్ష్యమ్ = తినుటకు, దివి = ఆకాశమున, దేవాః కృణ్వంతి = దేవతలు చేయుచున్నారో, యాః అంతరిక్షే బహుధా నివిష్టాః = ఏవి ఆకాశమున బహువిధముగా ఏర్పడియున్నవో, తాః= ఆ ఉదకములు, (నీకు), శగ్ం = శుభమును, స్యోనా = సౌఖ్యమును, భవంతు = అగుగాక.

52. యవం వస్త్రాణి మంత్రముతో పట్టువస్త్రము నివ్వవలెను. (క్షౌమం దుకూలంస్యాత్ – అమరం) దాతల పేర్లు తెలియుటకై తెలుగున చదివించుట జరుగు చున్నది.

మిత్రా వరుణా = మిత్రా వరుణులారా, యువం = మీరు, పీవసా = అఖండమైన, వస్త్రాని = వస్త్రములను, వసాథే = ధరించుచున్నారు, యువోః = మీ యొక్క, సర్గాః = సృష్టులు, అచ్ఛిద్రాః = విచ్ఛేదములేక, మంతవః = మననయోగ్యములైనవి, (అట్టి మీరు), విశ్వా = సమస్తమైన, అనృతాని= అసత్యములను, అవాతిరతం = నశింపజేయుదురుగాక, ఋతేన = ఫలములతో, (మమ్ములను), సచేథే = చేర్చుదురుగాక. (ఋ. 1-152-1)

53. మాంగళ్య తంతునా అను మంత్రముతో మంగళ సూత్ర ధారణము. మాంగళ్య సూత్రాధిష్ఠాన దేవతను షోడశోపచారములచే అర్చించవలెను. లోకరక్షణ హేతువుగా ఈ మంగళసూత్రమును నీ కంఠమున కట్టుచున్నాను. నీవు నూరేండ్లు జీవించుము.

1. హిరణ్య వర్ణాః శుచయః పావకాః ప్రచక్రముర్హిత్వా వద్యమాపః
శతం పవిత్రా వితతా హ్యాసు తాభిష్ట్వా దేవస్సవితా పునాతు ॥
2. హిరణ్యవర్ణాః శుచయః పావకాః యాసుజాతః కశ్యపోయా స్వగ్నిః
యా అగ్నింగర్భం దధిరే సువర్ణా స్తాస్త ఆపశ్శగ్ంస్యోనాభవంతు ॥
3. యాసాం దేవా దివి కృణ్వంతి భక్షంయా అంతరిక్షే బహుధా నివిష్టాః
యా అగ్నింగర్భం దధిరే సువర్ణా స్తాస్త ఆపశ్శగ్ంస్యోనాభవంతు ॥
4. యాసాం రాజా వరుణోయాతి మధ్యే సత్యానృతే అవపశ్యం జనానామ్ ।
యా అగ్నింగర్భం దధిరే సువర్ణా స్తాస్త ఆపశ్శగ్ంస్యోనాభవంతు ॥
*5. శివే నత్వా చక్షుషా పశ్యం త్వాప శ్శివయా తన్వోపస్పృశంతు త్వచంతే ।*
*ఘృత శ్చుత శ్శుచయో యాః పావకా స్తాస్త ఆపశ్శగ్ంస్యోనా భవంతు ॥*

52. యువం వస్త్రాణీతి క్షౌమాంబరం ॥

*యువం వస్త్రాణి పీవసా వసాథే యువోరచ్ఛిద్రామంత వోహ సర్గాః ।*
*అవాతిరత మనృతాని విశ్వఋతేన మిత్రా వరుణా సచేథే ॥*

శ్రీమ దఖిలాండ కోటి బ్రహ్మాండ నాయుకులై శ్రీకామరాజుపేట గ్రామంలో వేంచేసియున్న శ్రీరుక్మిణీ సత్యభామా సమేత శ్రీవేణుగోపాలస్వామివారి పాణిగ్రహణ మహోత్సవ సమయమందు ధర్మకర్తలు మైలవరపు కామరాజు పంతులుగారు సమర్పించిన మధుపర్క ద్వయం ॥

53. మాంగళ్యం తంతునానేతి మంగళ సూత్ర ధారణమ్ ॥

మంగళ సూత్రాధిష్ఠాన దేవతాభ్యోనమః ధ్యానావాహనాది షోడశోపచార పూజాం సమర్పయామి -

*మాంగళ్యం తంతు నానేన లోకరక్షణ హేతునా*
*కంఠే బధ్నామి సుభగే త్వం జీవ శరదాం శతమ్ ।*

- మాంగళ్య ధారణముహూర్త స్సుముహూర్తోస్తు ।

54.(తతః అర్ద్రాక్షతారోపణం కుర్యాత్ .... కపిలా వాచనాది మంగళాచార ప్రాప్తం కుర్యాత్ - తస్యాయం ప్రయోగః - వరః పయసా వధ్వంజలా ఉపస్తీర్య । ద్విస్తండులానోప్య । (అర్ద్రాక్షత శుక్ల శాలి తండులాన్ ... అని కారికావృత్తి) ద్విరభిఘారయతి ..బ్రాహ్మణైస్సహ కపిలాగ్ం స్మారయంతు । దక్షిణాః పాతు । బహుదేయంచాస్తు ...... యాజుష పూర్వప్ర. పుట. 184) గాన అర్ద్రాక్షతారోపణము తడిపి ఆరబెట్టిన తెల్లబియ్యముతో చేయవలెను - ఇది పూర్వాచార్య ప్రయోగము కూడ. సుప్రసిద్ధ శ్లోకం “ జానక్యాః కమలామాలాంజలిపుటే .....” దీనినే సూచిస్తున్నది. కాని కారణం ఏమిటో తెలియదుగాని ఈ శ్లోక సంబంధియగు భద్రాచలమున పసుపు కలిపిన బియ్యంతో అక్షతారోపణం జరగడం విచారించదగినది.

శ్రీ భూదేవుల దోసిళ్ళను పాలతో ప్రోక్షించవలెను- నారాయణుని అంజలియం దుంచవలెను. పైన ఫలమునుంచవలెను. గంధద్వారా అను మంత్రముతో క్షీరధార గావించవలెను.

55.ఆపైన కపిల గోవును స్మరించవలెను. బ్రాహ్మణులు ఈ క్రింది ఆశీర్వాక్యములు పలుకవలెను. - బహుదేయంచాస్తు = ఇచ్చునది వృద్ధినందుగాక. శాంతిపుష్టితుష్టివృద్ధికలుగుగాక.అవిఘ్నమస్తు -

56. ఆపైన దంపతులిరువురి జన్మనక్షత్రమును, తద్రాశ్యాధిపతులను, తదధిష్ఠానదేవతలను, చంద్రుని స్మరించవలెను. వీరలు శాంతి కారకులగుదురు గాక.

57. ప్రజాపతి - బ్రహ్మ, స్త్రియాం = స్త్రీలయందు (భార్యయందు), యశః = యశమునకు కారణమగు వీర్యమునకు, ముష్కయోః = అండములయొక్క, సపం = సంబంధమును, అదధాత్ = స్థాపించెను.; కామస్య = కామము యొక్క తృప్తిం = తృప్తికి కారణమయినది, ఆనందం = సుఖమునకు కారణమయినది, అగ్నే = (ఓ) అగ్నీ, ఇహ = ఈ వివాహ కార్యమందు, మాం = నన్ను, తస్య = ఆ సుఖమును, భాజయ = పొందింపుము; మోదః = వార్త వినుటవలన కలుగు సుఖము, ప్రమోద= దర్శన సుఖము, ఆనందః = అనుభవమువలన కలుగు సుఖము, (యొక్క) సపః = సంబంధమును, ముష్కయోః = అండములయందు, నిహితః = ఉంచబడినది; దక్షిణానాం ప్రతిగ్రహే = ఈ దక్షిణలను స్వీకరించుట వలన, కామస్య స్మృత్వా ఇవ = కోరిన దానిని పొందినట్లుగనే, తృప్యాణి = తృప్తినందుదును.;

మనసః = మనస్సునకు సంబంధించిన, చిత్తం = విజ్ఞానమును, ఆకూతిం = సంకల్పమును, వాచః సత్యం = వాక్సంబంధమైన సత్యమును, ఆశీమహి = పొందుదుముగాక, పశూనాగ్ం రూపం = పశువుల యొక్క అనేక రూపములను (పశు సంపద), అన్నస్య = అన్నము యొక్క (ధాన్య సంపద), ఆశీమహి = పొందుదుముగాక, మయి = నన్ను, యశః = యశస్సు, శ్రీః = ధనము, శ్రయతాం = సేవించుగాక. ; అస్యస్త్రియై = ఈ స్త్రీయందు, అహం పుమాన్ = పురుషుడనగు నేను, యథా = యే విధముగా, అతృపగ్గ్ం = తృప్తినందుచున్నానో, యథా = ఏ విధముగా, ప్రియా స్త్రీ = ప్రియురాలగు స్త్రీ, ప్రియే పుగ్ం సి = ప్రియుడైన పురుషుని వలన, తృప్యతి = తృప్తినందుచున్నదో, యేవం = ఆ విధముగా, భగస్య తృప్యాణి = సౌభాగ్యము చేత

**అక్షతారోపణమ్ -**

54. కపిలాగ్ం స్మారయం త్వితి శ్రీభూమ్యో రంజలౌ పయసా స్పృశ్య। నారాయణాంజలౌ నిధాయ। ఫల ముపరివిన్యస్య। గంధద్వారా మితి క్షీరధారాం కృత్వా॥

*గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం*
*ఈశ్వరీగ్ం సర్వభూతానాం తా మిహోపహ్వయే శ్రియం॥*

55. కపిలాగ్ం స్మారయతు। బహుదేయం చాస్తు। పుణ్యం వర్ధతాగ్ం శాంతిరస్తు తుష్టిరస్తు పుష్టిరస్తు వృద్ధిరస్తు అవిఘ్నమస్తున ఆయుష్యమస్తు ఆరోగ్యమస్తు అచల మహదైశ్వర్య సమృద్ధిరస్తు।

56.దంపత్యోస్సగ్రహే, సనక్షత్రే, సహసోమేన, క్రియేతాగ్ం శాంతిరస్తు॥

57. ప్రజాపతిః స్త్రియాం యశః। ముష్కయో రదధా త్సపం। కామస్యతృప్తి మానందం। తస్యాగ్నే భాజయేహమా। మోదః ప్రమోద ఆనందః। ముష్కయోర్నిహితః స్సపః। సృత్వేవ కామస్య తృప్యాణి। దక్షిణానాం ప్రతిగ్రహే। మన సః చిత్తమాకూతిం। వాచస్సత్యమశీమహి। పశూనాగ్ం రూపమన్నస్య యశ శ్శ్రీశ్శ్రయతాం మయి। యధాహమస్యా అతృపగ్స్త్రియై పుమాన్। యధా శ్రీ స్సృప్యతి పుగ్ంసి ప్రియే ప్రియా। ఏవం భగస్య తృప్యాణి యజ్ఞస్య కామ్యప్రియః దదామీ త్యగ్నిర్వదతి। తథేతి వాయురాహ తత్ హంతేతి సత్యం చంద్రమాః। ఆదిత్యః సత్యమోమితి। ఆపస్తత్సత్య మాభరన్। యశో యజ్ఞస్య దక్షిణా॥

తృప్తుడనౌదును.; యజ్ఞస్య కామ్యః ప్రియః = (నేను) యజ్ఞము యొక్క కోరదగిన ప్రియుడను, దదామి ఇతి = ఇచ్చుచున్నాను అని, అగ్నిః వదతి = అగ్ని చెప్పుచున్నాడు, తథా ఇతి వాయుః ఆహ = తథాఅస్తు అని వాయువు చెప్పుచున్నాడు, చంద్రమాః = చంద్రుడు, తత్ సత్యం = అది నిజము, హంత ఇతి = సంతోషమని, ఆదిత్య= ఆదిత్యుడు, సత్యం ఓం ఇతి = సత్యము అంగీకరించుడు అని, తత్ సత్యం = ఆ సత్యమును, ఆపః = జలము, ఆభరన్ = తెచ్చినది. యజ్ఞస్య దక్షిణా = యజ్ఞముయొక్క దక్షిణ, యశః= యశము.

58.ప్రజామేకామస్సమృధ్యతాం = పుత్రోత్పత్తి రూపమున నాకోరిక పరిపూర్ణమగుగాక, - అని స్వామి దోసిలితో తలంబ్రాలను దేవి శిరస్సున ఉంచవలెను. పశవో ......తాం = పశువులను గూర్చిన నా కోర్కె సిద్ధించు గాక, - అని లక్ష్మీదేవి స్వామివారి తలపై ఉంచవలెను. యజ్ఞో ....తాం = యజ్ఞ విషయికమగు నా కోర్కె సిద్ధించుగాక అని స్వామివారు లక్ష్మీదేవి శిరస్సున ఉంచవలెను. తూష్ణీం చతుర్థం = నాలుగవది మంత్రము లేకుండ ఒకరి శిరస్సున ఒకరు ఉంచుకొనవలెను. లేదా (ధర్మో మేకామ స్సమృధ్యతాం = నేను కోరిన ధర్మ సమృద్ధి యౌగాక, శ్రియో మేకామ స్సమృధ్యతాం = నేను కోరిన ధన సమృద్ధి యగుగాక.) కొందరిమతమున నాలుగవసారి తూష్ణీంగా చేయవలెనని, మరికొందరి మతమున నాలుగవసారి ధర్మో మేకామ...., శ్రియోమేకామ..., అనేవి చెప్పుచూ అక్షతారోపణము జరుపవలెనని ప్రయోగములు కన్పించుచున్నవి. గాన ఏదో ఒక విధానమును అనుసరించ వలసి యున్నది.

59. విశ్వేత్తాతే, పద్మప్రియే, విష్ణు పత్నీం అను మంత్రములతో క్రమముగా స్వామి, శ్రీదేవి, భూదేవుల కొంగులయందు బంగారము, పసుపుకొమ్ము, పోకలు ఉంచి ముడివేసి, అలా ముడివేసిన కొంగులను జితంత మంత్రముతో కలిపి ముడివేయవలెను. ఇది బ్రహ్మబంధనము.మఘవన్ = ఓ ఇంద్రుడా, సవనేషు= యజ్ఞములయందు, సున్వతే = సోమరసమును పిండెడి, (యజమానికొరకు) యా = ఏ కర్మలు, చకర్థ = చేసితివో, తే = నీ యొక్క తాః = ఆకర్మలు, ప్రవాచ్య = చెప్పదగినవి, విశ్వేత్ = అనంతములు, (నీవు), పారావతం = పరావతుడు అను పేరు గల శత్రువు యొక్క యత్ = ఏ (ధనము), ఋషిబంధనే శరభాయ= ఋషిబంధువగు శరభుని కొరకు, పురుసంభృతం = అధికముగా సంపాదించినట్లు, అపావృణో= వరించినావు (దాచినావు)

పద్మప్రియే, విషుపత్నీం, జితంత మంత్రములకు అర్థము ముందుగా ఇవ్వబడినది.

60. అంతవరకూ పశ్చిమముఖుడైయున్న స్వామిని తూర్పుముఖమున నుండునట్లు స్థాపించవలెను.

మహదాశీర్వచనము, ఫలప్రదానములు ఆచారానుగుణ్యంగా జరిగించవలెను.

పాణిగ్రహణమునందలి అర్థం-విశేషాంశములు సంపూర్ణము



58. ప్రజామేకామ స్సమృధ్యతాం।

పశవోమేకామ స్సమృధ్యతాం।

యజ్ఞోమేకామ స్సమృధ్యతాం।

ఏవం త్రిః అక్షతానారోపయేత్।

తూష్ణీం చతుర్థం॥

(లేదా) (ధర్మోమేకామ స్సమృధ్యతాం శ్రియోమేకామ స్సమృధ్యతాం॥)

59. విశ్వేత్తాతే, పద్మప్రియే, జితంత ఇతి బ్రహ్మబంధనం కృత్వా -

విశ్వేత్తాతే సవనేషు ప్రవాచ్యాయా
చకర్థ మఘవన్ ఇంద్రసున్వతే
పారావతం యత్పురు సంభృతం
వస్వపావృణో శ్శరభాయ ఋషిబంధవే॥

పద్మప్రియే ............ ............సన్నిధత్స్వ॥

జితంతే ............ .......... సురాజయాతి॥

60. దేవం ప్రాఙ్ముఖం సంస్థాప్య -

మహదాశీర్వచనం కుర్యాత్ -

భక్తాభీష్ట ఫలసిద్ధ్యర్థం ఫలప్రదానానికరిష్యే --

ఇతి పాణిగ్రహణమ్॥

## 1. వివాహ ప్రధానహోమః

(వివాహప్రయోగానంతరం ఈ వివాహప్రధానహోమంమొదలుకొని నక్షత్రదేవతా హోమం ఆపైన జయాదుల వరకూ పాంచాహ్నిక ప్రథమదివసమున( వరుసగా ) జరిగింపవలెను)

తతః అగ్నిప్రతిష్ఠాపన సంస్కారాజ్యభాగాంతే మూలమంత్రేణ సమిధాజ్యచరుం హుత్వా॥ అనయా నవోఢయా వధ్వాసహ, హిరణ్యగర్భ, ప్రజాపతే, సహస్రశీర్షేతి వివాహప్రధాన హోమం జుహుయాత్॥

1. **హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్ । సదాధారపృథివీం ద్యాముతేమాం కస్మైదేవాయ హవిషావిధేమ స్వాహా ॥**

2. **ప్రజాపతే నత్వదేతాన్యన్యో విశ్వాజాతాని పరితా బభూవా । యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు వయగ్ ం స్యామ పతయో రయీణాగ్గ్ స్వాహా ॥**

3. **సహస్రశీర్షా పురుషః ............. అయనాయ విద్యతే స్వాహా॥ యజ్ఞేన యజ్ఞమయజంత దేవాః ........స్సంతి దేవా స్స్వాహా॥**

---

(మానుషంలో ప్రధానహోమమున అగ్నిప్రతిష్ఠ, సంస్కారములు, సోమాయేదంవరకూ అజ్యభాగములు, జయాదులు ఆపైన పాణిగ్రహణము, సప్తపదులు ఉంటాయి. ప్రవేశహోమమున ఆగ్నిప్రతిష్ఠ ఆజ్యభాగముల అనంతరం జయాది వర్జంగా ప్రాజాపత్యహోమం, ఆపైన ధృవారుంధతీదర్శనము చెప్పబడినది.)

1. పాణిగ్రహణ విధ్యుక్తం కర్మ సర్వం సమాచరేత్ । కుండస్య చతురస్యస్య సమీపే ప్రాఙ్ముఖం హరిం। దేవీభ్యాం సహ దేవేశం నివేశ్య సుసమాహిత:। ఇధ్మాధానాది సంస్కారా నాఘారాన్తం యథావిధిః। ప్రధాన హోమం కుర్వీత ప్రవేశాఖ్య మత: పరం। లాజహోమం ప్రకుర్వీత తాన్త్రికం హోమమేవచ। సప్తావరణ హోమాన్ కృత్వా వైకుంఠ పార్షదాన్। శ్రీ సూక్త హోమం కుర్వీత తిథి వారాధిదేవతాన్। నక్షత్రాణా మధిపతీంచ జయాదీంచ హునేత్క్రమాత్ । ప్రణీతి మార్జనాంతంతు కృత్వా కర్మయథావిధి:। యానేదేవం సమారోప్య నృత్తవాద్య పురస్సరం। గ్రామం ప్రదక్షిణీకృత్య దేవాగారం ప్రవేశయేత్। ఇతి సమ్యక్ సమాఖ్యాతం పాణిగ్రహణముత్సవం। తతో వనవిహారాఖ్య ముత్సవం తూచ్య తేధునా। ద్వితీయదివసే దేవం ..." పురు.సంహి. బ్రహ్మోత్సవాధ్యాయం 24.98-105.

భద్రాచల పాఠమున ప్రధాన, ప్రవేశ, లాజహోమాలు లేవు.

## 2. ప్రవేశహోమః

అనయానవోఢయావధ్వాసహ అతో దేవా సహస్రశీర్షం దేవమితి వివాహ ప్రవేశహోమం జుహుయాత్ ॥

1. అతోదేవా అవంతునో ............స్సప్తధామభి స్వాహా॥
2. ఇదం విష్ణుర్విచక్రమే .............సురే స్వాహా॥
3. త్రీణి పదావిచక్రమే ................ధారయన్ స్వాహా॥
4. విష్ణోః కర్మాణి పశ్యత ..............స్సఖా స్వాహా॥
5. తద్విష్ణోః పరమంపదగ్ం ..........పరమంపదగ్గ్ స్వాహా॥
6. సహస్రశీర్షం దేవం విశ్వాక్షం ..... పరమస్స్వరాట్ స్వాహా॥

అథలాజహోమః॥

## 3.లాజహోమః

అనయా నవోఢయా వధ్వాసహ లాజహోమం కరిష్యే-

ఇయం నారీతి తస్యాః లాజాంజలినా వామపార్శ్వే జుహుయాత్॥

(లాజలతో నిండిన వధువు దోసిలితో వరుడు ముమ్మారు హోమము చేయవలెను)

ఇయంనా ర్యుప బ్రూతే కుల్పా న్యావపన్తికా

దీర్ఘాయురస్తుమే పతిర్జీవాతుశరద శ్శతగ్ం స్వాహా॥

( కుల్పాని=పేలాలను, అవపంతికా=హోమముచేయుచున్నదై, ఉపబ్రూతే=చెప్పుచున్నది.)

వజ్రనఖాయ విద్మహే। తీక్ష్ణ దగ్ంష్ట్రాయ ధీమహి।

తన్నోనారసింహః ప్రచోదయాత్స్వాహా॥

నారాయణాయ విద్మహే వాసుదేవాయధీమహి ।

తన్నో విష్ణుః ప్రచోదయాత్స్వాహా ।

4. **తాంత్రిక హోమః** (దీనిని పురుషోత్తమ సంహిత విధించినది. 24.98-102)

అథతాంత్రిక హోమం కరిష్యే ॥

ఇంద్రాగ్నీ నవతింపురో దాసపత్నీరధూనుతమ్ ।
సాకమేకేన కర్మణ శుచిన్నుస్తోమ న్నవజాత
మద్యేంద్రాగ్నీ వృత్రహణాజుషేథాగ్ం స్వాహా ॥

గయస్ఫానో అమీవహా వసువి త్పుష్టివర్ధనః
సుమిత్ర స్సోమనో భవ స్వాహా॥

✤ ఓం నమో నారాయణాయస్వాహా ॥

✤ ఓం నమో భగవతే వాసుదేవాయ స్వాహా ॥

**5. సప్తావరణ దేవతా హోమః**

సప్తావరణ దేవతా హోమం కరిష్యే -

నివృత్తి శక్తి సహితాయ స్వాహా । ప్రతిష్టా శక్తి సహితాయ స్వాహా। వేద్యా శక్తి సహితాయ స్వాహా । కరుణా శక్తి సహితాయ స్వాహా। శ్రీమహాలక్ష్మి శక్తి సహితాయ స్వాహా । రతీ శక్తి సహితాయ స్వాహా। సంజ్ఞా శక్తి సహితాయ స్వాహా । ప్రద్యుమ్నాయస్వాహా। అనిరుద్ధాయ స్వాహా ॥

-- ఇతి ప్రథమావరణమ్

హనుమతే స్వాహా । సుగ్రీవాయ స్వాహా । భరతాయ స్వాహా । విభీషణాయ స్వాహా । లక్ష్మణాయ స్వాహా । అంగదాయ స్వాహా। శత్రుఘ్నాయ స్వాహా । జాంబవతే స్వాహా॥

-- ఇతి ద్వితీయావరణమ్

✤ అధిక పాఠం అం. అప్ప.

ధృష్టయే స్వాహా । జయంతాయ స్వాహా । విజయాయ స్వాహా । సురరాష్ట్రాయ స్వాహా । రాష్ట్రవర్ధనాయ స్వాహా । అకోపాయ స్వాహా । ధర్మపాలకాయ స్వాహా । సుమంతాయ స్వాహా॥

**-- ఇతి తృతీయావరణమ్**

బ్రహ్మణే స్వాహా । వజ్రాయ స్వాహా । శక్త్యై స్వాహా । దండాయ స్వాహా। ఖడ్గాయస్వాహా । పాశాయ స్వాహా । ధ్వజాయ స్వాహా । గదాయ స్వాహా। త్రిశూలాయ స్వాహా ।

**-- ఇతి చతుర్థావరణమ్**

సుదర్శనాయ స్వాహా । పాంచజన్యాయ స్వాహా । గదాయై స్వాహా। ఖడ్గాయ స్వాహా । శార్ఙ్గాయస్వాహా । పద్మాయ స్వాహా । కౌస్తుభాయ స్వాహా । వనమాలాయైస్వాహా।

**-- ఇతి పంచమా వరణమ్**

వశిష్టాయ స్వాహా । వామ దేవాయ స్వాహా । జాబాలాయ స్వాహా। గౌతమాయ స్వాహా । భరద్వాజాయ స్వాహా । కౌశికాయ స్వాహా✤। వాల్మీకాయ స్వాహా । నారదాయ స్వాహా ।

**-- ఇతి షష్ఠా వరణం**

నలాయస్వాహా । నీలాయస్వాహా । గవయా యస్వాహా । గవాక్షాయస్వాహా । గంధమాదనా యస్వాహా । మైందాయస్వాహా। ద్వివిదాయస్వాహా । శరభాయస్వాహా ।

**-- ఇతి సప్తమావరణమ్**

'అం' అనంతాయ స్వాహా । 'గం' గరుడాయ స్వాహా । 'విం' విష్వక్సేనాయ స్వాహా ।

–ఇత్యావరణ దేవతా హోమమ్॥

✤ శౌనకాయస్వాహా – చా.వేం.రా.భ, అంవే. రా. పాఠాలు

# 6. వైకుంఠ పార్షద హోమః[1]

❖ ఓం నమో భగవతే వాసుదేవాయ స్వాహా।
దశరథాత్మజాయ విద్మహే సీతావల్లభాయ ధీమహి।
తన్నో రామచంద్రః ప్రచోదయాత్స్వాహా॥

1. నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి।తన్నో విష్ణుః ప్రచోదయాత్స్వాహా॥
2. మహాదేవ్యైచ విద్మహే విష్ణుపత్న్యైచధీమహి। తన్నోలక్ష్మీః ప్రచోదయాత్స్వాహా॥
3. ధనుర్ధరాయ విద్మహే సర్వసిద్ధ్యైచ ధీమహి। తన్నోధరాః ప్రచోదయాత్స్వాహా॥
4. విష్ణుపత్న్యైచ విద్మహే శ్రీభూసఖ్యైచ ధీమహి। తన్నో నీళాః ప్రచోదయాత్స్వాహా॥
5. ఉర్వీధరాయ విద్మహే మహానాగాయ ధీమహి। తన్నశ్శేషః ప్రచోదయాత్స్వాహా॥
6. పక్షిరాజాయ విద్మహే సువర్ణపక్షాయ ధీమహి। తన్నో గరుడః ప్రచోదయాత్స్వాహా॥
7. విష్వక్సేనాయ విద్మహే వేత్రహస్తాయ ధీమహి। తన్నస్సేనేశః ప్రచోదయాత్స్వాహా॥
8. చక్రాంతస్థాయ విద్మహే చతుశ్చక్రాయ ధీమహి। తన్నశ్చక్రః ప్రచోదయాత్స్వాహా॥
9. సుదర్శనాయ విద్మహే మహాజ్వాలాయ ధీమహి। తన్న శ్చక్రః ప్రచోదయాత్స్వాహా॥
10. శంఖాన్తస్థాయ విద్మహే శర్మదాయ ధీమహి। తన్న శ్శంఖః ప్రచోదయాత్స్వాహా॥
11. పాంచజాన్యాయ విద్మహే శుభ్రవర్ణాయ ధీమహి। తన్న శ్శంఖః ప్రచోదయాత్స్వాహా॥
12. గదాధరాయ విద్మహే ఖడ్గహస్తాయ ధీమహి। తన్నో జేతా ప్రచోదయాత్స్వాహా॥
13. కామోదక్యైచ విద్మహే హిరణ్మయ్యైచధీమహి। తన్నో గదా ప్రచోదయాత్స్వాహా॥
14. విష్ణు భక్తాయ విద్మహే వీరవర్యాయ ధీమహి। తన్నో ఖడ్గః ప్రచోదయాత్స్వాహా॥
15. తీక్ష్ణధారాయవిద్మహే నీలవర్ణాయ ధీమహి। తన్నో నందకః ప్రచోదయాత్స్వాహా॥
16. అత్యుచ్ఛ్రితాయ విద్మహే పూర్వగణ్యాయ ధీమహి। తన్నో ధన్వః ప్రచోదయాత్స్వాహా॥

---

1. ఇది పాం.ల., చా.జగ్గప్ప. గార్ల ప్రతిష్ఠా ప్రయోగపాఠం. వైకుంఠపార్షదహోమం ఇదే క్రమంలో ఏ మార్పు లేకుండా మొత్తం 108 ఆహుతులుగా పురు.సం. (24.28-39) యందు విధించబడియున్నది. రేజే.శ్రీరం, రే॥రం పాఠాలలో 85 మాత్రమే కన్పిస్తున్నవి. రేజే.శ్రీరం, శ్రీకూర్మం పాఠాలు వేరే క్రమాన్ని పాటించినవి. ఉదా॥ నారాయణ గాయత్రి తర్వాత 'విశ్వవనితాయ' అంటూ ధాత్రు విధాత్రాదులున్నాయి.

❖ ద్వాదశాక్షరి, రామ గాయత్రులు రే॥రం, రేజే.శ్రీరం, శ్రీకూర్మం, పాఠాలలో అధికపాఠం.

17. ధనుర్ధరాయ విద్మహే మహా శార్ఙ్గాయ ధీమహి। తన్నో శార్ఙ్గ ప్రచోదయాత్స్వాహా ॥
18. శ్రీవత్సాయ విద్మహే మహాచిహ్నాయ ధీమహి। తన్నః శ్రీవత్సః ప్రచోదయాత్స్వాహా ॥
19. జీవాత్మకాయ విద్మహే తేజోరూపాయ ధీమహి। తన్నః కౌస్తుభః ప్రచోదయాత్స్వాహా ॥
20. భూతాత్మకాయ విద్మహే పంచవర్ణాయ ధీమహి। తన్నో వైజయన్తీః ప్రచోదయాత్స్వాహా॥
21. కోటిభాస్కరాయ విద్మహే జీవరత్నాయ ధీమహి। తన్నో మకుటః ప్రచోదయాత్స్వాహా॥
22. ఘకరాననౌచ విద్మహే మణిస్థగితాయ ధీమహి। తన్న కుండలౌః ప్రచోదయాత్స్వాహా॥
23. విమానేశాయ విద్మహే విష్ణురూపాయ ధీమహి। తన్నః పుష్పకః ప్రచోదయాత్స్వాహా ॥
24. విశ్వవనితాయ [2] విద్మహే విద్వేద్యాయ ధీమహి। తన్నో ధాతా ప్రచోదయాత్స్వాహా ॥
25. పరానందాయ విద్మహే వైధాత్రాయ ధీమహి। తన్నో విధాతా ప్రచోదయాత్స్వాహా ॥
26. విక్రాంతాయ విద్మహే ద్వారనాథాయ ధీమహి। తన్నో భువంగః ప్రచోదయాత్స్వాహా ॥
27. ప్రభాకరాయ విద్మహే పారగాయ ధీమహి। తన్నో పతంగః ప్రచోదయాత్స్వాహా ॥
28. మహాబలాయ విద్మహే ద్వారస్థితాయ ధీమహి। తన్నో మణికః ప్రచోదయాత్స్వాహా ॥
29. సహస్రయజ్ఞాయ విద్మహే ద్వారస్థితాయ ధీమహి। తన్న స్తాపసః ప్రచోదయాత్స్వాహా॥
30.ప్రతీ హారాయ విద్మహే మాల్యాంకారాయ ధీమహి। తన్న స్సిద్ధః ప్రచోదయాత్స్వాహా ॥
31.వేదోద్ధారాయ విద్మహే ధనప్రదాయ ధీమహి। తన్న స్సాధ్యః ప్రచోదయాత్స్వాహా ॥
32. వేదోద్ధారాయ విద్మహే మహామీనాయ ధీమహి। తన్నో హరిః ప్రచోదయాత్స్వాహా ॥
33. పరబ్రహ్మయ విద్మహే వాసుదేవాయ ధీమహి। తన్నో హంసః ప్రచోదయాత్స్వాహా ॥
34. విద్యాప్రదాయ విద్మహే హయగ్రీవాయ ధీమహి। తన్నో హయగ్రీవః ప్రచోదయాత్స్వాహా॥
35. సుధాప్రధాయ విద్మహే పృథ్వీధరాయ ధీమహి। తన్నః కూర్మః ప్రచోదయాత్స్వాహా ॥
36. ధరాధరాయ విద్మహే వరాహాయ ధీమహి। తన్నో వరాహః ప్రచోదయాత్స్వాహా ॥
37. వజ్రనఖాయ విద్మహే తీక్ష్ణదగ్గంష్ట్రాయ ధీమహి। తన్నోనారసిగ్ంహః ప్రచోదయాత్స్వాహా
38. అదితేయాయ విద్మహే కాశ్యపాయ ధీమహి। తన్నోః వామనః ప్రచోదయాత్స్వాహా ॥

2. వనితా జనితా త్యర్థానురాగా యాంచ యోషితి - మిక్కిలి యనురాగము పుట్టించు నట్టి స్త్రీకిని, చకారము వలన స్త్రీ మాత్రమునకు పేరు. - అమరం. ఇక్కడ బ్రహ్మ సృష్టికి స్త్రీ మాత్రుడగుటచే విశ్వవనిత.

39. భార్గవాయ విద్మహే పరశుహస్తాయ ధీమహి । తన్నో రామః ప్రచోదయాత్స్వాహా ॥
40. దశరథాత్మజాయ విద్మహే సీతావల్లభాయ ధీమహి । తన్నో రామః ప్రచోదయాత్స్వాహా॥
41. జనకజాయైచ విద్మహే రామప్రియాయైచ ధీమహి । తన్నస్సీతా ప్రచోదయాత్స్వాహా॥
42. లక్ష్మీ ప్రదాయ విద్మహే లక్ష్మణాయ ధీమహి । తన్నో లక్ష్మణః ప్రచోదయాత్స్వాహా ॥
43. రామభక్తాయ విద్మహే నిరాహారాయ ధీమహి । తన్నో భరతః ప్రచోదయాత్స్వాహా ॥
44. సుమిత్రాత్మజాయ విద్మహే శత్రుఘ్నాయ ధీమహి । తన్నశ్శత్రుఘ్నః ప్రచోదయాత్స్వాహా॥
45. శబ్దరాజాయ విద్మహే వాయుపుత్రాయ ధీమహి । తన్నో హనుమాన్ ప్రచోదయాత్స్వాహా
46. సంకర్షణాయ విద్మహే కృష్ణాగ్రజాయ ధీమహి । తన్నో రామః ప్రచోదయాత్స్వాహా ॥
47. రేవత్యైచ విద్మహే హరిప్రియాయైచ ధీమహి । తన్నో రేవతీ ప్రచోదయాత్స్వాహా ॥
48. దామోదరాయ విద్మహే గోపాలాయ ధీమహి । తన్నః శ్రీ కృష్ణః ప్రచోదయాత్స్వాహా ॥
49. భీష్మజాయైచ విద్మహే కృష్ణపత్నైచ ధీమహి । తన్నో రుక్మిణీ ప్రచోదయాత్స్వాహా ॥
50. క్ష్మాంశజాయైచ విద్మహే సత్యభామిన్యైచ ధీమహి । తన్నోస్సన్మతీ[3] ప్రచోదయాత్స్వాహా॥
51. మాయారూపాయ విద్మహే పిప్పలస్థాయ ధీమహి । తన్నో బుద్ధః ప్రచోదయాత్స్వాహా॥
52. అశ్వారోహాయ విద్మహే కలుషఘ్నాయ ధీమహి । తన్నో కల్కిః ప్రచోదయాత్స్వాహా ॥
53. ప్రభావత్యైచ విద్మహే ముకుందపత్న్యైచ ధీమహి । తన్నోద్వారశ్రీః ప్రచోదయాత్స్వాహా॥
54. అగ్రవంద్యాయ విద్మహే జయధ్వజాయ ధీమహి । తన్నో ధ్వజః ప్రచోదయాత్స్వాహా ॥
55. వేదాత్మనాయ విద్మహే హిరణ్యగర్భాయ ధీమహి । తన్నోబ్రహ్మ ✤ ప్రచోదయాత్స్వాహా ॥
56. ధాతృపత్న్యైచ విద్మహే సరస్వత్యైచ ధీమహి । తన్నో వాణీ ప్రచోదయాత్స్వాహా ॥
57. బ్రహ్మాదృశ్యాయ విద్మహే విశ్వజ్ఞాయ ధీమహి। తన్న స్సనకః ప్రచోదయాత్స్వాహా ॥
58. ధన్యాయ విద్మహే సనత్కుమారాయ ధీమహి । తన్నో యతిరాట్ ప్రచోదయాత్స్వాహా ॥
59. భక్తి వేద్యాయ విద్మహే భవ్యయాయ ధీమహి । తన్నః సనందనః ప్రచోదయాత్స్వాహా ॥
60. పంచ వర్షాయ విద్మహే జ్ఞానరూపాయ ధీమహి । తన్న స్సనః ప్రచోదయాత్స్వాహా ॥

3. సన్మతీ – రే॥ రం, చా.వేం రాభ పాఠాలు
✤ వేదస్తత్త్వ తతో బ్రహ్మ, బ్రహ్మో విప్రః ప్రజాపతిః – ఇత్యమరః.

61. నారదాయ విద్మహే పుణ్య శ్లోకాయ ధీమహి। తన్నో దేవర్షిః ప్రచోదయాత్స్వాహా ॥
62. లక్ష్మీ జనకాయ విద్మహే వేదజ్ఞాయ ధీమహి। తన్నో భృగుః ప్రచోదయాత్స్వాహా ॥
63. మార్కండేయాయ విద్మహే వేదప్రజ్ఞాయ ధీమహి। తన్నో మునిః ప్రచోదయాత్స్వాహా ॥
64. శ్రుతేష్టాయ[4] విద్మహే వేదార్థాయ ధీమహి। తన్నో వ్యాసః ప్రచోదయాత్స్వాహా ॥
65. వ్యాసపుత్రాయ విద్మహే చిద్రూపాయ ధీమహి। తన్నః శ్రీశుకః ప్రచోదయాత్స్వాహా ॥
66. కుంభజాయ విద్మహే సింధుహరాయ ధీమహి। తన్నో అగస్త్యః ప్రచోదయాత్స్వాహా ॥
67. బ్రహ్మాజ్ఞాయ విద్మహే కాశ్యపాయ ధీమహి। తన్నః కాశ్యపః ప్రచోదయాత్స్వాహా ॥
68. దేవజనన్యైచ విద్మహే సుపుత్ర్యైచ ధీమహి। తన్నో అదితిః ప్రచోదయాత్స్వాహా ॥
69. సర్వజ్ఞాయ విద్మహే అనసూయేశాయ ధీమహి। తన్నో అత్రిః ప్రచోదయాత్స్వాహా ॥
70. అనసూయాయైచ విద్మహే యోగిన్యైచ ధీమహి। తన్నః సుశ్రీః ప్రచోదయాత్స్వాహా ॥
71. జ్ఞానదాయ విద్మహే నిస్పృహాయ ధీమహి। తన్నో భరద్వాజః ప్రచోదయాత్స్వాహా ॥
72. ఉగ్రతపసేచ విద్మహే విశ్వామిత్రాయ ధీమహి। తన్నో యతిః ప్రచోదయాత్స్వాహా ॥
73. పుణ్యధరాయ[5] విద్మహే అహల్యేశాయధీమహి। తన్నో గౌతమః ప్రచోదయాత్స్వాహా ॥
74. బ్రహ్మాజ్ఞాయవిద్మహే అరుంధతీశాయధీమహి। తన్నో వశిష్ఠః ప్రచోదయాత్స్వాహా ॥
75. సౌభాగ్యదాయైచవిద్మహే అరుంధత్యైచధీమహి। తన్నస్సాధ్వీః ప్రచోదయాత్స్వాహా ॥
76. విధీశాయ విద్మహే విక్రాంతాయ ధీమహి। తన్నో జమదగ్నిః ప్రచోదయాత్స్వాహా ॥
77. రామజనన్యైచవిద్మహే క్షత్రకన్యాయ ధీమహి। తన్నో రేణుకాః ప్రచోదయాత్స్వాహా ॥
78. దేవరాజాయ విద్మహే వజ్రహస్తాయ ధీమహి। తన్న శ్శక్రః ప్రచోదయాత్స్వాహా ॥
79. శచీప్రియాయవిద్మహే పురుహూతాయధీమహి। తన్నో జిష్ణుః ప్రచోదయాత్స్వాహా ॥
80. రుద్రనేత్రాయయవిద్మహే శక్తిహస్తాయధీమహి। తన్నో వహ్నిః ప్రచోదయాత్స్వాహా ॥
81. ధనంజయాయవిద్మహే శోచిష్కేశాయ ధీమహి। తన్న శ్శుష్కః ప్రచోదయాత్స్వాహా।
82. వైవస్వతాయ విద్మహే దండహస్తాయ ధీమహి। తన్నో యమః ప్రచోదయాత్స్వాహా।

4. శ్రుతేష్టాయ - రే। శ్రీరం, స్మృతేష్టదాయ - అం.కూ, చా.వేం. రాభ పాఠాలు.
5. పుణ్యాధారాయ - రే.శ్రీరం

83. ధర్మరాజాయ విద్మహే కృతాంతాయ ధీమహి। తన్న శ్శమనః ప్రచోదయాత్స్వాహా ॥

84. పుణ్యజనాయ విద్మహే కర్బురాయ ధీమహి। తన్నో నిర్ఋతిః ప్రచోదయాత్స్వాహా ॥

85. నిశాచరాయ విద్మహే ఖడ్గహస్తాయ ధీమహి। తన్నో నిర్ఋతిః ప్రచోదయాత్స్వాహా ॥

86. శుద్ధి జలాయ విద్మహే పాశహస్తాయ ధీమహి। తన్నో వరుణః ప్రచోదయాత్స్వాహా ॥

87. మకరాశ్వాయ విద్మహే ఖాండేశాయ ధీమహి । తన్నో వరుణః ప్రచోదయాత్స్వాహా ॥

88. జగత్ప్రాణాయ విద్మహే గంధవాహాయ ధీమహి। తన్నోవాయుః ప్రచోదయాత్స్వాహా

89. ప్రాణరూపాయవిద్మహే శరభారూఢాయధీమహి। తన్నోవాయుః ప్రచోదయాత్స్వాహా

90. యక్షరాజాయ విద్మహే గదాహస్తాయ ధీమహి। తన్నః కుబేరః ప్రచోదయాత్స్వాహా ॥

91. పౌలస్త్యాయ విద్మహే ఏకపింగళాయ ధీమహి। తన్న శ్శ్రీదః ప్రచోదయాత్స్వాహా ॥

92. త్రిపురాన్తకాయ విద్మహే గౌరీశాయ ధీమహి। తన్న శ్శివః ప్రచోదయాత్స్వాహా ॥

93. తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి। తన్నో రుద్రః ప్రచోదయాత్స్వాహా ॥ ॥

అపఉపస్పృశ్య॥

94. హిమాద్రిజాయైచవిద్మహే దాక్షాయణ్యైచ ధీమహి। తన్నో గౌరీః ప్రచోదయాత్స్వాహా॥

95. భాగీరథ్యైచ విద్మహే లోకపావన్యైచ ధీమహి। తన్నో గంగాః ప్రచోదయాత్స్వాహా ॥

96. భాస్కరాయవిద్మహే మహాద్యుతికరాయధీమహి। తన్నోఆదిత్యః ప్రచోదయాత్స్వాహా॥

97. రామాంశుజాయైచవిద్మహే సూర్యపత్న్యైచధీమహి। తన్నోపద్మినీః ప్రచోదయాత్స్వాహా॥

98. ధరాంశజాయైచవిద్మహే కలిజనన్యైచ ధీమహి। తన్న శ్ఛాయా ప్రచోదయాత్స్వాహా ॥

99. నీళాంశజాయైచ విద్మహే సవితృపత్న్యైచ ధీమహి। తన్నో ఉషా ప్రచోదయాత్స్వాహా ॥

100. ఓషధీశాయ విద్మహే సుధాకరాయ ధీమహి। తన్నో సోమః ప్రచోదయాత్స్వాహా ॥

101.అంగారకాయవిద్మహే లోహితాంగాయధీమహి। తన్నో భౌమః ప్రచోదయాత్స్వాహా

102.రౌహిణేయాయ విద్మహే చంద్రజాయ ధీమహి। తన్నో బుధః ప్రచోదయాత్స్వాహా ॥

103.మంత్రరాజాయవిద్మహే అంగీరసాయ ధీమహి। తన్నో గురుః ప్రచోదయాత్స్వాహా ॥

104.భార్గవాయ విద్మహే దైత్యాచార్యాయ ధీమహి। తన్న శ్శుక్రః ప్రచోదయాత్స్వాహా ॥

105.ఛాయాపుత్రాయ విద్మహే శనైశ్చరాయ ధీమహి। తన్న స్సౌరిః ప్రచోదయాత్స్వాహా॥

106.అమృతభక్ష్యాయవిద్మహే చక్రచ్ఛిన్నాయధీమహి। తన్నోరాహుః ప్రచోదయాత్స్వాహా

107. ధూమ్రవర్ణాయ విద్మహే అర్ధకాయాయ ధీమహి। తన్నః కేతుః ప్రచోదయాత్స్వాహా

108. రత్నాకరాయ విద్మహే సరిన్నాథాయ ధీమహి। తన్నః సింధుః ప్రచోదయాత్స్వాహా

అనేన విధినా అష్టోత్తరశత గాతత్ర్యా హోమం కుర్యాత్

శ్రీ భూ సూక్త హోమం కుర్యాత్

( శ్రీభూసూక్తహోమములు శ్రీకూర్మ ప్రతిలో అధికపాఠం )

## 7. పరివారదేవతా హోమః

ఓం ఆధార శక్త్యైస్వాహా। కూర్మాయ స్వాహా। కాలహుతాశనాయ స్వాహా। అవనీచక్రాయ స్వాహా। అమృతార్ణవాయ స్వాహా। అంబువర్ణాయ స్వాహా। శ్వేతద్వీపాయ స్వాహా। కల్పవృక్షాయ స్వాహా। స్వర్ణ మండపాయ స్వాహా। పుష్కరార్వ్తాయ స్వాహా। విమలాయ స్వాహా। సరత్నాయ స్వాహా। సౌమ్య సింహాసనాయ స్వాహా। ధర్మాయ స్వాహా। జ్ఞానాయ స్వాహా। వైరాగ్యాయ స్వాహా। ఐశ్వర్యాయ స్వాహా। అధర్మాయ స్వాహా। అజ్ఞానాయ స్వాహా। అవైరాగ్యాయ స్వాహా। అనైశ్వర్యాయ స్వాహా। ఆత్మనే స్వాహా। అంతరాత్మనే స్వాహా। పరమాత్మనే స్వాహా। శాన్త్యై స్వాహా। మధ్యస్థాయ స్వాహా। సూర్యమండలాయ స్వాహా। సోమమండ లాయ స్వాహా। వహ్నిమండలాయ స్వాహా। సత్వగుణాయ స్వాహా। రజోగుణాయ స్వాహా। తమోగుణాయ స్వాహా। కమలాయ స్వాహా। కమలోపరి సుదర్శనాయ స్వాహా। విమలశక్త్యై స్వాహా। ఉత్కర్షణ శక్త్యై స్వాహా। జ్ఞాన శక్త్యై స్వాహా। క్రియాశక్త్యై స్వాహా। యోగశక్త్యై స్వాహా। ప్రభుశక్త్యై స్వాహా। ఈశ్వరశక్త్యై స్వాహా। సంజ్ఞాన శక్త్యై స్వాహా। కర్ణికాయ స్వాహా।

కర్ణికోపరి – ఓం నమో నారాయణాయ స్వాహా।

శ్రియై స్వాహా। భూమ్యైస్వాహా।

✤ విమానాధి దేవతా హోమం కరిష్యే -

చణ్డాయ స్వాహా । ప్రచణ్డాయ స్వాహా । భద్రాయ స్వాహా । సుభద్రాయ స్వాహా । జయాయ స్వాహా । విజయాయ స్వాహా । ధాత్రే స్వాహా । విధాత్రే స్వాహా । వాస్తుపురుషాయ స్వాహా । క్షేత్రపాలకాయ స్వాహా ।

✤ దిక్పాలకదేవతాహోమమ్‌కరిష్యే -

ఇన్ద్రాయ స్వాహా । అగ్నయే స్వాహా । యమాయ స్వాహా । నిర్ఋతయే స్వాహా । వరుణాయ స్వాహా । వాయవే స్వాహా । కుబేరాయ స్వాహా । ఈశానాయ స్వాహా ॥

✤ ధ్వజదండాధి దేవతా హోమం కరిష్యే ।

ప్రజాపతయే స్వాహా । తార్క్ష్యాయ స్వాహా । భూలోకాయ స్వాహా । భువర్లోకాయ స్వాహా। సువర్లోకాయ స్వాహా । మహర్లోకాయ స్వాహా । అనంతాయ స్వాహా । వాసుక్యై స్వాహా । తక్షకాయ స్వాహా । కర్కోటకాయ స్వాహా । పద్మాయ స్వాహా । మహాపద్మాయ స్వాహా । శంఖాయ స్వాహా । గుళికాయ స్వాహా ।

✤సర్వదేవతా హోమం కరిష్యే -

పరబ్రహ్మణే స్వాహా । ప్రజాపతయే స్వాహా । రుద్రాయ స్వాహా । (అప ఉపస్పృశ్య) సర్వదేవేభ్య స్స్వాహా । సామభ్య స్స్వాహా । యక్షేభ్య స్స్వాహా । అప్సరాభ్య స్స్వాహా । మాసేభ్య స్స్వాహా । సంవత్సరేభ్య స్స్వాహా । సర్వదేవేభ్య స్స్వాహా । సముద్రేభ్య స్స్వాహా। పర్వతేభ్య స్స్వాహా । ఆపగాభ్య స్స్వాహా । భూతేభ్య స్స్వాహా। పశుభ్య స్స్వాహా । పిండజేభ్య స్స్వాహా । జరాయుజేభ్య స్స్వాహా । భూతేభ్య స్స్వాహా । సర్వలోకేభ్య స్స్వాహా । అతలాదిభ్య స్స్వాహా । చండాదిభ్య స్స్వాహా॥

✤ గుర్తు గలవి బొబ్బిలి, పాం.ల పాఠాలలో అధికపాఠాలు

**❖వాహనాధి దేవతాహోమం కరిష్యే -**

ఓం నమోభగవతే వైనతేయాయ స్వాహా ।

**❖శాలాధి దేవతాహోమం కరిష్యే -**

కుముదాయ స్వాహా । కుముదాక్షయ స్వాహా । శుశోభనాయ స్వాహా। పూర్ణాయస్వాహా। పుష్కరాయ స్వాహా । ఇంద్రాయ స్వాహా । పుండరీకాయ స్వాహా । వామనాయ స్వాహా। సుభద్రాయ స్వాహా । ఆనందాయ స్వాహా । నందనాయ స్వాహా । యమాయ స్వాహా । శంకుకర్ణాయ స్వాహా । సర్వనేత్రాయ స్వాహా । సుబంధనాయ స్వాహా । వీరసేనాయ స్వాహా। సుషేణాయ స్వాహా । వరుణాయ స్వాహా । సుముఖాయ స్వాహా। సుప్రతిష్టితాయ స్వాహా ।సుహోత్రాయ స్వాహా ।సంభవాయ స్వాహా ।ప్రభవాయ స్వాహా। కుబేరాయ స్వాహా।

**❖దశావతార దేవతాహెూమమ్కరిష్యే -**

ఓం మత్స్యాయ స్వాహా । ఓం కూర్మాయ స్వాహా । ఓం వరాహాయ స్వాహా । ఓం నారసింహాయ స్వాహా । ఓం వామనాయ స్వాహా । ఓం పరశురామాయ స్వాహా । ఓం రామాయ స్వాహా । ఓం కృష్ణాయ స్వాహా । ఓం బుద్ధాయ స్వాహా । ఓం కల్కినే స్వాహా ।

**❖పాలికాధి దేవతా హోమమ్కరిష్యే -**

బ్రహ్మణే స్వాహా । విష్ణవే స్వాహా । ఈశానాయ స్వాహా । సోమాయస్వాహా

**❖నవకుంభాధిదేవతా హోమమ్కరిష్యే -**

ఓం నమో భగవతే నృసింహాయ స్వాహా । ఓం వాసుదేవాయ స్వాహా । ఓం సంకర్షణాయ స్వాహా । ఓం ప్రద్యుమ్నాయ స్వాహా । ఓం అనిరుద్ధాయ స్వాహా । ఓం సత్యాయ స్వాహా । ఓం అచ్యుతాయ స్వాహా। ఓం అనంతాయ స్వాహా । ఓం నమోభగవతే సుదర్శనాయ స్వాహా

⁕అష్టమంగళాధి దేవతాహోమమ్‌కరిష్యే -

| | | |
|---|---|---|
| శ్రీ వత్సాయ స్వాహా | - | చంద్రమసే స్వాహా |
| ఉదకుంభాయ స్వాహా | - | జాహ్నవ్యైస్వాహా |
| భేర్యై స్వాహా | - | |
| ఆదర్శాయ స్వాహా | - | |
| మత్స్యయుగ్మాయ స్వాహా | - | శ్రీదేవ్యై స్వాహా |
| అంకుశాయ స్వాహా | - | విమలాయ స్వాహా |
| శంఖాయ స్వాహా | - | వహ్నయే స్వాహా |
| ఆవర్తాయ స్వాహా | - | సరస్వత్యై స్వాహా |

## 8. కేశవాది చతుర్వింశతి నామ హోమః ॥

కేశవాది చతుర్వింశతి నామ హోమం కరిష్యే-

ఓం కేశవాయస్వాహా । ఓం నారాయణాయ స్వాహా । ఓం మాధవాయ స్వాహా । ఓం గోవిందాయ స్వాహా । ఓం విష్ణవే స్వాహా। ఓం మధుసూధనాయ స్వాహా । ఓం త్రివిక్రమాయ స్వాహా । ఓం వామనాయ స్వాహా । ఓం శ్రీధరాయ స్వాహా । ఓం హృషీకేశాయ స్వాహా । ఓం పద్మనాభాయ స్వాహా । ఓం దామోదరాయ స్వాహా। ఓం సంకర్షణాయ స్వాహా । ఓం వాసుదేవాయ స్వాహా । ఓం ప్రద్యుమ్నాయ స్వాహా । ఓం అనిరుద్ధాయ స్వాహా । ఓం పురుషోత్తమాయ స్వాహా । ఓం అధోక్షజాయ స్వాహా । ఓం నారసింహాయ స్వాహా। ఓం అచ్చుతాయ స్వాహా । ఓం జనార్దనాయ స్వాహా । ఓం ఉపేంద్రాయ స్వాహా । ఓం హరయే స్వాహా । ఓం శ్రీ కృష్ణాయ స్వాహా ।

## 10. తిథి వార నక్షత్ర దైవత్య హోమమ్‌కరిష్యే[1] -

### తిథి దేవతా హోమః :-

ఓం వహ్నయే స్వాహా - ప్రతిపదే స్వాహా। ఓం త్వష్ట్రే స్వాహా - ఓం ద్వితీయాయై స్వాహా। ఓం హిమాద్రి జాయై స్వాహా - తృతీయాయై స్వాహా । ఓం గణపతయే స్వాహా- చతుర్థైస్వాహా । ఓం సర్పాయ స్వాహా - పంచమ్యై స్వాహా। ఓం కుమారాయ స్వాహా - షష్ఠ్యైస్వాహా। ఓం గౌరీశాయ స్వాహా - అష్టమ్యై స్వాహా । ఓం వసవే స్వాహా - నవమ్యై స్వాహా । ఓం నాగాయ స్వాహా - దశమ్యై స్వాహా । ఓం ధర్మాయ స్వాహా - ఏకాదశ్యైస్వాహా। ఓం హరయే స్వాహా - ద్వాదశ్యై స్వాహా। ఓం కామాయ స్వాహా - త్రయోదశ్యై స్వాహా। ఓం కలయే స్వాహా - చతుర్దశ్యై స్వాహా। ఓం ఇన్దవే స్వాహా - రాకాయై స్వాహా। ఓం పితృభ్య స్వాహా-ఓం అమావాస్యాయై స్వాహా ॥

### వారాధి దేవతా హోమః :-

ఓం భాస్కరాయ స్వాహా - భానువాసరాయ స్వాహా।
ఓం చంద్రాయ స్వాహా - ఇందువాసరాయ స్వాహా ।
ఓం భౌమాయ స్వాహా - కుజవాసరాయ స్వాహా ।
ఓం ఇందుజాయ స్వాహా - సౌమ్య వాసరాయ స్వాహా ।
ఓం గురవే స్వాహా - గురువాసరాయ స్వాహా ।
ఓం భృగవే స్వాహా - భృగువాసరాయ స్వాహా ।
ఓం మందాయ స్వాహా - మందవాసరాయ స్వాహా॥

1. తిథి, వార హోమములు అం.అప్ప, శ్రీకూ, రేజే.చి.సిం. ప్రతులలో కన్పించలేదు.

## నక్షత్ర దైవత్య హోమః[2] :-

ఓం అగ్నయే స్వాహా - ఓం కృత్తికాభ్య స్వాహా ।
ఓం ప్రజాపతయేస్వాహా - ఓం రోహిణ్యై స్వాహా ।
ఓం సోమాయ స్వాహా - ఓం మృగశీర్షాయ స్వాహా ।
ఓం రుద్రాయ స్వాహా - ఓం ఆర్ద్రాయై స్వాహా ।
ఓం ఆదిత్యై స్వాహా - ఓం పునర్వసుభ్యాగ్ం స్వాహా ।
ఓం బృహస్పతియే స్వాహా - ఓం తిష్యాయ[3] స్వాహా ।
ఓం సర్పేభ్య స్వాహా - ఓం ఆశ్రేషాభ్య స్వాహా ।
ఓం పితృభ్య స్వాహా - ఓం మఘాభ్య స్వాహా ।
ఓం అర్యమ్ణే స్వాహా - ఓం ఫల్గునీభ్యాగ్ం స్వాహా ।
ఓం భగాయ స్వాహా - ఓం (ఉత్తర) ఫల్గునీభ్యాగ్ స్వాహా।
ఓం సవిత్రే స్వాహా - ఓం హస్తాయ స్వాహా ।
ఓం త్వష్ట్రే స్వాహా - ఓం చిత్రాయై స్వాహా ।
ఓం వాయవే స్వాహా - ఓం స్వాత్యై స్వాహా ।
ఓం ఇంద్రాగ్నిభ్యాగ్ంస్వాహా - ఓం విశాఖాభ్యాగ్ం స్వాహా ।
ఓం మిత్రాయ స్వాహా - ఓం అనూరాధేభ్య స్వాహా ।

2. శ్రీకూర్మప్రతిలో అగ్నయే స్వాహా, కృత్తికాభ్య స్వాహా, అంబాయై స్వాహా, దులాయై స్వాహా, నితత్యై స్వాహా, అభ్రయంత్యై స్వాహా, మేఘయంత్యై స్వాహా, వర్షయంత్యై స్వాహా, చుపుణీకాయై స్వాహా, ....... అంటూ పూర్తిగా స్మార్త పాఠాన్ని అనుసరించిన నక్షత్ర దేవతాహోమం కన్పిస్తున్నది. చూడదు యాజుష పూర్వ ప్రయోగం. పుట. 72. నక్షత్రములు వాని అధిదేవతలు తైత్తరీయ సంహిత 4 కాండ 4 ప్రశ్న 10 అను వాకమునందు గలవు. కృత్తికతో మొదలై భరణితో ముగియడం వైదిక సమ్ప్రదాయం.

3 " తుష్యం త్యస్మిన్నర్థయే ఇతి తిష్యః - దీనియందు కార్య సిద్ధికొరకు సంతోషింతురు తిష్య అనగా పుష్య నక్షత్రము. " - అమరం.

ఓం ఇంద్రాయ స్వాహా - ఓం జ్యేష్ఠాయై స్వాహా ।

ఓం నిర్‌ఋతయే స్వాహా - ఓం మూలాయ స్వాహా ।

ఓం అద్భ్యః స్వాహా - ఓం (పూర్వ) ఆషాఢాభ్య స్స్వాహా।

ఓం విశ్వేభ్యోదేవేభ్య స్వాహా - ఓం (ఉత్తర) ఆషాఢాభ్య స్స్వాహా।

ఓం బ్రహ్మణే స్వాహా - ఓం అభిజితే స్వాహా ।

ఓం విష్ణవే స్వాహా - ఓం శ్రవణాయ స్వాహా ।

ఓం వసుభ్య స్వాహా - ఓం శ్రవిష్ఠాభ్య[4] స్స్వాహా ।

ఓం వరుణాయ స్వాహా - ఓం శతభిషజే స్వాహా ।

ఓం అజాయైకపదే స్వాహా- ఓం ప్రోష్ఠపదేభ్య[5] స్స్వాహా ।

ఓం అహయే బుధ్నియాయ[6]స్వాహా - ఓం (ఉత్తర) ప్రోష్ఠ పదేభ్యస్స్వాహా ।

ఓం పూష్ణే స్వాహా - ఓం రేవత్యై స్వాహా ।

ఓం అశ్విభ్యాగ్ం స్వాహా - ఓం అశ్వినీభ్యాగ్ం స్వాహా ।

ఓం యమాయ స్వాహా - ఓం అపభరీణీభ్యాగ్ం[7] స్వాహా

---

4. శ్ర విష్ఠా – రేజే॥ శ్రీరం పారం. “ శ్రవిష్ఠయా సమా ధనిష్ఠా - శ్రవిష్ఠ యని శ్రవణమునకు, ధనిష్ఠకు కూడ పేరు. శుభకర్మలయందు మంచిదని వినబడునది శ్రవణము, ధనము కలిగించునది ధనిష్ట ” – అమరం. స్మార్తమున శ్రవణమునకు శ్రోణపదము వాడబడినది. అమర కోశమున శ్రవణమను అర్ధమున శ్రవణ, శ్రోణపదములు లేవు కాని సూర్యరాయాంధ్రము శ్రోణ పదమునకు శ్రవణమును అర్ధమునిచ్చినది.

5. ప్రోష్ఠపద, ఉత్తర ప్రోష్ఠ పదలని వేదమున పేర్కొనబడిన నక్షత్రములకు క్రమముగా పూర్వభాద్ర, ఉత్తర భాద్రలని పేర్లు. “స్యుః ప్రోష్ఠపదా భాద్రపదాః – ప్రోష్ఠమనగా నెద్దు, దాని పాదము వంటి పాదములు గలవి, భద్రం పదం యాసాం తాః శుభకరములైన పాదములు గలవి, అను ఈ రెండు పూర్వభాద్ర ఉత్తరాభాద్రలకు పేళ్ళు – అమరము

6. అహయే బుధ్నిమాయ – అని స్మార్తపారం.

7. అపభరిణి పదము వేదంలో ఉన్నది

## 11. జయాదిహోమః [8]

సమిత్సన్నహన మద్భి స్సంస్పర్శయిత్వా ।

అగ్నయ ఇదమితి సమిధ మగ్నౌ నిధాయ ।

రుద్రాయ తంతిచరా యేదమితి యిధ్మసన్నహనం నిదధ్యాత్ ।

(సమిధను ఇధ్మ సన్నహనమును నీటితో తడిపి అగ్నియందుంచవలలె)

తతః అస్మిన్ కర్మణి కర్మ పరిపూర్ణతా సిధ్యర్థం తత్తత్ కర్మ ఫల సిధ్యర్థం జయాదిహోమం కరిష్యే -

చిత్తంచ స్వాహా । ........... (ప్రణీతి మార్జనాంతం చేయవలెను.)

---

8. శ్రీకూర్మ పాఠంలో జయాది హోమానికి ముందు 'విష్ణవే స్వాహా, యజ్ఞాయస్వాహా, ప్రతిష్ఠాయై స్వాహా, భూస్స్వాహా, భువస్స్వాహా .. అని కొన్ని ఆహుతులు కన్పిస్తున్నవి. జయాదులను, ఆపై ప్రణీతి మార్జనాంతం జరిగించవలెనని పురు.సం విధించినది. చూ. అధస్సూచిక 1. పుట ....

# బలిప్రదానమ్ [1]

చిత్రవస్త్ర విచిత్రమాల్యాద్యైః శిబికాదిక మలంకృత్య । ఆలయాభిముఖే ప్రతిష్ఠాప్య । దేవేశం నానా విధ వస్త్రై రలంకృత్య । వేదాహమేతమితి శిబికా మారోప్య । నృత్త గీత వాద్య ఛత్ర చామర ధూప దీప ధ్వజ పతాకాద్యైః ఆచార్యాది భక్త జన యుక్తం, ప్రథమ దినాది నిత్య బల్యర్థం ముద్గ నిష్పావ కుళుత్థ మాష తిల తిల్యాపూప మిశ్రిత బలిపాత్రయుత మాచార్యః పరిచారకమూర్ధ్ని విన్యస్య, ఆలయ ద్వారపాలక, విమానపాలక, ఇంద్రాది లోకపాలక బల్యర్థం గ్రామం శనై శ్శనైః ప్రదక్షిణం కృత్వా, గ్రామవాసిన స్సర్వజనాః నానాఫలాపూపాదీని దద్యుః ॥

ఏవం గ్రామం ప్రదక్షిణం కృత్వా దేవ మాలయ మావిశ్య ।
అలంకృతాస్థాన మండపే సింహాసనే దేవం సంస్థాప్య ।
పాద్యాద్యై రభ్యర్చ్య ।

✤ " బ్రహ్మ కలశాది కలశాన్ ధాన్యోపరి నిధాయ । హిరణ్య శృంగమితి వరుణ సూక్తం పఠన్ ఉదకం పూరయిత్వా । గాయత్ర్యాభి మన్త్ర్య । పురుష సూక్తే నాభిషించ్య ।"

అపూపాదికం నివేద్య । నీరాజనం దత్వా । ప్రణమ్య । అభ్యంతరే దేవ మాస్థాపయేత్ ।

ఏవం సాయాహ్నే ద్వితీయాత్ప్రభృతి నిత్యం సాయం ప్రాతర్నిత్యార్చనాంతే దేవస్య విశేషార్చనం విశేష నివేదనం, ద్వారతోరణాన్తరాళ పతాక దేవతారాధనం, యోగేశ్వర ధ్యానకుంభారాధనం హోమం బలించ కృత్వా । సాయం ప్రాత రుభయంచ కారయేత్ ॥

---

1. రెండవదినమునుండి ప్రతిదినము నిత్యార్చనానంతరం ఉదయ సాయంకాలములయందు వైకుంఠపార్షదాది హోమములన్నియు జరిగించి ఆపై బలిప్రదానమొనరింపవలె .

✤ అం.వేం రా. ప్రతి అధిక పాఠం

# సదస్యోత్సవవిధిః

(6 వ దినము (పాంచాహ్నికమున 2 వదినము)

నవాహ్నిక దీక్షా షష్ఠదినే (ద్వాదశి)[2] సాయాహ్నేదేవమాస్థానే వినివేశ్య। విష్వక్సేనం ప్రపూజ్య। పుణ్యాహజలేన చందన తాంబూలాది సదస్య సంభారాన్ సంప్రోక్ష్య। నూతన పీత కౌశేయ వస్త్రే ఆఢకప్రమాణ తండులోపరి అష్టదళ పద్మకర్ణికా మధ్యస్థిత కుంకుమ పుష్ప చూర్ణోదక కలశే బ్రహ్మాణం, అష్టదళేష్వింద్రాదీన్ షోడశోపచారై రభ్యర్చ్య।

✤ "చతుర్వలయయుత మండపాష్టదిక్షు అష్టదిక్పాలకానావాహ్య। తన్మధ్యే బ్రహ్మకలశోత్తరభాగే వసన్త కలశం నిధాయ। ఆపోవా ఇదగ్ం సర్వమితి తీర్థాన్యాకృష్య। కలశస్య ముఖే విష్ణురితి కలశానావాహ్య। శ్రీమత్తులసీ దళం నిక్షిప్య। పంచత్వక్ పంచపల్లవ పంచామృత నవరత్నాని పరిమళద్రవ్యాణి తత్తన్మన్త్రై ర్నిక్షిప్య। ధ్రువ బేర గాయత్ర్యా అభిమన్త్ర్య। సర్వధర్మాన్ పరిత్యజ్యేతి నమస్కుర్యాత్।" ✤

అనంతరం సువర్ణ భాజనే క్రముక నాగవల్లీ దళయుతం పరిషద్దక్షిణాం గృహీత్వా॥ ఇమాంగాథాముదీ రయేత్॥

*( సభా తాంబూలమును పళ్లెమునందుంచుకొని లేచినిలచి సభవారి క్రిందివిధముగా విజ్ఞాపనచేయవలెను.)*

సర్వేషాం మహాజనానాం శ్రీ మహావిష్ణు స్వరూపాణామ్ బ్రాహ్మణానాం సర్వత్ర ఇమా న్యాసనాని - సుఖాసనాని।

సర్వైర్దైవేక్షణః క్రియతాం॥ ............ "ఓం తథా"

ప్రాప్నువంతు భవంతః॥ ............. "ప్రాప్నువామః"

---

2. హవల్దార్ అం.సీతారామాచార్యులుగారు చెప్పిన ప్రకారం బొబ్బిలి శ్రీవేణుగోపాలస్వామి వారి దేవాలయమునందు నవాహ్నిక షష్ఠ దినమున (ద్వాదశి) సాయంకాలం వసంతోత్సవం జరుగుతున్నది. అ వసంతోత్సవ ప్రయోగముతో బాటే ఆ దినముననే అం.వేంన ప్రతియందు సదస్యోత్సవము వ్రాయబడియున్నది.

✤ అం.వేం.రా. ప్రతి.

అర్చతప్రార్చత।

హిరణ్యరూప స్సహిరణ్య సంధృగ పాన్న పాత్సేదు హిరణ్య వర్ణః।
హిరణ్యయా త్పరియోనే ర్నిషద్యా హిరణ్యదా దద త్యన్న మస్మై॥

అఖిలాండ కోటిబ్రహ్మాండ నాయకస్య శ్రీ ......................

స్వామినః వివాహ సదస్య మహోత్సవ సమయే అత్రస్థితాశేష విద్వజ్జనానా మనేక సువర్ణ మంత్ర పుష్పాణి। ఇతి పరిషద్దక్షిణాం దత్వా॥

ఆశిషోవాచయిత్వా । వస్త్రచందన తాంబూలదిభి స్తోషయేత్॥

ఇతి సదస్యోత్సవ విధిః।।

## వసంతోత్సవః

(6 వ దినము (పాంచాహ్నికమున 2 వదినము)

నవాహ్నిక దీక్షా షష్ఠదినే (ద్వాదశి) సాయంకాలే వసంతోత్సవం కుర్యాత్। సంకల్ప్య। విష్వక్సేనపూజా పుణ్యాహవాచనం కుర్యాత్। వసంత కలశాన్ ప్రోక్ష్య। దేవస్య పురతః నూతన వస్త్రోపరి తండులై ర్మండలం కృత్వా। మండలోపరి ఇంద్రాదీశానాన్త మష్టకలశాన్ వసన్త యుక్తాన్ విన్యస్య। మూలమన్త్రేణాభిమన్త్ర్య। మూలేన షోడశోపచారాన్ సమర్ప్య। వేదాహ మేతమితి వసంతం సమర్ప్య । శేషం భక్తానాం దత్వా । వసంతోత్సవ పూర్వకం గ్రామ ప్రదక్షిణం కృత్వా। ఆలయం ప్రవిశేత్।

**రథోత్సవః** (7 వ దినము(పాంచాహ్నిక తృతీయదివసము)

✤ "సప్తమదిన రాత్ర్యాం నిత్యోత్సవ నీరాజనా నంతరం భగవతః పురతో నూతన వస్త్రోపరి తండులై ర్మండలం విరచ్య। తస్మిన్ షట్కోణపద్మం విలిఖ్య । పద్మమధ్యే తండుల కలశే । ఓం వశిష్ఠాయనమః ఇతి వశిష్ఠ మావాహ్య। ప్రాగాది షట్కోణేషు తండులయుత కలశాన్ విన్యస్య। కశ్యప అత్రి భరద్వాజ విశ్వామిత్ర గౌతమ వశిష్ఠ జమదగ్నీన్ తత్తన్నామ మంత్రైః యథాక్రమామావాహ్య । ఓం సప్తఋషిభ్యోనమః ఇతి మంత్రేణ షోడశోపచారై రభ్యర్చ్య। ఓం వశిష్ఠాయనమః ఇతి మన్త్రేణ ఏకస్య వైష్ణవస్య తత్కలశం దద్యాత్ । ఏవం ప్రకారేణ కశ్యపాది నామ మన్త్రైః షణ్ణాం వైష్ణవానాం కోణస్థిత షట్కలశాన్ దద్యాత్। రథోత్సవాంగ విష్వక్సేనపూజా పుణ్యాహవాచనాని కృత్వా । పుణ్యాహవాచ నోదకేన రథం సంప్రోక్ష్య । రథేన భగవంతం నివేశ్య। అర్ఘ్య పాద్య ఆచమనీయ గంధపుష్ప ధూప దీప నైవేద్యాని సమర్ప్య । నివేదిత ముద్గాన్నం రథస్య అష్టదిక్షు బ్రహ్మేన్ద్రా దీశానాన్తం తత్తన్నామ మన్త్రైః ఉత్సవ బలించ కృత్వా। తాంబూల నీరాజన మన్త్రపుష్పాణి భగవన్తం సమర్ప్య । గ్రామ ప్రదక్షిణ పూర్వకం ఆలయం ప్రవిశేత్। రథారోహణా ద్యాలయ ప్రవేశపర్యన్తం షట్ షష్టి భోజ్యాన్ ద్రవిడ పారాయణ పూర్వకం భగవతో నివేద్య । అనంతరం పరకాలోత్సవ విహారాంశ్చద్రవిడ పారాయణ పూర్వకం నివేద్య। తాంబూల నీరాజన మన్త్ర పుష్పాన్ భగవతే దద్యాత్। ఏకస్య భోజ్యస్య నివేదనే ప్యుక్త ప్రకారేణ కర్తవ్యం। షట్ షష్టి భోజ్యాన్ ద్రవిడ వేద పారాయణోక్త ప్రకారేణ నివేదనం కర్తవ్యం"

✤ ఈ రథోత్సవ ప్రక్రియ బొబ్బిలి అం.సీతారామాచార్యుగారి సౌజన్యంతో వారి తండ్రిగారు అం.వేం.న ప్రతినుండి లభ్యమైనది. నవాహ్నిక సప్తమ దినమున జరుగు ఈ ఉత్సవం పాంచాహ్నికమున కన్పించుట లేదు.

**మృగ (యా) యాత్రావిధిః** (8 వ దినము(పాంచాహ్నిక చతుర్థదివసము)

** చతుర్దశ్యా మాచార్యో నిత్యకర్మాను ష్ఠానాదికం కృత్వా । శయనమందిరం ప్రవిశ్య । దేవముత్థాప్య । బ్రహ్మ కలశాది పంచకలశాన్ ధాన్యోపరి నిధాయ । హిరణ్య శృంగ మిత్యాది వారుణ మంత్రే ణోదకపూరితాన్ పంచకలాశాన్ గాయత్ర్యాభిమంత్ర్య । దేవం నిత్యార్చన క్రమేణాభ్యర్చ్య । పురుష సూక్తే నాభిషిచ్య । నిత్యహోమం కృత్వా । దేవస్య సమీపం గత్వా । ప్రణమ్య ॥

**మృగయాత్రా త్వయాదేవ శ్వః కర్తవ్యం సురేశ్వర ।**
**తత్ర ప్రతిసరారంభ మనుజ్ఞాం దాతుమర్హసి ॥**

జితంత ఇతి కంకణంబధ్వా –

**జితంతే పుండరీకాక్ష నమస్తే విశ్వభావన ।**
**సుబ్రహ్మణ్య నమస్తేస్తు మహాపూరుష పూర్వజా ॥**

ధృతచాపశరం చిత్రరక్షాది కటక సంయుతం దేవం దేవీం వినా అశ్వారథం కృత్వా । గ్రామసమీపే గ్రామోపాంతవనే విహారవేదిమధ్యే దేవమానీయ । తత్రేక్షుఖండ అపూపాదికం నివేద్య । తత్రాశ్వ గజ రథారూఢజనై స్సార్థం, చక్రవిశ్రామిత్రైస్సహ, మృగయా సంభ్రమం నాటయిత్వా –

"పుణ్యాహం కృత్వా । తజ్జలేన శరశరాసనాదికం ప్రోక్ష్య । ధన్వనాగా ఇతి మన్త్రేణ దేవకర స్పర్శన పూర్వకం యత్ర బాణా సంపతంతి ఇతి మన్త్రేణ బాణాన్ సర్వతః విసృజేత్–

** నవాహ్నిక అష్టమదినమున (చతుర్దశినాడు) మృగయోత్సవం, పాంచాహ్నికమున ఇది త్రయోదశి నాడు కన్పిస్తున్నది (రే॥రం, పాం.ల.ప్రతులు). మృగగయోత్సవం "సప్తమే అహని యద్వా అష్టమే అహనివా" అని క్రి.కై.చం. పేజి.నెం. 190. మృగయోత్సవం సాయంకాలం చేయడం ఆచారం.

**యత్రబాణాః సంపతంతి కుమారవిశిఖా ఇవ**

**ఇంద్రోన స్తత్ర వృత్రహా విశ్వాహా శర్మ యచ్ఛతు ॥**

మృగచ్ఛేద నటనార్థం రంభాస్థంభాన్ భిత్వా । మృగయా [1] వినోదం పరకాల వైభవంచ పఠిత్వా ।"

పశ్చాదాలయస్య పురస్తా త్సంవాదన [2] రూపం వినోద మవధార్య । ఇందిరాకటాక్షైరను గ్రహీతం దేవం ఆలయ మావిశ్య । పూర్వవదర్చయేత్॥

**శేషహోమః** [3] (8 వ దినమున అపరరాత్రి (పాంచాహ్నికచతుర్థదివసము)-

*(వివాహమైనపిదప 3దినముల అనంతరం నాల్గవనాడు అపరరాత్రి యందు దీక్షా విసర్జనరూపమగు శేషహోమము జయాద్యుత్తరపరిషేచనాంతం జరిగించడం మానుషమున గలదుప్రాణానాయమ్య - .... చత్వారిశృంగా... షట్పాత్ర ప్రయోగం ఆజ్యభాగాలతోసహా శేషహోమం జరిగించవలె నని స్మార్తం)*

అథ చతుర్థస్యా మపరరాత్రౌ శేషహోమ ప్రయోగః ॥

పరిషించ్య ।

1. సమిధాజ్య చరుభిః ప్రత్యేకం మూలమన్త్రేణ, పంచోపనిషద్భిశ్చ అష్టోత్తరశతాహుతీ ర్హుత్వా ॥
2. తతః అష్టాక్షర, ద్వాదశాక్షర, విష్ణుగాయత్ర్యా చ అష్టోత్తరశత మాజ్యేన ప్రత్యేకం హుత్వా ।

అయం శేషహోమ ఇత్యుచ్యతే ॥

3. తతః జయాద్యుత్తర పరిషేచనాంతం కృత్వా ।

అథవినోదోత్సవ విధిః॥

---

1.&2 చోరసంవాద రుక్మిణీసంవాదములు అనుబంధము 16 న ఇవ్వబడినవి.

3.పాద్మం చివరిరోజున శేషహోమాన్ని విధించినది- చర్యా 30. 33,34,35

"తుర్యేహ న్యవర రాత్ర్యాం వై శేషహోమం సమాచరేత్ । సమిధాజ్య చరుప్రాయై రష్టోత్తర శతాహుతీః జుహుయా త్స్వేన మూలేన పంచోపనిషదైరపి। పూర్ణాహుతిం తతః కృత్వా పంచమే దివసే గురుః ॥ - వి.తి. 7.609,610

**1.వినోదోత్సవః** (9 వ దినము ఉదయం (పాంచాహ్నికపంచమదివసము)

పరేద్యుః ఉషఃకాలే (మరునాడు అనగా పౌర్ణమినాటి ఉషఃకాలం) వినోదోత్సవార్థం దేవం యానమారోప్య। ఊర్మికా మార్గణార్థం (ఉంగరము వెదకుట) ఇత స్తతః పర్యటనం కారయిత్వా। ఆలయం ప్రవిశ్య। సింహాసనే ఉపవిశ్య । పాణానాయమ్య । విష్వక్సేన పూజా పుణ్యాహవాచన పురస్సరం ఘృతాభిషేకార్థం ఘృతకుంభ మండలారాధనం కరిష్యే । ఇతి సంకల్ప్య

**2.ఘృతారోపణమ్ - ✤**

**ద్రోణ పరిమిత తండులోపరి నూతన వస్త్ర మాచ్ఛాద్య। తదుపరి అష్టదళ పద్మం విలిఖ్య మధ్యే ఘృతపూరిత కుంభం నిధాయ । తస్మిన్ బ్రహ్మాణ మావాహ్య। అష్టదిక్షు లోకపాలా నావాహ్య । షోడశోపచారై రభ్యర్చ్య। ఘృత కుంభం సమాహృత్య।**

ఆచార్య హస్తేన పాదాగ్రే - సుమంగళాయ నమః

- ఇతి ఘృతమభ్యర్చ్య - పాణిం ప్రక్షాళ్య

మూలమంత్రేణ కంఠే - భద్రాయ నమః

- ఇతి ఘృతమభ్యర్చ్య - పాణిం ప్రక్షాళ్య ,

మూలమంత్రేణ శిరసి - సుశోభనాయనమః

- ఇతి ఘృతమభ్యర్చ్య - పాణిం ప్రక్షాళ్య।

అన్యేష్వంగే ష్వక్షతారోపణ మేవ ॥

---

✤ పాద్మాది సంహితలలో లాజహోమానంతరం (ఏకాదశినాడు) ఘృతారోపణము చెప్పబడగా ప్రస్తుతము లభించిన పాఠమున చక్రతీర్థవిధికి ముందు (పౌర్ణమినాడు) చెప్పబడినది. ఈ విధానము కపింజల సంహితయందు సంపూర్ణముగ చెప్పబడియున్నవి.. (కపిం.23.50-54) పాద్మమున ఘృత దూర్వాంకుర చందన శాలితండులముల ఉపయోగముండగా ఇందు కేవల ఘృతోపయోగమే కన్పించుచున్నది. సుశోభనాది మన్త్రములు దాదాపు ఒకే విధముగనున్నను వాని వినియోగమున భేదమున్నది. వినోదోత్సవ, ఘృతాభిషేక, చూర్ణోత్సవములు బొబ్బిలి అం.వేం.న పాఠము ననుసరించి, చక్రతీర్థపాఠము బాలసీమ చా.వేం రాభ. పాఠముననుసరించి నిర్ణయింపబడినవి.

1. క్రి.కై.చం. చూర్ణోత్సవమునుచెప్పుచూ 'పూర్వవత్' అనగా నవాహ్నిక షష్ఠమ దినమున జరిగిన విధముగా పౌర్ణమినాటి ఉదయం జరిగించవలెననిచెప్పినది. (పేజీ.నెం. 191.)

## 3.చూర్ణోత్సవ విధిః

అథ పౌర్ణమాస్యాం[1] ప్రాతరుత్సవానంతరం తీర్థస్నాన కాలాత్పూర్వం ఉత్సవ బేరం వినా ధ్రువాయ హవిర్నివేద్య। అన్యత్సర్వ హోమాదికం కృత్వా ॥ తీర్థయాత్రాధివాసార్థం దేవాభిముఖే స్థండిలం కృత్వా-పశ్చమే చక్రం, ఉత్తరే విష్వక్సేనం అష్టోపచారైరభ్యర్చ్య ॥

✤ "దేవాభిముఖే పంచద్రోణపరిమితి ధాన్య రాశౌ అలంకృత ఉలూఖలం నిధాయ ।

ఉలూఖలే లక్ష్మీ మన్త్రేణ లక్ష్మీ మావాహ్య ।

**హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ ..... సర్వం మ నిషాణ ॥**

ముసలే మూలమన్త్రేణ భగవన్త మావాహ్య ।

**ఓం నమోనారాయణాయ ॥**

ఋత్విగ్భిస్సహ ఆచార్యః తదులూఖలే హరిద్రా ఉశీర కచ్చూర ఏలా లవంగాది పరిమళ ద్రవ్యాణి నిధాయ । గణికాదిభిః దేవాసీభిః మంగళ పాఠకైః చూర్ణీకృత్య । తచ్చూర్ణం నవవస్త్రయుత కలశే నిక్షిప్య। ద్రోణపరిమిత తండులోపరి విన్యస్య । మూలమన్త్రేణ భగవన్త మావాహ్య। గంధాదిభి రభ్యర్చ్య । ఋత్విగ్భిస్సహ ఆచార్యః తచ్చూర్ణకలశం దేవ సమీపే నిధాయ । ప్రదక్షిణ పూర్వకం దండవత్ప్రణమ్య । తచ్చూర్ణం శ్రీ సూక్తేన దేవాయ సమర్పయేత్। అనేక స్తోత్ర పూర్వకం పుష్పాంజలిం సమర్పయేత్ । తచ్చూర్ణం అశుభ హరణార్థం ఆచార్యాది భక్తజనైః శిరసి ధారయేత్ । ద్రోణపరిమిత తండులోపరి వసంత కలశం నిధాయ । తస్మిన్ నారాయణం, దిక్షు లోకపాలానావాహ్య । తద్వసంతం శీర్షే సమర్ప్య । శేషం భక్తానాం వినియోగ మాచరేత్ ॥"

✤ చూర్ణోత్సవం అం.పీ గారి పాఠం, క్రి.కై.చం. అనుసారి.

## 4. <u>చక్రతీర్థమ్</u> (అవభృధః, చక్రవారి)

"అథ పౌర్ణమాస్యాం ప్రాతరుత్సవానంతరం ప్రతిసరం బధ్వా। చక్రబేరం యానాదిక మారోప్య । నదీ తటాక సాగరతీరంవా గత్వా। తత్ర అలంకృత ఆస్థానమంటపే దేవం నిధాయ । నవ కలశ స్నపన మండలారాధనం కృత్వా । స్నానాసనం సమర్ప్య । అబ్లింగై ర్వైష్ణవ సూక్తాదిభి ర్దేవ మభిషిచ్య । తటాకాది తీర్థేషు గంగాది తీర్థాదీనావాహ్య। తదుత్సవ బేరేణసహ త్రివారం భక్తాః స్నానం కృత్వా । పూతాత్మానో భవేయుః । <u>దేవస్య రక్షాబంధనం విసృజ్య</u>। తజ్జలే నిక్షిప్య ।" – (బాలసీమ చా.వేం.రా.భ పాఠంనుండి. దేవునితోబాటు ఆచార్యాదులందరకూ రక్షాబంధన విసర్జనమును క్రి.కై.చం.పుట 192 చెప్పినది.)

కుంకుమ పుష్పాదిభిః పూర్వోక్త కలశచూర్ణేన సహ మిశ్రీకృత్వా యేతేశత మిత్యభిమంత్య – దేవాయ సమర్పయేత్। బ్రహ్మాణమభ్యర్చ్య। వసంతం సమర్ప్య । వినియోగం కృత్వా। దేవం యానమారోప్య । చక్రవి శ్రామితైస్సహ తోయ ధారపురస్సరం ఆలయాగ్రం గత్వా ॥

---

<u>అవభృధ సమయస్యాపవాదః</u> :-

1. " సంకల్ప పూర్వ మాలోచ్య మాసేబుక్షే తథాతిథౌ । తీర్థావగాహనం యద్వా సమ్యోగే తిథితారయోః విషువేచాయనే చైవ నాదరస్తిథి తారయోః। దుష్టవారాది సంయోగే శుభమేవ యథోదితమ్ " – పాద్మ. చర్యా. 10. 24-26 ॥
2. "నవమే దివసేవాపి కుర్యాదవభృథోత్సవం । ప్రతిష్ఠా దివసే యద్వా రాజ్ఞో జన్మ దినేపివా మాసనక్షత్ర తిథిషు దర్శేవాతీర్థ మాచరేత్ । సాగరేవా మహానద్యాం పుణ్యతీర్థే ఉ ధవాబ్జజ వాప్యాం వా పుష్కరిణ్యా వా కుర్యాదవభృథోత్సవమ్ । ...తీర్థోత్సవం వినిశ్చిత్య ధ్వజారోహణ మాచరేత్ ॥ " – వి.తి. 8 . 79-86 ॥

<u>కలశస్థాపన చక్రాభిషేకములు</u> :- " కలశానగ్రతః పంచవింశతిం దశ సప్త చ యద్వా నవస్య యథావిధిః యథాక్రమం కలశై రభిషించేత చక్రం శిష్టైశ్చ వారిభిః । సరితాదౌచ తీర్థేషు తీర్థాన్యావాహ్య నామభిః నిమజ్జయే త్తత్ర బింబం చక్రం చ త్రి ర్యథావిధి । తీర్థార్థ మౌత్సవే బింబే సమానీతే తు వారిభిః ప్రోక్ష్య కూర్చాగ్ర పతితైః ర్బింబం చక్రం నిమజ్జయేత్ । చక్రాభావేతు తత్కూర్చం కేవలం దేవసన్నిధౌ దేవేనసహ తత్కాలే నిమజ్జన్తి చ యే నరాః । తే నిర్ధూతయా ఉ శుభం సర్వం మహాపాతక మప్యథ యాన్తి ధ్రువం సుదుష్ప్రాపం స్థాన మాచన్ద్రతారకమ్ ॥ – పాద్మ.చర్యా. 11. 223 - 228

ఆస్థానే దేవమాస్థాప్య । చతుర్దిక్షు వేదాధ్యయనం కృత్వా । జయస్తోత్రై ర్దేవం సంస్తూయ । ఆలయ మావిశ్య । అభ్యంతరే పూర్వస్థానే సంస్థాప్య । అష్టాక్షరేణ పుష్పాంజలిం దత్వా । యాగశాలామాగత్య । పావకం పరిషిచ్య । పూర్ణాహుతి హోమం కుర్యాత్ ।

## 5. పూర్ణాహుతిహోమమ్ [1]

1. పునః ప్రాణానాయమ్య ॥ పూర్ణాహుతి హోమం క రిష్యే- అదితేనుమన్వస్వేతి పరిషే చనం కుర్యాత్ -

2. ఆచార్యః ప్రాఙ్ముఖ ఉదఙ్ముఖోవా భూత్వా ఆదౌ జిహ్వాహోమం కుర్యాత్-

ఓం మధ్యమే విశ్వరూపాయ స్వాహా । తత్పూర్వే కాళ్యై స్వాహా । యామ్యేకరాళ్యై స్వాహా । పశ్చమే మనోజవాయ స్వాహా । ఉత్తరే సులోహితాయ స్వాహా । ఆగ్నేయే ధూమ్రక్షాయ స్వాహా । నైరుత్యాం విస్ఫులింగాయ స్వాహా ॥

సమాహిత మనోభూత్వా సప్తజిహ్వాః ప్రకల్పయేత్ ॥

3. " సర్వరత్నాని ధాన్యాని ఫలాని కుసుమాని చ గన్ధ ద్రవ్యాణి వస్త్రాణి లోహాని వివిధాని చ । సర్వౌషధీ శ్చ తాంబూలం దక్షిణా భూషణాని చ ।" [2]

---

1. పాద్మ, క్రి.కై.చంద్రికా, పురుషోత్తమ సంహితలు పుష్పయాగానంతరం పూర్ణాహుతి నివ్వవలెనని చెప్పిననూ కపింజల, విష్ణుతిలకాదులు అవభృధాన్తముగా చెప్పినవి. చూ..అను..1,6 . పూర్వాచార్య ప్రయోగమున పూర్ణాహుతి అవభృధక్రియ చివరిభాగముగా కన్పడుచున్నది.

2. 'పరిషేచన పూర్వకముగా పూర్ణాహుతి నివ్వవలె. సర్వరత్నములు ధాన్యములు ఫలములు పూవులు గంధద్రవ్యములు వస్త్రములు లోహములు ఓషధులు, తాంబూలము, దక్షిణ, భూషణములు, అజ్యసిక్తములగు వివిధ అన్నములతో పూర్ణాహుతినివ్వవలె. ఇదం విష్ణురితి మన్త్రమున, యోదీక్షా మన్త్రమున మంగళవాద్యములతో జయశబ్దములతో పూర్ణాహుతి ద్రవ్యములను, వసోర్ధారేతి మన్త్రమున అజ్యధారను అగ్నియందుంచవలె" - నారా సం. 11.165-169.

హోమ ద్రవ్యాణి సర్వాణి పాత్రే నిధాయ, పూజాదికం కుర్యాత్ -

4. ద్వాదశ[3] గృహీతే నాజ్యేన స్రుచం పూరయిత్వా -

ఏకం, ద్వే, త్రీణి, చత్వారి, పంచ, షట్, సప్త, అష్టౌ, నవ, దశ, ఏకాదశ, ద్వాదశ, స్రుచా ఓం - ఇత్యాజ్యం గృహీత్వా ....

5. తదనంతరం కుక్కుటాండ ప్రమాణేన చరోః పిండం ఘృతాప్లుతం స్రుగావర్తే నిధాయ - స్రువేణ పిధాయ । నాసికాగ్రాన్త ముద్ధృత్య ।

**ఇదం విష్ణు రితి మన్త్రేణ*** సర్వమంగళ వాద్యైశ్చ జయశబ్ద సమాకులైః పూర్ణాహుతిం దద్యాత్-

ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధేపదం
సమూఢమస్య పాగ్ం సురే స్వాహా ॥

సప్తతే అగ్నే సమిధ స్సప్తజిహ్వా
స్సప్తర్షయ స్సప్తధామ ప్రియాణి ।

సప్తహోత్రా స్సప్తధాత్వా యజన్తి
సప్తయోనీ రాపృణస్వా ఘృతేన స్వాహా ॥

- అగ్నయే సప్తవత ఇదమ్ ।

**పూర్ణాహుతి ముత్తమాం జుహోతి ।**
సర్వంవై పూర్ణాహుతిఃసర్వమేవాప్నోతి ।
అథోఇయం వై పూర్ణాహుతిః । అస్యామేవ ప్రతితిష్ఠతి ॥

6. తదను వసోర్ధారేతి మన్త్రేణ ఆజ్యధారా మగ్నౌ క్షిపేత్ -

**వసో ర్ధారాం జుహోతి వసోర్మేధారా స దితివా ఏషా హూయతే ఘృతస్య వా ఏన మేషాధారా ఽ ముష్మిన్ లోకే పిన్వమా నోపతిష్ఠత ఆజ్యేన జుహోతి తేజో వా ఆజ్యం తేజో వసోర్ధారా తేజ సై వాస్మై**

3. "ఆజ్యం ద్వాదశ కృత్వస్తు గృహీత్వా పూరయే త్స్రుచం । తయా చాజ్యాహుతః కార్యా సా పూర్ణాహితి రిష్యతే"- చూ.. అను. 14. కపర్ది కారికలు.

* పాద్మ చర్యా. 11.88, పురు.సం. 24.48

తేజో ఽ వరుంధే ఽ ధోకామావై వసోర్ధారా కామానే వావరుంధే॥

– పూర్ణాహుతి ముహూర్త స్సుముహూర్తోస్తు ॥

7. ఇత్యాసనా దుత్థాయ స్రుచా పూర్ణాహుతిగ్ం హుత్వా –

(ముందు ద్రవ్యములు, ఆపై ఆజ్యధార)

**<u>ఉత్తర పరిషేచనమ్</u> –**

8. అదితేన్వమగ్గ్ం స్థాః । అనుమతేన్వమగ్గ్ స్థాః । సరస్వతేన్వమగ్గ్ స్థాః । దేవసవితః ప్రసావీః ॥

<u>ప్రణీతావోక్షణమ్</u>

♠(*'ఆత్మనః అగ్రే ప్రణీతాం సంస్థాప్య । ప్రోక్షణీజలం తస్యాం సంయోజ్య ।'*)

9. పూర్ణపాత్రమాదాయ పునఃపూర యిత్వా ।

సదసి సన్మేభూయా స్సర్వ మసి సర్వంమే భూయాః ।

పూర్ణమసి పూర్ణంమే భూయా అక్షితమసి మా మే క్షే స్థాః ॥

–ఇత్యభిమంత్ర్య ॥

10. యేనదేవాః పవిత్రేణ ఆత్మానం పునతే సదా । తేన సహస్ర ధారేణ । పావమాన్యః పునన్తుమా । ప్రాజాపత్యం పవిత్రం తశోద్యామగ్ం హిరణ్మయం । తేన బ్రహ్మ విదోవయం । పూతం బ్రహ్మాపునీమహే । ఇంద్రస్సు నీతీ సహ మా పునాతు । సోమ స్స్వస్త్యా వరుణ స్సమీచ్యా। యమోరాజా ప్రమృణాభిః పునాతుమా । జాతవేదా మోర్జయంత్యా పునాతు ॥ – ఇతి మార్జయిత్వా ॥

♠ ఇక్కడ నుండి ఈ విధముగా బ్రాకెట్లలో నివ్వబడినవి ఆయా సందర్భమున చెప్పబడిన క్రి.కై.చంద్రికా వచనములు. పూర్వాచార్య కృత కారికల నర్థము చేసుకొనుటకై ఈ విధముగా నివ్వబడినవని గమనించగలరు. – క్రి.కై.చం. 29 పరి. పేజి. నెం. 145

ఫలాదులు, అనేక ఉపాహారములు, బహుమాన ములను ఇచ్చి ఎవరుతృప్తిపరతురో వారు అఖిల భోగములను అనుభవించి, చివరన నా సాయుజ్యమును పొందుదురు " ఆపైన దేవుని రథమునుండి యానమునకు దించి ప్రదక్షిణ క్రమమున ఆలయ ప్రవేశము. ఇది దేవదేవుడగు శార్ఙ్గి రథోత్సవము.

8వ దినమున మృగయోత్సవము - భగవత్ప్రీతికరము సర్వారిష్ట వినాశకరము అగు మృగయోత్సవమున యాత్రోపకరణముల నలంకరించి నానాలంకారయుతుడగు దేవుని అశ్వరత్నము నధిరోహింపజేసి, జనులందరితో కలసి అడవికేగవలె - అక్కడ అర్చన, వేట - చుట్టూ సైన్యము రాగా మధ్యనగల క్రూరమృగములను భటులు హరి ఎదుట సంహరించెదరు - దేవుని ముందు ధనుర్బాణములను పూజించవలె - నాలుగు దిక్కుల నాలుగు బాణములను, ఊర్ధ్వమున కొక్కటి విడువవలెను - అర్చన - గ్రామ ప్రదక్షిణ - ఆలయ ప్రవేశము. (" పూర్వేద్యుః తీర్థ దివసా దేవస్య మృగయాభవేత్ । మృగయాదివసా త్పూర్వం జలద్రోణ్యవగాహనమ్ " అని పాద్మ చర్యా. 11. 180. - పాద్మము దేవేరులతో సహా దేవుని కృత్రిమాశ్వమున అధిరోహింపజేసి గ్రామోత్సవ పూర్వకముగా సైన్యముతో పొలిమేరవద్దకుగాని ఉద్యానవన మండపమునకుగాని చేర్చవలెనని ఆర్చించవలెనని చెప్పినది)

శేషహోమము - ఈ 8వదినమున అపరరాత్రియందు శేషహోమము చేయవలెనని పాద్మ విష్ణు తిలక సంహితలు చెప్పుచున్నవి.

పాద్మ.క్రియా. 30. 33,34,35. పాణిగ్రహణవిధి - " చతుర్థ్యా మపరరాత్రేషు శేషహోమం సమాచరేత్ । సమిధాజ్య చరు ప్రాయై రష్టోత్తర శతాహుతీః । జుహుయా న్మూల మంత్రాభ్యాం పంచోపనిషదైరపి । దినేతు పంచమే దేవం తైలేనాభ్యంజయే ద్ధరిమ్ । శ్రీభూమిసహితం దేవం స్నాపయే ద్విధిపూర్వకమ్ । "

విష్ణుతిలకం 7. 609,610 దేవీనాముద్వాహవిధి - " తుర్యేహ న్నపరరాత్ర్యాంవై శేషహోమం సమాచరేత్ । సమిధాజ్య చరుప్రాయై రష్టోత్తర శతాహుతీః॥ జుహుయా త్స్వేనమూలేన పంచోపనిషదైరపి । పూర్ణాహుతిం తతః కృత్వా పంచమే దివసేగురుః ॥" గాన శేషహోమము పాంచాహ్నికమున నాలుగవ దినమునలేదా నవాహ్నికమున 8వ దినమున అపరరాత్రియందు చేయవలసియున్నది. మూలమంత్రములు రెండింటితో పంచోపనిష న్మంత్రములతో విడివిడిగా (ప్రత్యేకం) 108 ఆహుతులు సమిధాజ్య చరువులతో హోమమొనర్చుట శేషహోమము.

<u>అవభృథోత్సవము</u> - అదే 8వరోజున అపరరాత్రియందు శేషహోమానంతరము తీర్థబింబాధివాసము (దీనిని పాద్మము కూడ విధించినది) - బింబ దక్షిణకరమున కౌతుక బంధనం - ధాన్య రాశి యందుంచి యథావిధి అర్చన - <u>నిశాచూర్ణ ఘట్టనము</u> (పసుపు దంచుట)- దేవునిముందు ధాన్య రాశియందు రోలునుంచి, అందులక్ష్మీదేవిని శ్రీసూక్తమున ఆవాహన మొనర్చి, మూలమంత్రమున మంత్రించిన క్షాళిత ముసలమును గ్రహించి ఋత్విక్కులు నిశాచూర్ణ ఘట్టన మొనరిమపవలె - ఇందు నలుగురు వైష్ణవులు/ వైష్ణవీలు పాల్గొనవచ్చు (గణికలు గీతములను పాడుచుండ అని పాద్మము) - ఆచూర్ణమును బాగుగా దంచి కుంభమందుంచి క్రొత్తవస్త్రముచుట్టి తండుల పీఠమున మూలవిద్యతో స్థాపించవలె - దానిని గంధముతో అర్చించి శ్రీసూక్తమున అభిషేకించవలె.

<u>9వదినమున ఉదయము</u> - వాహనమున దేవుని అధిరోహింపజేసి తీర్థబింబ పురస్సరముగా నద్యాది పుణ్యతీర్థములకు గాని , సరస్తీరమునకు గాని, సముద్ర తీరమునకు గాని చేరుకొని పౌర్ణమినాడు లేదా దర్శినాడు అక్కడగల జనసందోహమునకు దగ్గరగాగల మండపమునందు చాందినీక్రింద, భద్రపీఠమున తూర్పు/ ఉత్తర ముఖునిగా స్వామిని వాహనమునుండి దించి పీఠమునం దుంచవలె. స్వామిఎదుట 25/10/9/7/5 కలశలనుంచి అభిషేకించవలె. ఆయా తీరముల యందు గంగాది నదుల నావాహనజేసి చక్రబింబమును (చక్రాభావమున కూర్చ యని పాద్మము) తీసుకొని ఆచార్యుడు స్వయముగా బింబముతోసహా మూడుమార్లు మునుగవలె - ఆసమయమున దేవునితో మునుగు నరులెల్లరు అనేకమహాపాతక సంచయములు నాశనముకాగా , ఆచంద్రతారకమును, చేరనశక్యము అగు స్థానమును పొందుదురు.

ఆపై అర్ఘ్యాదుల దేవుని పూజించి పురుషసూక్తమున అన్నాదికములను నివేదించి బ్రాహ్మణులకు భోజన మిడవలె . యానమునదేవు నెక్కించుకొని అలయమున జేర్చవలె.

ఆరాత్రి దేవుని పుష్పయాగ మండపమున పూజించవలె. (మరుసటి దినమున చక్రాబ్జమున పుష్పయాగమని పాద్మము)

<u>మహోత్సవమున ఆచార్యునకు స్వేచ్ఛ</u> -మహోత్సవము జరుగు సమయమున ఆచార్యుడు తన ఇష్టానుసారము ఊహాపోహ విధానములతో కర్తవ్యమును మనోహరముగా నిర్వహింప వచ్చును. నవాహ ఉత్సవ మధ్యమున ఆచార్యుడు యథోచితముగా మహ దాశీర్వచనము, ఆస్థానోత్సవము, పుష్పదామ విలాసము, కవాట బంధనము దేవదేవీ సంభాషణములు, ఇంకనూ అనేక చిత్రవిచిత్రములను వినోదములను, కల్పించవలెను.

**అన్యచ్చమంగళం సర్వం కుర్యా ల్లౌకిక వర్త్మనా .... పాద్మ.క్రియా. 30.30.**

# భారద్వాజ సంహితోక్త

## విివాహప్రయోగము

### (రేజేటి చిన సింగచార్యులుగారి పాఠం)

పాఞ్చరాత్ర తాంత్రిక ప్రకారేణ విష్ణు వివాహ ప్రయోగ విధిరుచ్యతే

తతః యాగప్రతిమ మాదాయ । ధ్రువార్చాగ్రే విన్యస్య । అర్ఘ్యాద్యుపచారై రభ్యర్చ్య । దేవదేవ జగన్నాధ నారాయణ ధ్రువార్చా రూప ఉత్సవవిగ్రహ ముఖేన తిరుక్కల్యాణ మహోత్సవ మనుగృహాణ । అవధారయ – ఇతి ప్రకృతికార్యం విజ్ఞాప్య ॥

ప్రాణానాయమ్య – పూర్వోక్తైవంగుణ విశిష్టే శుభాభ్యుదయైక ముహూర్తే అస్యదేవదేవస్య.... రాత్రౌ వివాహమంగళం కరిష్యమాణః । ఆదౌ రక్షా బంధనం కరిష్యే ఇతి సంకల్ప్య । ధ్రువ కౌతుకబింబ దక్షిణ హస్తయోః పద్మప్రియే విష్ణుపత్నీమితి మంత్రద్వయముక్త్వా కంకణాని బధ్వా, నత్వా। ననిద్రామవధారయేతి త్రిః శయ్యాయాం శాయయేత్ । ఇతి ఏకాదశ్యాం కర్తవ్యః ప్రయోగః ॥

అథ ద్వాదశ్యాయాం సాయంకాలే బలికౌతుకం అనేన కల్యాణ మండపం నయిత్వా ప్రాణానాయమ్య । పూర్వోక్తైవం విశిష్టే శుభేభ్యుదయైక ముహూర్తే శ్రీరామచంద్ర వివాహ మంగళ మత్ర కరిష్య మాణః । ఆదౌ కల్యాణ మంటపాశ్రిత భూత బలిప్రదానం కరిష్యే । – ఇతి సంకల్ప్య – మంటప పూర్వభాగే బలిమండలే గంధపుష్పాక్షతోదకం విన్యస్య । శంఖపాలాదియే భక్తా కల్యాణాగార చక్రిణః । తేభ్యో బలిం ప్రదాస్యామి సర్వే గృహ్ణంతు సత్వరం । కల్యాణాగార భూతేభ్యః ఇమం బలిం దదామి । పశ్చాజ్జలం దత్వా ॥ హే శంఖపాలాదయః సర్వే యూయం సపరివారాః స్వార్పితం బలిం గృహీత్వా తృప్తా భవన్తు। వాద్యాదికం కుర్యాత్। బలి కౌతుకం దేవాగారం ప్రవేశయేత్॥

అథ యుంజానః ప్రథమ మిత్యాదికం పఠన్ కౌతుకదేవం కల్యాణగారం నయిత్వా । రత్న పీఠే సన్నివేశ్య । తత్పురతో మంగళ ద్రవ్యాణ్యాసాద్య । బ్రాహ్మణై రనుజ్ఞాతో తదేవ లగ్న మిత్యాదికం వాచయేత్ । ప్రాణానాయమ్య । దేశకాలా వనుకీర్త్య ... శుభతిథౌ దేవస్య అక్షతారోపణం కరిష్యమాణః । ఆదౌ కల్యాణమంటపాది సర్వప్రదేశ శుద్ధ్యర్థం అభ్యుదయార్థంచ స్వస్తిపుణ్యాహవాచనం కరిష్యే । తదంగ విష్వక్సేన పూజాం కరిష్యే । ధ్యాయామీత్యాది షోడశోపచారాన్కృత్వా। ఓం నమో భగవతో బలే నేత్యాది పుణ్యాహం వాచయేత్ । ఏవం విశిష్టే శుభేభ్యుదయైకముహూర్తే అస్యదేవదేవస్య జగత్కుటుంబినః శ్రీరామచంద్ర మంగళాంగ ద్వితీయ యజ్ఞోపవీతధారణం కరిష్యే ।

స్వర్ణయజ్ఞోపవీతం హస్తే గృహీత్వా । గంధద్వారా మిత్యభిమంత్ర్య । యజ్ఞోపవీతమితి మంత్రేణ ధారయిత్వా। కన్యాం వృణీధ్వమితి ద్వౌద్వౌ బ్రాహ్మణాన్ ప్రేషయేత్। తే కన్యాదాతారం గత్వా బ్రువతే – దాస్యామితి అచ్యుత పరబ్రహ్మ నారాయణ నిరాకార సాకార పంచార్షేయ ప్రవరాన్విత అచ్యుతగోత్రోద్భవాయ – పరబ్రహ్మణ శర్మణో నప్త్రే, నారాయణశర్మణః పౌత్రాయ, ప్రద్యుమ్నశర్మణః పుత్రాయ, శ్రీ జనార్దన శర్మణే వరాయ – సౌభాగ్య విశ్వంభర నిరాకారసాకార త్రయార్షేయ ప్రవరాన్విత సౌభాగ్యసగోత్రస్య – విశ్వంభరశర్మణోనప్త్రీం, రత్నాకరశర్మణః పౌత్రీం, క్షీరార్ణవశర్మణః పుత్రీం లక్ష్మీనామ్నీం కన్యాం వృణీమహే। వృణీధ్వం – దాస్యామీతి ప్రతివచనం। తతః విధివత్కృత స్వర్ణకంకణే శ్రీమన్నారాయణాయ ఇత్యభిమంత్ర్య, హరిద్ర మనులిప్య, పద్మప్రియే, విష్ణుపత్నీం ఇతి మంత్ర ద్వయముక్త్వా । దేవీదేవయోః రక్షాబంధనం కుర్యాత్। అథో త్తరాగ్ర కూర్చోపరి స్థిత కలశం హస్తే గృహ్య నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి । తన్నో విష్ణుః ప్రచోదయా దిత్యభిమంత్ర్య। ఇమంమే గంగేయమునే సరస్వతి ఇతి దేవస్య మన్త్రోత్సవనం కృత్వా। దేవమలంకృత్య। సకలారాధనై శ్శోభనమస్తు॥ దధిమధు సమ్మిశ్రం మధుపర్కం సువర్ణపాత్రే నిధాయ । పవిత్ర ద్వయం నిధాయ। మధువాతాఋతాయే త్యభిమంత్ర్య । శ్రీమతే నారాయణాయనమః ఇతి త్రిః ప్రాశయేత్ । సకృత్తూష్ణీం । చరణం పవిత్రమితి ఉచ్చై రుక్త్వా గాంవిసర్జయేత్ । ఆవరణ వస్త్రంకృత్వా । ప్రాణానాయమ్య । ఏవం విశిష్టే శుభాభ్యుదయైక ముహూర్తే శ్రీ రామచంద్ర ప్రీత్యర్థం యథాశక్తి సాలంకృత కన్యాదానంకరిష్యే। పుష్పాక్షతోదకం గృహీత్వా। కన్యాంకనక సంపన్నాం ... బ్రహ్మలోక జిగీషయా సీతానామ్నీ మిమాం కన్యాం యథాశక్తి విభూషితాం దాస్యామి విష్ణవే తుభ్యం దత్తా దేవం సమాశ్రయేత్ ॥ రాజ్ఞేత్రైలోక్యనాథాయ, సమన్విత వశిష్ఠగోత్రోద్భవాయ, దశరథ పుత్రాయ శ్రీరామచంద్ర వరాయ తుభ్యం – ... ప్రవరాన్విత గౌతమ గోత్రోద్భవాం అముష్య నప్త్రీం, పౌత్రీం, పుత్రీం సీతానామ్నీం కన్యాం అహం సర్వలోక రక్షణ ధర్మప్రజాసహత్వ కర్మభ్యః ప్రతిపాదయామి । కన్యాదానంకృత్వా – దేవస్య యథాశక్తి సువర్ణ దక్షిణాం దద్యాత్ । మంగళాష్టకాని పఠిత్వా – శ్రీరామాకుచకుంభ ....... (మంగళాష్టకములు) చూర్ణికా ॥ న్వన్న్యష్టాశీతి నహస్రాణాం ..... మహోత్సవాష్టోత్తరశతసంహితాసార భారద్వాజ సంహితా ప్రకార శ్రీ పాంచరాత్రోక్త భగవద్దిన ధ్వజారోహణ తిరుక్కల్యాణ మహోత్సవస్య తిథి వార నక్షత్ర యోగకరణ ముహూర్త లగ్న హోరా నవాంశ ద్వాదశాంశ త్రింశాంశకానా మనవరత మనుకూల శుభైశ్శోభనానాం సర్వేగ్రహా స్సనక్షత్రాః ఏకాదశస్థాన ఫలదా స్సుప్రసన్నా భవంతు । తతః గుడజీరకాన్ హస్తే గృహీత్వా । అఘోరచక్షు...., ధ్రువంతేరాజా ... ఇతి మంత్రద్వయం ఉక్త్వా

దేవీదేవయోః శిరసి నిక్షిపేత్ । ఆవరణ వస్త్రమపాస్య । లక్ష్మీం దృష్ట్వా ఆశునస్సశాన ఇత్యాసనం దత్వా । లక్ష్మీం కన్యాం ఆవాభ్యాం సృష్టి నిర్మాణకరాణి కర్మాణి కర్తవ్యానీతి శిరః ప్రదేశే హిరణ్యపాత్రే నిధాయ । పవిత్ర ద్వయం నిధాయ । హిరణ్యవర్ణాం హరిణీం .. ఇతి సూక్తే న స్నాపయిత్వా । యువం వస్త్రాణీతి దేవ్యా క్షౌమాంబరం ధారయిత్వా । అథ వృద్ధస్త్రీభి రనుజ్ఞయా మాంగళ్య తంతునానేన ... ఇతి మంగళసూత్రం ధారయిత్వా । ప్రాణానాయమ్య । ఏవంవిశిష్టే శుభాభ్యుదయైక ముహూర్తే దేవీదేవయో రక్షతారోపణం కరిష్యే- నారాయణాంజలౌ లక్ష్మీకరస్పృష్టాన్ అక్షతాన్ నిధాయ । ఫలముపరి విన్యస్య । గన్ధద్వారామితి వారిధారం కృత్వా । ప్రజాపతి స్త్రియాం యశః .... ప్రజామేకామ స్సమృధ్యతాం । పశవో మేకామ స్సమృధ్యతాం । యజ్ఞోమేకామ స్సమృధ్యతాం । ఏవం త్రిరక్షతానారోపయేత్ । తూష్ణీ చతుర్థం । తతః విశ్వేత్తాతేసవనేషు ... ఇతి సువర్ణసహిత బ్రహ్మ బంధనం కృత్వా । పునర్దేవాగారం ప్రవిశ్య । యాగావేద్యాం దేవముపవేశ్య । ప్రాణానాయమ్య । ఏవం విశిష్టే శుభాభ్యుదయైక ముహూర్తే వివాహ ప్రధాన హోమం కరిష్యే - పూర్వదిన స్థాపిత చక్రకుండాగ్నిం ద్విముఖం చైకహృదయ మిత్యా ద్యలంకృత్య । ఇధ్మా ధ్యాఘా రాన్తం కృత్వా । పంచసూక్తాని ఏకైక ఋచా హుత్వా । ప్రాణానాయమ్య । ఏవం విశిష్టే శుభేభ్యుదయైక ముహూర్తే పతిగృహీత లక్ష్మీవివాహాగ్ని ప్రవేశ స్థాలీపాక హోమం కరిష్యే । అష్టాక్షరేణ, ద్వాదశాక్షరేణ, మన్త్రద్వయ, షడక్షరేణ చ క్రమేణ ప్రతిమన్త్ర మష్టావింశతి వారం హుత్వా । తతః దర్వ్యా మభిఘార్య । చరుం ద్విరవదాయ । పునరభిఘార్య । హిరణ్య గర్భ స్సమవర్తతాగ్రే ........హవిషావిధేమ స్వాహా। ప్రజాపతయ ఇదం నమమ । పునః దర్వ్యా ముపస్తీర్య । అభిఘార్య । చరుం ద్విరవదాయ । పునరభిఘార్య । ప్రజాపతే నత్వ దేతా న్యన్యో విశ్వాజాతాని .... రయీణాగ్ స్వాహా । ప్రజాపతయ ఇదం నమమ । సమిత్సన్నహనే అద్భి స్సంస్పర్శయిత్వా । అగ్నయ ఇదం నమ మేతి సమిధ మగ్నౌ నిధాయ । రుద్రాయ తంతు చరాయ ఇదం నమమ । అప ఉపస్పృశ్య । అస్మిస్కర్మణి కర్మ శుద్ధ్యర్థం జయాది హోమం కరిష్యే । చిత్తం చస్వాహా ... ..........శేషమార్జనాన్తం కృత్వా । దేశకాలామనుకీర్త్య । అనేన మయాకృతేన ప్రధానాది హోమేన భగవాన్ సర్వాత్మకః శ్రీ యజ్ఞపురుష స్సుప్రీయతాం నమమ । ఇత్యక్షతోదకం విసృజేత్ । ద్వాదశ్యాం కర్తవ్య ప్రయోగ స్సమాప్తః ॥

అథ త్రయోదశ్యాం ప్రాతః భగవతః షోడశోపచారాన్ కృత్వా । యాగ కౌతుకం యాగవేద్యాం ఉపవిశ్య । దేశకాలా వను కీర్త్య । శుభ తిథౌ రామచన్ద్ర ప్రీత్యర్థం ప్రాతరౌపాసనం కరిష్యే । ద్విముఖం చైకహృదయ మిత్యగ్నిం ధ్యాత్వా । భూర్భువస్సువరితి పరిషిచ్య । అహవనీయాయ నమః .. ఇత్యలంకృత్య । అదితేనుమన్యస్వేతి పరిషిచ్య ।

ఆజ్య మధిశ్రిత్య । విష్ణుసూక్త ప్రకారేణ హోమం కృత్వా । అదితేన్వ మగ్గ్ం స్థాః ఇత్యుత్తర పరిషేచనం కృత్వా । మన్త్ర హీనం క్రియాహీనం భక్తిహీనం హుతాశన యద్ధుతన్తు మయాదేవ పరిపూర్ణం తదస్తు తే ॥ ఇతి ప్రార్థ్య ॥. పునః పరిషించ్య। అలంకృత్య। ఆజ్యనైవేద్యం దత్వా। అనేన ప్రాతరౌపాసనహోమేన శ్రీరామ చన్ద్రప్రీయతాం నమ మేతి అక్షతోదకం విసృజేత్। ఏవం ప్రకారేణ ఇధ్మాది వర్జం పౌండరీక హోమాన్తం ప్రాతస్సాయం హోమం కుర్యాత్। హోమానన్తరం ఉత్సవ ఘోషవర్జం బలిం దద్యాత్।

అథ పౌర్ణమాశ్యాం రాత్రౌ ఉత్సవానంతరం యాగవేద్యాం దేవ ముపవిశ్య । ప్రాణా నా యమ్య। దేశకాలావనుకీర్త్య। శుభతిథౌ శ్రీరామ చన్ద్ర వివాహ వ్రత పూర్ణార్థం పౌండరీక హోమం కరిష్యే । ఇతి సంకల్ప్య । ద్విముఖం చైకహృదయమితి అగ్నిం ధ్యాత్వా గాయత్ర్యా ప్రక్షాళ్య। ఆహవనీయాయనమః ఇత్యలంకృత్య। అదితేనుమన్యస్వేతి పరిషిచ్య । మూలమన్త్ర ద్వాదశాక్షార మన్త్రరత్నైః ప్రతిమన్త్ర మష్టౌ దశవారం హుత్వా అథితేన్వ మగ్గ్ స్థాః ఇతి గాయత్ర్యా పరిషిచ్య। పునరలంకృత్య। ఆజ్య నైవేద్యం దత్వా। మూల మన్త్రేణ పూర్ణాహుతిం హుత్వా। యాతే అగ్నే యజ్ఞియా ..... సక్షయ ఏహి ఇతి ఆచార్య హస్తం సంతప్య, హరే ర్ముఖవాసం కారయేత్ । తతః ప్రాత రవభృధస్నానం । మహానదీం గత్వా। చక్ర తీర్థ మహోత్సవానంతరం, పునరాగమనే పరకాలవైభవానంతరం, దేవీకృత కవాట బంధనోత్తర ప్రత్యుత్తరాదికం నిర్వర్త్య। ఆలయం ప్రవిశ్య। ప్రాణానాయమ్య దేశకాలా వనుకీర్త్య। శుభతిథౌ భగవ ద్దివ్యకల్యాణాం గత్వేన ఆరోపిత ధ్వజావతరణం కరిష్యే.। ఇతిసంకల్ప్య । ధ్వజారోపణదినవ దుత్సవ ఘోష సహితం ఉద్వాసన బలిం దత్వా । గరుడాయ ముద్గాన్నం నివేద్య । గరుడ గద్య మాత్రం పఠిత్వా । సుపర్ణోసీతి ధ్వజావతరణం కృత్వా। హే బ్రహ్మాదయః సర్వే యూయం ఉద్వాసనం బలిం గృహీత్వా తృప్తాస్సన్తు। స్వం స్వం స్థానం గచ్ఛధ్వం। ఇత్యుచ్చైరుక్త్వా, దేవాన్ విసర్జయేత్। తతః పుష్పయాగదినే స్పృష్టా స్పృష్ట దోష నివృత్యర్థం భగవతో ద్వాదశారాధన ప్రబన్ధపఠనాదికం కుర్యాత్ । ఇతి శ్రీపాంచరాత్ర తాన్త్రిక ప్రకారేణ విష్ణు వివాహ ప్రయోగః సమాప్తః ॥ (ధ్రువన్తు గ్రామరక్షార్థం అర్చనార్థంతు కౌతుకం। స్నానార్థం స్నపనం ప్రోక్తం ఉత్సవం చోత్సవార్థకం బల్యర్థం బలిబేరంచ పంచ బేరాణి కల్పయేత్ ॥)

(ఈ శ్లోకంతో సహా ఈ గ్రంథం, విశ్వావసు సంవత్సర మార్గశిర శుద్ధ 13 బుధవారం సర్కి రేజేటి చినసింగరచార్యులుగారు వ్రాసుకొన్న భరద్వాజ సంహితోక్త ప్రతిష్ఠాన్తర్గత కల్యాణ విధినుండి గ్రహించబడినది. రేజేటివారి వంశవృక్షం ప్రకారం వీరు పేర్కొన్న విశ్వావసు సంవత్సరమునకు సరియగు ఆంగ్లసంవత్సరం క్రీ.శ.1845)

## ఏకాహ్నిక కల్యాణోత్సవమ్

ఏకాదశ్యాం ప్రాతరుత్సవాన్తే ఏకాహ్నిక దివ్య కల్యాణ విధిరుచ్యతే - ఏవం విశేషణ విశిష్టే శుభాభ్యుదయైక ముహూర్తే ఏకాహ్నిక దివ్య కల్యాణ మహోత్సవాంగ మృత్యంగ్రహణ ప్రత్యామ్నాయ తండులగ్రహణం కరిష్యే ॥ ఏకాహ్నిక దివ్య కల్యాణోత్సవ అంకురార్పణ ప్రభృతి అవభృథ పర్యన్తం తన్మధ్యే తత్త త్కర్మకరణ యోగ్యతా సిద్ధ్యర్థం రక్షా సూత్ర బన్ధనం కరిష్యే ॥ ఇడావాచన, ద్వారతోర ణాన్తరాళ పతాకపూజా, వాస్తుపూజా, యోగేశ్వర పూజాం కృత్వా - పాయసాన్నేన పూర్వ వద్బలిహరణం కృత్వా - విశేష నివేదనం నీరాజన మన్త్ర పుష్ప నమస్కారాన్ సమర్ప్య -సాయంకాలే, పూర్వ వద్ధోమం బలిప్రదానం కృత్వా । తద్రాత్రః ఏకాహ్నిక దివ్య కల్యాణోత్సవం కరిష్యే ఇతి సంకల్ప్య -

విష్వక్సేన పూజా పుణ్యాహవాచనం కృత్వా । అక్షతారోపణం కృత్వా । దేవమభ్యర్చ్య । కూర్మాది దశావతార హోమ, నక్షత్ర హోమ, సప్తావరణ హోమ, వైకుంఠపార్షద హోమ, కేశవాది చతుర్వింశతి నామహోమ, మత్స్యకూర్మాది దశావతారహోమ, శేష హోమ, జయాదిహోమ, ప్రాయశ్చిత్తహోమాన్సగ్గ్ స్కరిష్యే ఇతి సంకల్ప్య । హోమానన్తరం పాయసాన్నేన బలిదానం కృత్వా । పావకం పరిషిచ్య । పూర్ణాహుతిర్హుత్వా । చూర్ణోత్సవం కుర్యాత్ । అవభృథస్నానాంగ కలశ స్థాపనం కరిష్యే । కలశోదకేన దేవం మార్జయిత్వా । ఇత్యవభృథ స్నానం కృత్వా । నైవేద్య నీరాజన మన్త్రపుష్ప నమస్కారాన్ సమర్ప్య । పూర్వవ దభ్యర్చయేత్ । ఇతి ఏకాహ్నిక దివ్యకల్యాణోత్సవ విధిః ॥ మృత్సంగ్రహణం యథా కుర్యా త్తండులానితథా కురు। ధ్వజకర్మ వినాకార్యం సర్వం పూర్వవ దాచరేత్ ॥

**(డా॥ ఉప్మాకయ్యగారు, రేజేటి శ్రీరంగనాయకులు గార్ల తాళపత్రప్రతులనుండి.)**

("ఉత్సవే త్రిది నైకాహ సాధ్యే శ్రద్ధా ప్రవర్తితే । బలిప్రదానం సుమనోయజనం చాధివాసనమ్ । నవానామపి కుంభానాం తథా తీర్థావగాహనమ్ । మృగయాచ జలద్రోణీ వర్జనీయాని పద్మజ। తావత్యే వోత్సవదినే తీర్థాన్తే గ్రామ వీధిషు । బ్రహ్మాది దేవతాస్సద్య స్సమావాహ్య బలిం క్షిపేత్ । కేవలోదన మగ్నేచ హోమో నిశ్యధివాసనమ్। స్నపనం ఏషువాద్యేషు నద్యా దావగాహనమ్ పుష్పయాగో జలద్రోణీ మృగయాచ నయుజ్యతే । అన్యత్సర్వం యధాపూర్వం కర్తవ్యం ఫలకాంక్షిభిః॥"

---- పాద్మ. చర్యా. 11. 287-292 )



## అనుబంధము - 3
# భగవత్పుణ్యాహవాచనమ్

మృత్సంగ్రహణమునకు ముందుగా పుణ్యాహమును, దానికి ముందు విష్వక్సేవపూజను జరిపింపవలెనని శ్రీప్రశ్న సంహిత 31వ అధ్యాయమున 2 నుండి 25 శ్లోకములయందు చెప్పబడినది. కాని విధివిధానములు మాత్రం చూచినమేరకు ఏ సంహిత యందుననూ పూర్తిగా లభించలేదు.

(ఈ అనుబంధము వ్రాయుట పూర్తియైన తర్వాత అడయార్ పుస్తకభాండాగారం నుండి భరద్వాజ (కణ్వ) సంహితను, తత్సంహితనుసారియగు ప్రతిష్ఠా వివాహ ప్రయోగములను తెప్పించడం, అందు ప్రతిష్ఠా ప్రయోగమున, ఈ మా భగవత్పుణ్యాహవచనమునకు ఆధార భూతమగు "భగవత్పుణ్యాహ వాచనము" లభించడం జరిగినది. అది లభించిన తర్వాత ముందు వ్రాసిన ఈ చర్చ అంతా అవసరము కాదు. కాని, చేసిన కృషి, అందు లభించిన కొన్ని ముఖ్యాంశములు అందరికీ తెలియజేయవలెనని ముందు వ్రాసినవి అవసరమగునంత మేరకు ఇవ్వబడుతున్నాయి.)

అందుచేత పూర్వాచార్య ప్రయోగములను గ్రహించి వానిని పరిష్కరింప పూను కొంటిమి. అందునా మనమీనాడు కొత్తగా ప్రాయోగికగ్రంధ నిర్మాణమొనరించుటలేదు. ఆ పనిని పూర్వాచార్యులెన్నడో చేసియున్నారు. కాలగతియందు వానిలో స్ఖాలిత్యములులేర్పడి, ప్రక్షిప్తములు చేరియుండవచ్చును. శాస్త్ర విరుద్ధములగు అట్టివానిని గుర్తించి, సూచించి, తగు కారణములను వివరించి, సరియగు పాఠము నెన్నుకొనుటయే ప్రస్తుత పరిష్కరణము. శాస్త్రమును ముందిడుకొని ప్రయోగమును తయారు చేసిన అది స్వతన్త్ర ప్రయోగ మగునేమో గాని దానికి ఆచార సంప్రదాయత్వములు సిద్ధించవు. ప్రాయోగిక గ్రంథ విషయమున శాస్త్రానుసరణముతోబాటు ఆచార సంప్రదాయములకు సమప్రాధాన్యత గలదు.

లభించిన మాతృకలలో నాలుగింటియందు విష్వక్సేనపూజా, పుణ్యాహములు లున్నవి -

1. రేజేటి బలరామయ్యగారి తాళపత్ర ప్రతి – విష్వక్సేనపూజ, పుణ్యాహము (కలశలున్నవి) (1821) ఇది నేడు ప్రయోగముననున్న ప్రతికి చాల దగ్గరగానున్నది.
2. భద్రం శ్రీరామాచార్యులు గారి తాళపత్ర ప్రతి – విష్వక్సేనపూజ, పూణ్యాహము (కలశలులేవు) (1800) భగవతోబలేనతో ప్రారంభం – బ్రాహ్మణేష్వమృతగ్ం, వాస్తోష్పతే మన్త్రములున్నవి.

3. రేజేటి చిన సింగరాచార్యులు గారి తాళపత్ర ప్రతి - విష్వక్సేనపూజ, పుణ్యాహము (కలశలు లేవు) (1845) భరద్వాజసంహితోక్త ప్రతిష్ఠాన్తర్గతం - బ్రాహ్మణేష్వమృతగ్ం, వాస్తోష్పతే మన్త్రములున్నవి.
4. భద్రం కృష్ణమాచార్యులు గారి తాళపత్ర ప్రతి - విష్వక్సేనపూజ, పుణ్యాహము (కలశలున్నవి) (1862) శ్రీ కూర్మ గ్రంధానికి అనుసరణ - బ్రాహ్మణేష్వమృతగ్ం, వాస్తోష్పతే మన్త్రములున్నవి.
5. గ్రంధపట్టికలోనున్న కాగితపు ప్రతులు నాలుగింటియందూ కొద్దిపాటి భేదముతో నేడు ఉపయోగపడుచున్న గ్రంధమున్నది (1950 - 1990)

దక్షిణాది సంహితలలో మొదటిదగు ఈశ్వర సంహిత పుణ్యాహమును కొంతసూక్ష్మముగ వివరించినది. విష్ణుతిలక సంహిత దానినే విపులముగ వాసుదేవ పుణ్యాహమను పేరున దేవసన్నిధియందు విధించి, మానుష పుణ్యాహముపై నిషేధమును కూడ ప్రకటించి, విధానమును కూడ వివరముగా నిర్దేశించినది. మన్త్రసిద్ధాన్తానుసారినని ప్రకటించిన అత్యన్త లోకప్రియ సంహిత 'పాద్మము' వాసుదేవ పుణ్యాహమును స్పృశించలేదు. పాద్మానుసారి, అతి ప్రామాణిక ప్రయోగ గ్రంధము అగు క్రియా కైరవ చంద్రిక కూడ వాసుదేవ పుణ్యాహమును విడిచిపెట్టినది. గాన వాసుదేవ పుణ్యాహమనునది ఆగమ పుణ్యాహవిధికి అర్వాచీన వివరణమనియూ, క్రియాకైరవ చంద్రికకాలము నాటికి గూడ దానికంత ప్రాచుర్యము లేదనియూ భావింపవలసి వచ్చుచున్నది. అదియునూగాక పుణ్యాహవాచనము స్వదేహశుద్ధికి, సంబారముల శుద్ధికి ఉద్దేశించబడిన మానుష ప్రక్రియాంశ, కర్మ సంబంధి గాని పాంచరాత్ర సిద్ధాన్త సంబంధిగా తోచుటలేదు. గాన ఈ ప్రక్రియ కేవల పుణ్యాహమా, వాసుదేవపుణ్యాహమా, భగవత్పుణ్యాహమా, ఏకాయన పుణ్యాహమా అను మీమాంసకు అంతప్రాధాన్యమీయ నవసరము కన్పించుటలేదు. కాని భగవత్పుణాహముపై వచ్చిన కొన్ని ఆక్షేపణలను దృష్టియందుంచుకొని ఈక్రింది పరిశీలన మనివార్యమగుచున్నది.

**'పుణ్యాహవిధి' - సంహితా శ్లోక పరిశీలనము**

1. ఈశ్వర సంహిత - 10వ అధ్యాయము - 20 - 51 శ్లోకములు
2. విష్ణుతిలకము - 5వ అధ్యాయము - 25 నుండి 100 శ్లోకములు

(క్రింద నిచ్చిన 1-ఈశ్వరసంహితనూ, 2- విష్ణుతిలకమునూ సూచించును)

- 1. ఈ.సం.- విష్వక్సేనపూజ - స్వదేహశుధ్యర్థం పుణ్యాహవాచనము
2. వి.తి.- దేవసన్నిధిని వాసుదేవపుణ్యాహము చేయవలె - మానుష పుణ్యాహ మొనర్చిన మందిరము శూన్యమగును

- 1. ఈ.సం.- శుద్ధభూతలమున ధాన్యపీఠ ప్రకల్పనము
2. వి.తి.-గోమయమున అలుకవలె - ప్రాఙ్ముఖుడుగా లేదా ఉదఙ్ముఖుడుగా ఆసీనుడై ప్రాణాయామ త్రయము చేయవలె, భూతశుద్ధి - సంకల్పము
- 1. ఈ.సం.----
2. వి.తి.-తిల వ్రీహి యవాత్మక చతుర్దళాత్మక పద్మమును విశ్వవిద్యతో లిఖించవలె
- 1. ఈ.సం.-గంధవారి సంపూరిత రత్న, హాటక, కూర్చ స్రక్ వస్త్రపల్లవయుత, చన్దనాద్యుపలిప్త అర్ఘ్యచర్చిత మంగళకుంభము నుంచవలె
2. వి.తి.-ఆ పద్మకర్ణిక యందు శుద్ధజల పూరితము, కూర్చా పిధానపత్రయుతము, తంతువేష్టనవేష్టితము అగు కుంభమును, పురుష, విద్యతో, ప్రాగగ్ర ఉదగగ్రదర్భలయం దుంచవలె
- 1. ఈ.సం.- --
2. వి.తి.-ప్రాగాది చతుర్దిక్కులయందు ప్రాగగ్ర ఉదగగ్రములుగా కుశలనుంచి వానిపై అర్ఘ్యాదులను కల్పించవలె. కలశమునకు (కుంభము) క్రింద యోగపీఠ మును కల్పించి ఆ కలశము నందు హృదయాంబుజమునుడి సుదర్శనదేవుని 'అగచ్ఛ' అనుచూ ఆవాహన మొనర్చవలె - ఆవాహన ముద్ర చూపవలె - అర్ఘ్యాదులలో పూజ - నివేదనము
- 1. ఈ.సం.-నలుగురు ఋత్విక్కులను కుంభమునకు నాలుగు వైపుల నుంచవలె- వారికి దక్షిణ తాంబూలాదులు - ఆపై కుంభమున సుదర్శనావాహన, అర్చన- హృదయమున అచ్యుతుని ధ్యానించుట - దేశికుడు బ్రాహ్మణులతో గలిసి దర్భలతో కలశము స్పృశింపవలె - ఓంకారాద్యము పవిత్రాన్తమునగు మన్త్ర చతుష్టయమును ముందుగా జపించవలె- గాయత్రీ త్రితయాన్వితమగు పుణ్యాహశబ్దమును పఠించవలె.
2. వి.తి.-ఆపై ఆచార్యుడు ద్వాదశాక్షరిని, పవిత్రమన్త్రమును, త్రిపదామను మన్త్రమును ఋత్విజులతో కలిసి జపించవలె-
- 1. ఈ.సం.---- 2. వి.తి.- ఆచార్యుడు ప్రణవాదిగా పుణ్యాహశబ్దము నుచ్చరించవలె
- 1. ఈ.సం.----2. వి.తి.- సుదర్శన షడర్ణమును 108 సార్లు జపించవలె.
- 1. ఈ.సం.---
2. వి.తి.-ఆపై వాసుదేవాది నలుగురు భగవన్మయుల నామములను ప్రణవాదిగా కీర్తించవలె

- 1. ఈ.సం.- ఆపై ఆత్మానువాదము (ఏకపదీత్యాదులు), ఆత్మవ్యూహము (చతుర్విధాదులు), ఆపై శుద్ధి మన్త్రములు పఠించవలె. (ఇక్కడ శివంపానీయాదులు లేకపోవుట గమనార్హము) 2. వి.తి.- ప్రకృతిని, బ్రహ్మను, ఆత్మను చూచుచున్నటుల (ఏషాసా పరాప్రకృతి, ఏషత్పరం బ్రహ్మ .. ఇత్యాదులు) స్వయముగా జపించవలె. వాసుదేవ ప్రథమతో కరోతును చేర్చి జపించవలె - చతుర్విధ సర్వజ్ఞ సర్వేశ్వరాదులు, ఆత్మవ్యూహ ఆత్మానువాదములు, ఆపైన శివపానీయం భగవద్వాసుదేవయోః కరోతు అనునవి చేర్చవలె - అక్షతైరక్షతం చాస్తు అనుచు అక్షతం అరోగం కుశలం భగవాన్వాసుదేవయోః కరోతు అనునాలుగింటిని ఉద్ధరించవలె - సుమన శ్శబ్ద షష్టిని భగవన్ వాసుదేవాదుల ప్రథమను, కరోతి పదమును చేర్చవలె. - ఏషగతి పదము ముందుంచి తర్వాత భగవత్పద ప్రథమనుంచి, వాసుదేవాది చతుర్మూర్తులను ఉద్ధరించవలె - ఆపై ఓం భగవాన్ వాసుదేవో వర్ధతాం ... మొ॥లగు నాలుగు, ఆపై ఓం పురుషోవర్ధతాం, ఓంసత్యో ..., ఓంఅచ్యుతో..., ఓంఅనంతో వర్ధతాం అను నాలుగు, మొత్తం 8 జపించవలె ఆపై పూర్వవత్ ఓంభగవాన్ వాసుదేవః ప్రీయతాం... అంటూ పై ఎనిమిదింటినీ చెప్పవలె - ఆపై ఓం భగవాన్ వాసుదేవ శాన్తిరస్తు మొ॥గు నాలుగు చెప్పవలె.

- ఆపై ఏకాయన శుద్ధిమన్త్రాలు ఈ క్రిందనిచ్చిన అర్థంలో(విష్ణుతిలకముఈశ్వర సంహితలు రెండూ కూడ చాలావరకు ఇవే శుద్ధిమన్త్రముల నిచ్చినవి - పెద్దగా భేదము లేదు)

'పవిత్రం భగవాన్ వాసుదేవః పరాత్పరం, పవిత్రం సంకర్షణోదేవః, పవిత్రం ప్రద్యుమ్నః, పవిత్రం అనిరుద్ధః, - ఆపైన శుద్ధయే మొదటిపదంగా వాసుదేవ, లాంగలి, ప్రద్యుమ్న, అనిరుద్ధ, పురుష, సత్య, అచ్యుత, అనంత, గోవిన్ద, కేశవ, నారాయణ, మాధవ గోవింద,మహావిష్ణు, మధుసూధన, త్రివిక్రమ, వామన, శ్రీధర, హృషీకేశ, పద్మనాభ, దామోదర, మీనాత్మ, కూర్మాత్మ, వరాహాత్మ, నృసింహాత్మ, వామనాత్మ, దాశరథిరామ, హరి, శ్రీకృష్ణ, బలరామ, కల్కి మూర్తులను ; ఆపై విభవమూర్తులు - పద్మనాభ, ధ్రువ, అనంత, శక్తీక, మధుసూదన, విద్యాధిదేవ, కపిల, విశ్వరూప, విహంగమ, క్రోడాత్మ, బడబవక్త్ర, ధర్మ, వాగీశ్వర, ఏకార్ణవాన్తశాయి, కమఠరూప, వారాహ, నృసింహ, అమృతాహరణ, శ్రీపతి, కాన్త, అమృతధారక, రాహుజిత్, కాలనేమిఘ్న, పారిజాతహర, లోకనాథ, దత్తాత్రేయ, న్యగ్రోధశాయీ, ఏకశృంగ,

వామన, త్రివిక్రమ, నర, నారాయణ, హలీ, కృష్ణ, పరశురామ, రామ, కల్కి పాతాళశయన ప్రభువు అను 38 మంది ; దేవేరులు శ్రీయాదులు, చక్రాది ఆయుధమూర్తులు; సహస్రఫణి అనంతుడు, వైనతేయుడు, గణాధ్యక్షుడు విష్వక్సేనుడు, చండప్రచండాది ద్వారపాలురు, ఇన్ద్రాది లోకపాలురు, కుముదాది భూతేశులు, సనకాది యోగులు, ఋషులు, న్యూనాధిక శుద్ధికి శంఖచక్ర గదాపద్మ యుక్తుడు, సర్వేశ్వరేశ్వరుడు, ప్రభువు అగు భగవానుడు, కర్మపూరణమునకు నారాయణుడు; పరాత్పరుడగు పరమాత్మ - <u>దివ్యములు స్థితములునగు ప్రతిమల పరిశుద్ధికి</u>, ప్రాసాద గోపురాదుల శుద్ధికి, యాగస్థాన, యాగోపకరణ శుద్ధికి, జనపదములకధిపతియగు రాజు, క్షేత్రవాసుల విభుడు, బ్రాహ్మణాది వర్ణములవారు, ఆయా ఆశ్రమవాసులు, వేదశాస్త్రాగమజ్ఞులు శుభాత్మకులగు వ్రతస్థులు. పంచకాల విధిజ్ఞులు పాంచరాత్రరతాత్ములునగు ఆచార్య దేశికాదులు, ఋత్విక్పరిచారకాదులు, విశేషముగ పరహితేచ్ఛగల వైష్ణవులు, పుత్రమిత్రకళత్ర దాసాదులు, గోవులు అనువానికి మరల మరల స్వస్తి, శుభము, శాంతి కలుగుగాక. - అవిఘ్నము, దీర్ఘాయుష్యము కలుగుగాక - సమాహిత మనస్కులగుదురు గాక - ఉత్తరోత్తరము సంపదలు కలుగుగాక - భగవద్భక్తులగు వైష్ణవులు, మహాత్ములగు ఏకాన్తినులు. సర్వభాగవతులకు ఓంభూః స్వస్తి, ఓంభువః స్వస్తి, ఓం సువ స్వస్తీ. ఓం మహః స్వస్తి, ఓం జనః స్వస్తి, ఓం తపః స్వస్తి, ఓం సత్యం స్వస్తి.

స్వస్తిమన్త్రముల తర్వాత ' పుణ్యాహము, స్వస్తి, ఋద్ధి' అనువానిని ఋత్విజులతో గలిసి వచించ వలె- ఆపైన శతధార జలమున స్నానాదులు, దేశికుడాత్మశుద్ధికై ఆత్మప్రోక్షణ - ఈ విధముగా అన్ని దేవయాగములయందు పుణ్యాహవాచన మొనర్పవలె. (బహుశః ఈ శతధార - పదమును అనుసరించి, శుద్ధికొరకు బ్రాహ్మణేష్వమృతగ్ం మన్త్రం గ్రంధమున చేరియుండవచ్చు- Edit)

- ఈ పుణ్యాహము విష్ణుసంబంధమైన యాగాది కర్మలయందు చేయ నుద్దేశింపబడినది

- ఈ మన్త్ర జలమున చేసిన ప్రోక్షణము శుద్ధియనబడును - కూర్చతో అశ్వత్థదళములతో సుదర్శన షడర్ణమున ఆచార్యుని బుద్ధికి తోచిన చోట్ల కుంభగత సలిల ప్రోక్షణ మొనరింపవలె - అని విష్ణుతిలకము)

## స్మార్తపుణ్యాహవాచనము

### (యాజుష పూర్వ ప్రయోగ చంద్రిక పుట 7 నుండి 15)

**1. స్వస్తి పుణ్యాహవాచనమ్**

- స్వస్తి పుణ్యాహవాచనం కరిష్యే – అదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణపతి పూజాం కరిష్యే – అనంతరం పుణ్యాహవాచనం.
- పుణ్యాహం దీర్ఘమాయురస్తు (శిరస్యభిమన్త్ర్య), శివాపస్సన్తు (కలశేష్వభిమృశ్య), సౌమనస్యమస్తు (హృదయేభిమృశ్య), అక్షతమరిష్టంచాస్తు, అర్చత ప్రార్చత ... – గంధద్వారాం ... గన్ధాః పాన్తు – అక్షతాః పాన్తు – ఆయుష్యమస్తు.
- పుణ్యాహం వాచయిష్యే – వాచ్యతాం – భద్రంకర్ణే ....
- దక్షిణకలశ మాదాయ – ప్రాక్కలశేకించిత్కిచి దుదకం నినయతి – దీర్ఘమాయురస్తు మనస్సమా ధీయతాం – సమాహితమనస్స్మః – ప్రసీదన్తు భవతః – శాన్తిరస్తు, పుష్టిరస్తు, తుష్టిరస్తు, వృద్ధిరస్తు, అవిఘ్నమస్తు, ఆయుష్యమస్తు, ఆరోగ్యమస్తు, స్వస్తిశివం కర్మాస్తు, కర్మసమృద్ధిరస్తు .. మొ॥నవి
- ఈశాన్యాం బహిర్దేశే అరిష్ట నిరసన మస్తు (ఈశానదేశే ఉదకం సించేత్) – యత్పాపం తత్ప్రతి హతమస్తు – శుక్రాంగారకాది గ్రహాః ప్రీయతాం – దిగ్దేవతాప్రీయతాం
- నైరృత్యాందిశి సించేత్ – శామ్యన్తు ఘోరాణి, శామ్యన్తు పాపాని ..... మొ॥నవి
- ప్రధమకలశే – శుభాని వర్ధన్తాం – శివాఋతవస్సన్తు – శివా ఓషధయస్సన్తు – ఉత్తరేశుభకర్మణ్య విఘ్న మన్తు – విశ్వే దేవాశ్చ ప్రీయతాం .... ప్రీయతాం భగవాన్నారాయణః ..... ఉద్గాత్వే శకు నేసామగాయసి – ఓం పుణ్యాహం భవన్తోబ్రువన్తు – ఓం పుణ్యాహం ఏవంత్రిః – స్వస్తయే వాయుముపబ్రు వామహై సోమం – స్వస్తిన ఇంద్రో..... బృహస్పతిర్దధాతు. మహ్యంసహకుటుంబాయ శుద్ధివృద్ధ్యభ్యుదయ కర్మణే మహాజనా న్నాశీర్వచన మపేక్షమాణాయాయుష్మ తే స్వస్తి ఏవం త్రిః – ఓగ్‌ంస్వస్తి భవన్తో బ్రువన్తు ఓగ్‌ం స్వస్తి ఏవంత్రిః
- వామ దక్షిణహస్తాభ్యాం దక్షిణోత్తర కలశౌ యుగపద్గృహీత్వా ఋద్ధి భవన్తోబ్రువన్తు – ఋధ్యతాం బుద్ధి సమృద్ధిః – ముఖసమముద్ధృత్య
- స్వస్తిపుణ్యాహ సమృద్ధిరస్తు, వర్షశతం సంపూర్ణమస్తు, గోత్రాభివృద్ధిరస్తు, శాన్తిః పుష్టిః తుష్టిః చ అస్తు – శుభగ్‌ం శుభమస్తు – గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు – సర్వం సంపదస్తు – ఇత్యుదకం నిక్షిప్య–

- శుచీవోహవ్య... (అబ్లింగమన్త్రాలు) - మార్జనం - ప్రాచ్యాందిశి దేవా ఋత్విజో మార్జయంతాం...

  వాస్తోష్పతేతి మన్త్రపఠనం - మన్త్రజపదక్షిణ - స్వస్త్యయనం తార్క్ష్య...మన్త్రజపం॥

<u>2. కర్మణః పుణ్యాహవాచనం</u> -

- కర్మణః పుణ్యాహం భవన్తో బ్రువన్తు - ఓం పుణ్యాహం కర్మణోస్తు ఏవంత్రిః
- ఓం కర్మణే స్వస్తిభవన్తో బ్రువన్తు - ఓగ్ ం స్వస్తికర్మణోస్తు ఏవంత్రిః - స్వస్తిన ఇంద్రోవృద్ధశ్రవా....
- ఓం కర్మణ బుద్ధి భవన్తోబ్రువన్తు - ఓం కర్మబుధ్యతాం - ఏవంత్రిః - ఋద్యాస్మహవై మన్త్రం
- ముఖసమం కలశముద్ధరేత్ - కర్మణ ః పుణ్యాహ సమృద్ధిరస్తు - వర్షశతం సంపూర్ణమస్తు - గోత్రాభివృద్ధిరస్తు శాన్తిః పుష్టిశ్చాస్తు - శుభగ్ం శుభమస్తు - గోబ్రాహ్మణశ్శుభమస్తు - శుచీవోహవ్య. ప్రాచ్యాందిశి దేవా ఋత్విజో మార్జయన్తాం ...(మార్జన) - ఏతేభ్యః బ్రాహ్మణేభ్యః నానాగోత్రేభ్యః..... కర్మణః పుణ్యాహ వాచన మన్త్ర జప దక్షిణాం ... సంప్రదదే నమమ - వాస్తోష్పతేతి మన్త్రజపం - స్వస్త్యయనం తార్క్ష్య ... మన్త్ర జపం॥

<u>వైఖానస పుణ్యాహము</u> కూడ ఇప్పట్టున పరిశీలనీయుచు. - వాసాధికారమున వైఖానస పుణ్యాహ విధి ఇట్లు చెప్పబడినది. "పుణ్యాహం దేవకార్యేషు వాచయేత్తు విశేషతః దేవస్య ప్రముఖే ప్రోక్ష్య మండలంవాఽత్ర కారయేత్ । తండులైః పూరితం పాత్రం <u>త్రిపాదప్యోపరి</u> న్యసేత్ । గంధంచాక్షత దూర్వాంశ్చ తాంబూలం తంతుభిస్సహ । కరకం కూర్చయుక్తస్తు జలపూర్ణం నిధాపయేత్ । ఋత్విజో వరయే త్పశ్చా త్పఞ్చ సప్త నవాథవా॥ సాక్షతం దర్భ యుగ్మస్తు హస్తే హస్తే ప్రదీయతాం । ఆచార్య స్స్వగ్రతో బ్రూయాత్ పుణ్యాహం కర్మణోస్త్వితి । తథాస్త్వితి ప్రతిబ్రూయుః పుణ్యాహం ప్రతివాచకాః । బ్రువన్తు కర్మణే స్వస్తీ త్యాచార్యస్తు తతో వదేత్ । స్వస్త్యస్తు కర్మణ ఇతి బ్రూయుస్తే ప్రతివాచకాః । ఆచార్యః కర్మణో ఋద్ధిం వదేచ్చ తదనంతరం । ప్రతిబ్రూయు స్తథాకర్మ ఋధ్యతామితి చేతరే । ఉక్తవ ద్ఘోషయే ద్విద్వా <u>న్సర్వదేవాది వర్జితం</u> ।హిరణ్యపవమానాన్తమాపోహిష్ఠాది పూర్వకం॥'- ఇది దీవివేంకటనరసింహాచార్య సంపాదితమగు వైఖానసప్రతిష్ఠా గ్రంధము 68 వ పుట యందు వివరించబడినది.

వైఖానసమున ఐదుగురు శ్రోత్రియులు, ఆచార్యుడు పుణ్యాహ మొనరింతురు.

- ఆచార్యుడు కరకమును నీటితో నింపును - కరకమును పాంచభౌతికమును, జలమున సర్వతీర్థ జలమును ఆవాహనము, అర్చన - ప్రాణాయామము, తిథివార సంకీర్తనము
- రెండు చేతులతో కలశము నెత్తి అస్య దేవదేవస్య సుపుణ్యాహం కరోమి అని ఆచార్యుడు చెప్పగ కురుష్వ అని ప్రతివచనము - కలశను క్రిందదర్భలపై నుంచుట - స్వస్తి సుప్రోక్షితమస్తు అని స్థానమును ప్రోక్షణ - ప్రజాపతి ప్రీయతాం అని పలుకుట - అభిస్రావ జలమును ధరించుటకు వేరొక పాత్ర నుంచి అందు కుశాక్షతాదుల నుంచుట
- కరకమును బాహుమాత్ర మెత్తి వామహస్తమున నుంచుకొని దక్షిణ హస్తమును కరక ముఖమున మూతవలె నుంచి కూర్చొనియే ' శామ్యన్తు ఘోరాని, శామ్యన్తు పాపాని, శామ్యన్తు ఈతయః ' అనుచు పాత్రకు బయట భూమియందు ముమ్మారు ఉపస్రావమొనర్చుట - శుభానివర్ధన్తాం ఇత్యాదులతో అభిస్రావ పాత్ర యందు అతోదేవా, శుచీవోహవ్యా మొ॥గు మన్త్రములతో అభిస్రావము - స్వస్తి, ఋధ్యంతముగా పుణ్యాహమును త్రిధా త్రిధా వాచ నాను వాచనములు - యత్పుణ్యం నక్షత్రం మంత్రము - దేవదేవస్య స్వామినః .... కర్మణి ఓం పుణ్యాహం అని ముమ్మారు - స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః, స్వస్తినః పూషా విశ్వ వేదాః, స్వస్తినః తార్క్ష్య అరిష్టనేమి, స్వస్తినో బృహస్పతిర్దధాతు ఇత్యాదులతో అస్యదేవదేవస్య స్వామినః .... కర్మణి ఓం ఋధ్యతాం అని ముమ్మారు - ఆపోహిష్ఠేతిమన్త్రమున అభిస్రావోదకమును కరకమున సంయోజనము - హిరణ్య పవమాన మన్త్రములతో కుశాగ్రములచే కరకస్పర్శనము మొ॥నవి - దక్షిణాదానము. వీనిని గమనించిన ఇక్కడ కూడ స్మార్తలక్షణములు మెండుగనున్న వనవచ్చును .... లేదా వైఖానసము స్మార్తము నంగీకరించిన దనవచ్చును. బహుశా దీనని చూచి మనవారు కొందరు, వాసుదేవ పుణ్యాహమున ఋత్విజులకు దర్భలనిచ్చు వారు వానిని క్రిందకూ మీదకు ఊపుట నేర్చుకొని యుండవచ్చును - లేనిచో వాసుదేవపుణ్యాహవు ఋత్విజులను దర్భలనిచ్చుట వారు వానిని క్రిందకూ మీదకూ ఊపుట నేర్చి యుండవచ్చును. అటుగానిచో వాసుదేవపుణ్యాహము దర్భలనూపమని చెప్పలేదు కదా– మహోత్సవ విధియందలి కర్మణః పుణ్యాహమున స్మార్తమున గూడలేని హిరణ్యవర్ణా, పవమానస్సువర్జనః మొ॥నవి బహుశః వైఖానన పుణ్యాహాను సరణము గాక మరియేమగును. సర్వదేవ వర్జనవిధియున్న వైఖానపుణ్యాహామునుండి సర్వదేవపూజన విధియున్న పాంచరాత్ర పుణ్యాహమున ఇట్టివానిని గ్రహించుట చక్కని తన్త్ర సాంకర్యమునకు ఉదాహరణము గాదా?

ఆంధ్రప్రాన్త ఆగమ, స్మార్తాది పుణ్యాహవాచనముల పరిశీలనము –

- ఈశ్వర, విష్ణుతిలక సంహితల యందలి పుణ్యాహమును అక్షరశః అనుసరించు పూణ్యాహ వాచన ప్రయోగము ఆంధ్రదేశమున ఆచరణయందున్నదనుటకు ఆధారములు లభించలేదు.
- ఇటీవల JET వారు ప్రచురించిన మహోత్సవవిధి అను గ్రంథమున పుణ్యాహ ప్రయోగమున్నదిగాని అది "పరిశోధనమండలివారు" స్వయముగా తయారు చేసిన గ్రంథము. దానికి పూర్వాచార్య ప్రయుక్తాధారములు చూపబడలేదు.
- ఆంధ్రదేశమున అనుచానంగా వస్తున్న పాంచరాత్రాగమ పుణ్యాహము భగవత్పుణ్యాహ మని చెప్పబడుతోంది. ఆంధ్రప్రాంత ఆగమ గ్రంథములు దక్షిణదేశమునుండి వచ్చినవనుటకు ఆధారముల గలవు. కొద్దిపాటి ముఖ్యభేదములున్ననూ ఈ భగవత్పుణ్యాహగ్రంథము ఈశ్వర, విష్ణుతిలకానుసారియే. దీని ప్రయోగతన్త్రము (ప్రక్రియ) నకు స్మార్తప్రయోగ తన్త్రమునకు కొన్నిచోట్ల పోలికలు కన్పించుచున్నవి.

మా పూర్వులేర్పరచుకొన్న పాంచరాత్ర భగవత్పుణ్యాహవాచనమునకు 1821 A.D. వృషసంవత్సరమున శ్రీమాన్ రేజేటి బలరామయ్యగారు, దుందుభినామసంవత్సర శ్రావణబహుళ 30 కి సరియగు 26–8–1862 న శ్రీమాన్ భద్రం కృష్ణమాచార్యులుగారు వ్రాసుకొన్న (ఈ రెండూ పరిశోధకుల కత్యన్త విలువైన Dated Palm leaf Manuscripts) తాళపత్ర గ్రంథముల యందలి భగవత్పుణ్యాహమున – మూడు కలశలనుంచుట, వానియందు చతుర్వేదములను ఆవాహనము, ఉదకసించనము మొదలగు ప్రక్రియలు ముందున్న వాసుదేవపుణ్యాహ గ్రంథమునకు కలిసినవి. సుదర్శనావాహనము, తన్మంత్రజ పస్థానములయందు అన్యకలశనుంచి అందు విష్ణువు నావాహన మొనర్చుట గలదు. మిగిలిన గ్రంథమంతయూ వాసుదేవ పుణ్యాహమునకువలెనున్నది – స్మార్త స్వస్తి పుణ్యాహమునకు దీనికి గ్రంథవిషయమున పోలికయేలేదు. ఈ గ్రంథమే నేటికి ఆంధ్రదేశమున (ఆంధ్ర రాయలసీమ తెలంగాణములయందు) అత్యధికముగా వాడబడుచున్నది.

లభించినవానిలో ప్రాచీనమగు భద్రం శ్రీ రామాచార్యులుగారి భగవత్పుణ్యాహము 'భగవతోబలేన'తో ప్రారంభమై, పవిత్రమన్త్ర, ఆత్మవ్యూహ, శుద్ధిమన్త్రాదులతో చాలవరకూ విష్ణుతిలకమును పోలిన గ్రంథమున్నది. కాని వాసుదేవ పుణ్యాహమున గల కుంభస్థాపన, సుదర్శనవాహన, తన్మంత్రజప, 'ఏకపదీ ద్విపదీ' త్యాది ఆత్మానువాదములు లేవు. వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధులు చెప్పబడిన చోట్ల నారాయణ / శ్రీరామ,

వారాహ, నారసింహ, వామనులు చెప్పబడిరి. ఎందుకనో కరోతు అనుపదము వదలివేయబడినది. ఏక కలశావాహనకాని, మూడుకలశలుంచుటగాని చెప్పబడలేదు. కాని వాసుదేవ పుణ్యాహమున లేని ' బ్రాహ్మణేష్వమృతగ్ం, వాస్తోష్ప తేతి ' మన్త్రములు మాత్రమున్నవి.

ఇట్టి పరంపరాగత పాంచరాత్ర భగవత్పుణ్యాహవాచనమును కొందరు పెద్దలు ఇది స్మార్తానుసారియనీ, అనవసరపు వేదమన్త్రములు కొన్ని ఇందు చొప్పించబడినవనీ సంహితానుసారికాదనీ నిందించుచున్నారు. వారీక్రింది అంశములను గమనించ గలరు

- విష్ణుతిలకాంతర్గత వాసుదేవ పుణ్యాహవిధియందు శివం పానీయమస్తు, సౌమనస్యమస్తు, అక్షతమరోగం చాస్తు, పుణ్యాహం భవంతోబ్రువన్తు, స్వస్తి భవంతోబ్రువన్తు మొ॥నవి గలవు. విష్ణుతిలకముకన్న ప్రాచీనమగు ఈశ్వర సంహితయందు ఇవి లేవన్నది గమనించ వలసియున్నది. (యామునులు ఈశ్వర సంహిత నుదహరించిరి గాన అది 8వ శతాబ్దికి ముందరిది. విష్ణుతిలకము మధ్యమకాల సంహిత, పాద్మం దీనిని పేర్కొన్నదిగాని వాసుదేవ పుణ్యాహవిధిని అంగీకరించలేదు.)
- స్మార్తమున (యాజుష పూర్వ ప్రయోగ చంద్రికయందు) శివ అపస్సన్తు, సౌమనస్యమస్తు, అక్షతైరక్షతం చాస్తు, పుణ్యాహం భవన్తో బ్రువన్తు, స్వస్తి భవన్తో బ్రువన్తు అనేవి యథాతథంగా ఉన్నాయి.)

  ఇట్టిసమభావ సమాన పద ప్రయోగాలకు కారణమేమైయుండును – విష్ణుతిలకం స్మార్తమైనదా లేదా స్మార్తం విష్ణుం తిలకమైనదా ? – ఏమైననూ శిరోధార్యమే గదా.
- అక్షతమరోగం కుశలం భగవ ద్వాసుదేవయోః కరోతు వంటివి స్మార్తం నుండి భేదిస్తున్నవి.
- మరొక ముఖ్యాంశము – భద్రాచల క్షేత్రమున పుణ్యాహవాచనమున నాలుగు కలశలనుంచుట గలదు. కుంభకోణమున జరుగు వాసుదేవపుణ్యాహమున వాస్తోష్పతేతి మన్త్రమున ప్రోక్షణమున్నది.
- పై వానివలన స్మార్త ఆగమ పుణ్యాహ వాచనములనకు సారూప్యము సహజముగ నున్నదని తెలియుచున్నది.
- స్మార్తమున ఏకకలశ పుణ్యాహము అశౌచమున మాత్రము చేయబడుచున్నదని తెలియుచున్నది.

- గాన, బహుశః, ఈ సారూప్యములను, భేదములను, విధి నిషేధములను గమనించిన పూర్వులగు ప్రాక్ దక్షిణ ఉత్తర, అన్యకలశలను నాలుగు కలశలతో పుణ్యాహమేర్పరచి యుండవచ్చు. అన్యకలశయంధు విష్ణువు నావాహనమొనర్చుట, ఆయావేదమన్త్రముల ప్రయోగము మొ॥నవి చేర్చుకొని యుండవచ్చు.ఇదికేవలము మావారిచేతలే కానవసరములేదు. భారద్వాజ సంహితోక్త ప్రతిష్ఠావిధి అదయార్ ప్రతి యందలి భగవత్పుణ్యాహవాచనము దీని ప్రాచీనతనూ, ప్రాచుర్యమును చెప్పక చెప్పుచున్నది.
- ఇక మన్త్రసిద్ధాంతానుసారులూ, అస్ఖలిత సంహితానుసారులని చెప్పుకొన్న పాంచరాత్ర పరిశోధన మండలివారి గ్రంధములయందలి అంశములను పరిశీలింపవలసియున్నది. వీరు తమ గ్రంధములకు పూర్వాచార్య ప్రయోగములను సూచించలేదు. గాన వీరి గ్రంధము సంహితను ముందుంచుకొని యథామతి తయారుచేసిన స్వతన్త్ర గ్రంధముగా పరిగణింపవలసియున్నది.

పరిశోధనమండలివారి పుణ్యాహనమునకు మొదటిపేరు, 'ఏకాయనపుణ్యాహ వాచనం' (భగవదారాధనావిధి – పుట 49) – దీనికే మరొక పేరు 'వాసుదేవ పుణ్యాహ వాచనవిధి' (మహోత్సవవిధి – పుట 14) ఈ గ్రంధములయందు గల ఈ క్రింది అంశములను గమనింపవలసి యున్నది –

- విష్ణోరరాటమన్త్రమున దర్భసమ్మార్జనము, గంధద్వారేతిమన్త్రమున పేడ అలుకుట మొదలగునవి చేర్చబడినవి – విష్ణుతిలకము వీనిని విధించలేదు
- రం అను అగ్నిబీజము సుదర్శన మన్త్రమున చేర్చబడినది
- మహోత్సవవిధి 17వ పుటలో 'తస్మిన్ ఓం ఓం ఓం పరమధామావస్థిత..... అనునది క్రి..క్రై.చం. రాకా వ్యాఖ్యనుండి సంగ్రహించబడినది.
- ముందు ఏకాయనపుణ్యాహమునలేని బలమన్త్ర సాత్వికత్యాగాదులు మహోత్సవ విధిలో చేర్చబడినవి.
- మరొక ముఖ్యాంశము – మహోత్సవవిధి 22వ పుటయందు, పుణ్యాహశుద్ధి మన్త్రముల అనంతరం, ఏకాయనమునలేని, విష్ణుతిలకము చెప్పని కర్మణః పుణ్యాహ వాచనము స్మార్తమునుండి / వైఖానసము నుండి సంగ్రహింపబడి చేర్చబడినది. – ఇదంతయూ వారి అనుసంధాన ప్రక్రియ. – 25వ పుటలోని శాన్తిరస్తు, పుష్టిరస్తు ఇత్యాదులు, ఈశాన్యాం బహిర్దేశే అరిష్ఠ నిరసన మొ॥నవి నిర్ద్వంద్వముగా స్మార్తా నుసరణములు.

- ఇక్కడే మరియొక అంశము 'ఆగ్నేయాం యత్పాపం తత్ప్రతిహతమస్తు' అనునది - పాపం స్మార్త నైరృతి వీరినోటబడి ఆగ్నేయమైనది.
- 26 వ పుటలోని శ్లోకం ' స్థానాని దేశాని సహస్రబాహుః....' అనేది ఎస్.బి. రఘు నాథాచార్యుల క్రియాకైరవచంద్రిక రాకావ్యాఖ్యలోనిది.
- మరొక ముఖ్యవిషయం - 'ఓం సహస్రార హుంఫట్' అను మన్త్రము వీరి ~రిశోధనమున అస్త్ర మన్త్రమై కూర్చున్నది.

ఈ విషయములను ఇలా వ్రాయడంలోని ఔచిత్యం ప్రశ్నించదగినది కావచ్చు. కాని శతాబ్దాలనుండి వస్తున్న ఒకానొక సంప్రదాయాన్ని కాదనాలన్న వారి ప్రయత్నమున గల లోపాలను ఎత్తిచూపడం ఆ సంప్రదాయము యొక్క ఆత్మరక్షణ చర్యయేగాని రంధ్రాన్వేషణకాదని మనవి. పరిశోధనమన్న పక్షపాతదృష్టితో తోచినది వ్రాయుటకాదని మనవి.

---

**వ్యాహృతులు** :- " భూర్భువస్సువరితివా ఏతా స్తిస్రో వ్యాహృతయః " అని తై.ఉ. శీక్షావల్లి 5.1 గాన భూః, భువః , సువః అనేవి వ్యాహృతులు. ఇవి మహః అను బ్రహ్మముయొక్క అంగభూతములు. " వ్యాహరణం ఉచ్చారణం తద్విషయత్వా న్మంత్రాణాం వ్యాహృతిత్వం, యద్వా వివిధే కర్మణి అహ్రియన్తే ప్రయుజ్యత ఇతి వ్యాహృ తయః ॥ అర్థం - వివిధములగు కర్మలయందు ప్రయోగింప బడుచున్నవిగాన వ్యాహృతులు. ఇవి అగ్నిహోత్రారంభమున హవిరాసాదనకు, ప్రాణాయామము, గాయత్రీమంత్రము, పరిషేచనము మొదలుగా దాదాపు సకల కర్మలయందు ప్రయోగింపబడుచున్నవి.

**మహావ్యాహృతిమన్త్రములు** - ఓంభూః ఓంభువః ఓగ్ంసువః ఓంమహః ఓంజనః ఓంతపః ఓగ్ంసత్యం అని క్రి.కై.చం పుట287, గాని వీనికి సప్తవ్యాహృతులని వ్యవహారము కన్పడుచున్నది; తైత్తరీయ ఉపనిషత్ (అంధ్రపారం వావిళ్ళ వారి ప్రతి) ప్రకారం మహావ్యాహృతులు (4.1-5) - 1. భూరగ్నయే పృథివ్యై స్వాహా 2. భువో వాయవే ఽ ంతరిక్షాయ స్వాహా 3. సువరాదిత్యాయ దివేస్వాహా 4. భూర్భువశ్చంద్రమసే దిగ్భ్య స్వాహా 5.నమోదేవేభ్య స్స్వధా పితృభ్యో భూర్భువస్సువరగ్న ఓమ్ ॥ - అనునవి. ఇక భూరన్న మగ్నయే పృథివ్యై స్వాహా... మొ॥నవి తృతీయానువాకమున అన్నకామస్య హోమమంత్రాః అని చెప్పబడినవి.)

భగవత్పుణ్యాహవాచనం (భారద్వాజ సంహితోక్త గ్రామార్చా ప్రతిష్ఠావిధి)
(Copy of Adayar Library - Ms. (Paper) - No. 10- i -18, p. 6-11)

అథ భగవత్పుణ్యహవాచనం కృత్వా –

శ్రీమన్నారాయణో యస్య భగవాన్ పవిత్రం నారాయణః పవిత్రం శతధారం సహస్రధార మపరిమితధార మచ్ఛిద్ర మనన్త మరిష్ట మచ్యుత మపరిమితం పరమం పవిత్రమ్ । ఓం భగవా న్నారాయణః పునాతు ఓం భగవా న్నారసింహః పునాతు ఓం భగవాన్వామనః పునాతు । ఇత్యక్షతాన్ కలశేషు నిక్షిప్య । ఓం భూర్భువస్సువరోమితి ధర్మ జ్ఞాన వైరాగ్య కలశేషు పునరుదక మాపూర్య । భగవత్పుణ్యాహం భవన్తో బ్రువన్తు । భగవా న్మఙ్గలం శ్రేష్ఠం వాసుదేవ పరాయణం । ఋత్విగ్భిశ్చ మహో యజ్ఞై ర్యథా యజ్ఞో మహీయతే । య ఇదం సర్వదేవానాం భగవా న్వేద పారగః । భగవా న్పుత్ర పౌత్రైశ్చ దీర్ఘమాయు రవాప్నుయాత్ ॥ వాసుదేవోభగవాన్ నారసింహో భగవా న్వామనో భగవా న్వారాహో భగవా న్యేషా సా పరా ప్రకృతి రేత తత్పరబ్రహ్మ ఏష ప్రభవః । ఏష ఆత్మా చతుర్విధః సర్వజ్ఞ స్సర్వదర్శి సర్వేశ్వరేశ్వర స్సర్వశక్తి సమృద్ధిమాన్ స్వాధీనో నన్తా ద్వ్యపగత నిద్రా భయక్రోధో నిరవశిష్టో నిరనవద్యో భగవాన్ శ్రీరామః । ఇతి దక్షిణోత్తర కలశౌ స్వామినః ముఖసమ ముద్ధృ త్యా ద్భిర్దీర్ఘమాయురస్తు శివం పానీయం భగవాన్ సుమనసోపి సౌమనస్యమస్తు సుమనసో భగవాన్ శ్రీరామః సుమనసో భగవాన్ వారాహః ఏష గతిర్హరి ర్భగవాన్నారసింహః ఏషగతిర్హరి ర్భగవా న్వామనః । ఓం పురుషప్రీయతాం అచ్యుతః ప్రీయతాం సత్యః ప్రీయతాం భగవాన్ శ్రీరామః ప్రీయతాం భగవా న్వారాహః ప్రీయతాం భగవాన్నారసింహః ప్రీయతాం భగవాన్వామనః ప్రీయతాం భగవతీ హరిణీ ప్రీయతాం ఓం భగవతీ శ్రీః ప్రీయతాం మహాపురుష శాన్తిరస్తు । భగవత స్సర్వం న్యూనాతిరిక్తం యావ ద్వర్షశతం సంపూర్ణమస్తు।

ఇతి దక్షిణోత్తర కరాభ్యాం దక్షిణోత్తర కలశౌ గృహీత్వా పూర్వకలశే ఉదకమాపూర్య ఓం యజమానాయ జగత్కుటుంబినే సర్వలోక రక్షణార్థాయ శుద్ధివృద్ధి అభ్యుదయకర్మణే శ్రీవైష్ణవాశీర్వచన మపేక్షమాణాయ కర్త్రాచార్యాయుష్మతే స్వస్తి । ఓం స్వస్తి భవన్తో బ్రువన్తు ఓగ్ం స్వస్తి । ఇత్యక్షతైః వైష్ణవానభ్యర్చ్య । ప్రీణాతు ప్రీయతాం శ్రీరామః ప్రీణాతు ప్రీయతాం వారాహః ప్రీణాతు ప్రీయతాం నారసింహః ప్రీణాతు ప్రీయతాం వామనః ।శాన్తిరస్తు పుష్టిరస్తు – ఆరోగ్యమస్తు అచలమహదైశ్వర్యమస్తు భగవత్పుణ్యాహ సమృద్ధిరస్తు శాన్తిశ్శాన్తిః । శుద్ధయే రాఘవోస్తు వారాహ శ్శుద్ధయే సదా। శుద్ధయే నారసింహోస్తు వామనశ్శుద్ధయేస్తు నః । కర్మణశ్శుద్ధయేచాస్తు విష్ణు స్సర్వత్ర సంస్థితః । దోషాణాం హరణాయాస్తు సదా

సింహోకృతిర్మమ । విఘ్నానాం హరణాయాస్తు విష్వక్సేనో గణేశ్వరః । ఇతి ఈశాన్య దిశి దక్షిణ కలశోదకం నినీయ – సర్వత్ర రక్షణాయాస్తు గదా చక్రాదయ స్సదా యాగయేషస్సు రేశస్య నగర గ్రామవాసినామ్ । తుష్టయే పుష్టయే చాస్తు ఆయు రారోగ్య సిద్ధయే । గురూణాం సాధకేన్ద్రాణాం పఞ్చకాల రతాత్మనామ్ । అశేషపుత్ర మిత్రాణాం దాసీదాస గవామపి । వేదశాస్త్ర సమాధీనాం సన్తు త్రాణాయ సర్వశః । అవిఘ్న మనిశంచాస్తు దీర్ఘమాయుష్య మస్తు నః । సమాహిత మనా శ్చాస్తు సంపద శ్చోత్తరోత్తరమ్ । పుణ్యాహం శుద్ధయే చాస్తు రాఘవాద్యాశ్చ మూర్తయః । శంఖ చక్ర గదాపద్మై ర్యుక్త స్సర్వేశ్వరేశ్వరః । నారాయణ స్సురేశోయం కర్మణః పూరణాయచ । న్యూనాధికానాం శాన్త్యర్థం ప్రీయతాం భగవాన్విభుః ఓం పుణ్యాహం భవన్తో బ్రువన్తు । బ్రాహ్మణే ష్వమృతం హితం యేనదేవా....పునాతు ॥ ప్రాచ్యాందిశి రాఘవో మార్జయన్తాం దక్షిణాయాం దిశి వారాహో మార్జయాన్తాం ప్రతీచ్యాం దిశినారసింహః ఉదీచ్యాందిశి మహోపురుషః శుభమస్తు ॥

ఏతేభ్య శ్శ్రీ వైష్ణవేభ్యః భగవద్భాగవతాచార్యాను గ్రహేభ్యః భగవన్తం శ్రీమన్నారాయణ ముద్దిశ్య శ్రీమన్నారాయణ ప్రీత్యర్థం భగవత్పుణ్యాహవాచన మన్త్ర జప దక్షిణాం యజమానస్య మనసోత్సాహ పరిమితాం భగవదాచార్య ప్రీతిం కామయ మానః । ఏతేభ్య స్సంప్రదదే నమమ॥ వాస్తోష్పతే .... సదానః । అమీవహా ..... శుభమ్ । ఇతి భగవత్పుణ్యాహవాచనమ్ ॥

*(నాగరిలిపిలోనున్నభగవత్పుణాహవాచనమునకు లిప్యంతరీకరణము.)*



అనుబంధము ... 4

# రక్షాబంధనము

## రక్షాసూత్ర ప్రమాణము

**1.పాద్మ భారద్వాజ సంహితోక్తములు** (ఆధార శ్లోకములు చివర నివ్వబడినవి)

| బంగారం | ఉపయోగం | సూత్ర సంఖ్య | అధిదేవత |
|---|---|---|---|
| 108 సువర్ణములతో చిటికెనవ్రేలు లావు, 1 తాలం పొడవుగల 1 కంకణం | మూలబేరమునకు | 25 | వాసుదేవుడు |
| | ఉత్సవబేరము | 16 | ఆయుధ, వసుదేవతలు |
| | కర్మార్చకు | 9 | నవ నక్షత్ర దేవతలు |
| | యాగబేరమునకు | 8 | వరుణుడు |
| 54 సువర్ణముల 2 కంకణములు | బలిబేరమునకు | 5 | విష్ణువు |
| | తీర్థబేరము | 6 | గణనాథుడు |
| | స్నానబేరము | 3 | ఇంద్రుడు |
| | విష్వక్సేనునకు | 12 | కేశవాది దేవతలు |
| | గరుడునకు | 10 | యమ |
| | ఆలయ ప్రాకారా శ్రిత బింబములకు | 3 | ఇంద్రుడు |
| 1 కంకణము | ఆచార్యునకు | 6 | యమ |
| | ఋత్విక్కులకు పరిచారకులకు | 5 | విష్ణువు |

(80 గురిగింజల యెత్తు – 1 సువర్ణము, 108 సువర్ణముల యెత్తు – 1 నిష్కము)

2. పాద్మ, పురు. సంహితలు "7 లేక 5 తంతువులతో సువర్ణ లేదా క్షౌమ లేదా కార్పాసములతో నిర్మించిన సూత్రం" రక్షాసూత్రం అనిచెప్పినవి.

అర్చనాదివిధులు (విష్ణుతిలకం 7.53-60, పాద్మ.చర్యా - 11. 28 - 39, పురు. సం 18. 2-11)

"సువర్ణ / రజితాది పాత్రయందు ఖారిద్వయం / అర్థం / పాదం తండులములపై పైపట్టికలో చెప్పిన నాలుగు రక్షాసూత్రములనుంచి, నూతన వస్త్రాచ్ఛాదన మొనర్చి 200 పోకచెక్కలు దానికి రెట్టింపు (నాలుగు రెట్లని వి.తి.) అరటిపండ్లు మొ॥వానిని చేకొని ఛత్ర చామరాదులతో బ్రాహ్మణులతో కలిసి శాకున సూక్తము చదువుతూ దేవసన్నిధిని ప్రవేశించవలె. అక్కడ గోమయమున అలికిన చతురశ్రమమున ధాన్యముంచి ఆపైన పాత్రనిడి యథావిధి పుణ్యహ మొనర్చి, సూత్రములను విభజించి వానిని (అపరాజిత మన్త్రమున అని పాద్మం) చందనోదకమున తడిపి, రెండు చేతుల అంగుష్ఠానామికలతో రక్షాసూత్రములను గ్రహించి అస్త్రమన్త్రమున (మూలమన్త్రమున లేదా విశ్వేత్తాతేమన్త్రమున అని వి.తి) దేవదేవునకు కుడిచేతికి, దేవేరులకు ఎడమ చేతికి, ఆచార్యునకు కుడిచేతికి బంధించవలెనని, దీనికై పైనజెప్పిన ప్రమాణము గల 4 సూత్రముల నేర్పరచవలెనని" ... భరద్వాజ సంహిత, "బృహత్సామమన్త్రమున ధూపపాత్రభస్మమున రక్షనేర్పరచి, అర్ఘ్యాదులనర్చించిన ప్రతిసరము నాచార్యుడు తన దక్షిణహస్తమున ధరించవలెనని" వి.తి.

రేజేటి సింగరాచార్యులుగారి ప్రదీపికాఖ్య ప్రతిష్ఠాఖండ లో -

"సప్తభిః పంచభి ర్వాథ త్రిభిర్వా తన్తుభిః కృతం
రక్షా సూత్రంతు సంధార్యం ఋత్విగాచార్య సేవకైః ॥"

కంకణ ద్రవ్యాణి -

దూర్వాయవాఙ్కురా శ్చైవ వాలకం చూతపల్లవాః
హరిద్రా ద్వయ సిద్ధార్థ శిఖి ప త్రోరగత్వచః
క్కణౌ షధయ శ్చైత త్కౌతుకాఖ్యా దశస్మృతాః ॥- ఏతే కౌతుక సంజ్ఞాని ॥

టీకా : దూర్వా క్ష గరికమొలకలు, యవాఙ్కురాః క్ష వరిమొలకలు, వాలకః క్ష బంగారు సూడిగములు (కడియము), చూతపల్లవాః క్ష మామిడి ఆకులు, హరిద్రా ద్వయం క్ష మానిపసుపు, మంచి పసుపు, సిద్ధార్థా క్ష ఆవాల మొలకలు, శిఖి క్ష మయూర శిఖి, పత్ర క్ష లేతచిగురుటాకులు, ఉరగ త్వచః క్ష భుజపత్రములు అను ఈ 10 క్కణ ద్రవ్యములు."

(ఇవి రేజేటి సింగరాచార్యులుగారి ప్రదీపికాఖ్య ప్రతిష్ఠాఖండ తాళపత్రగ్రంథలో 9వ ఆకునందు వ్రాయబడియున్నవి.)

దొడ్డిపట్ల ఉప్మాకయ్యగారి ఉత్సవ సారసంగ్రహం తాళపత్ర గ్రంథంలో లభించిన శ్లోకములు - " రక్షా బంధన కర్మాణి వక్ష్యేహం చతురానన । సహేమ నిష్క మాత్రంతు కనిష్ఠాంగులి మానతః ఉచ్ఛ్రాయం తాలమాత్రంతు కంకణం కారయేచ్ఛుభం।

పవిత్రారోపణాద్యేషు ప్రతిష్ఠా ద్యంగ కర్మసు దేవస్య కౌతుకం బధ్వా దేవ్యోశ్చ తదనన్తరం। ఏకనిష్కప్రమాణేన సూత్రమేకం ప్రకల్పయేత్ తదర్ధ నిష్కకం సూత్రత్రయం నిర్మాపయే దవి। సౌవర్ణం రాజితం వాపి పాత్రే కలమ తండులైః భారర్ధ సమ్మితైః పూర్ణైః స్వర్ణసూత్ర చతుష్టయం। నిధాయ పూగై రనఘూః ద్విశతై శ్చాథ సమ్మితైః। తాంబూలీనాం దలై స్సార్ధం చతుశ్శత మితై స్సహా। కదల్యాదిఫలై స్సార్ధం సాధారం న్యస్యమూర్ధని। అన్యే ద్వ్యా క్షౌమ వస్త్రాణి ఛత్ర చామర సంయుతం। దీపికాశత సంయుక్తం సావధానంచ మూర్తిపాః। బహుభి ర్ధాహ్మ ణై ర్యుక్తం పఠద్భిః శాకునం తతః। ధామ ప్రదక్షిణం నీత్వా బహి రావరణానిచ తూర్య మంగళ సంగీతైః ప్రవిశే ద్దేవ సన్నిధౌ। భూతలే గోమయ రసై రాలిప్తే చతురశ్రకే పూరితే శాలి భారేణ పాత్రం విన్యస్య దేశికః। పుణ్యాహ వాచనం కృత్వా యథావిధి విభజ్యచ గురు ర్గృహీత్వా సూత్రాణి చందన క్షోదవారిణి। అంగుష్ఠా నామికా భ్యాంతు సమ్మృజ్యాస్త్రేణ దేశికః బంధయే ద్దేవదేవస్య దక్షిణే పాణిపంకజే। దేవ్యోర్వామకరే బధ్వా గురో స్స్వవ్యేతరేకరే గత్వాచ దేవనికటం సాష్టాంగ ప్రణిపత్యచ ప్రార్థ యిత్వోత్సవం బింబం బధ్వా కౌతుకమంగళం॥ - ఇతి పాద్మే.

" పంచవింశతిభి సూత్రైమూలబేరేతు బంధయేత్। సూత్రాణా ముత్సవార్థేతు షోడశం తన్తు యుజ్యతే కర్మార్థే నవకం సూత్రం యాగబేరేతు చాష్టకమ్। బలి ప్రతినిధౌ చైవ పంచసూత్రంతు కల్పయేత్ తీర్థబేరేతు షట్కంస్యాత్ స్నానబేరే త్రిసూత్రకమ్। విష్వక్సేనస్య రక్షార్థం ద్వాదశం సూత్రముచ్యతే దశసూత్రం ప్రయత్నేన ఖగేశం బంధయే త్తతః। ఆలయాశ్రయ బింబానాం ప్రాకారాశ్రయ వర్తినాం రక్షార్థం తం ప్రయత్నేన త్రీణి సూత్రాణి కల్పయేత్। ఆచార్యస్య కరేచైవ ష ట్సూత్రం బంధయేత్తతః ఋత్విజాం పంచసూత్రాణి తథైవ పరిచారిణః। ఏవమేవతు సంఖ్యాస్స్యా ద్రక్షాసూత్ర ప్రకల్పనే॥ - ఇతి శ్రీ భారద్వాజ సంహితాయాం ఏకాదశోధ్యాయః॥

## రక్షా సూత్రస్య ఆవృత్తి భేదేన ఫలభేదః -

ఏకసూత్రం మహాపాపం ద్విసూత్రం చాభిచారకం। త్రిసూత్రం దైత్యనాశార్థం పంచసూత్రం మహాఫలం షట్సూత్రం సర్వసిద్ధ్యర్థం సప్తసూత్రం సు శోభనం। అష్ట సూత్రార్చకా ఋద్ధిం నవసూత్రం సుఖావహం ఏకాదశం చ సూత్రం స్యాద్రాజారాష్ట్ర సుఖావహం। దాదశైత్రోతుకాప్రతి(?) షోడశం సుప్రతిష్ఠితం తస్మాద్యత్నేన కర్తవ్యం రక్షాసూత్రం సుఖావహం॥ త్రిసూత్ర మింద్ర దైవత్యం పంచసూత్రంతు వైష్ణవం। షట్సూత్రే గణనాథశ్చ సప్తమం శ్రీరుద్రాహృతం అష్టసూత్రస్య వరుణో దశసూత్రం యమస్మృతం। వాసుదేవాధి దైవత్యం పంచవింసతి సూత్రితం నవసూత్రాధిదైవత్యం నవ నక్షత్ర దేవతాః। రుద్రమేకాదశం చోక్తం రక్షాసూత్రాధి దైవతం కేశవాదీని దైవత్యం ద్వాదశం సూత్రదేవతా। షోడశే సూత్ర దైవత్యం అయుధైర్వసుదేవతాః త్రిసూత్రాది షోడశాన్తం స్యాత్ప్రత్యేకం దేవతాస్మృతా॥ ............ ఇతి శ్రీ పాంచరాత్రే సనత్కుమార సంహితాయాం రక్షా సూత్ర దేవతా పటలః॥



# అంకురారోపణము

## పాత్రలు - మండల రచన

"ప్రాగేవ వాపయే బీజా నంకురార్థం యథామతి" అను పాద్మసంహితోక్త ప్రమాణము ననుసరించి - అంకురసిద్ధి కొరకు చేయు బీజావాపనమునకు అంకురావాపనము, అంకురారోపణము, అంకురార్పణము అని పేర్లు.

క్రియా కైరవ చంద్రిక రాకా వ్యాఖ్యయందు చెప్పబడిన విధముగా[1] బహువిధ పరిణామశీలియగు లోక వ్యవహారముననిది సిద్ధించుచున్నది. ఇక్కడ అంకుర పదము బీజములను అర్థమున వాడబడుచున్నది.

## 1. అంకురార్పణ పాత్రలు

ఇవి పాలికలు, ఘటికలు, శరావములని మూడు రకములు. వీని రూపము సంహితలయందు విశేషముగా వర్ణింపబడియున్నది. వాడుకలో పాలికకు బదులు పెద్దమూకుడు, ఘటిక బదులు చిన్న కుండ (ముంత), శరావమునకు బదులు చిన్న మూకుడు (ప్రమిద వంటిది) ఉపయోగించబడుచున్నవిపాలికా ఘటిక శరావముల వర్ణన ఆయాసంహితలయందీ విధముగానున్నది - ఈనాటికీ బొబ్బిలి ప్రాంతంలోని కొందరుకుంభకారులు బొమ్మలలోచూపినవిధంగా పాలిక ఘటిక శరావములు తయారు చేయగలరని తెలుస్తున్నది..

పాలిక (వైష్ణవి)

| | ఉత్సేధం (ఆయామం) | వక్త్రం (విస్తారం) | బిలం (కంఠం) | పాదపీఠం (విస్తారం) | రూపం |
|---|---|---|---|---|---|
| పాద్మం[2] | 25 అం | 16 అం | 7అం | 8అం | ముఖంపద్మాకారం |
| పురు.సం[3] | 25 అం | 16 అం | 1అం కఠం ఎత్తు4అం | 8అం | ముఖం పద్మాకారం ఉమ్మెత్తపూవు ఆకారం |
| కపింజల[4] | 20 అం | 16 అం | 8అం | 8అం | ఉమ్మెత్తపూవు ఆకారం |

ఘటిక (బ్రాహ్మి)

| | ఉత్సేధం (ఆయామం) | వక్త్రం (విస్తారం) | బిలం (కంఠం) | పాదపీఠం (విస్తారం) | రూపం |
|---|---|---|---|---|---|
| పాద్మం[2] | 22 అం | | మధ్య ఘటికాముఖం 6 అం. నాల్గు దిక్కుల చిన్న ఘటాలు 4అం | | |
| పురు.సం[3] | 22 అం | | ఊర్ధ్వ భాగము ఘటాకృతి, నాల్గు దిక్కుల చిన్న ఘటాలు 4అం. విస్తీర్ణము గలవి.ఎత్తు 4అం. 1అంకంఠం. 10అం. పాదపీఠం. | | |
| కపింజలం[4] | 20 అం | 12 అం | ఊర్ధ్వ భాగము ఘటాకృతి, నాల్గు దిక్కుల చిన్న ఘటాలు 4అం. విస్తీర్ణము గలవి. క్రింద పాలికాకృతి. | | |

1. క్రి.కై.చం. రాకావ్యాఖ్య పుట 219
2. పాద్మ.క్రియా. 24.29-34
3. కపిం.సం. 21.2-9
4. పురు.సం. 13.6-12

శరావము (శైవం)

| | ఉత్సేధం (ఆయామం) | వక్త్రం (విస్తారం) | బిలం (కంఠం) | పాదపీఠం (విస్తారం) | రూపం |
|---|---|---|---|---|---|
| పాద్మం | 20 అం | 12 అం | ---------- | ---------- | ---------- |
| పురు.సం[3] | 20 అం | 12 అం | ఎత్తు4 అం, కంఠం 1అం, 10అంపాదపీఠం | | |
| కపింజలం[4] | 20 అం | 12 అం | ....... | 6 అం | |

## 2. బీజములు (నవ ధాన్యములు)

అంకురారోపణమునకు కావలసిన బీజములు నేటి నవధాన్యములే కాక సంహితలయందు మరికొన్ని కన్పించుచున్నవి. కొన్ని సంహితలు త్రయోదశ బీజములను కొన్ని ద్వాదశ బీజములను విధించినవి. కపింజలము అభావమును ముద్గము ప్రశస్తమని చెప్పియున్నది. ఈక్రిందిశ్లోకములు ఆధారముచేసుకొని పట్టిక యందు అయా వివరములు చూపబడినవి.

**ముద్గాది వేణు బీజాన్తం త్రయోదశ మనుత్తమం, ముద్గ సర్షపనీవార శింబ మాష యవస్తథా ప్రియఙ్గుశ్చణక శ్యామ కుళుత్థాశ్చ తథాతిలాన్, వ్రీహి వేణుశ్చ ధాన్యాని పయోభిః క్షాళయేత్సుధీః తిల ముద్గ యవ వ్రీహి మాష గోధూమ సర్షపాః, చణకో రాజమాషశ్చ నవధాన్యః ప్రకీర్తితాః నవధాన్యాని వా యద్వాత్రయోదశ మథాపి వా, అంకురారోపణార్థంతు సంగ్రహేల్లోహభాజనే॥**

**- శ్రీపురు.సం 13 అధ్యా. 25 - 29 శ్లో**

**నీవార శ్శాలయో ముద్గా శ్శ్యామాకాశ్చ ప్రియఙ్గవః।**
**యవా స్తిలాశ్చ గోధూమాః యేచా న్యే యాజ్ఞికా మతా॥**

**- పాద్మేక్రియా.24 అధ్యా -79; నారా. సం.య.7.134,135**

**ముద్గసర్షప నీవార శింబ మాష యవస్తథా,**
**పియంగు శ్యామ నిష్పావా కుళుత్థాశ్చ తథాతిలాః**
**వ్రీహి వేణూ చ ధాన్యాని పయోభిః క్షాళయే త్సుధీః,**
**బీజానామప్యలాభేతు ముద్గమేకం ప్రశస్యతే॥**

**- కపిం. 21 అధ్యా.20, 21**

| సంహిత | పురు. | | ఈశ్వర | పాద్మ | క్రి.కై.చం | కపింజల | నారాయణ | వైఖా.ప్రతి | అర్థం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| బీజసంఖ్య | 13 | 9 | 12 | 8 | 13 | 13 | 8 | 12 | |
| 1 | ముద్గ | ముద్గ | ముద్గ | ముద్గ | ముద్గ | ముద్గ | ముద్గ | ముద్గ | పెసలు |
| 2 | యవ | యవ | యవ | యవ | యవ | యవ | యవ | యవ | యవలను పొట్టుతో గూడినధాన్యము |
| 3 | తిల | తిల | తిల | తిల | తిల | తిల | తిల | తిల | నువ్వులు |
| 4 | ప్రియంగు | --- | ప్రియంగు | ప్రియంగు | ప్రియంగు | ప్రియంగు | ప్రియంగు | ప్రియంగు | కొఱ్ఱలు |
| 5 | నీవార | --- | నీవార | నీవార | నీవార | నీవార | నీవార | --- | తృణధాన్యములు |
| 6 | --- | గోధూమ | గోధూమ | గోధూమ | --- | --- | గోధూమ | గోధూమ | గోధుమలు |
| 7 | సర్షప | సర్షప | సర్షప | --- | సర్షప | సర్షప | --- | సర్షప | ఆవాలు |
| 8 | మాష | మాష | మాష | --- | మాష | మాష | --- | మాష | మినుములు |
| 9 | --- | --- | శాలి | శాలి | --- | --- | శాలి | శాలి | 60రోజులలో పండు వరి |
| 10 | శ్యామాక | --- | --- | శ్యామాక | శ్యామాక | శ్యామాక | శ్యామాక | --- | చాములు |
| 11 | వ్రీహి | వ్రీహి | --- | --- | వ్రీహి | వ్రీహి | --- | వ్రీహి | ఎఱ్ఱ వడ్లు |
| 12 | వేణు | --- | వేణు | --- | వేణు | వేణు | --- | -- | వెదురు బియ్యము |
| 13 | కుళుత్థ | --- | కుళుత్థ | --- | కుళుత్థ | కుళుత్థ | --- | --- | ఉలవలు |
| 14 | చణక | చణక | --- | --- | --- | --- | --- | చణక | శెనగలు |
| 15 | శింబ | --- | --- | --- | శింబ | శింబ | --- | --- | కాయధాన్యములు |
| 16 | --- | --- | నిష్పావ | --- | నిష్పావ | నిష్పావ | --- | --- | గాలికి ఎగురబోయబడిన ధాన్యం |
| 17 | --- | రాజమాష | --- | --- | --- | --- | --- | --- | అలచందలు |
| 18 | --- | --- | --- | --- | --- | --- | --- | తిల్వ | లొద్దుగ |
| 19 | --- | --- | --- | --- | --- | --- | --- | మసూర | చిరుసెనగలు |

**తిల సర్షప నీవార శాలీ మాష ప్రియ్గవః,**

**కుళుత్థ ముద్గ నిష్పావ యవ గోధూమ వైణవాః**

**బీజాని ద్వాదశైతాని..॥ - ఈశ్వర.సం. 10 అధ్యా.116, 117**

**తిలముద్గ యవ వ్రీహి మాష గోధూమసర్షపాః।**

**చణకో రాజమాషశ్చ ధాన్యాని నవచా హరేత్॥ - విష్ణుతిల. 7 అధ్యా.**

**గోధూమాన్ వ్రీహియ శ్చాఢాః ముద్గా శ్చణక బర్బరాః**

**తిల మాష కుళుత్థాశ్చ నవధాన్యః ప్రకీర్తితా॥**

(బర్బరాః = బొబ్బర్లు, అఢా = కందులు) **- పూర్వాచార్యా ప్రయుక్తము**

**తిల మాష యవ వ్రీహి ముద్గ సర్షప చణక కుళుత్థ గోధూమ ప్రియ్గు**

**శ్యామాకాది చతుర్దశ ద్వాదశ వా యథాసంభవం గృహీత్వా ..॥**

**- యాజుష. పూ. ప్రయోగము.**

**నవ ధాన్యములు = గోధుమలు, యవలు, పెసలు, శెనగలు, కందులు, బొబ్బర్లు, నువ్వులు, మినుములు, ఉలవలు. - శబ్ద రత్నాకరం**

## 3. <u>అంకురార్పణ మండల రచన:</u>

అంకురార్పణ మండలమునందుంచు పాత్రల సంఖ్యను బట్టి రచనావిధానమున మార్పు కన్పించుచున్నది. పాత్రల సంఖ్య 108, 48, 36, 24, 16, 12, 9, 8, 5, 4 గా ఉన్నది. ఆయా సంహితలయందు సూత్రపాతాది రచనా విధానము చక్కగా వర్ణించబడియున్నది.

**1. అష్టోత్తరశత పాలికాద్యంకురారోపణ మండలోద్ధారము.** (108 పాత్రలు)

ఇంద్రా దీశానాంతం 8 దిక్కులు, మధ్యన బ్రహ్మపదం 1 కలిపిన మొత్తం = 9

ప్రతి దిక్కునకు 12 పాత్రల చొప్పున 12 × 9 = 108 (36 పాలికలు, 36 ఘటికలు, 36 శరావములు) (శ్రీపురు.సంహి.13.1, పాద్మ-క్రియా. 24-59...68, క్రి.కై.చం.పుట-29,30, శ్రీమన్నారాయణ సంహితలయందీ వివరములు గలవు)

<u>రచనా విధానము</u> (క్రి.కై.చం. పుట 30)

ప్రాగాయతముగా (పడమర నుండి తూర్పునకు) = 12 సూత్రములు

ఉదగాయతముగా (దక్షిణము నుండి ఉత్తరమునకు) = 15 సూత్రముల

మొత్తం పదములు = 11 × 14 = 154 (దీర్ఘమాయతమ్ - అమరం)

మార్జన పదములు = 46, పాత్రలుంచవలసిన పదములు = 108

వా ఉత్తరం ఈ

ప

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ | శ | శ | శ | | శ | శ | శ | శ | | శ | శ | శ | శ |
| శ | శ | శ | శ | | శ | శ | శ | శ | | శ | శ | శ | శ |
| శ | శ | శ | శ | | శ | శ | శ | శ | | శ | శ | శ | శ |
| | | | | | | | | | | | | | |
| ఘ | ఘ | ఘ | ఘ | | ఘ | ఘ | ఘ | ఘ | | ఘ | ఘ | ఘ | ఘ |
| ఘ | ఘ | ఘ | ఘ | | ఘ | ఘ | ఘ | ఘ | | ఘ | ఘ | ఘ | ఘ |
| ఘ | ఘ | ఘ | ఘ | | ఘ | ఘ | ఘ | ఘ | | ఘ | ఘ | ఘ | ఘ |
| | | | | | | | | | | | | | |
| పా | పా | పా | పా | | పా | పా | పా | పా | | పా | పా | పా | పా |
| పా | పా | పా | పా | | పా | పా | పా | పా | | పా | పా | పా | పా |
| పా | పా | పా | పా | | పా | పా | పా | పా | | పా | పా | పా | పా |

తూ

నై ద ఆ

## 2. అష్టచత్వారింశ త్పాలికాంకురార్పణమండలం (48 పాత్రలు)

ప్రాగాయతముగ 9, ఉదగాయతము 12 ఈ చొప్పున సూత్రపాతం చేయగా వచ్చే పదముల వివరం-

మండలం యొక్క యావత్తు పదములు - 8 × 11 = 88

మార్జన పదములు - 40

ప్రాగాయత నవసూత్రములలో 2 పద పంక్తులు విడిచి 3వ పదపంక్తి మార్జించి, మరల 2 విడిచి 1 మార్జించి, మరల మిగిలిన రెండు పదపంక్తులు విడువవలెను. అట్లే ఉదగాయిత ద్వాదశ సూత్రములలో ప్రతి రెండు పంక్తులు విడచిపెడుతూ 3వ

పంక్తి మార్జన చేసేది. మొత్తం 5 పంక్తులు మార్జన కాబడును. పాత్రలుంచవలసిన 48 పదముల యందు 16 పాలికలు, 16 ఘటికలు, 16 శరావములు స్థాపించవలె

వా ఉ ఈ

ప తూ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ | శ | | శ | శ | | శ | శ | | శ | శ |
| శ | శ | | శ | శ | | శ | శ | | శ | శ |
| | | | | | | | | | | |
| ఘ | ఘ | | ఘ | ఘ | | ఘ | ఘ | | ఘ | ఘ |
| ఘ | ఘ | | ఘ | ఘ | | ఘ | ఘ | | ఘ | ఘ |
| | | | | | | | | | | |
| పా | పా | | పా | పా | | పా | పా | | పా | పా |
| పా | పా | | పా | పా | | పా | పా | | పా | పా |

నై ద వా

## 3. షట్త్రింశ త్పాలికాంకురార్పణ మండలం (36 పాత్రలు) – (కపింజలోక్తము)

ప్రాగాయ తోదగాయతములుగా 9 చొప్పున సూత్రపాతం చేసి 28వ పదములు మార్జించగా 12 శరావములు, 12 ఘటికలు, 12 పాలికలు కలిగి మొత్తము 36 పాత్రల అంకురార్పణ మణ్డలం ఏర్పడును.

ప్రాగాయతోదగాయతములుగా ఐదేశి చొ॥న సూత్రపాతం చేయగా 16 పదములు వచ్చును. వీనియందు

వా ఉ ఈ

ప తూ

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| శ | శ | | శ | శ | | శ | శ |
| శ | శ | | శ | శ | | శ | శ |
| | | | | | | | |
| ఘ | ఘ | | ఘ | ఘ | | ఘ | ఘ |
| ఘ | ఘ | | ఘ | ఘ | | ఘ | ఘ |
| | | | | | | | |
| పా | పా | | పా | పా | | పా | పా |
| పా | పా | | పా | పా | | పా | పా |

నై ద వా

4. <u>చతుర్వింశ త్పాలికాద్యంకురార్పణమండలం</u> (24 పాత్రలు (పాద్మ.క్రియా. 24.65))

ప్రాగాయతముగా - 9, ఉదగాయతముగా - 6 సూత్రపాతం చేయవలెను

మొత్తం మండలంలోని పదములు - 8 × 5 = 40

మార్జన పదములు - 16

8 శరావములు, 8 ఘటికలు, 8 పాలికలు మొత్తము 24 పాత్రలు

వా ఉ ఈ

| | | | | |
|---|---|---|---|---|
| శ | శ | | శ | శ |
| శ | శ | | శ | శ |
| | | | | |
| ఘ | ఘ | | ఘ | ఘ |
| ఘ | ఘ | | ఘ | ఘ |
| | | | | |
| పా | పా | | పా | పా |
| పా | పా | | పా | పా |

సోమకుంభం ప ... తూ

నై ద ఆ

5. <u>ద్వాదశ పాలికాద్యంకురార్పణ మండలం</u> (12 పాత్రలు(పాద్మ.క్రియా. 24.66)

సూత్రపాతము - ప్రాగాయతముగా -5, ఉదగయతముగా -4, చేయగా వచ్చు 12 పదములలో కేవలము 12 పాలికలను గాని, లేదా 4 శరావములు, 4 ఘటికలు, 4 పాలికలు ఉపయోగించవచ్చును. ( "చత్వారి సూత్రాణ్యన్యాని పంచ ద్వాదశకల్పనే -పాద్మ.క్రి. 24.66)

వా ఉ ఈ

| | | |
|---|---|---|
| పా | పా | పా |
| పా | పా | పా |
| పా | పా | పా |
| పా | పా | పా |

సోమకుంభం ప ... తూ

నై ద ఆ

## 6. షోడశ పాలికాంకురరార్పణామండలం (24 పాత్రలు)

సర్వార్ధ పక్షే ప్రథమే పంచైవ ద్వివిధాన్యపి । యద్వేన్దుకుమ్భం పరితః పాలికా షోడశస్థితాః॥ -పాద్మ.క్రి. 24.66-68; శ్రీమన్నా.సం. య.వై.కాం. 7. 122.

ప్రాగాయతోదగాయతములుగా ఐదేసి చొ॥న సూత్రపాతం చేయగా 16 పదములు వచ్చును. వీనియందు కేవలము పాలికలనే ఉపయోగించవలెను.

వా ఉ ఈ

| | | | |
|---|---|---|---|
| పా | పా | పా | పా |
| పా | పా | పా | పా |
| పా | పా | పా | పా |
| పా | పా | పా | పా |

సోమకుంభం

ప తూ

నై ద ఆ

## 7. ద్వాదశ పాలికాంకురరార్పణ మండలం (12 పాత్రలు)

| | | | |
|---|---|---|---|
| పా | పా | పా | పా |
| పా | పా | పా | పా |
| పా | పా | పా | పా |

ఈ ద్వాదశ, నవ, పంచ పాలికాపక్షములు సనత్కు.సం.శివరాత్రమున పాంచరాత్ర గ్రంథమున 9వ అధ్యాయ మందు చెప్పబడిన వని శ్రీమాన్ దొ॥ప్రకాశం గారి వ్రాతప్రతిలో వివరింపబడినది.

## 8. నవపాలికాంకురరార్పణమండలం (9 పాత్రలు)

వా ఉ ఈ

| | | |
|---|---|---|
| పా | పా | పా |
| పా | పా | పా |
| పా | పా | పా |

ప తూ

నై ద ఆ

**9. పంచపాలికాంకురర్పాణమండలం** (5 పాత్రలు)




ఈ క్రింది అష్ట, చతుః పాలికాంకురార్పణ మండలములకు సూత్రపాతం లేకుండా కేవలముపాలికలనే ప్రాగా ద్యష్ఠ / చతుః దిక్కులయందుంచి యథాశాస్త్రముగా బీజావాపము చేయవలెను.

**10.అష్టపాలికాంకురార్పణ మండలం** (8 పాలికలు)




**11.చతుష్పాలికాంకురార్పణ మండలం** (4 పాలికలు)




**నవపాలికాంకురార్పణము** - విష్ణుతిలకాన్తర్గతమగు ఈ నవపాలికాంకురార్పణ విధానమున అంకురార్పణ హోమము చెప్పబడలేదు. ఇందు మధ్య బ్రహ్మస్థానము లేదు. దీనికి బదులు మధ్యన సోమకుంభమున్నది. తూర్పు మొదలు ఈశాన్యం వరకు 8 పాలికలు, 4 × 4 సూత్రాస్ఫాలనము వలన ఏర్పడు 8 కోష్ఠములయందు ధాన్యపూరణ - పాలికల క్షాళన - కుశకాశములతో బిలములను అవరోధించుట - పైన అశ్వత్థ పల్లవబంధనము - మట్టి, ఇసుక, ఎండిన ఆవు పేడ ఉంచుట - తూర్పుమొదలు ఈశాన్యం వరకూ అష్ఠ పాలికావాహనము పురుష విద్యతో - మధ్యన కూర్చ, పల్లవ, గంధవారి సంయుక్తము, శరావ పిధానయుతము అగు సోమకుంభము

నుంచుట - బీజములను నూతనపాత్ర యందుంచుట - ఆవుపాలతో క్షాళనము - బీజపాత్రను స్థండిలమున నుంచుట, మూలవిద్యతో ఆవాహన - సోమావాహన - పుణ్యాహం - పాలికలయందు విష్ణువును ఆవాహన, పూజనము - ద్వాదశాక్షరితో బీజావాపము - మూర్ధాన మన్త్రమున మృదాచ్ఛాదన - ఇమమ్మేవరుణమన్త్రమున సోమకుంభోదక సించనములు గలవు. (వి.తి. 7 అధ్యా. 20-38)

## అంకురార్పణ విధి :

శ్రీమన్నారాయణ సంహిత (యజ్ఞవైభవకాండ - 7 అధ్యా. 111 - 165 శ్లో.)
(పాద్మ సంహిత (క్రియా. 24 అధ్యా. 25-99 శ్లో)
(కపింజల సంహిత - (అధ్యా 21 - శ్లో 16 - 28)

(శ్రీమన్నారాయణ పాద్మ సంహితలయందు చాలవరకు విషయమంతయూ ఒకే విధముగ నున్నది. అక్కడక్కడనున్న స్వల్ప భేదములు ఆయాచోట్ల బ్రాకెట్లలో నివ్వబడినవి)

- ప్రతిష్ఠాదికర్మలకు ముందు ఆరంభమున అంకురార్థం బీజావాపం చేయవలె. 12, 9, 7, 5, 3 దినముల కార్యక్రమములయందు కర్మారంభమునకు ముందుగ అంకురారోపణము చేయవలె. అంకురారోపణ పాత్రలు మూడురకములు. వీని కొలతలు రూపవర్ణనము, ఈ అనుబంధము మొదట ఇవ్వబడినది.
- ఖనిత్రమును తీసుకొని విష్వక్సేనునిగాని వైనతేయునిగాని అలంకరించి యానమున నుంచి, ఛత్రాదులు అంకురభాజనములతో, తూర్యనాదములతో, బహుబుక్కులను, శాకున సూక్తము పఠిస్తూ ప్రాచీముదీచీ దిశకేగవలె.
- అస్త్రమంత్రమున ధరణీ సంప్రోక్షణము - మహీసూక్తమున స్పృశించి ధ్యానించుట - వరాహమూర్తిని అర్చించుట - భూమిని అస్త్రమన్త్రమున ప్రోక్షించి పుష్పముల పూజించి - క్రోడవిద్యతో భాజనములయందు మృద్గ్రహణమొనర్చి, మూలమంత్రమున నూతన వస్త్రమున చుట్టి, నదిఇసుక, గోకులముల గోమయములను గ్రహించి - యానమున/ గజమున/హయముపై కెక్కించి - శాకున సూక్త, శ్రీసూక్త, భూసూక్తములతో, తూర్యఘోషతో గ్రామప్రదక్షిణము, మంటప ప్రవేశము.(ఇంతవరకూ పాద్మానుసరణ - ఇకపై నారాయణ సంహితానుసరణము)
- భగవదనుజ్ఞార్థం ప్రార్థనా.
- పాలికా క్షేత్ర సమ్మార్జన, గోమయేనానులేపన, రంగవల్యాద్యలంకరణ.
- చన్దనార్ద్ర సూత్రాస్ఫాలన, ప్రథమం ప్రాగాయతం, అనన్తరం ఉదగాయతం
- సంహితోక్త శక్త్యనుకూల అంకురార్పణ మండల రచన

(శక్త్యపేక్షపాలికానాం పక్షభేదః ప్రదర్శితం - అను పాద్మ వచనం ప్రకారం యధాశక్తి, కర్మభేరము ననుసరించి మండల రచనచేసి పాలికాదుల నుంచవలెను. ప్రతి పదమున తిల

తండులములను అధిక ప్రమాణమునగాని, ప్రస్థ ప్రమాణమునగాని పోసి ఆ ధాన్యమున పాలికాదులను విధ్యుక్తముగా బ్రహ్మాదీశాన పర్యన్తము ఉంచవలెను - పాద్మం)

- విష్ణు గాయత్ర్యా శరావాది పాత్ర ప్రక్షాళనం. (పాలికలను క్షాళనమొనర్చి స్వస్వమన్త్రములతో అర్చించవలెను, అలకరించవలెను - కపింజలం)
- పాలికా కంఠే దూర్వా సహదేవీ అశ్వత్థ పల్లవ బంధనం.
- బిలమూలములయందు కుశకాశ తృణాదుల పూరణం.
- ప్రథమం మృత్, పశ్చాత్ వాలుకా, అతః పరం కరీష చూర్ణేన పూరణం.
- పారమేష్ఠి విద్యయా ఘటికాః పురుషవిద్యయా పాలికాః విశ్వాఖ్య విద్యయా శరావాః స్థాపనం.
- శరావ ఘట పాలికలను ప్రత్యేక వస్త్రముతో ఆచ్ఛాదనం.
- సర్వేషాం పశ్చాత్ సోమకుంభం ధాన్యరాశౌ స్థాపయేత్, నవ వస్త్రేణాచ్ఛాద్య, గంధోదకేన సమ్పూర్ణే తస్మిన్ కుంభే రత్నాని విన్యసేత్,
- నీవార, శాలి, ముద్గ, శ్యామాక, ప్రియంగవ, యవ, తిల, గోధూమాది యాజ్ఞీయ వృక్ష బీజాన్ నూతన పాత్రే నిధాయ, తత్పాత్రం పాలికానాంతు ప్రాగ్దేశే విన్యస్య, వస్త్రేణాచ్ఛాద్య, పుణ్యాహంకుర్యాత్. *(తూర్పున బియ్యముతో ఏర్పరచిన స్థండిలమున బీజపాత్రనుంచవలెను. బీజములను సోమవిద్యచే పూరించవలెను - కపింజల సంహిత)*
- సోమకుంభమున సోముని ఆవాహనము, పూజ - పాయసాన్న నివేదనము
- పాలికాధిదేవతా పూజనం - ఘటికానాం బ్రహ్మాణం, పాలికానాం జనార్దనం, శరావానా మీశానం ధ్యాత్వా, శాలాపూజనం, ధ్వజతోరణ ద్వారకుంభ అధిదేవతార్చనం, కుముదాది గణాధిపార్చనం.
- అంకురార్పణ హోమం - మూల మన్త్రేణ 100 అజ్యాహుతులు, సోమమన్త్రేణ సమిధలు(4 సమిధలని పాద్మము), నృసూక్తమున (పురుష సూక్తము) చరువు, పునః సోమమన్త్రమున 100 ఆజ్యాహుతులు. ***(పూర్ణాహుతిని కూడ పాద్మము విధించినది. శ్రీక్రై.చంద్రికయందు - పాలికాదుల అధిదేవతా పూజనము, సోమకుంభ పూజనము, పాయసాన్న నివేదనమైన తర్వాత, కుండమునగాని, స్థండిలమునగాని 'విధివత్ అగ్నే ప్రతిష్ఠా దగ్నేముఖాన్తం కృత్వా' - అగ్నే మధ్యమున ఆధారాది పద్మాన్తం పీఠ కల్పనము, అందు సోముని ఆవాహన, అర్ఘ్యాది నైవేద్యాన్తం ఘృతమున ఇవ్వవలె - ఘృతమున 108, సమిధలతో 108, చరువున 16, సోమమన్త్రమున 108 ఆహుతులు ఇవ్వవలెనని చెప్పబడినది (పేజి నెం. 32) - గాన అగ్నే ప్రతిష్ఠను అగ్నే ముఖాన్తం అంకురార్పణ మధ్యమున జరుపవలసియున్నది - ఎడిటర్)***
- సంపాతాజ్యమును గ్రహించి స్పర్శమన్త్రమున పాలికలను స్పృశించవలెను. శేషించిన సంపాతాజ్యము సర్వమును అస్త్రమన్త్రమున బీజపాత్రయందు నిక్షేపించవలెను.

(సమిధాజ్యములతో సోమమన్త్ర మష్టోత్తరశతం హోమం చేయవలెను. సమ్పాతాజ్యమున సేచనమొనర్చి బీజములను విన్యసించవలెను. పాలికలకు యథాక్రమంగా ఘృతారోపణము చేయవలెను. పుణ్యాహవాచన మొనర్పవలెను - అని కపింజలసంహిత. సంపాతాజ్య శేషము బీజపాత్రయందు నిక్షేపించవలెను - అని పాద్మము)

- సోమమన్త్రమును ఆచార్యుడు స్వయముగ 100 గాని, 108 గాని, 1000 మార్లు గాని, యథాశక్తి జపమొనరింపవలెను.
- సుముహూర్తమున బ్రాహ్మణానుమతితో బ్రహ్మాదీశాన పర్యన్తం ఓషధయ స్సంవదన్త ఇతి మన్త్రముతో బీజావాప మొనరింపవలెను. (కపింజలం కూడా బ్రహ్మాదీశానాన్తమే విధించినది. కాని బీజావాపమునకు జితన్త మన్త్రమును విధించినది. పాద్మము ద్వాదశాక్షరవిద్యను ఈశ్వర సంహిత అష్టాక్షరిని విధించినవి)
- మహీసూక్తమున మృత్తికా నిక్షేపణము, ద్వాదశాక్షరవిద్యతో శ్రీసూక్తమున కించిత్ హరిద్రాంబువులను చల్లవలెను. పాలికలను కోమల పంచపల్లవములతో కప్పవలెను.
- ఆపైన సర్వదిక్కులయందు కుముదాది గణములకు పాయసమున బలి నొసంగవలెను.
- కర్మాంతము వరకు పాలికలను రక్షించవలెను. ప్రతి దినం సోమకుంభమున సోముని పూజించవలెను. (యజేత సోమం తత్కుంభే పాయసేన దివానిశం - అని పాద్మము)
- అనిర్వాణ దీపముంచవలెను - నాలుగు దిక్కులయందు గాని లేదా తూర్పునగాని పూర్వాగ్ర ఉత్తరాగ్రములుగా 12 కుశలనుంచి అందు ఒకటి, రెండు, మూడు లేదా నాలుగు దీపములను ఉంచవలెను. రెండేసి వత్తులతో గోఘృతమున లేదా తిల తైలమున దీపములనుంచవలెను. అగ్ని మన్త్రమున ఆ వత్తులను వెలిగించి ప్రతిదినము యజ్ఞాంతము వరకు రక్షించి పూజింపవలెను. (కపింజలము కూడ ఉద్వాసాంతము నిత్య దీప ప్రజ్వలనం, బలి ప్రదానం విధించినది)
- అంకురారోపణము రాత్రి చేయవలెను. (కపింజలం కూడ ఇటులనే విధించినది)
- అంకురవృద్ధి కొరకు సోమకుంభ జలమున శ్రీ సూక్తముతో ప్రతిదినము హరిద్రావారి జల్లవలెను. పసుపు పచ్చని తెల్లని నిట్టనిలువగు అంకురములు శుభకరములు, తత్ విపరీతములు అశుభములు. అంకురములు కన్పించకపోయిన (రాకపోయిన) కర్మ అంతయూ నశించును. మృత్సంగ్రహణ కాలమున ఖనన సమయమున ఖనిత్రము పతనమైన యజమానున కశుభము. ఇత్యాది నిమిత్తములు కన్పించిన వెంటనే శాంతి జరిపించవలెను. **(నల్లని అంకురములు ద్రవ్యనాశ కరములనియూ, ఎర్రనివి కలహ కారకములనియూ, నీలిరంగు అంకురములు మానసపీడ గలిగించునవనియూ, వంకరలు ~~తిరిగిన అంకుర~~ములు రోగకారకములనియూ, అసలు మొలవకపోయిన మరణమనియూ - ఈశ్వర సంహిత)**

## ప్రవరలు -

1. లక్ష్మీ నారాయణం - అచ్యుతగోత్రం - అచ్యుత, పరబ్రహ్మ, నారాయణ, నిరాకార, సాకార పంచార్షేయం - పరబ్రహ్మ శర్మ, నారాయణశర్మ, ప్రద్యుమ్న శర్మ, లక్ష్మీదేవి- సౌభాగ్యసగోత్రం - సౌభాగ్య, విశ్వంభర, నిరాకారసాకార త్రయార్షేయం - విశ్వంభరశర్మ, రత్నాకరశర్మ, క్షీరార్ణవశర్మ ( ఇది సర్వతోపయోగం)

2 . శ్రీవేణుగోపాలస్వామివారు- గార్గేయస గోత్రం - ఆంగీరస గార్గ సైన్య త్రయార్షేయం

యదువర్మణోనప్త్రే - శూరసేనవర్మణః పౌత్రాయ - వసుదేవ వర్మణః పుత్రాయ రుక్మిణీదేవి - శ్రీవత్సగోత్రం - శ్రీవత్స చ్యవన ఔరువ ఔప్నువ జామదగ్ని పంచార్షేయం - మహాభీష్మక, భీమరాజ, భీష్మకమహారాజ

సత్యభామ - భార్గవస గోత్రం - భార్గవ చ్యవన ఔరువ ఔప్నువ జామదగ్ని పంచార్షేయం - యుధజిత్ , క్రతుజిత్, సత్రాజిత్

3. శ్రీసీతారామస్వామివారు - వసిష్ఠసగోత్రం - వసిష్ఠ, మైత్రావరుణ, కణ్వ త్రయార్షేయ ప్రవర - రఘువర్మ, అజవర్మ, దశరథ వర్మ

సీతాదేవి - గౌతమసగోత్రం - ఆంగీరస, అయాస్య, గౌతమ త్రయార్షేయం -

నిమి వర్మ, విదేహవర్మ, జనకరాజవర్మ

4. **శ్రీవేంకటేశ్వరస్వామివారు -**

1. **ఆంగీరస బార్హస్పత్య భరద్వాజ త్రయార్షేయ ప్రవరాన్విత భరద్వాజ సగోత్రాయ .... శ్రీనివాస శర్మణే వరాయ -**

**భార్గవ చ్యవన అప్నవాన ఔర్వ వైదల పంచార్షేయ ప్రవరాన్విత భార్గవ సగోత్రోద్భవీం ... శ్రీదేవ నామ్నీం కన్యామ్**

**కాశ్యప ఆవత్సార నైధృవ త్రయార్షేయ ప్రవరాన్విత కాశ్యప సగోత్రోద్భవీం.... భూదేవీనామ్నీం కన్యామ్**

( ఇది తిరుమలలో చెప్పేప్రవర అని తిరుమలవాసుని కల్యాణోత్సవం పుట 18,19)

2. ఇతర పాంచరాత్ర దేవాలయాలలో శ్రీవేంకటేశ్వరునకి అచ్యుతగోత్ర ప్రవర ఉపయోగిస్తారు. కొన్ని దేవాలయాలలో భరద్వాజసగోత్రం చెప్పే సంప్రదాయం కూడా కన్పిస్తున్నది.

## అనుబంధము 6

# అగ్ని కార్యవిధిః

## 1. ఉపయుక్త విషయములు

(శ్రీమన్నారాయణ సంహిత-యజ్ఞ వైభవకాండ 6 అధ్యా. 26-97 శ్లో)

**1. యాగమంటపాలంకరణ, ద్వారాలంకరణములు** :- అశ్వత్థ, ఔదుంబర, వట, ప్లక్షములు ప్రాగాదిగా తోరణము లేర్పరచవలె - పై జెప్పినవన్నియూ లభ్యముకానిచో అందేదో ఒకదానితో నాలుగు తోరణములు కట్టవచ్చు. అదీ లభ్యము కానిచో చందన వృక్షపు ఆకులతో నాలుగు తోరణములు కట్టవలె. తోరణము పొడవు 7 లేదా 5 హస్తములు (లేదా బేసి హస్తములు). - అర్ధహస్త ప్రమాణము పట్టిక కల్పించవలె - ప్రతి తోరణమునకు మూడు మూడు శూలములు కల్పించవలె. - శూలము పొడవు రెండు తాలములు, వెడల్పు 8 అం.లు - పట్టిక యొక్క పాద నహనము (వెడల్పు) 22 అం.లు - పాదములు వృత్త లేదా చతురశ్రాకారమున ఉండవలె - ఆ పాదములయందు కలశ, దక్షిణావర్త శంఖము, చక్రము, ధ్వజము, పటహము, కార్ముకము, నాగము అనువానిని కల్పించవలె.

అష్టమంగళములను ఫలకములందు కల్పించవలె - ఫలకములు యజ్ఞవృక్షీయములు లేదా సువర్ణాది లోహ నిర్మితములు - 24 × 12 × 2 అం.ల ప్రమాణము గలవి - వానిపై శ్రీవత్సము, పూర్ణకుంభము, భేరీ, దర్పణము, మత్స్యయుగ్మము, చక్రము, శంఖము, సూర్యుడు అను అష్టమంగళములను లిఖించవలె.

**2. ఆచార్యుడు మొ॥ వారి పీఠములు** - వీరికి 24 × 12 అం.ల పొడవు గలపీఠములు - ఆచార్యునకు సింహాకారము, ఋత్విజులకు కూర్మాకార పీఠములు - ఆచార్య పీఠము క్రింద కృష్ణాజినము, ఋత్విజుల పీఠముల క్రింద కృష్ణాజినములనుగాని, అలాభమున కుశలనుగాని వేయవలె - బ్రహ్మకు వ్యాఘ్రాజినముపై బ్రహ్మపీఠము నుంచవలె - పీఠములపై ఉన్నితో లేదా నూలుతో చేసిన ఆసనముల నుంచవలె - ఆచార్యునకు, బ్రహ్మకు కల్పించిన ఆసనములకు సువర్ణ రజిత రత్నాదులతో నాల్గువైపుల అలంకరించవలె.

**3. బ్రహ్మదండము :-** ఇది ఒక హస్తము పొడవు, మూలమునుండి అగ్రము వరకు ఆదోక ఆకృతి. మూలమున 1 అం.ల మధ్యన 2 అం.లు, అగ్రమున 3 అం.లు దళసరి గల యజ్ఞీయదారు దండము - దీనిపై రత్న, సువర్ణ, రజితములతో

ఫలపుష్ప లతాదుల నలంకరింపవలె - దండాగ్రమున బంగారముతో చేయబడిన సుదర్శనమును ప్రతిష్ఠించవలె - అట్టి బ్రహ్మదండమును ధరించిన విప్రుడు నిజముగా చక్రధరుడగు హరియే యగును - విఘ్నకర్తలగు భూత పైశాచిక గ్రహములు అతనిని చూచి దూరముగా తొలగిపోవుదురు.

**4.ధ్వజములు :-** తెల్లని లేదా నల్లని పట్టు వస్త్రములతో ఆచార్యునకు నచ్చిన ప్రమాణమున నేర్పరచిన ధ్వజములను దేవుని వాహనములయం దేర్పరచవలె.

**5.పతాకములు :-** 8 లేదా 10 తాలముల పొడవు వెడల్పులతో పట్టు లేదా నూలు వస్త్రములతో చేయబడినవి, శోభనాకారములు నానా వర్ణ విచిత్రితములు ..... ..... ...... అగు పతాకములను ప్రతి ద్వారమున కల్పించవలె.

**6.బ్రహ్మకూర్చ :-** "చతుర్వింశతి దర్భైశ్చ బ్రహ్మకూర్చాదయ స్మృతాః। మూల మంగుళ ముత్సృజ్య తథాగ్రం విసృజే ద్బుధాః। పవిత్ర గ్రంథివద్గ్రంథి ర్వేణిరూపం తథాకృతి ॥ పురు.సం 11.39.40

**7.ప్రోక్షణపాత్ర :-** సౌవర్ణ / రాజిత / తామ్ర / మృణ్మయమగు పాత్ర - ఎత్తు 8 లేదా 6 అం.లు. - మూలమున 3 అం.లు, ముఖము 12 అం.లు గల గుండ్రని తామరపూవు వంటి ఆకారముననున్న పాత్ర ప్రోక్షణపాత్ర.

**8.ప్రణీతపాత్ర :-** పై ప్రోక్షణపాత్రతో సమానరూపము సమప్రమాణము గల పాత్ర ప్రణీతపాత్ర

**9.ఆజ్యపాత్ర :-** ఒక తాలము ఎత్తు, ముఖము 16 అం.లు, మూలమున 3 అం.ల విస్తారము - గుండ్రని తామరపూవు వంటి ఆకారము గలిగి లోహ / మృణ్మయ నిర్మితమగు పాత్ర.

**10.చరుపాత్ర :-** హవిస్సు వండుటకుపయోగపడు పాత్ర చరుపాత్ర - మూలమున 2 లేదా 6 అం.లు, మధ్యన 12 అం.లు, అగ్రమున 6 అం.లు గలిగి తామర మొగ్గ ఆకారమున, ఆఢకము (4 కుంచములు), లేదా అందు సగము, లేదా ప్రస్థము (కుంచెడు) బియ్యము ఉడుకుటకు తగిన పాత్ర చరుపాత్ర.

**11.దర్వీపాత్ర :-** స్రుక్స్రువములతో సమానమగు ఆకారము, అదే ప్రమాణము, సువర్ణాది లోహములతోగాని యజ్ఞీయ దారువులతోగాని స్రువ ప్రమాణ గర్తముతో ముఖమున వలయములతో హస్త ప్రమాణమున నున్నది దర్వీపాత్ర.

**12.ఇధ్మము :-** అశ్వత్థ వట ప్లక్ష ఔదుమ్బరాదులగు యజ్ఞీయ వృక్షములనుండి సంగ్రహింపబడిన 16 సమిధలను, 9 లేదా 12 కుశలతో కట్టిన కట్ట ఇధ్మము -

ఇందలి సమిధలు 12 అం.లుపొడవు, చిటెకెన వ్రేలి లావు కలిగి సర్వలక్షణ సంయుతము లైయుండవలె - (ఇధ్మమేకవింశత్య కుశాభ్యాం బంధయేత్తతః సమిత్ప్రాదేశయుగళం చతుర్విదంశాంగుళః కుశైః అని పురు.సం. 11. 38, 39)

(చర్మహీనములు వినాశనమును, చీల్చబడినవి క్షీణతను, తడివి బంధునాశమును, పాతవి పుత్రనాశమును, విరిగినవి భార్యామరణమును, కొమ్మలున్నవి కలహమును, లావుగనున్న ఉద్వేగమును, పొట్టిగనున్న అవగహమును, పొడవుగనున్న అతివృష్టిని, సన్ననివి అనావృష్టిన, వంకరగనున్న సర్వవినాశమును, కాలినవైన మందిర దహనమును కలుగజేయును. గాన ఈ లోపములు లేనివి సంగ్రహించవలె.)

**13.సమిధలు** :-సలక్షణములగు సమిధలు పొడవు 12 అం.లున్న శాంతి కర్మలకు, 13 అం.లున్న దైవికమునకు, 16 అం.లున్న ఆర్షమునకు, 15 అం.లున్న అభిచార కర్మలకు ఉపయోగ పడును.

**(పాలా శౌదుంబ రాశ్వత్థ ప్లక్షా స్సమిధయస్తథాని - పురు.సం. 11.38)**

**14.పరిధి** :- హస్తమాత్రము (24 అం.లు) పొడవుగల పాలాశ అశ్వత్థ వృక్షజములను సలక్షణములను గ్రహించవలె - (శాఖలు గలవి, కాలినవి, క్రిములతోనున్నవి, విరిగినవి, తడివి, ముళ్ళచెట్లవి, తొక్కలేనివి, వక్రములు పనికిరావు) (త్రిః ప్రాదేశంతుపరిధీన్ అని పురు. సం. 11.41)

**15.పవిత్రము** :- పవిత్రము ప్రాదేశమాత్రమని పురు.సం. -11.41( ద్వి రంగుళం మూలవలయం గ్రంథిరేకాగుళం తథా । చతురంగుళమగ్రంస్యా త్పవిత్రస్య ప్రమాణకమ్ ॥ - పూర్వాచార్యోక్తము.

**16.భృంగారము** :- లోహజ/ దారుజమై 24 అం.లు పొడవు, 5 లేదా 3 అం.ల వెడల్పు గలది భృంగారము. (భృంగారః కనకాలుకా - అని అమరము, జలమునుంచుటకు ఉపయోగపడు బంగారు గిండి పేరు)

**17.వ్యజనము** :- విశాల శిఖి పింఛములతో వృత్తముగా గాని, చతురశ్రముగాగాని, దీర్ఘవృత్తముగాగాని వ్యజనము నేర్పరుపవలె - అలాభమున వెదురుతోగాని తాటియాకుతో గాని చేయవచ్చును.

**18.దర్భలక్షణము** :- కుశ, కాశ, యవ, దూర్వా, గోధూమ, ఉదకుందురా, ఉశీర, వ్రీహి, మౌంజి అనునవి దశ దర్భలు - ప్రాదేశము పొడవున్నది దర్భ, 2 ప్రాదేశములున్న కుశ, 3 ప్రాదేశములు పొడవున్న బర్హిస్సు, ఆపైన పొడవుగలది తృణము.

కుశలు సంధ్యకు, దర్భలు పితృకర్మకు, బర్హిస్సు యజ్ఞకర్మకు, మిగిలినవి గృహగోపమునకు పనికి వచ్చును - మొదలు కొన సమానముగానున్న పుందర్భ - ఇది వివాహమునకు, సర్వసుఖములగూర్చుటకు, మోక్షమునకు వాడబడును; కొన లావుగనున్నది స్త్రీదర్భ - ఇది సీమంతమునకు, సర్వకార్యములకు వాడబడును; మొదలు లావుగనున్నది నపుంసక దర్భ - ఇది విశేషముగ యాగములు మొ॥గు సర్వకార్యములకు అభిచారమునకు పనికివచ్చును.

(దర్భలయందు కొనలు లేనివి, చిన్న కొనలున్నవి, బాగా లావైనవి, ఉపయోగించినవి పనికిరావు)

19. <u>చరులక్షణము</u> :- 1. కేవలాన్నము, 2. ముద్గాన్నము, 3. పాయసాన్నము, 4. గుడాన్నము అనునవి నాలుగు రకముల చరువులు - ఆఢకము / సగము / ప్రస్థము పరిమాణముగల బియ్యమును వండినది చరువు.

20. <u>కుండ సంస్కారములు</u> :- వీక్షణం ప్రోక్షణం చైవ ఖన నావోక్షణం తథా । తాడ నాభ్యుక్షణం చైవ కుట్టణం మార్జనం తథా । పూరణంచ త్రిసూత్రంచ రూపణంచ సమం తతః ఆలేపనం రంగవల్లీచ అర్చనం చాక్షతార్పణం । పుష్పాణిచ కుశాంశ్చైవ సంస్కారాశ్చ యథాక్రమాత్ ॥

21. <u>పంచాగ్నులు</u> :- తూర్పున ఆహవనీయము, దక్షిణమున దక్షిణాగ్ని, పశ్చిమమున గార్హపత్యము, ఉత్తరమున సభ్యాగ్ని, ఆగ్నేయమునగాని ఈశాన్యమున గాని అవసథ్యములనునవి పంచాగ్నులు. వీనికి క్రమముగా పలాశ, ఖదిర, అశ్వత్థ, బిల్వ, ఔదుంబరములు సమిధలు. అలాభమున పాలాశ మొక్కటి. ప్రాగాదిగా క్రమమున వీనికి పాయసాన్న, కృసరాన్న, గుడాన్న, హరిద్రాన్న, ముద్గాన్నములు (విష్ణు తిలకము) చరువులు.

22. <u>అగ్ని లక్షణములు</u> :- అగ్నికి శిరస్సు పొగతోనున్న అగ్ని, పొగలేనిది చక్షువు, కృశించి మండుమంట కర్ణము, కట్టెనంటియున్నది నాసిక, ప్రజ్వలించుచున్నది జిహ్వ. శిరమున ధననాశము, నేత్రమున అంధత్వము, కర్ణమున వ్యాధి, నాసికయందు మనః పీడ, జిహ్వాయందు చేసిన హోమమువలన సర్వకార్యసిద్ధి కలుగును. అగ్నికి 8 అం.ల స్థానమున పరిషేచనము, 9 అం.ల దూరమున పరిధులను, 10 అం.ల దూరమున కుశాక్షతలతో పరిస్తరణలను, ఏకాంగుళ ప్రమాణమున అక్షతాదులతో పూజ చేయవలెను.

23. <u>హోమద్రవ్యములచే కలుగు ఫలము</u> - (పాద్మ.చర్యా. 4.51 - 58) యజ్ఞ వృక్షోద్భవముల వలన శాంతి సౌభాగ్యములు, శుభ పుష్పములచే సౌభాగ్యము,

ధూపద్రవ్యముల వలన సదా ఆరోగ్యము, దధి వలన పుష్టి, క్షీరమున శుచి, అన్నమువలన అన్ని కోర్కెలు, ఆజ్యమున ఆయుష్యవంతులగు సంతానము, శ్వేతపద్మమువలన బ్రహ్మజ్ఞాన బ్రహ్మవర్చసములు, లక్ష్మీపుష్పములు నీటి తామరలు మారేడు సమిధలవలన లక్ష్మియు లభించును. జ్ఞానకాములు నేతిని, కన్యాకాములు కాలపుష్పములను, గోకాములు గోమయమును, దూర్వాల నాయుష్కాములును, విభూతికాములు మృత్తును, ఇన్ద్రియకాములు యవలను, సర్వజన ప్రియత్వమునకై తిలలను, బ్రహ్మ వర్చసమును కోరి బ్రహ్మ వృక్ష సముద్భవములను, వేణు బీజ యవ నీవార శాలిధాన్యములను సర్వకామములకు హోమమొనర్తురు. లాజహోమమున సర్వకామములు నిస్సంశయముగ సిద్ధించును. అన్నకాము లన్నమును, పుత్రకాములు పాయసమును, హిరణ్యార్థులు నింబ పుష్పములను, సర్వసిద్ధికి నేతిని హోమమొనర్తురు.

**24. హోమద్రవ్య పరిమాణములు** :- 1. సర్పి, మధు, క్షీరముల ధారలు - 4 అం.లు, 2. శుక్తి, దధి, పాయసములు - 1 గ్రాసము (కడి), 3. భక్ష్యాహుతి - గ్రాసమున సగము, 4. పుష్పములు - అఖండితములు, 5. నిష్పావాది బీజములు, ధూపద్రవ్యాహుతులు, తిల, వ్రీహి, యవాదులు - పిడికిలిలో 4వ వంతు, 6. సమిధలు 8 అం.లుకాని, 4 అం.లు కాని, 7. దూర్వాలు - 6 అం.లు. 8. గోమయము- ద్రాక్షగింజంత, 9. పూర్ణాహుతి ఘృతము - 1 కుడుపము (మానెడు).

**25. అంగుళమానము** :-

(చేతులు పైకెత్తి పాదాగ్రములపై నిలబడిన యజమానుని కొలతలో 5వ వంతు హస్తము. (5 హస్తములు = 1 పురుషుడు) ... ఆ హస్తమున 24వ వంతు అంగుళము.)

**8 పరమాణువులు = 1 త్రసరేణువు　　8 లీక్షలు = 1 యూక**

**8 త్రసరేణువులు = 1 రథరేణువు　　8 యూకలు = 1 యవ**

**8 రథరేణువులు = 1 వాలాగ్రము　　8 యవలు =1 అంగుళము**

**8 వాలాగ్రములు = 1 లీక్షా　　24 అంగుళములు= 1 హస్తము**

**అంగుష్ఠ తర్జనులతో ఏర్పడు జానకు - ప్రాదేశమని**

**అంగుష్ఠ మధ్యమములతో ఏర్పడు జానకు - తాలమని,**

**అంగుష్ఠ అనామికలతో ఏర్పడు జానకు - గోకర్ణమని,**

**అంగుష్ఠ కనిష్ఠికలతో ఏర్పడు జానకు - వితస్తియని పేర్లు.**

**ఈ వితస్తి సరిగా 12 అం.లు ఉండును.**

**("ప్రాదేశ తాల గోకర్ణా స్తర్జన్యాదియుతే తతే। అంగుష్ఠే స కనిష్ఠే స్యా ద్వితస్తిర్ద్వాదశాంగులః" - అమరం)**

**26.ప్రస్థ మానము**

| | | | |
|---|---|---|---|
| 2 గిద్దలు | - 1 అరసోల | 2 అడ్డలు | - 1 కుంచం (ప్రస్థము) |
| 2 అరసోలలు | - 1 సోల (నికుంచకము) | 4 కుంచములు | - 1 తూము (ఆఢకము) |
| 2 సోలలు | - 1 తవ్వ | ద్రోణము (నలుతుము) | - 1 లేదా 2 తూములు |
| 2 తవ్వలు | - 1 మానిక (కుడుపము) | 20 కుంచములు | - 1 పుట్టి (ఖారీ) |
| 2 మానికలు | - 1 అడ్డ | వాహః | - 20 పుట్లు |

"అస్త్రియా మాఢక ద్రోణౌ ఖారీ వాహో నికుఞ్చకః । కుడుపః ప్రస్థ ఇత్యాద్యా పరిమాణార్థకాః క్రమాత్ ।" - అమరం (కుడువ - కుడుబ - కుడుప)

**27.సప్తజిహ్వలు** (సంహితాంతర భేదములు గలవు)

1.కాళీ - కుండమధ్యమున - శాంతి కర్మకు
2.కరాళీ - తూర్పున - విజయార్థము
3.సుమన - ఆగ్నేయమున - పుష్టికొరకు
4.లోహిత - పశ్చిమమున - వశీకరణమునకు
5.స్ఫులింగినీ - వాయవ్యమున - సర్వసిద్ధికి
6.ధూమ్రా - ఉత్తరమున - మారణాదులకు
7.విశ్వరూపీ - ఈశాన్యమున - మణిమాద్యుష్ట సిద్ధికి

- **సమూహ్య** (సమముగా ఊహించుట) **పరిచాయ్య, ఉపచాయ్య** అనునవి యాగాగ్ని యందుపయోగపడు పదములు. సహనం = విస్తారము
- **పర్యగ్నీకరణము** - మండుతున్న దర్భకట్టతో కుండమును అంతటా స్పృశించుట.
- **పరిస్తరణ** - కొనల గ్రంధిగలిగి ప్రాగుదగగ్రములుగా 11 చొ॥న కుండమునకు నాల్గుదిక్కుల యందుంచు కుశలు
- **సంపాతాజ్యం** - హోమము చేయునపుడు ప్రత్యేక పాత్రలోనికి చేరిన నేయి
- **ధమని** - అగ్నిని ప్రజ్వప్రజ్వలింపచేయుట కుపయోగపడు వెదురు గొట్టము
- **ధవిత్రము** - మృగచర్మమున చేయబడిన విసనకర్ర
- **ప్రణీతము** - మంత్రసంస్కృతమయిన అగ్ని ప్రణీతము
- **పాత్రలు** - స్రువాదులు, 6 పాత్రలతో చేయు ప్రయోగము షట్పాత్ర ప్రయోగము

- <u>హవ్య కవ్యములు</u> -క్రమముగా దేవ, పితృయోగ్య ఆహుతులగు అన్నములు
- <u>ఉపస్పర్శనము</u> - ఆచమనము (శుద్ధాచమనము)
- <u>అఘమర్షణ</u> మన్త్రము - సర్వపాపములను పోగొట్టు మంత్రము
- <u>అవభృథము</u> - యజ్ఞ దీక్షాంతమున న్యూనాతిరిక్తదోష పరిహారార్థము చేయు స్నానము.

" <u>ప్రోక్షణం</u> - జలేన సేచనం, సపవిత్రేణ దక్షిణ పాణినా ఉత్తానేనకృతం

(పవిత్రయుతమగు కుడిఅరచేతిని పైకెత్తి జలము చల్లుట)

<u>అవోక్షణం</u> - జలేన సేచనం, సపవిత్రేణ దక్షిణ పాణినా అర్వాచీనేనకృతం

(పవిత్రయుతమగు కుడి అరచేతిని బోర్లించి నీరుచల్లుట)

<u>అభ్యుక్షణం</u> - జలేన సేచనం, సపవిత్రేణ దక్షిణ పాణినా ముష్టికృతేన

(పవిత్రయుతమగు బోర్లించిన కుడి అరచేతి పిడికిలితో నీరు చల్లుట) "

*(క్రియాకైరవ చంద్రిక రాకా వ్యాఖ్య - పేజి నెం. 2)*

## <u>2. అగ్నికార్యము</u>

(అగ్నిద్వారా వా అగ్నావేవ వా క్రియమాణం కార్యం అగ్నికార్యం - క్రి.కై.చం.)

శ్రీమన్నారాయణ సంహిత - య.వై.కాం. 11 అధ్యా. 1 - 187

<u>1.అగ్ని 3 విధములు</u> (1-6 శ్లో) :-

<u>1. బాలాగ్ని</u> - ఉత్తమము - ఇది మంథితాగ్ని - ఫలము దశ గుణము(10రెట్లు) - ప్రతిష్ఠ, యజ్ఞము మొ॥వానికి,

<u>2. యువాగ్ని</u> - మధ్యమము - ఇది సూర్యకాంతజన్యము - ఫలము ద్వి గుణము - ప్రాయశ్చిత, ఉత్సవాదులకు,

<u>3.వృద్ధాగ్ని</u> - అధమము - ఇది లౌకికాగ్ని (శ్రోత్రియాగార సంపాదితము) - ఫలము ఏక గుణము - నిత్యయాగవిధులకు, కామ్యములకు.

<u>2.మంథనపాత్రల లక్షణము</u> (10-14 శ్లో) :- శమీగర్భయగు అశ్వత్థ దారువునుకాని, కేవలము అశ్వత్థమునుకాని అరణికి ఉపయోగించవలె, దీని పొడవు 2 తాలములు, వెడల్పు 6 అం.లు. ఎత్తు 4 అం.లు. - మంథన దండము ఖాదిరమున (చంద్ర), 12 అం.ల పొడవగు నాళము, మూలమున 1 అం., సుషిరమున (రంధ్రమున)

1 అం., అగ్రమున (శిఖ) 1 అం.ను, ఊర్ధ్వ పట్టిక మథనదండ ప్రమాణానుగుణముగా ఖాదిరమున నాలుగు ముఖములతో ఉండవలె.

3. మంథన విధానము (15-26 శ్లో) :- పుణ్యాహము జరిపి ఆ జలమున మంథన పాత్రల ప్రోక్షణ - విష్ణుగాయత్రితో పంచగవ్య ప్రోక్షణ - అస్త్రమన్త్రమున భూసంప్రోక్షణము - గోమయానులేపన, రంగవల్ల్యాద్యలంకరణ - ద్రోణము లేదా అందు సగము ధాన్యముతో (వ్రీహి, శాలి, తిలలు) ధాన్యపీఠ కల్పనము - భూమిర్భూమ్నేతి మన్త్రమున భూప్రార్థనము - త్రాతార మన్త్రమున ధాన్య పీఠ ప్రకల్పనము - యువం వస్త్రేతి మన్త్రమున అష్టదళపద్మ సంయుక్త నూతన వస్త్రాచ్ఛాదనము - ధన్వనాగ దేవస్యత్వ మన్త్రములతో దర్భాచ్ఛాదనము - ధ్రువమన్త్రమున పాత్ర స్థాపనము, శ్రీసూక్తమున అరణీ మధ్యమున శ్రీదేవీ ఆవాహనము, అర్ఘ్యాది పూజనము - దండమధ్యమున పురుష సూక్తమున విష్ణు ఆవాహన పూజనములు - ఆపై రజ్జుమధ్యమున పట్టికయందు స్వస్వ మన్త్రమున సుదర్శనావాహనము, పూజ - తవవాయు, అవాతవాయు మన్త్రములతో సర్వపాత్రలను అభిమన్త్రణ. అగ్నిందూత మన్త్రమున అరణియందు దండమునుంచి అగ్నిసంభవము వరకూ ఋత్విక్కులు మంథన మొనర్పవలె - వేద వాద్య ఘోషలతో వహ్నిగతుడగు హరిని ధ్యానించవలె - శ్రీఘ్రముగానగు అగ్నిదర్శనము సర్వశుభము - అగ్ని యేర్పడకపోయినను, అగ్నిమంథనకాలమున దండము నేలబడినను శాంతి చేయవలె.

4. అగ్ని ఆరాధన (29-34 శ్లో) :- సౌవర్ణ / రజిత / తామ్ర / మృణ్మయ పాత్ర మధ్య అగ్నినుంచి, అందు ఎండుపుల్లలు ఆకులను వైచి అందు విధ్యుక్తముగా త్రివిక్రముని ఆవాహనమొనర్చి అర్చించి, ఆ అగ్నియం దగ్నిమయుడగు హరిని ధ్యానించవలె - "నమస్తే సర్వలోకేశ ! భక్తాభీష్టఫలప్రద ! తేజోమయస్వరూపా ! శ్రియః పతీ ! ఈ యజ్ఞమున, సమాప్తివరకూ, లోకక్షేమార్థము, నాపైననుగ్రహమున, సావధానుడవై ఉండవలసినది " అని అగ్నిపాత్రను తీసుకొని ఛత్ర చామర వాద్యములతో ప్రాదక్షిణమున యాగశాల ప్రవేశింపవలె.

5. కుండ సంస్కారాదులు (35-44) :- యథోక్తవిధిని కుండముల నేర్పరచవలె - కుండ అష్టాదశ సంస్కారముల నొనర్పవలె (వీక్షణ, ప్రోక్షణ, ఖనన, అవోక్షణ, తాడన, అభ్యుక్షణ, కుర్దన, మార్జన, పూరణ, త్రిసూత్ర, రూపణ, సమీకరణ, ఆలేపన, రంగవల్లీ, అర్చన, అక్షతార్పణ, పుష్పములు, కుశలనర్పించుట అనునవి) - కుండమునకు పశ్చిమమున ఆచార్యుడాసీనుడై తనకు దక్షిణమున పుష్పాదిహోమ ద్రవ్యములను, కుండమునకు ఉత్తరమున ప్రాగగ్రములుగా 8 కుశలను (6 అని క్రి.కై.చం) భూమిపై నుంచి మూలమన్త్రమున పాత్రలను రెండు రెండుగా ఉంచవలె-

(పాద్మ సంహిత - ఆజ్య, చరు, ప్రోక్షణ, ప్రణీత పాత్రలు, సమిధ, కుశ, తండుల, తోయ, పరిధీ, స్రుక్, స్రువ, దర్వీ, వ్యజన, శుష్కకాష్ఠ, ఘంటా, గంధ, అక్షతలను చెప్పినది. శ్రీమన్నారాయణ సంహిత, కపింజల, క్రియాకైరవచంద్రికలు సుమారు ఇవే విషయములను చెప్పినవి. శ్రీ పురుషోత్తమ సంహిత మాత్రము - "ద్వాదశంవా అష్టపాత్రంవా షట్పాత్రంవా చతుష్టయం। ఏతేష్వేకం ప్రకుర్వీత యథా కర్మానుసారత" - (31 అధ్యా.10 శ్లో) అని చెప్పియున్నది. తదనుగుణముగా కావచ్చు లేదా వైదికానుసరణము కావచ్చు పూర్వాచార్యులు 'దర్వి, ఆజ్యస్థాలి, ప్రోక్షణపాత్ర, పూర్ణపాత్ర, ఇధ్మము, స్రువము' అనువానితో చేయు ప్రయోగము షట్పాత్ర ప్రయోగమని, ('దర్వి, ఆజ్యస్థాలి, ప్రోక్షణి, స్రువము' అనువానితో చేయునది చతుష్పాత్రప్రయోగము - ఇందు ఆఘారము, ఆజ్యభాగము, ఇధ్మము, జయాదులు ఉండవు.) "ఆజ్యస్థాలీ, చరుస్థాలీ, ప్రణీతీ, ప్రోక్షణీ, స్రుక్కు, స్రువము, ఘంట, ఇధ్మం, పరిధి, భృంగారం, వ్యజనము, దర్భలు" అనునవి ద్వాదశ పాత్రప్రయోగమని చెప్పియున్నారు. ఇక్కడ పాత్రప్రయోగమన్న మాట తరచుగా యజ్ఞయాగాదులు చేసేవా రుపయోగించు సాంకేతిక పదము. దానివలన ఆయాకర్మలకు ఎన్ని పాత్రలుండవలెనో అవిఏవో నిస్సందేహంగా తెలుసుకొన వీలుకలుగుతుంది. (ఎప్పడో ఏదో చేసేవారు "ఏ పాత్రైతేనేమి" అనవచ్చు. వారికి ఏదో ఒక పాత్ర సరిపోవచ్చు.) "ద్వాదశంవా అష్టపాత్రంవా షట్పాత్రంవా చతుష్టయం। ఏతేష్వేకం ప్రకుర్వీత యథా కర్మాను సారతః" - అని పురు. సంహి. 31.10 శ్లో)

<u>6.కుండమధ్యమున వర్ణచక్రలేఖవాదులు</u> (45-64) :- కుండమధ్యమున ప్రాగాయత ఉదగాయతములుగ 3, 3 రేఖలు గీసి అష్టాక్షరితో శాలిధాన్యము నుంచవలె - అందు స్వర్ణశలాకతో ప్రాగుదగగ్రములగు 8, 8 రేఖలను లిఖించవలె - 49 కోష్టములేర్పడును - మధ్యకోష్ఠమున చంద్రమండలమును, అందు క్రమముగా అష్టాక్షర బీజ విన్యాసము నొనర్చవలె - దాని వెలుపల 8 కోష్టములయందు అకారాద్యక్షరములు ఋకారాన్తము, ఆపై దాని బయటి కోష్టములయందు ఋకారాది జకారాన్తము 16 అక్షరములు, దాని బయటి కోష్టములయందు ఝ కారాది సకారాన్తం 24 అక్షరములు, యోని మధ్యమున హ కార ళ కార క్ష కారములు ముందుగా ప్రణవముతో లిఖించవలె - నాలుగు దిక్కులనున్న మేఖలలకు సహస్రారం, సుదర్శనం, చక్రం, హేతిరాజం అని విన్యసించవలె - పర్యగ్నీకరణము కుండమధ్యస్థ విష్టరమున జరుపవలె.

<u>7.అగ్ని ప్రతిష్ఠాపన</u> (54-56) :- గార్హపత్య కుండమున వాద్యఘోషతో అగ్నిమన్త్రమున అగ్నిస్థాపన - కాష్ట నిక్షేపణ - వాయుమన్త్రమున వ్యజనముతో వీచుట - ఆపైన అన్ని కుండములయందు సంస్కృతాగ్నిని యథోక్తముగా అసాదనమొనర్చవలె

8.పరిస్తరణాదులు (57,58) :- అద్భిః పరిసమూహ్య (చూ. ప్రయోగకారిక 15, అగ్నికార్యవిధి) - అగ్నిః పరిస్తీర్య, అనగా ప్రాగగ్ర ఉదగగ్ర దర్భలు, చివర గ్రన్థులు గలవి ద్వంద్వములు కానివి, 3, 3 కాని 5, 5 కాని, 7, 7 కాని, 9, 9 కాని, 11, 11 కాని 25 అం.లు పొడవగు వానిని (పంచవింశతి నిష్టితములు) పరిస్తరణలుగా ఉంచవలె. ("దర్భై రగ్నిం పరిస్తీర్య" అని మాత్రమే పురు.సం. 31.9)

9.హోమసంకల్పము (59-69) :- తిథ్యాదుల కీర్తనము - తూర్పున ఆహవనీయ కుండమున వాసుదేవుని, దక్షిణమున దక్షిణాగ్నియందు సంకర్షణుని, పశ్చిమమున గార్హపత్యమున ప్రద్యుమ్నుని, ఉత్తరమున సభ్యకుండమున అనిరుద్ధుని, కోణభూములయదు పురుష, సత్య, అచ్యుత, అనంతులను సంకల్పవిధిని ఆవాహన - కుండ మధ్యమున సర్వావయవ సంపూర్ణ సర్వాభరణ భూషిత ఋతుస్నాతయగు మహాలక్ష్మిని, శంఖచక్రగదాపద్మాది భూషితుడగు నారాయణుని ధ్యానించి అర్చించవలె - గ్రామ్యధర్మ ప్రకారమున చింతించవలె - ఆపైన అగ్నిబీజమున అగ్నిని జనింపచేసి కుశవారితో సంప్రోక్షణ మొనర్చి ఏషహిదేవేతి ఋక్కుచే అక్షతలతో కూడిన ఉదకమును అగ్ని ముందుంచి అభిముఖుడవు కమ్ము అని అగ్నిని స్మరించవలె - (పురు. సంహిత కూడ ఏషహిదేవ మన్త్రమును, సుముఖోభవాదులను విధించింది) (ఇక్కడ అగ్ని ప్రతిష్ఠ తర్వాత అగ్ని జననమును మరల సంహితయే చెప్పుట తొందరపాటునకు లేదా ప్రక్షిప్తమునకు ఉదాహరణవలె కన్పించుచున్నది.)

10.అగ్న్యలంకారం (69-72) :- వాసుదేవాది మన్త్రములచే దిక్విదిక్కులయందు యథాక్రమముగా ప్రణవాది నమోంతముగా ఆహవనీయ, గార్హపత్య, దక్షిణాగ్ని, సభ్యాగ్ని, అవసథ్యాగ్ని, రత్నాగ్ని, దావాగ్ని, ద్విశీర్షకం అని పలుకుచూ అక్షతలతో అర్చించవలె. (పురు. సంహిత కూడ ఇదే విధము)

11.అగ్నిధ్యానవిధి (72-75)

బాలాగ్ని ధ్యానం -' ద్విశీర్షకం సప్తహస్తం త్రిపాదం సప్తజిహ్వకం । అభీతిదం చర్మధరం వామే చాజ్య ధరం కరే । స్వాహాసమేతం వరదం భిభ్రాణం స్రుక్స్రువౌ కరే । శక్తిహస్తం మహాతేజం యజ్ఞమూర్త్యనలం భజే ॥ ' అని పాద్మ. పురు.నారా. సంహితలు క్రి.కై.చంద్రిక కేవిధంగా చెప్పినవి.

కాని క్రి.కై.చంద్రిక (పుట 142,143) - యువాగ్ని వృద్ధాగ్ని ధ్యానాలను వేరు వేరుగా ఇచ్చింది -

యువాగ్ని ధ్యానం - ' త్రినేత్రం పంచ వక్త్రాఢ్యం రక్తవర్ణం దిశాభుజం ।

త్రి మేఖలం త్రిపాదం సప్త జిహ్వా సమన్వితం। ఉపవీత సమాయుక్తం జటామకుట మండితం । చక్రం పరశు ఖడ్గంచ వజ్రం చాభయ దక్షిణే । టంకం పాశాబ్జ చక్రంచ వరదం వహ్నినామకే । స్వాహా దక్షిణపార్శ్వేతు స్వధా వామే తథైవచ । ...మేషారూఢం యౌవనాగ్నిం ధ్యాయే దుత్సవ కర్మణి ।'

**వృద్ధాగ్ని ధ్యానం**- 'చతుర్భుజం త్రినేత్రం చ ఏకవస్త్రం జటాధరం । శూలం పరశు హస్తంచ అభయం వరదానిత్వం । సప్తజిహ్వాన్వితం శక్తిం ఉపవీతోత్తరీయకమ్ । మేషాసీనం సితం నిత్యే శివమ్ వృద్ధాగ్ని మారభేత్ ॥'

స్మార్తంలోనూ వైఖానసంలోనూ ఇచ్చిన 'చత్వారి శృంగా త్రయొ అస్యపాదా ద్వే ... మేషారూఢం జటాబద్ధం ... ధ్యాయేద్ధుతాశనం' నానేది బహుశా అన్నిటకి వర్తించే ధ్యానం కావచ్చు.

**12.పాత్ర సంస్కారవిధి**: (76-94) :- ప్రోక్షణపాత్రజలములను తీసుకొని 1. ఇమంమే, 2. తత్వాయామి, 3. త్వన్నో అగ్నే, 4. సత్వంనో అగ్నే, 5. త్వమగ్నే అను పంచవారుణిక మన్త్రములతో అన్ని పాత్రలను - ప్రోక్షించవలె - వానిని ఎదుటనున్న తండులముల యందుంచవలె - వాసుదేవాది మన్త్రములతో దిక్కులయందు దర్భలను నిక్షేపించవలె - కమండలమునందు ప్రోక్షణీజలములను నింపవలె - దానియందు పవిత్రమును, అక్షతలను, దర్భలను ఉంచవలె - వాసుదేవుని సుదర్శనమును పూజించి, పై జలమును అస్త్రమన్త్రమున అభిమన్త్రించి వెంటనే సర్వపాత్రలను ప్రోక్షించవలె (త్రిరుత్పూర్య పవిత్రేణ పాత్రాణాం ప్రోక్షణం చరేత్-అని పురు.సంహిత) - ఆపై పాత్రలను ఉత్తాన మొనర్చి ప్రణీత పాత్రను శోధించవలె (ఉత్పూర్య పూర్వవన్నీరం ఉద్ధరేన్ముఖసమ్మితం - అని పురు.సంహిత) - దానిని ఎదురుగనుంచుకొని ప్రోక్షణపాత్రజలమును అందుంచి మిగిలిన ప్రోక్షణీ జలమును వేరొక పాత్రయందుంచవలె.

అగ్నికి ఉత్తరమున గల ఎనిమిది కుశలపై ఆఢకార్ధ మానమున తండులముల నుంచి ఆపైన ప్రణీత పాత్రనుంచవలె - కుశలచే మూతవేయవలె - దానియందు వాసుదేవునర్చించవలె - కుండ దక్షిణపార్శ్వమున బ్రహ్మ నర్చించవలె - సప్తదర్భకృత కూర్చను కుశత్రయ కృత ఆసనమున నిక్షేపించి బ్రహ్మ నర్చించవలె - ఆజ్యపాత్రను తీసుకొని సంస్కారమొనర్చి దానియందు కపిల గోఘృతమునుంచవలె - మూలమన్త్రమున, విష్ణుగాయత్రితో ఆజ్య సంపూర్ణపాత్ర మగ్నికి ఉత్తరమున

ఉంచవలె (ఆజ్యపాత్రం విలాప్యాగ్నౌస్థాల్యా మాజ్యం నిరూప్యచ అంగారానుత్తరస్థాన్వై నిరూహ్యోపరి విన్యసేత్। ఆజ్యస్థాలీం తతోత్పూర్య ప్రణవేన యథావిధి । అంగుష్ఠోపకనిష్ఠాభ్యాం గ్రంధిం విస్రయ క్షాళయేత్ ॥ - పురు.సంహిత) - ద్వయమన్త్రమున ప్రత్యస్య దర్భాగ్రే అగ్నౌ నిధాయ - వెలిగించిన బర్హిస్సుతో పర్యగ్నీకరణమొనరించి పాత్రలను లేవనెత్తి యథాస్థానమున నుంచవలె - ఉత్పూర్యోత్ప్లవనంకూర్చ మద్భిస్స్పృష్ట్వా హ్యోషర్బుధే ప్రహృత్య చామృతీకృత్య ఘృతం సురభి ముద్రయా అవకుంఠ్యచ దిక్పాలా నింద్రాదీన్ పూజయేత్క్రమాత్ - స్రుక్స్రువములను ఉష్ణోదకమున ప్రక్షాళన మొనర్చి, కుశ పంచక నిర్మితమగు కూర్చను తీసుకొని దాని మూలము, మధ్య, అగ్రములతో క్రమముగా స్రుక్స్రువముల మూల, మధ్య, ఆగ్రములను సమ్మార్జన మొనరింపవలె, ఆపై దానిని తనకు ఉత్తరముగా అగ్నియందుంచవలె.

దర్వీపాత్రను కూడ పైజెప్పిన విధమున సంస్కరించవలె - ప్రాగాదిగా నాలుగు దిక్కులయందు వాసుదేవాది మన్త్రములతో పరిధులనుంచవలె.

3 పరిధులు - పశ్చిమమున అంగుష్ఠాగ్రములావు 3 ప్రాదేశముల పొడవు గల పరిధిని ఉత్తరాగ్రముగను, తర్జన్యాగ్రసమ స్థౌల్యము ప్రాదేశముకన్న తక్కువపొడవుగల పరిధిని ప్రాగగ్రముగా దక్షిణమున, మధ్య మాంగుళిసమస్థౌల్యము ప్రాదేశత్రయముకన్న తక్కువ పొడవుకలది అగు పరిధిని ఉత్తరమున పూర్వాగ్రముగను; కనిష్టికాగ్ర సమస్థౌల్యము 12 అం.లు పొడవు గలవియగు ఆఘారయుక్త సమిధలను పరిధులకుపైన అగ్ని ఈశ కోణములయందు నిక్షేపించవలె - అని పురు.సంహిత. (విష్ణుతిలకం 5 అధ్యా. 241-243 ) స్మార్తం కూడ ఇదేవిధంగా చెప్పియున్నవి. నారాయణ సంహిత మాత్రం ప్రాగాదిగా నాలుగు దిక్కులయందు వాసుదేవాది మన్త్రములతో నాలుగుపరిధులను వానిపై గణేశ స్కంద నామములతో ఉంచవలెనని చెప్పినది.)

**13.** <u>**ఇధ్మ హోమము**</u> (95-102 శ్లో) :- అగ్నిని పరిషేచన పూర్వకముగా అలంకరించి ఇధ్మమును వదులు చేసి (విస్రస్య), ఆచార్యుడు ప్రణీతాముఖ పూర్వమున విధ్యుక్తముగా ఒక సమిధను ఉంచి, పంచదశ సంఖ్యాకములగు సమిధలను తీసుకొని బ్రాహ్మణులకు విజ్ఞాపనమొనర్చి, వారి అజ్ఞననుసరించి ఆజ్యసంయుక్తములగు ఆ సమిధలను ఇధ్మమన్త్రమున ఉంచవలె. ఆపైన ఆచార్యుడు

అతంద్రితుడై ఆఘార హోమమొనరింపవలె.

విష్ణుగాయత్రితో చరుస్థాలీని నీటితో ప్రక్షాళన మొనర్చి ఆఢక ప్రమాణమునగాని తదర్ధమునగాని తండులములను పంచోపనిషన్మంత్రములతో మంచిచీట కడిగి, తగు జలమునందుంచి కుండాగ్నియందు పచనము జేయవలె.

**14.గర్భాధానాది సంస్కార హోమవిధి** (110-117 శ్లో) :- ద్వాదశాక్షర మన్త్రమును 108 సార్లు జపించి వైష్ణవాగ్నికి గర్భాదానాది కర్మలు జరిపించవలె - దేవునకు యోగపీఠాదులను అగ్నియందు కల్పించవలె - దీనికొరకు క్రమముగా మూలమన్త్రమున 16 సమిధలను, ప్రణవమున 16 ఆజ్యాహుతులను, మూలమన్త్రమున చరువు 16 ఆహుతులను హోమమొనర్పవలె - అనంతరము బింబమునకు చేసిన విధముననే స్నానాదులను దేవున కగ్నియందుకూడ సమర్పింపవలె - ప్రాతరౌపాసనము సాయంకా లౌపాసనము చేయవలె - దానికి నృసూక్తమున అగ్నియందు చరువుతోను, విష్ణుసూక్తముతో పాయసమున, శ్రీసూక్తమున ఆజ్యమున, భూనీళా సూక్తములతో అష్టాక్షరితో సమిధలను నిత్యము అగ్నియందు వ్రేల్చవలె, ఒక్కొక్కదానికి 100/50/25 గుడాహుతులను విధ్యుక్తముగా చేయవలె - కుండమధ్యమున సప్తవ్యాహృతులను వ్రేల్చి అగ్నినర్చించవలె.

**15.నిత్యహోమవిధి (131-145 శ్లో)** :- శాంతిహోమ పురస్సరముగా స్విష్టకృద్ధోమము చేయవలె - ఆజ్య చరు తిల వ్రీహులను క్రమముగా ఉంచవలె - ఆజ్యము అష్టాక్షరితో, చరువు నృసూక్తమున, విష్ణుమన్త్రమున తిలలు, పంచమంత్రములచే వ్రీహిధాన్యము, మూర్తిమన్త్రమున సమిధలను 108 ఆహుతుల నివ్వవలె - ఇది నిత్యము చేయవలెను - సర్వ దోష నివృత్తికై హోమాన్తమున పంచోపనిషన్మంత్రముతో సప్తవ్యాహృతులతో హోమమొనర్పవలె - పరిధులను దర్భలను దహించవలదు - స్థితులైయున్న దేవులను ఉద్వాసన మొనర్పవలదు - కర్మ పూర్తియగువరకు అగ్నిని ప్రత్యహము ధరించవలె - సాయంప్రాతః కాలముల జరుగు హోమాన్తమున క్రమమున అన్ని కుండములయందు ఋత్విజులు అష్టాక్షరిని ఆగమోక్త ప్రమాణసంఖ్యా విధానముల హోమమొనర్పవలె.

- గుడాన్న, ముద్గాన్న, తిలోదన, కృసరాన్న, మాషాన్న, పాయసాన్నములను దినదినము ఆజ్యసమ్మిశ్రముగా ఉంచవలె

– అశ్వత్థ, ఔదుంబర, ప్లక్ష, న్యగ్రోధ, బదరీ, బిల్వ, పాలాశ, ఖాదిరములనునవి క్రమముగా సమిధలు

– నందివర్ధన, పున్నాగ, కేతకి (మొగలి), చంపక, మల్లి, మందార, అంబుజములను క్రమముగా ఉంచవలె – లేదా – పున్నాగ మొక్కటికాని, మల్లిక యొక్కటికాని, అంబుజమొక్కటికాని ప్రతిదినము హోమమొనర్పవలె.

– క్షీరము, ఆజ్యము, దధి, నాలికేర జలము, ఇక్షుసారము, మధు, ఫలరసములను క్రమముగా హోమము చేయవలె, లేదా పంచామృతములను హోమమొనర్పవలె.

– యజ్ఞీయవృక్షజ ఫలముల నన్నిటిని హోమమొనర్పవలె

– ఏలా, లవంగ, తక్కోల, జాజి కుసుమములు, సర్వౌషధులు, సర్వబీజములు హోమమొనర్పవలె

– బింబ నివేదితములగు అపూపాదులన్నిటిని అన్ని కుండములయందు హోమ మొనర్పవలె.

**16.నిత్య బలిప్రదాన విధి** :– ప్రతిదినము హోమాన్తమున బలిప్రదాన మొనర్పవలె – పూర్ణాహుతి యగువరకు యాగమంటప అష్ట భాగములయందు క్రమముగా అదేవిధమున జరుగవలె – సర్వదా నృత్తగీతాదులనిర్వహించి యాగమంటపమును రక్షింపవలె – కర్మ పూర్తియగువరకు ఆచార్యుడు జితేన్ద్రియుడై హవిస్సునే భుజించవలె – ఏకభుక్తము అధశ్శయనములను ఋత్విజులతో సహా అందరూ పాటించవలె – ఆవాహిత దేవుల నందరనూ సాయం ప్రాతః కాలములయందు నైవేద్యాన్తము అర్చించవలె – ఆ విధముగా దివసములన్నిటినీ గడపి ఆఖరిదినమున శేషహోమము చేయుటకు ముందు పరివారాది సర్వ దేవతాహోమ మొనర్పవలె.

**17.పరివారాది సర్వ దేవతహోమం** :– ఆధారశక్తి మొదలుగా గల పీఠావరణదేవతలను, బ్రహ్మ, రుద్రాది సర్వదేవతలను, వేదములను, ఋషులను, గంధర్వులను, సరీసృపములను, యక్షులను, అప్సరసలను, మాససంవత్సరములను, సరిత్తులను, సముద్రములను, పర్వతములను, నదులను, భూతములను, పశువులను, వృక్షములను, ఓషధులను, వనస్పతులను, ఉద్భిదములను, స్వేదజములను, అండజములను, జరాయుజములను, భువాది సప్తలోకములను, అతలాది అధోలోకములను, ఛందాది దేవతలను, అందరను స్మరించి వారి కొరకై బలిద్రవ్యములను మూలమన్త్రమున హోమమొనర్చవలె – ఇదం విష్ణురితి మన్త్రమున

ప్రోక్షణమొనర్చి, స్విష్టకృద్ధోమొనర్పవలె - ఆపై శాంతిహోమాదికము సర్వమును పూర్తిచేసి శేషహోమ మొనర్పవలె.

18. <u>శేష హోమం</u> (158-164 శ్లో) :- పరిషేచన పూర్వకముగా శేషహోమ మొనర్పవలె - ఎదుట స్రుక్కునుంచి దానికి దక్షిణమున ఆజ్యపాత్రను, ఉత్తరమున స్రువమును ఉంచి, ఉపయోగింపబడిన కుశల నన్నిటిని రెండుచేతులతో గ్రహించి ఉత్తరాగ్రముగా బంధించవలె - ఆ దర్భల మొదళ్ళు ఆజ్య పాత్రను, మధ్యభాగములు స్రువ మధ్యమును, కొనలు స్రుచగర్తమును యథాక్రమముగా ముమ్మారు స్పృశించునట్లు చేసి, ఆ దర్భలను అగ్నియందు ఉంచవలె - అనుయాజ సమిధను హోమమొనర్చి, ఆపైన పరిధులను వ్రేల్చవలె (అనుజాయం తతోహుత్వా పరిధీనేవ మేవహి ఊర్ధ్వం హుత్వా) - ప్రణీత పాత్రను ముందుభాగమున ఉంచవలె - ప్రోక్షణీజలమాదాయ ప్రణీతావారి సేచయేత్ - ప్రణీతాజలమున తూర్పుమొదలుకొని ఉత్తరదిక్కు వరకు సేచనమొనర్పవలె - ఆ ప్రణీత జలమును పశ్చిమమును ఉంచి తన శరీరమును ప్రోక్షణమొనరించుకొనవలె - ఇధ్మ ప్రవర్చన మొనర్చి బ్రహ్మను ఉద్వాసన మొనర్పవలె.

19. <u>పూర్ణాహుతి</u> (165-171 శ్లో) :- పరిషేచన మొనర్చి పూర్ణాహుతి నివ్వవలె - అన్నిరకముల రత్నములు, ధాన్యములు, ఫలములు, కుసుమములు, గంధ ద్రవ్యములు, వస్త్రములు, లోహములు, ఔషధములు, తాంబూలము, దక్షిణ, భూషణములు, ఆజ్యసిక్తములగు వివిధాన్నములు, సర్వద్రవ్యములు సంపాదించి పూర్ణాహుతి నివ్వవలెను - ఇదం విష్ణు, యోదీక్షా అను మన్త్రములతో జయశబ్ద సమాకులములగు సర్వ మంగళవాద్యములతో కుండమున పూర్ణాహుతి నివ్వవలె - వసోర్ధారా మన్త్రమున ఆజ్యధారను క్రమముగా నొసంగవలె - ఆపైన విధ్యుక్తముగా అర్ఘ్యాదులతో పావకుని పూజించి ఆజ్యాదులను నివేదించి, కుండకుండముననున్న అనలమును యథాక్రమముగా సేకరించి గార్హపత్యమున నిక్షేపించవలె - అగ్నిని విధ్యుక్తముగా ఆత్మారోపణమొనర్పవలె.

<u>అగ్నికార్యసంగ్రహము</u> (16 అధ్యా. 9,10,11 శ్లో) - "ఉల్లేఖనం తథా చాగ్నిం, ప్రాణాయామం, పరిస్తరమ్ । పాత్రాణ్యాసాదనం చైవ పవిత్రం ప్రోక్షణీంతతః । ప్రణీతా బ్రహ్మ కూర్చంతు ఆజ్యం దర్వీం చ మార్జనమ్ । పరిధీంచ ద్విజశ్రేష్ఠ పరిషేచనమేవచ । ఊర్ధ్వం, చైవానుయాజంచ ఇధ్మ మాఘరమేవచ । అగ్నేర్ముఖం చరుం చేతి ........." అని కపింజలము.

20. షోడశ సంస్కార హోమం (16. 34, 35, 36 శ్లో) - "వైష్ణవాగ్నిం చ కర్తవ్యం గర్భాదానాదికం క్రమాత్" - 16 సమిధలను మూలమన్త్రమున హుతమొనర్పవలె - ఆజ్యమున 16 ఆహుతులు ప్రణవమున, మూలమన్త్రమున చరువును హుతమొనర్పవలె. (కపింజలము)

## 21. ఆఘారహోమపరిశీలనము

**ఆఘారహోమ విషయమున సంహితలలో కొన్ని విషయములయం దేకవాక్యత లేదు. గాన ఆయా అంశములను పరిశీలింపవలసి యున్నది.**

**పాద్మం : (చర్యా.4అధ్యా.28-30 శ్లో) "అథద్యాదాజ్యపాత్రంచ కుశకూర్చేన వేష్టితే వామేకరే నిధాయాగ్నా వాఘారాహుతి మాచరేత్। ప్రాజాపత్యం తథా చైన్ద్ర మాజ్యభాగ మథాచరేత్ ఆగ్నేయం దక్షిణే భాగే సౌమ్యభాగ మథోత్తరే। మధ్యే వ్యాహుతిభిర్హుత్వా స్మరేదగ్ని మనన్తరం॥**

**క్రి.కై.చం. : "కుశకూర్చవేష్టితే వామకరతలే ఘృతపాత్రం నిధాయ - 'ఓం ప్రజాపతయే ఇదం నమమ' ఇతి ప్రథమం నైరృత్యా దీశానాన్తం - 'ఓం ఇన్ద్రాయ ఇదం నమమ' ఇతి ద్వితీయం వాయువ్యా దాగ్నేయాన్తం ఆఘారం హుత్వా తతః అగ్నౌ ఉత్తరే 'ఓం అగ్నయే స్వాహా' అగ్నయ ఇదం నమమ। దక్షిణే 'ఓం సోమాయస్వాహా' సోమాయ ఇదం నమమ ఇతి। మధ్యే భూరాది వ్యాహృతిభిశ్చ హుత్వా-। తదను అగ్నిం స్మరేత్।"**

**శ్రీమన్నారాయణ సంహిత -- (య.వై.11 అధ్యా.98,99,100 శ్లో) "తత స్త్వాఘార హోమంచ కుర్యాద్గురు రతన్ద్రితః అనిలాదగ్నిపర్యన్త మాఘారం ప్రథమం యజేత్। నైరృతా దీశ పర్యన్తం ఆఘారంస్యాద్ద్వితీయకం। ఆగ్నేరుత్తర యామ్యేతు సోమేన జుహుయా ద్ధవిః। మధ్యమే తదను బ్రహ్మన్ అగ్ని మన్త్రేణ హోమయేత్।"**

**శ్రీ పురుషోత్తమ సంహిత (11 అధ్యా. 23-25 శ్లో) - " వాయువ్యకోణ మారభ్య వైశ్వానర దిగంతకం। హునే ప్రజాపతి ధ్యాయన్ ప్రథమాఘార హోమకే నైరృతే ర్దిశమారభ్య రౌద్ర కోణాంతమేవహి। ఇంద్రం తతః పశ్చాత్ ద్వితీయాఘార హోమకే। చతుర్గృహీతం కృత్వాజ్యం చక్షుర్హోమం సమాచరేత్। మధ్యే వ్యాహృతిభి ర్హుత్వా ధ్యాయే దగ్నిమనుత్తమం।"**

**కపిజల సంహిత - (16.32-34 శ్లో) - " నైఋత్యా దీశపర్యన్తం ఆఘారం ప్రథమంహునేత్। అనిలాదగ్ని పర్యన్తం ఆఘారంతు ద్వితీకం। ఆగ్నే రుత్తరయామ్యేతు అగ్నిం సోమేన హూయతే। మధ్యమేతు ముఖే హుత్వా అగ్ని మన్త్రేణ మన్త్ర విత్॥"**

**వైఖానస ప్రతిష్ఠా (పుట 104) - "స్రువేణాజ్యం స్రావయన్ పరిధి ముపస్పృశ్య వాయువ్యా దాగ్నే యాన్త ముపాంశునా (మెల్లని మాటలతో) ప్రజాపతయే స్వాహేతి**

'ఓం ప్రజాపతయే స్వాహా' - నైర్‌ృత్యాదీశానాన్తం పరిధి ముపస్పృశ్య కంఠరవేణ ఇన్ద్రాయస్వాహేతి 'ఓం ఇన్ద్రాయస్వాహా' - ఇత్యాఘారౌ జుహుయాత్। - చక్షుషీ బుధ్వా అగ్నయే స్వాహా, సోమయస్వాహా ఇతి ఆజ్యభాగాన్ ఉత్తర దక్షిణ యోర్జుహోతి - ఓం అగ్నయే స్వాహా, ఓం సోమాయస్వాహా' ........... మధ్యమాస్యమితి బుధ్వా తత్ర వ్యాహృతీర్జుహోతి - 'ఓం భూస్వాహా, ఓం భువస్వాహా, ఓం సువస్వాహా, ఓం భూర్భువస్సువస్వాహా', తదగ్నిముఖమితి బ్రహ్మవాదినో వదన్తి.

చక్షుర్హోమమున కూడ ఇట్టి పరిస్థితి కొంత ఉన్నది. దక్షిణోత్తర దిశలయందు క్రమముగా అగ్నిసోములను ఒక్క పాద్మమే చెప్పినది. క్రి.క్రై.చం., కపింజలసంహితలు వైఖానసము కూడ తద్వ్యతిరేకముగా చెప్పినవి. నారాయణ, పురుషోత్తమ సంహితలయందు స్పష్టత లేదు. స్మార్తము ఉత్తర పూర్వార్ధమున అగ్నిని, దక్షిణపూర్వార్ధమున సోముని చెప్పినది. పూర్వాచార్యులు ఈ విషయమున పాద్మమును వదిలి స్మార్తమును, స్మార్తానుసరులగు సంహితలను అనుసరించిరి.

అగ్ని ముఖమనునది కూడ వివాదగ్రస్తముగ కన్పించుచున్నది. శ్రీమన్నారాయణ కపింజలములు మధ్యమున అగ్నిమన్త్రమని చెప్పినవి. మిగిలిన పాద్మ క్రి.క్రై.చం., పురుషోత్తమ, వైఖానసములు భూరాది వాహృతులను విధించినవి. కాని మా పూర్వాచార్యులేలనో ఇక్కడ వ్యాహృతులను విడచిరి.

పైన చూపిన సంహితలలోని వివరణములకంటే ఈ విషయమున వైఖానస ప్రతిష్ఠాగ్రంథము సుబోధకమనుట వాస్తవము. వారి కారికల వలననే అగ్నిముఖమను పేరు దీనికి ఏ విధముగా వచ్చినదో తెలియుచున్నది.

అఘారహోమము చేయు విధానమున కూడ సంహితలయందస్పష్టత కన్పించు చున్నది. పాద్మ క్రి.క్రై. చంద్రికలు కుశకూర్చవేష్టిత వామకరతలమున ఘృతపాత్రనుంచుకొని అఘారాహుతులు చేయమని చెప్పినవి. దేనితో? స్రుక్కుతోనా ? స్రువముతోనా ? ఆజ్య పాత్రతోనా? పురుషోత్తమ నారాయణ సంహితలు స్రువముచే ఆజ్యమును గ్రహించి స్రుక్కును పూరించి అఘార హోమము చేయవలెనని చెప్పినవి. (నారాయణ సంహిత చతుర్ గృహీతమును కూడ చెప్పినది.) శ్రౌతము స్రుక్ స్రువములను రెండింటినీ పూరించి స్రుక్కుతో ప్రథమాఘారము, స్రువమున ద్వితీయాఘారము చేయవలెనని చెప్పుచున్నది.

| సంహిత | ప్రథమాఘారం | ద్వితీయాఘారం | చక్షుర్హోమం దక్షిణం ఉత్తరం | ఆగ్నిముఖం |
|---|---|---|---|---|
| పాద్మం | ప్రాజాపత్య అజ్య భాగం | ఐంద్ర ఆజ్యభాగం | అగ్ని సోమ | మధ్యన వ్యాహృతులు |
| క్రి.కై.చం | నైరృత్యా దీశానాన్తం | వాయవ్యాదాగ్నేయాన్తం | సోమ అగ్ని | మధ్యన భూరాది వ్యాహృతులు |
| కపింజలం | నైరృత్యా దీశానాన్తం | వాయవ్యాదాగ్నేయాన్తం | సోమ అగ్ని | మధ్యముఖమున అగ్నిమంత్రమున |
| నారా.సం | వాయవ్యాదాగ్నేయాన్తం | నైరృత్యా దీశానాన్తం | ఉత్తరయామ్యమున సోమమంత్రమున | మధ్యన అగ్నిమంత్రమున |
| పురు.సం | వాయవ్యాదాగ్నేయాన్తం ప్రజాపతికి | నైరృత్యా దీశానాన్తం ఇంద్రునికి | చతుర్ గృహీతంకృత్వాజ్యంచక్షుర్హోమ | మధ్యన వ్యాహృతులు |
| వైఖానసం | వాయవ్యాదాగ్నేయాన్తం ఉపాంశునా ప్రజాపతయేస్వాహా | నైరృత్యా దీశానాన్తం కంఠరవేణ ఇంద్రాయస్వాహా | సోమ అగ్ని | మధ్యమాస్యం ఇతి బుధ్వా ఓం భూస్వాహా, ఓంభువ స్వాహా, ఓం సువస్స్వాహా, ఓం భూర్భువ స్సువ స్వాహా, ఇదమగ్నిముఖం |
| విష్ణుతిలకం | నైరృత్యా దీశానాన్తం | వాయవ్యాదాగ్నేయాన్తం | అజ్యభాగములు | మధ్యన వ్యాహృతులు |

ఈ అఘారహోమం పట్ల అన్ని సంహితలయందు ఏకవాక్యత లేదు. ప్రథమాఘార ద్వితీయాఘార విషయమున దిశాభేదము కన్పించుచున్నది. పాద్మమున ప్రాజాపత్య ఐంద్రాహుతులున్నవికాని దిశానిర్దేశము కన్పించదు. శ్రీమన్నారాయణ పురుషోత్తమ సంహితలయందు పైవానికి భిన్నమగు అభిప్రాయము కన్పించుచున్నది. వైదిక ప్రక్రియాను సారియగు వైఖానసము దీనినే చెప్పినది. స్మార్తము కూడా ఈ మార్గమునే అనుసరించినది. ఆ కారణము చేతనే కావచ్చు, మా పూర్వాచార్యులు కూడ క్రి.కై.చం., కపింజలములు వ్యతిరేకించినా నారాయణ పురుషోత్తమ సంహితల ననుసరించిరి.అంతేగాక బహుశా వైఖానసమున గల "ఉపాంశునా" అనుదానివలే శ్రీకూర్మం ప్రతియందు ఈ సందర్భమున "తూష్ణీం హుత్వా" అను వ్రాతలు కన్పించుచున్నవి.

**<u>22.ప్రణీతావాహనం</u>** :- (వి.తి. 5, 222-224). ప్రోక్షణపాత్రయందలి నీటితో ప్రణీత పాత్రకు సత్యంత్వర్తేతి మన్త్రమున పరిషేచనమొనర్చి, శుద్ధతోయమున పూరించవలె- ప్రణీతమున వాసుదేవుని ఆవాహన మొనర్చి అర్చించవలె - అగ్నికి ఈశాన్య దిగ్భాగమున, కుశాసనమున ప్రణీతపాత్ర నుంచవలె - దక్షిణమున 12 దర్భలతో నిర్మింపబడిన కూర్చతో బ్రహ్మ నర్చించవలె.

**<u>23.ప్రణీతావోక్షణం</u>** (వి.తి.5. 296 - 301) :- తనముందుగల కుశలయందు ప్రణీతపాత్ర నుంచి ప్రోక్షణీజలము నందుంచవలె. ఆపైన ప్రణీత పాత్ర నీటితో భూమిని సంప్రోక్షించవల, తనను ప్రోక్షణమొనరించుకొనవలె - బ్రహ్మోద్వాసన మొనర్పవలె - స్రువమును జలమున పూరించి కుండము చుట్టూ ప్రదక్షిణముగా పరిషేచన మొనర్పవలె - మిగిలిన నీటితో తన శిరమును ప్రోక్షించుకొని, హృదయమ్భోజమున వహ్నిస్థుడగు పరమేశ్వరుని సమర్పించి, కుండ భస్మమున తిలకమును ధరించి, దేవుని అర్ఘ్యాదుల నర్చించవలె - భక్తితో అగ్నియందు యథావిధిగా యథాశక్తి చేసిన ఆరాధనను స్వీకరింపుము - అని ప్రార్థించి ఆయన పాదారవిందముల యందు హవనము సమర్పించవల.

(హవ్యము, హవిస్సు సమానార్థకములు. హవో హూతౌ- అనగాపిలుచుట. అగ్నియందు వేల్వదగు పక్వాన్నమునకు చరువని పేరు. హవిష్యమనగా హవిస్సు, నేయి - హవ్య కవ్యములు అనగా క్రమముగా దేవతకు, పితృదేవతలకు వర్తించు హోమ ద్రవ్యములు.



## అనుబంధము - 7

# ద్వారతోరణ పూజాదులు

(ద్వారతోరణ, అంతరాళ, పతాక, ద్వారకుంభ దేవతా పూజలు)

(పాద్మం(క్రియా.27.83-95 (క్రి.కై.చం.9 .31.32 శ్రీపురు.సం. 11 .20-35)

పాద్మ మహోత్సవ విధియందు (11.72) "ద్వారతోరణ కుంభాదీన్ ప్రతిష్ఠాయామి వార్చయేత్" - అని; క్రి.కై.చంద్రిక ఉత్సవ విధిలో మృత్సంగ్రహణానంతరం యాగశాలయందు (పుట186) "ద్వారతోరణ ధ్వజకుంభాన్ అభ్యర్చ" అనియు ఉండుటచే కల్యాణోత్సవమున ప్రతిష్ఠకువలెనే వీనిని గ్రహించవలె.) యాగ, అంకురార్పణ, స్నపన, కల్యాణ మండపాది ఏమండపమునందైన ద్వారతోరణ దేవతలను, పతాక దేవతలను, ద్వారకుంభదేవతలను, ద్వారపాలురను, పూజించుట కన్పించుచున్నది. తూర్పున ఋగ్రూపము, ఇంద్రదైవత్యము (ఓం లం ఇంద్రాయనమః అని క్రి.కై.చం), సుశోభన నామకము అగు అశ్వత్థ తోరణమును పూజించవలె.

- దక్షిణమున యజుర్వేద రూపము, యమదైవతము (ఓం యం యమాయనమః అని క్రి.కై.చం.), సుభద్రనామకము అగు ఔదుంబర తోరణమును పూజింపవలె.

-పశ్చిమమున సామవేద రూపము, వరుణదైవతము (ఓం వం వరుణాయనమః అని క్రి.కై.చం), సుబంధ నామకము అగు న్యగ్రోధ తోరణమును పూజించవలె.

-ఉత్తరమున అధర్వణ వేదరూపము, సోమదైవత్యము (ఓం సోం సోమాయనమః అని క్రి.కై.చం.), సుహోత్రకనామము అగు ప్లక్ష తోరణమును పూజింపవలె.

-ద్వార పార్శ్వములయందున్న ధ్వజములు రెండింటియందు ద్వారపాలుర నర్చించవలె- తూర్పున ఎర్రని ధ్వజములయందు కుముద కుముదాక్షులను ద్వారపాలురను, దక్షిణమున పసుపు పచ్చని ధ్వజములయందు పుండరీకాక్ష వామనులను ద్వారపాలురను, పశ్చిమమున నీలిరంగు ధ్వజములయందు శంకుకర్ణ సర్పనేత్రులను ద్వారపాలురను, ఉత్తరమున పాండురవర్ణ ధ్వజములయందు సుముఖ సుప్రతిష్ఠులను ద్వారపాలురను, ధ్వజాంశుకములయందు ధ్యానించవలె. చండాదులు ద్వారపాలురని, కుముదాదులు గణేశులని (ఈశ్వరసంహిత 11.291, 292, ష్రేడర్. పేజి నెం: 65) చెప్పబడగా, ఇక్కడ పాద్మము కుముదాక్షాదులను ద్వారపాలురుగా పేర్కొన్నది. క్రియాకైరవ చంద్రిక కూడ అంకురార్పణ విధియందు (31, 32) కుముదాదులనే ద్వారపాలురుగా చెప్పినది. రే.శ్రీరం ప్రతిష్ఠా ప్రయోగమున గూడ కుముద కుముదాక్షులు ద్వారపాలురుగ, పూర్ణపుష్కరములు కలశలుగ చెప్పబడినవి -ఇందు ద్వారతోరణ పూజావిధి మృత్సం గ్రహణమునకు ముందున్నది).

-చతుర్దిక్కులయందు దిక్కునకు రెండు చొ॥న పూర్వాది ద్వారములయందు, నవవస్త్రములు, సాశ్వత్థపల్లవములు, సపిధానకములు అగు 8 కుంభములను ధాన్యరాశులయందు ఇదం విష్ణురితి మన్త్రమున ఉంచవలె. ఆ కలశల పేర్లు - పూర్ణపుష్కరములు, ఆనంద నందనములు, వీరసేన సుషేణములు, సంభవ ప్రభవములు అనునవి. తోరణములకు నూతన వస్త్రాచ్ఛాదనము. (సోమకుంభముతోబాటు, పాలికాధి దేవతలతోబాటు పైవానినన్నిటిని పూజించి పాయసాన్న నివేదన మొనరింపవలెనని క్రి.కై.చం.(పుట31, 32) గాన నీ ద్వారతోరణ పూజాదులు అంకురార్పణాంతర్గతములు లేదా దానికి ముందుగా జరుగవలసినవి.

---

## అనుబంధము - 8

## వాస్తుపూజా

(నారా.సం. య.8.1-71; పురు.సం.4.1-47; పాద్మసం.- క్రియా. 27.5-20)

పై సంహితలయందు వాస్తుపూజ రెండు విధములగా కన్పించుచున్నది. - 1. విగ్రహ వాస్తు పూజ 2. వాస్తు మండలార్చన, శ్రీమన్నారాయణ సంహిత ఈ రెండు ప్రక్రియలనూ భోధించుచూ, రెండవ దానిని ప్రకారాంతరముగా పేర్కొన్నది. పురుషోత్తమ సంహిత కేవలము మండలార్చనను మాత్రమే చెప్పగా, పాద్మము విగ్రహ పూజనమునే వర్ణించినది. క్రి.కై.చంద్రిక (పుట42) సహజముగా పాద్మము ననుసరించినది. ఈ మూడు సంహితలలో అక్కడక్కడ కేవలం కొన్ని పాఠభేదాలు తప్ప 'ఒకే విషయం ఒకే శ్లోకాలుగా' చెప్పబడి ఉన్నది. అన్ని సంహితలూ వాస్తునాధుని అర్చించని కర్మ ఆసురమగునని ఏకకంఠమున చెప్పినవి. 'కృతంకర్మ', 'దేవయాగాది కర్మసు' అని పేర్కొనుట వలన వాస్తుపూజ కేవలము ప్రతిష్ఠా కర్మకే పరిమితమనుట సరియైనది కాదని తోచుచున్నది..

### 1. విగ్రహవాస్తు (నారా.సం)

- వాస్తుపురుషుడు అధోముఖుడు, ప్రాక్శిరస్కుడు, ప్రసార్య పాణిపాదుడు, (మస్తక మీశాన్యమున, పాదములు నైరృతిని, బాహుద్వయము ఆగ్నేయ వాయుకోణములందు) - ఇట్టివాస్తు పురుషుని మంటప దక్షిణభామున ప్రత్యేక వేదికయందు లేదా తండులమధ్యమున లిఖించవలె. - ఈతడు మధ్యాహ్నమున ప్రాక్శిరస్సు, సాయాహ్నమున దక్షిణముఖము, మధ్యరాత్రి పశ్చిమమూఖము, ఉదయమున ఉత్తరశిరస్సు గలిగి 7 తాలముల పొడవున దంష్ట్రాకరాళవదనునిగా రక్తపాత్రధరునిగా చెప్పబడియున్నాడు.

- ఈతని శిరమును అంశుమాలిని, బాహుమూలముల మన్మధుని, కూర్పరమున కుమారుని, హస్తమున వినాయకుని, పాదయుగళముల అశ్వినీదేవతలను, హస్తమున చంద్రుని, పార్శ్వమున దుర్గను కూర్పరమున సప్తమాతృకలను, బాహూమూలమున స్థాణువును, హృదయమున విష్ణువును, నాభియందు బ్రహ్మను, అష్టదిక్కులయందు దిక్పాలురను, ఉత్తరమున క్షేత్రేశుని, పార్శ్వమున వాసుదేవుని పూజించవలె.

- వాస్తునాధునికి పదమటిప్రక్క హోమమొనర్పవలె - పంచోపనిషన్మంత్రములతో 1000

కాని, 100 కాని అజ్యాహుతులు, శమి, అపామార్గ, ఖాదిర సమిధలతో మూలమంత్రమున తన్మంత్రవర్ణసంఖ్యతో సమమగు అహుతులు, పురుషసూక్తమున 16 చరు ఆహుతులు, వాస్తు దేవునకు ప్రత్యేకము హోమము చేయవలె.

- ఆయాదేవతలకు, క్షేత్రపాలులునకు బలుల నొసంగవలె – సంపాతాజ్యమును గ్రహించి వాస్తు విగ్రహ సేచన మొనర్చవలె, – వాస్తు మన్త్రమున కర్మాంతము వరకు పూజించవలె.

## 2.ప్రకారాంతముగ మండలార్చన –

- శాలకు దక్షిణమున, తాలము ఎత్తు, 24 అం.ల చతురస్ర వేదికయందు, వాస్తు మండలమును కల్పించవలె – భూసూక్తమున వేదిపై గోమయానులేపనము –.రక్త, పీత, సిత చూర్ణముల రంగవల్లీ ప్రకల్పనము – దానిపై నూతన వస్త్రమున తండుల మండలమున, 10 X 10 రేఖలతో 81 పదములు వచ్చు విధమున మండలమును లిఖించి, ఆ మండల మధ్యమున, కర్షప్రమాణ హేమమున చేయించిన ప్రతిమను, పంచామృతములతో శోధన మొనర్చినదానిని, ఉంచి వాస్తుపురుషు నావాహన మొనర్చి పూజించవలె.
- వాస్తోష్పతేతి మన్త్రౌ ద్వౌ – అనగా రెండు వాస్తోష్పతేతి మంత్రములతో వాస్తుపురుషుని యథాశక్తి (1000/100/108 సార్లు) ధ్యానించి, పంచ త్వ క్పల్లవ, వస్త్ర, కూర్చాదికయుతమగు సౌవర్ణ/రాజిత/తామ్ర కుంభమున ప్రతిమనుంచి, ప్రాణప్రతిష్ఠా పూర్వకముగా షోడశోపచారములచే అర్చించవలె.
- దీనికి తూర్పున లేదా ఉత్తరమున సోమమండలము లిఖించవలె – ముందువలె ధాన్య పీఠము కల్పించి దాని మధ్య 16 దళములతో కర్ణికా కేసరములతో కూడిన మండలమును లిఖించి, కర్ణికయందు సోమకుంభమును సవస్త్ర మణికూర్చకముగ నుంచి, అందు రజిత సోమప్రతిమను, పంచగవ్యశోధన మొనర్చిన దానిని ఉంచి ప్రాణప్రతిష్ఠా పూర్వకముగా అర్చించవలె.
- మధ్యపదమునకు బాహ్యమున చుట్టూ ఉన్న ఇంద్రాది 8 పదములలో బ్రహ్మ జజ్ఞాన మంత్రమున, ప్రజాపతి, బ్రహ్మ, కమలాసన, అజ, విధి, శతానంద, ద్రుహిణ, విశ్వరేతస అను పేర్లతో బ్రహ్మను అవాహనమొనర్చి పూజింపవలె – దీనికి తూర్పుననున్న పదషట్కమున మహేంద్రుని, త్రాతారమిన్ద్ర అను మన్త్రమున, మహేంద్ర, దేవతానాథ, శచీనాథ, పులోమజ, స్వర్గాధీశ, వజ్రహస్త అను పేర్లతో అవాహనమొనర్చి పూజింపవలె.
- దక్షిణపద షట్కమున, యమాయ సోమ మంత్రమున, యమ, దండధర, కాల,

కాలాంశ, రవినందన, ధర్మాధికార అను నామముల యముని ఆవాహనమొనర్చి పూజింపవలె - పశ్చిమ పద షట్కమున, ఇమంమే వరుణ మన్త్రమున, వరుణ, మకరారూఢ, పాశపాణి, ప్రచేతస, సురూపిణ, అపాంనాధ అను పేర్లతో వరుణుని అర్చించి పూజించవలె - ఉత్తరపదషట్కమున యక్షరాజ, కుబేర, గుహ్యకేశ, ధనాధిప, గదాధర, యాతుధాన నామములతో అర్చించి పూజించవలె - ఆగ్నేయపద చతుష్కమున అగ్నిందూత మంత్రమున హుతాశన, ధూమకేతు, సప్తజిహ్వ హవిర్భుజ నామములతో అగ్నిని; నైరృతి దిక్కున మోషణుఃపరా మంత్రమున ఖడ్గహస్త, కర్బుర, నిర్‌ఋతి, నరవాహన నామములతో నిర్‌ఋతిని; వాయవ్యపద షట్కమున ఆవాతవాయు మంత్రమున పవమాన, మరుత, జగత్ప్రాణ, సమీరణ నామములతో వాయువును ; ఈశాన్యపద షట్కమున తమీశాన మంత్రమున ఈశాన, గౌరీనాధ, మహేశ్వర, వృషభారూఢ నామములతో మహేశ్వరుని పూజించవలె - ఆపైన బాహ్యమునగల ఈశానపదము మొదలుకొని 32 మంది దేవతలను ప్రదక్షిణముగా, క్రమమున, పర్జన్య, ఈశాన, జయంత, ఆదిత్య, ఇంద్ర, సత్య, సంబాధ, భృగు, అంతరిక్ష, అగ్ని, ఉష్ణాంశు, పూషాణ, వితధ, యమ, గ్రహక్షత, గంధర్వ, భృంగరాజ, ఋషి, నిర్‌ఋతి, దౌవారిక, పుష్పదంత, సుగ్రీవ, సురూప, అసుర, పౌషాణ, నాగజననీ, నాగాధీశ, గుహ్యక, భల్లాట, సోమ, అనర్గళ, ఆదిత్య, సౌరదేవి నామములతో, పంచత్వక్ పంచపల్లవ నవరత్న పంచామృత సప్తమృత్ సర్వౌషధి సమాయుక్తములగు సౌవర్ణ / రజిత / తామ్ర కలశల యందు తత్తన్మంత్రములతో నుంచి ప్రతిమావస్త్ర సంయుతములు గా అర్చించవలె - అష్టదిక్కులయందు కలశలనుంచి వానియందు ప్రాగాదిగా, కుమార, బిడాలక, భాస్కర, పూతన, జంబుక, పాపరక్షస, పిలిపింఛక, విశ్రవసులను పూజించవలె.

<u>**వాస్తు హోమము**</u> (శ్రీమన్నారాయణ సంహిత య.వై.కాం. 8.64-71)

- కుండమునగాని, స్థండిలమున గాని (స్థండిలమనగా అగ్నిహోత్రమునుంచుటకు సంస్కరింపబడిన స్థానము) అగ్నిని స్థాపించి ఇధ్మాధాన, అజ్యభాగముల నొనర్చి, 10 వేలు / 1000 / 108 కాని జపమునందర్ధ భాగముకాని, క్రమముగా సమిధాజ్య చరువులతో వాస్తునాథ మంత్రమున హోమమొనర్పవలె.
- సోమమంత్రమున 108 ఆజ్యాహుతులు; మంటపాంతస్థదేవులకు వారివారి పదసంఖ్యతో సమానముగ సమిధ చరు ఘృతముల ఆహుతులు, పరివారాది

సర్వదేవతలకు స్వస్వ మంత్రములతో సమిధాజ్య చరువులతో ఆహుతుల నివ్వవలె, పూర్ణాహుతి నొనర్పవలె (శమి, అపామార్గ, ఖాదిరములు సమిధలు).

- వాస్తునాథునకు ఇతర దేవతలకు విధ్యుక్తముగా బలులనివ్వవలె - వాస్తు కుంభతోయమున యాగమంటప భూమిని అఘమర్షణ సూక్తమున సేచనమొనర్పవలె (సేచనమనగా పాత్రతో నీళ్ళు చల్లుట) .

## ఏకాశీతి పద (81) వాస్తు మండలము (పురు.సంహితాన్తర్గతము)

విశ్రవస కుముద బిడాలక

పిలిపింఛ ఆర్యమ

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| పర్జన్య | ఈశాన | జయంత | ఆదిత్య | ఇంద్ర | సత్యసంబాధ | భృగు | అంతరిక్ష | అగ్ని |
| సౌరదేవి | ఈశాన | గౌరీనాథ | వజ్రహస్త | దేవతానాథ | శచీనాథ | హుతాశన | ధూమకేతు | ఉష్ణాంశు |
| ఆదిత్య | వృషభారూఢ | మహేశ్వర | స్వర్గాధీశ | మహేంద్ర | పులోమజ | సప్తజిహ్వ | హవిర్భుజ | పూషాణ |
| అనర్గళ | గుహ్యకేశ | ధనాధిప | విశ్వరేతస | విధాత | బ్రహ్మ | రవినందన | ధర్మాధినాథ | వితథ |
| సోమ | కుబేర | యక్షరాజ | ద్రుహిణ | వాస్తునాధ | కమలానాథ | యమ | దంధధర | యమ |
| భల్లాట | యాతుధాన | గదాధర | శతానంద | విధి | అజ | కాలాంశ | కాల | గ్రహక్షత |
| గుహ్యక | పవమాన | మరుత | అపాంనాధ | వరుణ | మకరారూఢ | ఖడ్గహస్త | కర్బుర | గంధర్వ |
| నాగాధీశ | సమీరణ | జగత్ప్రాణ | సురూపిణ | ప్రచేతస | పాశపాణి | నరవాహన | నిర్భతి | భృంగరాజ |
| నాగజననీ | పౌషాణ | ఆసుర | సురూప | సుగ్రీవ | పుష్పదంత | దౌవారిక | నిర్భతి | ఋషి |

పాపరక్షస జంబుక పూతనా

అనుబంధము - 9

# ధ్వజారోహణ దేవతాహ్వాన విధి

(శ్రీ పురుషోత్తమ సంహిత-23 అధ్యా. 4-96 శ్లో.)

(ఈశ్వరసంహిత - 10 అధ్యా 229-41; 11 అధ్యా 1-93 శ్లో.)

- ' సవము ' అనగా సాంసారికదుఃఖము - ఉత్ అనగా అదుఃఖమునుండి లేవనెత్తి దాటించుట - ఉత్+సవము= ఉత్సవము
- ఇవి నిత్య నైమిత్తిక కామ్యములని 3 విధములు.
- దేవయాగారంభమునకు (ఉత్సవమునకు) ఉత్తరాయణ ముత్తమము. దర్శ, పూర్ణిమ, ద్వాదశి, శ్రవణము, అయినము, విషువ, రోహిణి, పునర్వసు, (ఇతర పుణ్యతిధులు గ్రహణాది పర్వములు యజమానుని జన్మదినము ప్రతిష్ఠానక్షత్రము అని అధికపాఠం) అనువానిని తీర్థదివసముగా(చివరిరోజు) నిర్ణయించి యాగకర్మ ఆరంభించవలె. **( దీనివలననే ఉత్సవములకు తీర్థములని గూడ ప్రసిద్ధి)**
- ఉత్సవం ద్వాదశాహం గాని, నవాహం గాని, సప్తాహంగాని, పంచాహంగాని అయినచో ధ్వజారోహణ జరిపించవలసియున్నది.
- దేవాలయమునకు ఈశాన్యమున యాగమంటపాన్ని 10 హస్తముల పొడవున కాని, 9 హస్తముల పొడవున కాని, 5 హస్తముల పొడవున కాని, చతుర్ద్వారయుతముగా నిర్మించవలెను.
- మధ్య మహావేది ఒక హస్తం ఎత్తున ఏర్పరుచవలెను.
- వేదికి నాల్గువైపులా కుండములు - తూర్పున చతురశ్రము, దక్షిణమున చాపకుండము, పశ్చిమమున వృత్త కుండము, ఉత్తరమున త్ర్యశ్రకుండము నిర్మించవలెను. లేదా ఒక్క చతురస్రమును నిర్మించవలెను.
- యాగశాలను అశ్వత్థతోరణాదులతో, స్తంభాలంకరణములతో, పతాకములతో, దీపములతో అలంక రించవలెను. అష్టమంగళముల నేర్పరచి స్రుక్ స్రువాదుల సమకూర్చుకొనవలెను. మండప ప్రప (చలువపందిరి లేదా చాందినీ) నారవస్త్రముతో లేదా నూలుగుడ్డతో కట్టవలె.
- ఋతిగర్వణము - ఆచార్యుడు, ఋత్విక్కులు 16 లేక 8 లేక 4 మంది ఉండవలెను.
- ఉత్సవారంభ పూర్వము ధ్వజారోహణము - ఉత్సవారంభమున దేవునకు స్నపనము జరిగించవలెను.

- పట్టు లేదా నూలు గుడ్డను 10 హస్తములు పొడవు, 5 హస్తములు వెడల్పు గల దానిని తీసుకొని దాని మధ్యలో 9 తాలముల (బొటనవ్రేలు మధ్యవ్రేలుతో ఏర్పడెడి జాన తాలము – ప్రాదేశ స్తాల గోకర్ణా తర్జన్యాదియుతే తతే – అమరం) బంగారు కాంతులతో, నీలనాసాగ్రముతో, వంచబడిన ఎడమపాదముతో, విచ్చుకొని యున్న రెక్కలతో, తెల్లని వస్త్రములను ధరించి, లలాటమున కుటిలాలకలతో, హారనూపుర నాగేంద్రాభరణ ములతో ఆకాశమున నెగురుచున్న విథముగానున్న గరుడుని లిఖించవలెను.
- మూలబేరసమాయామము లేదా ద్వారాయామమనియు, ఆయామార్థము విస్తీర్ణమనియు, 4వ వంతు శేఖరమనియు, శేఖరసమ పుచ్ఛమనియు, దానిలో సగము కర్ణపుచ్ఛమనియు .... పటమధ్యమున ద్విభుజుడు, అజంలిబుద్ధుడు, బంగరు కొండవంటివాడు, గగనమున నెగురుటకు విప్పిన రెక్కలు గలవాడు, ఎడమపాదమును కుంచించి దక్షిణపాదమును పృష్ఠమువద్ద నుంచిన వాడును, కొంచము వెడల్పు చేసిన గుండ్రని కన్నులుగలవాడును, నల్లని పొడవైన నాసిక గలవాడును, శాంతవేషముతో ప్రహసితాననముతో నున్నవాడును, సర్పభూషితుడు ..... బ్రహ్మసూత్ర విభూషితుడు ........ నీలామ్బర వారవాణ (చొక్కా) ధరుడు, వాసుకి యజ్ఞసూత్రముగా ..... నున్నవాడు, .. అంటూ చాల వివరాలతో 10వ అధ్యా. 231 నుండి 259 శ్లో. వరకు ఈశ్వర సంహిత. (పాద్మ. క్రియా కైరవ చన్ద్రికలు కూడ చాలవరకు పైవర్ణనను ఇచ్చినవి)
- అట్టి గరుడ పటమును ధాన్యాధివాసమున నుంచవలెను. నయనోన్మీల నాదులను, ప్రతిష్ఠాదులను చేయవలెను. దర్పణమున స్నపన మొనర్ప వలెను. (పటస్థ గరుడునకు ప్రతిసర బన్ధనము అష్టాక్షర మన్త్రన్యాసము గరుడ పంచాక్షర మన్త్రము మొదలగునవి (క్రి.కై.చం పుట 175న చెప్పబడినవి.) శయ్యయందు శయనింప జేయవలెను.
- పటమునకు వాయువ్యమున మాహాకుంభమును, ఉత్తరమున కరకమును, అష్టదిక్కులయందు ఎనిమిది కలశలను ఉంచి, మధ్యనున్న కుంభమునందు గరుడుని, కరకమున చక్రమును, ఇంద్రాదుల నష్టదిక్కులయందు ఆవాహన మొనర్చి పటముననున్న గరుడుని నైవేద్యాన్తము పూజించవలెను.
- కుండమునం దగ్నిని జ్వలింపజేసి దర్భమూలములతో పర్యగ్ని కరణ మొనర్చి, తత్త్వ సృష్టి సంహారన్యాస హోమముల నొనర్చి, కుంభమందున్న శక్తిని కూర్చతో పటమునందుంచవలెను. ఆపైన గారుడ న్యాసపూర్వకముగా ప్రాణప్రతిష్ఠ నొనరింపవలెను. ' ఏహిదేవ (ఏహిఖేశ) మహాభాగ వైనతేయమహాబల ...' అని

గరుడ ప్రార్థన చేయవలెను. ప్రభాతమున ఆ గరుడపటమును పల్లకియందుంచి గ్రామ ప్రదక్షిణముగా దేవాగారమును ప్రవేశించి ధ్వజస్తంభము వద్ద కేగి, 'సుపర్ణోసి' మన్త్రముతో స్తంభాగ్రమున దేవున కభిముఖముగా పటబంధన మొనర్చవలెను. ఆపై ఉత్సవావభృథాన్తమువరకు పటమునందు వసించవలసిందిగా గరుడుని ప్రార్థించవలెను. ప్రతిదినము రెండు సార్లు గరుడుని అర్చించవలెను. (ధ్వజస్తంభ స్థితి, ప్రమాణము, వర్ణనము, స్థాపనము ధ్వజపట బంధనము చాల వివరముగా ఈశ్వర సంహితయందు చెప్పబడినవి)

- సాయహ్నమున దేవతాహ్వానము - భేరీపూజ - దేవునకు దక్షిణపార్శ్వమున కూర్చొని చరణం పవిత్ర మన్త్రమున భూప్రక్షాళనము, విష్ణోరరాట మన్త్రమున దర్భలతో సమ్మార్జనము, గంధద్వారేతి మన్త్రమున గోమయమున అనులేపనము, ఆపఉదస్త మన్త్రమున రంగవల్లీ ప్రకల్పనము, దేవస్య త్వేతి మన్త్రమున అక్షతలను చల్లుట, ధాన్యమస్యేతి మన్త్రమున ధాన్యపీఠ ప్రకల్పనము, శన్నోదేవీరితి మన్త్రమున పద్మపత్రాలంకరణము, త్రాతార మన్త్రమున మధ్యభాగమున పద్మలేఖనము, ధన్వనాగ మన్త్రమున పైన దర్భలతో పరిస్తరణము, మూర్ధాన మన్త్రమున నమస్కరించుట, కోణ చతుష్కమున ఘృతదీపముల నుంచుట, విష్వక్సేనపూజ, పుణ్యాహవాచనములను జరుపవలెను. పుణ్యాహ జలమున ఆపవుదస్తు మన్త్రముతో భేరిని ప్రోక్షించవలెను. అర్యమాయేతి మన్త్రమున భేరిని ధాన్యవిష్టరమునందుంచవలెను.
- భేర్యధిదేవతాహ్వానము - భూతేశుని, గదాధరుని, ప్రజాపతిని, సూర్యచంద్రులను, శేషుని, భూమా తృకలను, వాచస్పతి (బృహస్పతి)ని, సప్త ఋషులను, నందీశుని అర్చించవలెను. భేరీ మధ్యమున తిగుణాత్మికయగు ప్రకృతిని, దక్షిణమున విష్ణువును శ్రీదేవిని, మధ్యన బ్రహ్మను, ఎడమన రుద్రుని, దక్షిణ ముఖమున సూర్యుని, వామముఖమున చంద్రుని, చర్మసూత్రమున వాసుకిని, దక్షిణపార్శ్వ నవరన్ధ్రముల వాగీశ్వరి, క్రియ, కీర్తి, లక్ష్మి, పుష్టి, విద్య, కాన్తి, దుర్గ, గణపతులను; వామపార్శ్వ నవరంధ్రములయందు అత్రి, భృగు, వశిష్ఠ, భార్గవ, నారద, గౌతమ, భరద్వాజ, విశ్వామిత్ర, మరీచులను; అష్టదిక్కులయందు రంభ, మేనక, ఊర్వశి, తిలోత్తమ, సుముఖి, కాహళాధి దేవత వాగీశ్వరిని, మర్దళాధి దేవతలు త్రిమూర్తులను, ముఖాధి దేవత బ్రహ్మను, మృదంగాధిదేవత రుద్రుని, ఝల్లర్యధిదేవత విష్ణువును, పటహాధిదేవత శ్రీదేవిని, ఢమరుకాధిదేవత ఈశానుని, ఉడుక్కాధిదేవత షణ్ముఖుని, కరట్యధిదేవత

ధర్మరాజును, తిమిలాధిదేవత వాయువును, ఢక్కర్య ధిదేవత చన్ద్రశేఖరుని, తాళాధిదేవ బ్రహ్మను, వామహస్త ఖండాధిదేవత శ్రీదేవిని, దక్షిణహస్త ఖండాధిదేవత పార్వతిని, పూర్వాది దిక్కులయందు ఇన్ద్రాదులను ఆవాహన మొనర్చి అర్చించవలెను. - (క్రి.క్రై.చం.పుట - 181, 182)

- తూర్పున మర్దళము, ఆగ్నేయమున కాహళము, దక్షిణమున శంఖము, నైరృతిన మృదంగము, పశ్చిమమున పల్లకీ, వాయువ్యమున పటహము, ఉత్తరమున ఝల్లరీ, ఈశాన్యమున కాంస్యము అనునవి తాళములు.
- బయట నృత్తగాయ కాదులతో పటస్థుడగు గరుడుని పూజించి, భేరికి వస్త్రమునుచుట్టి తద్విష్ణోరితి మన్త్రమున భేరీతాడన మొనరింపవలెను. శ్రీ సూక్తమునుచ్చరించి సర్వ వాద్యములను ఘోషణ మొనర్పవలెను. భేరికి తూర్పున శంఖములను, ఆగ్నేయమున కాహళములను, దక్షిణమున మర్దళమును, నైరృతి యందు మురవ తన్త్రీ వేణువులను, పశ్చిమమున ఉడుక్కమృదంగ హ్రస్వమర్దళములను, వాయువ్యమున కరటీకాంస్యతాళమును, ఉత్తరమున పటహ హ్రస్వ పటహములను, ఈశాన్యమున దుడ్డుకములు వల్లీహస్త ఘంటలు మొ॥నవి ఉంచవలెనని - క్రి.క్రై.చం పుట - 181. (ప్రథమ తాడనము తద్విష్ణో అను మన్త్రముతో, బ్రహ్మ జిజ్ఞాన మన్త్రమున ద్వితీయము తృతీయము కద్రుద్రా అనుమన్త్రమున నొనరింపవలెను. ప్రదమతాడనము వామహస్తమున మూడుసార్లు, ఆపైన దక్షిణ హస్తమున నదే విధముగా మూడుసార్లు తాడన మొనరింపవలెను. మొదట శంఖనాదము పిమ్మట కాహళ స్వనమును ఆపైన మూడవదిగా తాడనమును జరిపించవలెను. - ఈశ్వర సం.)
- ఆపై దేవతాహ్వానము - కుముదాదిగణములు, ఋషులు, బ్రహ్మ, రుద్రుడు మొదలగు అందరు దేవతలకూ ఆహ్వానము.
- బలిబేరమును శిబికయం దుంచుకొని క్రమముగా తిరిగి, నృతగీత వాద్యయుతముగా పరిజనులందరితో కలసి అర్ఘ్య గంధ మాల్య ధూపదీపములతో, విమాన ద్వారము మొదలుకొని గ్రామ వీధ్యంతము పాయసముతో దేవతాహ్వాన పూర్వకముగా బలిప్రదాన మొనరింపవలెను.

ఈశ్వరసంహితయందు కుముదాది గణేశ్వరులకు తాళ స్వర రాగ వృత్తములు చెప్పబడినవి-

- **కుముదునకు - సమతాళము, షడ్జ స్వరము, గాంధార రాగము, విలాస వృత్తము;**
- **కుముదాక్షునకు - బద్ధతాళము, ఋషభ స్వరము, కౌలాఖ్య రాగము, సర్వతోభద్ర నృత్తము;**
- **పుండరీకునకు - శృంగిణీ తాలము, గాంధార స్వరము, కౌశికా రాగము, ఖేటక నృత్తము;**

- **వామనునకు - మల్లతాళము, మధ్యమ స్వరము, నటభాషికరాగము, చక్రమండల నృత్తము**
- **శంకుకర్ణునకు - మంగల తాళము, పంచమ స్వరము, శ్రీరాగము, కాంతార కుట్టిమ నృత్తము;**
- **సర్వనేత్రునకు - జయతాళము, ధైవత స్వరము, కామద రాగము, పృష్టకుట్టిమ నృత్తము;**
- **సుముఖునకు - భద్రక తాళము, పంచమ స్వరము, తక్కేశీ రాగము, కటిబంధన నృత్తము;**
- **సుప్రతిష్ఠునకు - ధక్కరీ తాళము, నిషాద స్వరము, దక్ష రాగము, వామజానూర్ధ్వ నృత్తము;**
- **పృశ్నిగర్భునకు - బ్రహ్మతాళము, ధైవత మధ్యమము, చాళాసాళ్యరాగము, ఆదిమ నృత్తము-1;**
- **మానవునకు - అనంతతాళము, పంచమస్వరము, మేఘ రాగము, ఆదిమ నృత్తము -2**
- **మిగిలిన అందరు దేవులకు భద్ర తాళము ప్రశస్తము.**
- **పక్షీశునకు - గరుడ తాళము, మధ్యమస్వరము, గౌడరాగము, విష్ణుక్రాంత నృత్తము;**
- **విఘ్నారికి - జయ తాళము, ఋషభ స్వరము, వరాటి రాగము, స్వస్తిక నృత్తము ;**
- ప్రాచ్యే ... ఆగచ్ఛ అమరగణాః కుముదానుయాయినః బలింగృహీత్వా తృప్తో భవతు
- ఆగ్నేయే అగచ్ఛ అమరగణాః కుముదాక్షానుయాయినః బలింగృహీత్వా తృప్తో భవతు
- దక్షిణే అగచ్ఛ పితృ గణాః పుండరీకాక్షానుయాయినః బలింగృహీత్వా తృప్తో భవతు
- నైర్‌ఋతిభాగే అగచ్ఛ యాతుధానాః వామనానుయాయినః బలింగృహీత్వా తృప్తో భవతు
- పశ్చిమే అగచ్ఛ ప్రథమాః శంకుకర్ణానుయాయినః బలింగృహీత్వా తృప్తో భవతు
- వాయవ్యభాగే అగచ్ఛ గంధర్వగణాః సర్వనేత్రానుయాయినః బలింగృహీత్వా తృప్తో భవతు
- ఉత్తరదిగ్భాగే అగచ్ఛ యక్షగణాః సుముఖస్యానుయాయినః బలింగృహీత్వా తృప్తో భవతు
- ఈశాన్యే అగచ్ఛ పిశాచ గణాః సుప్రతిష్ఠానుయాయినః బలింగృహీత్వా తృప్తో భవతు
- గగనే అగచ్ఛ సిద్ధగణాః పృశ్నిగర్భానుయాయినః బలింగృహీత్వా తృప్తో భవతు
- పృథివ్యాం అగచ్ఛ అధరగణాః మానవస్యానుయాయినః బలింగృహీత్వా తృప్తో భవతు

భేరీతాడనకు పూర్వము దేవతాహ్వానమొనరించి మహాకుంభము నర్చించవలెను. భేరీతాడన విషయమున ఈశ్వర పురుషోత్తమ సంహితలయందు ఇంచుమించుగా ఒకే శ్లోకములునున్నవి. చాలాతక్కువగనున్న భేదముల చాలవరకు ఆయాస్థలములయం దివ్వబడినవి.

శ్రీమన్నారాయణ సంహిత య.వై.కాండ 8. 114-121, క్రియాకైరవ చంద్రిక (పేజీ. నెం: 149) ప్రకారం దిక్పాలకాదులకు రాగతాళ నృత్తాదులు ఈ క్రిందివిధముగ నున్నవి.

| నారాయణ సంహిత | | | క్రియాకైరవచంద్రిక | | | |
|---|---|---|---|---|---|---|
| దిక్పాలురు | రాగం | తాళం | తాళం | స్వరం | రాగం | నృత్తం |
| ఇంద్ర | నాదనామక్రియ | రవి | సమ | షడ్జ | గాన్ధార | విలాస |
| అగ్ని | లలిత | విక్రమ | బద్ధార | ఋషభ | కోల్లి | సుభద్రక |
| యమ | మల్హరి | భృంగిణీ | భృంగిణీ | గాన్ధార | కౌశికి | ఖేటక |
| నిరృతి | బైరవీ | ప్రతీప | మల్ల | మధ్యమ | నట్టభాష | చక్రమండల |
| వరుణ | మేఘరంజి | మంగళ | మంగళ | పంచమ | కామద | కాంతార |
| వాయు | వసంత | జయ | జయ | ధైవత | తక్కేశీ | కుట్టిమ |
| కుబేర | శ్రీ | భద్ర | భద్ర | నిషాద | దక్ష | పృష్ఠకుట్టిమ |
| ఈశాన | శంకరాభరణ | నం ది | ధక్కరీ | ధైవత | శూలపాణి | వామజానూర్ధ్వ |
| బ్రహ్మ | ముఖారీ | సమ | బ్రహ్మ | మధ్యమ | మేఘరంజి | సర్వమమండల |
| పక్షీశ | గౌళ | గరుడ | | | | |
| సర్వదేవులకు | గాంధారీ | భద్ర | | | | |

క్రీగీతలున్నవి ఈ మా కల్యాణ గ్రంథమున ఉపయోగింపబడినవి.



## అనుబంధము - 10

# మహాసంకల్పము

పాంచారాత్రాగమంలో వివాహప్రయోగములో కన్యాదానానికి ముందు కన్యాదాన సంకల్పము పఠించవలసి ఉన్నది. ప్రస్తుతం ఇక్కడ మహాసంకల్పము చెప్పబడుచున్నది. బొబ్బిలిలో చామర్తి, అంపోలువారి ఇండ్లలో లభించిన వివాహప్రయోగ తాళపత్రపత్రులు రెండింటియందు (ఇవి సుమారు 1850 ప్రాంతం నాటివి) కన్యాదాన సంకల్పము అను పేరుతో "శ్రీమత్సురా సురవర గరుడ గంధర్వ ...." అంటూ ప్రస్తుత మహాసంకల్పానికి భిన్నమైన ఒక సంకల్పం ఉన్నది . దీని పూర్తి పాఠం ఈ అనుబంధంచివర ఇవ్వబడినది. కొన్ని ప్రతులలో ఇది గరుడ పీఠికగా, (భద్రాచలపాఠంలో కూడా గరుడపీఠికగానే ఉంది) కన్పించడంచేత దీనిని గరుడపీఠికగా భావించి పూర్వులు ఈకన్యాదాన సంకల్పస్థానంలో మహాసంకల్ప పఠనం ప్రారంభించి ఉంటారని భావించవచ్చు. స్మార్తంలో మహాసంకల్పం అనేది కన్యాదాన సమయమున అవశ్య పఠనీయమని చెప్పబడినది.

శ్లో॥ మహాదానేషు యజ్ఞాదౌ ప్రాయశ్చిత్తేషు కర్మసు
కన్యాదానే నదీస్నానే మహాసంకల్పమాచరేత్ ॥

(పురాణోక్త కర్మప్రకాశిక పుట-100)

ఈనాటి ప్రాంతీయ పాంచరాత్ర వివాహ ప్రయోగంలో "కన్యాదాన సంకల్పముక్త్వా" అని చెప్పి మహాసంకల్పానికి చాల దగ్గరగా ఉన్న సంకల్ప పఠనం చేస్తున్నాము. మనం చెప్పే ఈ మహాసంకల్పానికి స్మార్త మహాసంకల్పాలకు (ఆపస్తంబ, అశ్వలాయినాలు) చాల పోలికలున్నాయి. స్మార్త సంకల్పాలలో కూడా అక్కడక్కడ భేదాలు కన్పిస్తున్నాయి. ఈ సందర్భమున ఈ దిగువ అంశములను తప్పక గుర్తింపవలసి యున్నది.

1) ఆగమమున కన్యాదాన సంకల్పము వేరుగా కన్పిస్తూన్నది. వివాహప్రయోగంలో "కన్యాదానసంకల్పముక్త్వా" అని తప్ప మహాసంకల్పమన్న పేరు ఈనాటికీ వాడబడుటలేదు.

2) కన్యాదానసంకల్ప స్థానమున స్మార్తమహాసంకల్పమునకు దగ్గరగానున్న దానిని ఉపయోగిస్తున్నాము. రానురాను లేఖనదోషాల వలన పాఠాలలో మార్పులేర్పడి కొన్నికొన్ని చోట్ల అసలుపాఠం అంతుబట్టని పరిస్థితి ఏర్పడింది. భద్రాచలం వారి ప్రతిలో కూడ ఇట్టి మహాసంకల్పమే కనిపిస్తున్నది. కొన్ని స్ఖాలిత్యాలను సవరించేందుకు వారి పాఠం బాగా ఉపయోగపడినది.

అందుచే అగమమునందున్న మహాసంకల్ప పాఠభేదాలను, ఆ పోలికలున్న స్మార్త పాఠబేధాలను పరిశీలించవలసి యున్నది. దానికోసం ఈక్రింది అగమ, స్మార్త మహాసంకల్పముల పరిశీలనము -

1. **ఆగమము**-"శ్రీ మదచింత్యానంత సంతన్యమాన అనన్యనివార్యవీర్యస్య, అఖిలలోక పరిపాలన పరాయణస్య భగవతో నారాయణస్య మహా జలౌ ...."(సంతన్యతే అనేనేతి సతతం, తను విస్తారే - విస్తరింపజేయబడుచున్న)- (రేజేటివారి పాఠం)

"అస్యశ్రీమదాదినారాయణస్య అచింత్యాపరిమిత శక్త్యా ధ్రియమణాస్య" (శ్రీ కూర్మం బొబ్బిలి పాఠాలు) ఈ అచింత్యా పరిమిత శక్త్యాధ్రియమాణస్య లేనిదే అర్థపరిపుష్టి కనబడుటలేదు.

**స్మార్తపాఠము** - "అథానంతవీర్యస్య (అస్య శ్రీమద్భగవతో మహాపురుషస్య) శ్రీ మదాది నారాయణస్య అచింత్యా పరిమిత శక్త్యా ధ్రియమాణస్య" (వావిళ్ళవా యాజుష పూ.ప్ర.చంద్రిక -- పుట 197, ఋగ్వేద వివాహప్రయోగం -- పుట 78)

**అర్థం**- అనంతశక్తివంతుడు, మహాపురుషుడు, భగవంతుడు అగు ఆది నారాయణుడు ఊహ కందని తన అపరిమిత శక్తితో భరించుచున్న .......

**2. ఆగమము**- "మహాజలౌఘమధ్యే పరిభ్రమమాణానాం అనేకకోటి బ్రహ్మాండానాం ఏకతమే వ్యక్తావ్యక్త ప్రకృతి మహదహంకార వృధి వ్యావస్తేజో వాయురాకాశాద్యావరణైరావృతే అస్మిన్మహతి బ్రహ్మాండ ఖండ (కరండ) మండలే"

**స్మార్తంలో** కూడా ఇదే పాఠం - ముఖ్యమైన బేధాలు లేవు.

**అర్థం**-మహాజల సమూహము మధ్య (ఉచ్యతే సంఘీభూయతే ఓఘం=గుంపు - అమరం) తిరుగుచున్న అనేకకోటి బ్రహ్మాండములలో ఒక్కటియగు, వ్యక్తము అవ్యక్తము (అవ్యక్త ప్రకృతి) అగు, మహత్తు, అహంకారము, భూమి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశము అను ఆవరణములచే ఆవరించబడినదియగు, గొప్పదైన ఈ బ్రహ్మాండ ఖండమండలమున (కరణ్డ = సంపుటమున)

**3. ఆగమము**- ఆధారశక్తి కూర్మ (వరాహ) అనంత, (ఐరావత పుండరీక వామన కుముదాంజన పుష్పదంత సార్వభౌమ సుప్రతీకాఖ్య) అష్ట దిగ్గజోపరివేష్టితస్య - (రేజేటి, శ్రీ.కూ. బొబ్బిలి పాఠాలు)

స్మార్తంలో ముఖ్య భేదాలు లేవు.

అర్థం-ఆధారశక్తియగు ఆది వరాహము, ఆది కూర్మము, అనంతుడు

(శేషో అనంతః - అమరము) అనువారలపైన అష్టది గ్గజములమీద ప్రతిష్ఠింపబడిన ..........

4. <u>ఆగమము</u>-"అతలవితల సుతల ప్రతల తలాతల రసాతల మహాతల సప్త పాతాళ లోకానా ముపరితలే..."

**స్మార్తం** కూడా ఇదే విధముగా ఉన్నది

**అర్థం**- పాతాళము మొదలగు ఏడు లోకములకు పైన ........

5. <u>ఆగమము</u>-"భూలోక భువర్లోక సువర్లోక మహర్లోక తపోలోక జనోలోక సత్యలోక సప్తమ స్యాధో భాగే ...."

**స్మార్తం** - "ప్రతిలోమేన సత్యాది లోక షట్కస్యాధోబాగే (భూలోక, భువర్లోక సత్యలోకానా మధో భాగే)...." ( ప్రతిలోమేన = అవరోహణ క్రమమున సత్యలోకమాదిగాగల ఆరు లోకములకు క్రింద గల లోకము అని తాత్పర్యము.)

**అర్థం**- (చక్రవాళశైలమును మహావలయము మధ్యలో) గొప్పనాళమువలె నున్న అనేక పడగల వరుసలచే ప్రకాశించుచున్న శేషుని యొక్క వేయిపడగల మణిమండలములచే భూషింపబడిన ట్టియు......... (చక్రవాళము = చక్రాకారమున భూమినిచుట్టి యుండునది గాన చక్ర వాళము. దీనికి లోకాలోకాచలమనియు పేరు గలదు. దీని లోపలి పార్శ్వము సూర్యకిరణముల చేత ప్రకాశించును. వెలుపలి పార్శ్వము ప్రకాశింపదు గనుక కొంత చూడబడునది కొంత చూడబడనిది అగుటచే లోకాలోకము - అమరము)

7. <u>ఆగమము</u>- దిగ్దంతి శుండాదోర్దండ మండితే - లోకాలోకాచలవలయుతే

(దిగ్దంతి శుండా దండోత్తంభితే - భద్రాచలంవారి పాఠం)

**స్మార్తం** కూడ ఇదే పాఠము

**అర్థం**-అష్ట దిగ్గజముల తొండములనెడు కరదండములచే అలంకరింపబడిన (పైకెత్తబడిన)...

ఇక్కడ నుండి ద్వీపములు, సముద్రములు, పర్వతములు మొదలగునవి చెప్పబడినవి. ఇందులో కొన్ని ముందు వెనుకలకు మారడము, కొన్ని లోపించడము వంటి భేదాలున్నాయి. అందుచేత ద్వీపములు, వర్షములు, ఖండములు, పర్వతములు మొదలగు వానిని గూర్చిన సరియైన అవగాహన కోసం ఈ క్రింది వివరాలను గమనించవలసి ఉన్నది.

**భూగోళము** -పాద్మ సంహిత జ్ఞాన.9.4నుండి, విష్ణుతిలకమున 2-138 నుండి ఈభూగోళ వర్ణన ఉన్నది. భూగోళవర్ణనం సాధారణంగా పురాణాలలో కన్పిస్తుంది. ద్వీపాలు వర్షాలు సముద్రాలు కులపర్వతాలు మనువులు మొదలైనవాని సమాచారం ఇందులోఉంది. భూమండలం పంచాశత్కోటియోజన విస్తీర్ణము. దీనిచుట్టూ సాగరాలు అంగుళీయకమువలె ఏర్పడి ఉన్నవి. దీనిలో జంబూ,ప్లక్ష, కుశ, క్రౌంచ,శాల్మలీ, శాక, పుష్కర అనే ద్వీపాలున్నవి. వీనినావరించి క్రమంగా లవణ ఇక్షు సురా సర్పి దధి క్షీర స్వాదూదక సముద్రములున్నవి. జంబూద్వీపము భూమికి మధ్యలో లక్షయోజన విస్తీర్ణమున నున్నది. దీనికి రెట్టింపు విస్తీర్ణమున నున్న క్షారవారిధి దీనినావరించుకొనియున్నది. దీనిని సమర్థిస్తూ మార్కండేయ పురాణం ఇలా వివరిస్తోంది -

స్వాయంభువ మనువు కుమారుడు ప్రియవ్రతుడు. ప్రియవ్రతునకు ఆగ్నీధ్రుడు మొదలుగాగల ఏడుగురు కుమారులు. వీరు క్రమంగా జంబూద్వీపం మొదలైన సప్తద్వీపాలాను పాలించారు. వారి అనంతరం ఆద్వీపాలు 46 భాగాలుగా విడిపోయాయి-

| | | | | |
|---|---|---|---|---|
| 1. అగ్నీధ్రుడు | - | జంబూద్వీపం | - | 9 భాగాలు |
| 2. మేధాతిథి | - | ప్లక్షద్వీపం | - | 7 భాగాలు |
| 3. వపుష్మంతుడు | - | శాల్మలీద్వీపం | - | 7 భాగాలు |
| 4.జ్యోతిష్మంతుడు | - | కుశద్వీపం | - | 7 భాగాలు |
| 5. ద్యుతిమంతుడు | - | క్రౌంచద్వీపం | - | 7 భాగాలు |
| 6. సంభవుడు | - | శాకద్వీపం | - | 7 భాగాలు |
| 7. సవనుడు | - | పుష్కరద్వీపం | - | 2 భాగాలు |
| | | మొత్తం | - | 46 భాగాలు |

ఇందులో జంబూద్వీప విభాగాలు ఈవిధంగా ఉన్నాయి - జంబూద్వీ ప పరిపాలకుడైన అగ్నీధ్రుడు దానిని 9 భాగాలు చేసి తన కుమారులైన కింపురుష, వారివర్ష, ఇలావృత,రమ్య, హిరణ్య, కురు, భద్రాశ్వ, కేతుమాలులనువారికి హిమాలయాలకు ఉత్తరానగల 8 భాగాలను, హిమనగ దక్షిణభాగాన్ని పెద్దకొడుకైన నాభికీ ఇచ్చాడు. నాభి మనుమడగు భరతునిపేర ఆ హిమనగ దక్షిణభాగం భారత వర్షమని ఖ్యాతిగాంచింది. మిగిలిన 8 వర్షములు ఆయా పాలకులపేర్లతో ప్రఖ్యాతమయ్యాయి.

మొత్తంమీద వర్షములు తొమ్మిది - అవి కింపురుష, హరివర్ష, ఇలావృత,రమ్య, హిరణ్య, కురు, భద్రాశ్వ, కేతుమాల, భారత వర్షములు. అటువంటి భారతవర్షంలో - ఇంద్ర ద్వీపం, కేతుమంతం, తామ్రపర్ణం గభస్తిమంతం, నాగద్వీపం, సౌమ్యం, గాంధర్వం, వారుణం, భారతం అనే విభాగాలు ఉన్నాయని మార్కండేయ పురాణము చెబుతోంది. వీనినే నవఖండములని కొన్ని పాఠాలు పేర్కొంటున్నాయి. భారతం అటు వర్షాలలోనూ ఇటు ఖండాలలోనూ ఉండడంతో భారతవర్షే భరతఖండే అనే పాఠాలు కన్పిస్తున్నాయి. (దీనిని కూర్మపురాణం కూడా అంగీకరిస్తోంది. (చూడుడు కూర్మపురాణం 45.2 నుండి45.21 వరకూ, 47.23 నుండి చివరివరకూ )

## భారత వర్షము

1.భరతుడను రాజు పరిపాలించిన దేశము. (సూర్యరాయాంధ్రము)

2. లోకోయం భారతం వర్షం - అయం జంబూ ద్వీప నవమాంశః హిమసేతు మధ్యస్థో లోకః భారత వర్షమిత్యుచ్యతే- అమరము

వర్షము = ప్రపంచ భాగము (కురు, హిరణ్మయ, రమ్యక, ఇలావృత, హరి, కేతుమాల, భద్రాశ్వ, కిన్నెర, భారతములన్నునవి తొమ్మిది వర్షములు. (సూర్యరాయంధ్రము)

వర్షపర్వతములు - ప్రపంచమున వేరువేరు భూభాగములను ఒకదానితో ఒకటి విభజించు సరిహద్దు కొండలు. ఇవి ఏడు. హిమవంతము, హేమకూటము, నిషధము, మేరువు, చైత్రము, కర్ణి, శృంగి అనునవి. (సూర్యరాయాంధ్రము)

హిమవంతము - కింపురుష వర్షమునకు దక్షిణమందు మేరయై యుండునది, నిషధము - హరివర్షమున కుత్తరమున మేర, హేమకూటము - కింపురుషవర్షమున కుత్తరమున మేర, వింధ్య - భారత వర్షమునందుండు కులపర్వతము, (అమరము)

కులపర్వతములు - మహేంద్రో మలయస్సహ్యః శుక్తిమాన్ గంధమాదనః వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః॥

(ఇంద్ర (ద్వీప), కుశ (కశేరు), తామ్ర, గభస్తి, నాగ, సౌమ్య, గంధర్వ, చారణ, భారతములు వర్షములని కొన్నిటియందు, ఖండములని కొన్నిటియందు కన్పించుచున్నది. భారత, కింపురుష, ఇలావృత, కురుభద్ర, అశ్మక, రమణక, మంద, హరణ, కేతుమూల ములను తొమ్మిది నవఖండములుగా చెప్పబడుచున్నవి. (చూడుడు

వావిళ్ళ యా.పూ.ప్ర. చంద్రిక. పుట - 197; రాచకొండవారి వివాహ ప్రయోగము పుట. 111; ఋగ్వేద వివాహ ప్రయోగము పుట. 79; ఉపనయన వివాహవిధి చర్లగణపతిశాస్త్రి. పుట. 153; పురాణోక్త కర్మప్రకాశిక పుట. 101.)

8. ఆగమము-

1. రేజేటివారి పాఠం --లవణేక్షు సురాసర్పి దధి క్షీర స్వాదోద కార్ణవ పరివృత జంబూ ప్లక్ష కుశ క్రౌంచ శాల్మలీ శాక పుష్కర ద్వీప ద్వీపితే -

ఇంద్రద్వీప కుశ తామ్ర గభస్తి నాగ సౌమ్య గంధర్వ చారణ భారతే - తే నవమఖండే తత్కులాచలేభ్యః, చలిత కాళిందీ నర్మదా గోదావరీ కృష్ణవేణీ తుంగభద్రా ప్రభృతి అనేక పుణ్యనదీభిః - (ప్రచలిత కాళిందీ - భద్రాచలంవారి పాఠం)

సహస్ర ప్రసరే, కురు పాంచాల మధ్యదేశ అంగ వంగ కళింగ మగధ మద్ర మాళవ నేపాళ చోళ గౌళ మళయాళ సింహళ ద్రవిడ ద్రావిడ కర్ణాట లాట కిరాట మరాట పాండ్య పుళింద దశార్ణవ భోజ బాంహ్లీక బర్బర కేకయ కోసల కుంతల సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్రాది షట్పంచాశద్దేశ విరాజితే - (సహస్ర ప్రసరే - సహస్రమనగా ప్రపంచము, ప్రసరే = వ్యాపించిన ... " సహస్రస్య ప్రమాసి, సహస్రస్య ప్రతిమాసి " అని యజు.అరణ్యా. - 15.65)

పంచాశత్కోటి టియోజన విస్తీర్ణ భూమండలే -సుమేరో ర్నిషధ హేమకూట హిమవ ద్వింధ్యాచలానాం హరివర్ష కింపురుష యోర్దక్షిణే- నవసహస్ర యోజన విస్తీర్ణ మలయాచలా దుత్తరే -

సువర్ణ ప్రస్త ప్రాంశు శుక్యా వర్తన రమణక మోహారక పాంచజన్య సింహాలం కేతి నవఖండత్మాకే కర్మభూమౌ - సామ్యోవతీ (?) పుణ్యక్షేత్రే-

శ్రీరంగ వృషగిరి సత్యవ్రత యదుగిరి పాండురంగ శ్రీమ దహోబిల ప్రభృతి భగవ ద్దివ్య దేశానాం-

తామ్రపర్ణీ కావేరీ కృతమాలా బాహుదా సువర్ణముఖీ కృష్ణాది నదీ నాం చోత్తర దేశీ - శ్రీమద్గో దావర యోత్తర కాశ్యాది(?) నిఖిల పుణ్యక్షేత్రాధిక, హిమవాన్మేరోర్దక్షిణ దిగ్భాగే- శ్రీశైలస్య సకలజగ సృష్టినాధస్య పరసత్యోతసంఖ్యోత(?) వర్షశతజీవినో బ్రహణః (ఇది పరార్ధద్వయ సంఖ్యాత వర్షశతజీవినో బ్రహ్మణః-కావచ్చు ప్రథమ ద్వితీయ పరార్ధ ములనెడి రెండింటిచే లెక్కింపబడిన) ప్రథమపరార్ధా నంతరం ద్వితీయపరార్ధే ........

వాలుకాభిః ............

**2. శ్రీకూర్మం, బొబ్బిలి పాఠాలు–** తన్మధ్యే సుమేరు నిషధ హేమకూట హిమాచల వింధ్యాచలానాం హరివర్ష కింపురుషయో ర్దక్షిణే, త్రికూట మలయాచల యోరుత్తరే, స్వర్ణప్రస్థ సుప్తికా రమణ పాంచజన్య సింహాలంకార భరతేతి నవఖండాత్మకే భరతవర్షే భరతఖండే బదరికారణ్యే చంపకారణ్యే నైమిశారణ్యే పుణ్యారణ్యయోః మహాభాస్కరక్షేత్రే పరబ్రహ్మణా నియుక్తస్య పరార్ధ ద్వయజీవినో బ్రహ్మణః .........గంగావాలుకాభిః ......

**3.భద్రాచలపాఠం..** ...... శ్రీమద్గోదావర్యా ఉత్తరతటే, కాశ్యాది నిఖిల పుణ్య క్షేత్రాధిక హిమవాన్మేరో ర్దక్షిణదిగ్భాగే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, శ్రీరంగస్యోత్తరదేశే, గంగాగోదావర్యో ర్మధ్యదేశే, దండకారణ్యే, రామక్షేత్రే, అస్మిన్ తిరుమండపే భగవద్భాగవతాచార్య సన్నిధౌ –

**స్మార్తం–** లవణేక్షు సురా సర్పి దధి క్షీరోద కార్ణవైః పరివృతే జంబూప్లక్ష కుశ క్రౌంచ శాక శాల్మలీ పుష్కర సప్త ద్వీపైరావృతే ఇంద్ర ద్వీప కశేరు తామ్ర గభస్తి నాగ సౌమ్య గంధర్వ చారణ భారతాఖ్య నవఖండమండితే మహాసరోరుహాకారే పంచాశత్కోటి విస్తీర్ణ భూమండలే లక్షయోజన విస్తీర్ణ జంబూ ద్వీపే సేతుబంధ మలయాచల యోరుత్తరే ......

ఇక్కడనుండి రాచకొండ వివాహ సంస్కారము నందధిక పాఠము–

(ఇంద్రాగ్ని యమ నిర్రుతి వరుణ వాయు కుబేర ఈశానాష్టదిక్పాలక పాలితే, వలయాకార లవణేక్షు సురాసర్పి దధీ క్షీర జలార్ణవై ర్విరాజితే, అమరావతీ యశోవం త్యంభోవతీ రైవతీ సిద్ధవతీ సాధ్యవతీ గంధర్వవతీ అలకవతీ ప్రభృతి పుణ్య పత్తనైః ప్రకాశితే, మహేంద్ర మలయ సహ్య శుక్తిమాన్ గంధమాధన వింధ్య పారియాత్ర సప్తకులాచలై, హిమవత్ ఋక్షవ న్మేరు మతంగ హిరణ్యశృంగ మాల్యవ త్కిష్కింధా ఋష్యమూకనామక పంచదశ పర్వతైశ్చాధిష్టితే – అంగ వంగ కళింగ కాశ్మీర కాంభోజ సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర మగధ మాళవ నేపాళ కేరళ చోళ పాంచాల గౌళ మళయాల సింహళ ద్రవిడ ద్రావిడ కర్ణాట నాట పానాట పాండ్య పుళింద ఆంధ్ర మరాట దశార్ణ భోజ కుర్కురు కురు గాంధార విదర్భ విదేహ బాహ్లీక బర్బర కేకయ కోసల కుంతల కిరాట శూరసేన సేవస టెంకణ కొంకణ మత్స్య మద్ర పార్శ్వ ఘూర్జర యవన జాలాంధ్ర సాల చేది సింధు ప్రభృతి వివిధ దేశ భాషా భూపతిభిర్విచిత్రితే (షట్పంచాశ దేశ విశేష భూమిపాల విలిఖితే), గంగా గౌతమీ గోదావరీ తుంగభద్రా కావేరీ చంద్రభాగా చంపా నర్మదా యమునా సరస్వతీ

కృష్ణవేణీ బాహుదా కుముద్వతీ చర్మణ్వతీ రేణుకా మదహారిణీ కృతమాలా తామ్రపర్ణీ విశోకా కేశకీ గండకీ విచిత్రకా వశిష్ఠా ప్రవరా కాశ్యపీ సరయూ సర్వపాపహా కృశావతీ ఫల్గునీ కరతోయా పుణ్యతా ప్రణీతా వంజులాది పుణ్య మహానదీభిః పవిత్రితే. అయోధ్యా మధురా మాయా కాశీ కాంచ్యవంతికా పురీ ద్వారవతీ సౌమ్యవంతీ కురుక్షేత్ర రామేశ్వరాది మహాముక్తిస్థలయుతే. సరగ గుల్మల స్వామి పుష్కర త్రయ సహిత శేషాచల శ్రీశైలాది పుణ్యాచలై రధిష్ఠితే. భారత కింపురుష ఇలావృత కురు భద్రాశ్మక రమణక మంద హరణ కేతుమాలాఖ్య నవఖండ మండితే. దండక చంపక వింధ్య మిశ నైమిశ కదరిక బదరిక నహుష గుహ దేవధాతుకా ద్యేకాదశా రణ్యాయుతే, లక్షయోజన విస్తీర్ణ జంబూ ద్వీపే . సుమేరు నిషధ హేమకూట హిమాచలానాం హరివర్ష కింపురుషయోశ్చ దక్షిణే, సేతుబంధ మలయాచలయో రుత్తరే-

(ఇక్కడనుండి వారిళ్ళ రాచకొండ అన్నిపారాలూ సమానమే)

సహస్ర యోజన విస్తృతే భరత వర్షే భరతఖండే ప్రజాపతిక్షేత్రే దండకారణ్యే కర్మభూమౌ సమభూమధ్యరేఖాయాం పూర్వ దిగ్భాగే మేరోర్దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే కృష్ణా కావేర్యోర్మధ్యదేశే సమస్త దేవతా బ్రహ్మణసన్నిధౌ అస్మిన్ కళ్యాణమండపే పరబ్రహ్మణా నియుక్తస్య పరార్ధద్వయజీవినః కారణ బ్రహ్మణః ప్రథమ పరార్ధే ....... తిథౌ .... వారే - మమ జన్మ ప్రభృ త్యేతక్షణ పర్యంతం మనోవాక్కాయ కర్మభిః జానతోజ్ఞానతాః కృతానాం మహాపాతకోపపాతకాదీనాం నవవిధానం పాపానాం సద్యః అపనోదన ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం గంగా వాలుకాభిః.......

ఈ చర్చా సారాంశరూపమగు మహాసంకల్పపాఠము పాణిగ్రహణమ్మున ఇవ్వబడినది.

## కన్యాదానసంకల్పము (శ్రీకూర్మపాఠం)

శ్రీమత్సురాసుర వరగరుడ గంధర్వ యక్షరాక్షసభూత ప్రేత పిశాచ వినాయక సిద్ధ సాధ్య భూత ప్రేత పిశాచ వినాయక సిద్ధ సాధ్య కిన్నర కింపురుష యోగినీ ఘృణి బ్రహ్మరాక్షస భేతాళ పూతనా రేవతీ స్కంధ పురోగగ్రహ నక్షత్ర తారాగణ సమస్త మృగ పశు పక్షి సరీసృప స్థావర జంగమాది. బ్రహ్మాండ గరుడాండ రుద్రాండ వైష్ణవాండ అతల వితల సుతల తలాతల రసాతల మహాతల సప్తపాతా ళానంత వాసుకి తక్షక కర్కోటక పద్మ మహాపద్మ శంఖపా లాంగుళికా మహానాగ సమూహ మేరు హిమవ త్క్రౌంచ గంధమాదన వింధ్య శ్రీకైలాసాది మహాపర్వత, గంగా

యమునా సరస్వతీ నర్మదా కృష్ణవేణీ గౌతమీ శ్రోణ నద్యాది సకల నదీ సమూహైః , వ్యాస వాల్మీక గౌతమ వసిష్ఠ కాస్యప భరద్వాజ విశ్వామిత్ర జామదగ్ని సనక సనత్కుమార యోగీం ద్రాదిత్య చం ద్రాంగారక బుధ బృహస్పతి శుక్ర శనైశ్చర రాహు కేత్వాది సర్వేగ్రహా విశ్వేదేవాది సకలదేవ ధర్మార్థ కామమోక్ష చతుర్విధ పురుషార్థ సిధ్యర్థం సప్త సము ద్రాష్టలోకపాల దశదిక్సమూహైః ఏకాదశరుద్ర ద్వాదశాదిత్యా దృష్టవసు చతుర్దశభేద మన్వింద్ర సప్తఋషిగణ చతుర్దశ భువన పంచాశదక్షర షోడశస్వర మంత్రౌపమంత్ర ఓంకార వషట్కార స్వాహాకార స్వధాకార సుఖదుఃఖ పుణ్యపాప ధర్మాధర్మ రాజనతామనసాత్విక వ్యక్తావ్యక్త మహదహంకార పృధివ్యాపస్తేజోవాయురాకాశ పంచమహాభూత దశేంద్రియ వాక్పాణి పాద పాయూపస్థ త్వ క్చక్షు శ్రోత్ర జిహ్వాఘ్రాణ వచనాదాన గమన విసర్గానంద శబ్ద స్పర్శ రూపరస గంధ మనో బుధ్యహంకార చిత్త సంకల్ప వికల్ప నిశ్చయాకార సంధాన త్వ జ్మాంస రుధిర మేదో మజ్జా స్నాయ్వాస్తి సప్తధాతువికార ప్రాణాపాన వ్యానోదాన సమాన నాగకూర్మ కకుర దేవదత్త ధనంజయ ఇడ పింగల గాంధార సుషుమ్న నాడ్యాది ద్విసప్తతి సహస్ర నాడికా సమూహైః షడంగ ఋగ్యజుస్సామాథర్వణ పదపదార్థ వాక్య వాక్యార్థ గద్యపద్యార్థ వైశేషిక నైయాయిక పూర్వోత్తర మీమాంసాచరణ భరత సంగీత సకలవాద్య ప్రబంధ సాహిత్య జ్యోతిష మన్వాది బహుపురాణ ధర్మశాస్త్రేతిహాస స్త్రీశాస్త్ర మంత్రశాస్త్ర మంత్రసహితజపతప సమస్త భోగ్యాభోగ్య వస్తుసమూహ స్వరూపస్య లక్ష్మీసమేత శ్రీమాన్నారాయణస్యతిరుక్కళ్యాణమహోత్సవం కర్తుమ్ అశ్వత్థాశోక చూత క్రముక నారికేళ పూర్ణకుంభ పాలికా దీప ముక్తా తోరణాది తులసీ మాలికా కదలీస్తంభ సమేత మంగళ వస్తుభి రలంకృ తేస్మిన్ పుణ్యదేశే బ్రహ్మేంద్రాది సకల దేవ రుద్రవసు పులస్త్యాది నవబ్రహ్మ తత్పత్నిభి ర్దేవయోని విశేషైః లోపాముద్రాదిపుణ్యాంగనా శిరోమణిభిస్సహ సర్వే గ్రహా స్సనక్షత్రా శ్శుభ ఏకాదశస్థాన ఫలదా సుప్రసన్నా సుముహూర్తా భవంతు అస్య శ్రీమదాదినారాయణస్య శ్రీమన్నారాయణ కైంకర్యార్థం యథా శక్తి సాలంకృతకన్యాదానం కరిష్యే -



అనుబంధము - 11

# మంగళాష్టకములు

## 1. భరద్వాజ సంహితోక్త (బొబ్బిలి) పాఠంలోని మంగళాష్టకములు

శ్రీకాన్తా కుచకుంభ కుంకుమ పరీరంభో గుణానాం నిధిః ।
పూర్వాచార్య గుణావతార నికరః శ్రీపాంచరాత్రార్చితః॥
విష్వక్సేన విభీషణః ప్రభృతిభిః భక్తైః సదాసేవితః॥
పాయాన్నో భగవాన్ పురాణ పురుషః కుర్యాత్సదా మంగళమ్॥ 1.

శ్రీరామానుజ భట్టరార్య శఠగోపానంత సంకర్షణైః
శ్రీ సౌదర్శన పాంచజన్య భరతా చార్యై ర్మహా వైష్ణవైః
ఏతై శ్శాస్త్రపురాణ వైష్ణవ కథాలాపై స్సదా సేవితః
పాయాన్నో భగవాన్ పురాణ పురుషః కుర్యాత్సదా మంగళమ్॥ 2.

ప్రాసాద ధ్వజ రత్న మండప మహాసౌవర్ణ పీఠోన్నతః
ప్రాకారాంతర హేమరత్న రుచిభిః జాజ్వల్యమానో హరిః
నిత్యం నిత్య మహోత్సవైః బహువిధైః మాసాది పక్షోత్సవైః
పాయాన్నో భగవాన్ పురాణపురుషః కుర్యాత్సదా మంగళమ్॥ 3.

విశ్వామిత్రపరాశరౌ శుకమునిః ప్రహ్లాద రుక్మాంగదౌ
విష్వక్సేనవిభీషణౌ చ హనుమాన్ శ్రీవైనతేయాదయః
ఏతైర్భాగవతై ర్ముదా ప్రతిదినం సంసేవ్యమానోహరిః
పాయాన్నో భగవాన్ పురాణ పురుషః కుర్యాత్సదా మంగళమ్॥ 4.

శ్రీరంగే గరుడా చలే నిశిగిరౌ సింహాచలే మందిరే
వైకుంఠే కనకా చలే గిరిపతౌ నారాయణాఖ్యాచలే
లోకాలోక మహాచలే చ నిషధే పుణ్యాచలే స్వాశ్రయః
పాయాన్నో భగవాన్ పురాణ పురుషః కుర్యాత్సదా మంగళమ్॥ 5.

మీనః కచ్ఛప సూకరౌ నరమృగః కుబ్జో మహాభార్గవో
రామో యాదవనాయకోఽపి రసికః కృష్ణశ్చ కల్క్యాహ్వయః
లోకానాంపరి పాలనాయ సమభూ ద్దేవో జగద్రక్షకః
పాయాన్నో భగవాన్ పురాణ పురుషః కుర్యాత్సదా మంగళమ్॥ 6.

శ్రీలక్ష్మీ కమలాలయా వసుమతీ రామా జగద్రక్షిణీ
కల్యాణీ సకలేశ్వరీ హరిసతీ భాగ్యానుసంధాయినీ
శోభాంగీ విమలేక్షణా విమలినీ నారాయణీ సంయుతః
పాయాన్నో భగవాన్ పురాణ పురుషః కుర్యాత్సదా మంగళమ్॥ 7.

నానావేదపురాణ సార విభవః శ్రీ పాంచరాత్రార్చితః
శాస్త్రాణామధికై స్సమస్త ఫలదైః శ్రీ వైష్ణవై శ్శాశ్వతైః
భక్తై ర్భాగవతై రమర్త్య నికరై రాసేవ్యమానో హరిః
పాయాన్నో భగవాన్ పురాణ పురుషః కుర్యాత్సదా మంగళమ్॥ 8.

## 2. <u>వేంకటేశ్వర మంగళాష్టకములు</u>

1. శ్రీబ్రహ్మాచ పురన్ద రానిల యమ క్రవ్యాద యోమ్బోధిపాః
వాయు ర్గుహ్యకరాజ శంకర ముఖా దేవశ్చ దిక్పాలకాః
యక్షాః కిన్నర సిద్ధచారణగణా గంధర్వ విద్యాధరా
మంగా వేంకటనాథయో శ్శుభదినే కుర్వన్తు వాం మంగళమ్॥

2. వాగ్దేవీ హిమశైలరాజ తనయా లక్ష్మీశచీ రోహిణీ
స్వాహా సత్యవతీ పులోమ తనయాఽరుంధత్యహల్యా సదా
భూమి ర్భూమిసుతా ఽనలవధూః తారాఽనసూయాపిచ
మంగా వేంకటనాథయో శ్శుభదినే కుర్వన్తు వాం మంగళమ్॥

3. భారద్వాజ మరీచి కణ్వ పులహ వ్యాసాశ్చ గర్గ్యంగిరో
విశ్వామిత్ర పులస్త్య గౌతమ వసిష్ఠాత్రేయ భృగ్వాదయః
మార్కండేయ సుమంత శౌనక శుకా శ్శ్రీ వామదేవాదయో
మంగా వేంకటనాథయో శ్శుభదినే కుర్వన్తు వాం మంగళమ్॥

4. కైలాసో మలయాచలో హిమగిరి ర్హేమాద్రి రస్తాచలః
నీలో విన్ధ్య సువేల వేంకట మహావిద్యాద్రి సింహచలాః
క్రౌంచో మందర చక్రవాళ నిషధో గోవర్ధనో శుక్తిమాన్
మంగా వేంకటనాథయో శ్శుభదినే కుర్వన్తు వాం మంగళమ్॥

5. కృష్ణాసింధు సరస్వతీ మలహరీ తుంగ ప్రణీతాచలా
చిత్రా వేత్రవతీ కళింద తనయా జహ్నోస్సుతా గౌతమీ
కావేరి వకుళావతీ కమలినీ భద్రాది నద్య శ్శుభాః
మంగా వేంకటనాథయో శ్శుభదినే కుర్వన్తు వాం మంగళమ్॥

6. మందారో హరిచన్దన స్సురతరుః పున్నాగ కల్పద్రుమో
అశ్వత్థః కదళీ కదంబ పనసో ఖర్జూర చూతాదయః
నింబో దుంబర నాగకేసర వటాః జంబూ ప్రియంగు ద్రుమాః
మంగా వేంకటనాథయో శ్శుభదినే కుర్వన్తు వాం మంగళమ్॥

7. భేరీ దుందుభి వేణు కాహళ మృదం గాతోద్య వీణారవాః
ఢక్కా శంఖ కటాహకాదిక మహా వాద్యాని, విప్రాశిషః
దూర్వా జీరక గంధపుష్ప ఫలదా పుణ్యాంగనా భూషితా
మంగా వేంకటనాథయో శ్శుభదినే కుర్వన్తు వాం మంగళమ్॥

8. విప్రా వేదవిద స్సమస్త భగవ ద్భక్తా మహాగాయకాః
రంభా ద్యప్సరసః పురంధ్రి జనతా కల్యాణ నానావిధాః
విద్వాంసః సకలాగమ స్మృతి పురాణజ్ఞా స్తథామాగధాః
మంగా వేంకటనాథయో శ్శుభదినే కుర్వన్తు వాం మంగళమ్॥

## 3. గోపాలమంగళాష్టకములు

1. కాళిందీ పులినాంగణే కిసలయ స్తోమే వసిత్వా ఘనే
కుర్వ న్వేణు నినాద మద్భుతకరం గోపాలబాలావృతం
గుఞ్జానిర్మిత కర్ణభూషణ ధరో గోపాలబాలో హరిః
దంపత్యో రనయో ర్వివాహ సమయే కుర్యా త్సదా మంగళమ్॥

2. గో గోవత్స తదీయ పాల నివహాకారం భజిత్వా క్షణా
దేకాబ్దం విచరన్ సరోరుహ భువా సంస్తూయమానః ప్రభుః
హస్తాబ్జే దధియోజితాన్న కబళో గోపాలబాలో హరిః
దంపత్యో రనయో ర్వివాహ సమయే కుర్యా త్సదా మంగళమ్॥

3. గోపాంభోజముఖీ గృహాంచిత పయో దధ్యాది చౌర్యాదరో
మాత్రో లూఖల బంధి తోర్జునయుగం భిత్వా ధనేట్పుత్రయోః
దద్యా ద్దర్శన మాత్మన స్సభగవాన్ గోపాలబాలో హరిః
దంపత్యో రనయో ర్వివాహ సమయే కుర్యా త్సదా మంగళమ్॥

4. శ్రీ గోపాల సతీ యుగాంతర గత స్సర్వత్ర దేవాంగనా
జాలై స్సంభృత మోద మీక్షిత తమః కోట్యంగజాకారవాన్
వంశీనాదసుధా ప్లుతావని నభః గోపాలబాలో హరిః
దంపత్యో రనయో ర్వివాహ సమయే కుర్యా త్సదా మంగళమ్॥

5. బాలాయాహి మహార్హవస్తు నిచయం హిత్వా కిమర్థం భవాన్
మృద్భక్షోసి కరోమి తాడన మితి ప్రోక్త స్సదా నేతి యః
వక్త్రే మాతు రజాండ మీక్షితు మధాత్ గోపాలబాలో హరిః
దంపత్యో రనయో ర్వివాహ సమయే కుర్యా త్సదా మంగళమ్॥

6. నీలాంభోజ తను ర్మహా మహిమవాన్ కారుణ్య రత్నాకరః
పద్మాక్షః పరమేశ్వరః పరతరః పద్మారి మిత్రేక్షణః
పద్మాభూవని తానుకూల హృదయో గోపాలబాలో హరిః
దంపత్యో రనయో ర్వివాహ సమయే కుర్యా త్సదా మంగళమ్॥

7. శ్రీరంగే గరుడాచలే ఫణిగిరౌ శ్రీయాదవక్ష్మాధరే
శ్రీ శ్వేతాద్రి సుధౌచ కేసరిగిరౌ నీలాచలే సంస్థితః
భక్తానా మభయప్రద శ్శుభకరో గోపాలబాలో హరిః
దంపత్యో రనయో ర్వివాహ సమయే కుర్యా త్సదా మంగళమ్॥

8. దుష్టానాం హరణాయ సాధుజన రక్షాయైచ గాండీవినః
సారథ్యం కృతవాన్ స్వభక్తజన వాత్సల్యం పరిజ్ఞాపితుమ్
యో గీతార్థ మదా న్నరస్య సజయీ గోపాలబాలో హరిః
దంపత్యో రనయో ర్వివాహ సమయే కుర్యా త్సదా మంగళమ్॥

## 4. శ్రీకూర్మ మంగళాష్టకములు

1. క్షీరామ్భోనిధి మంథనోద్ధృత సుధా పానోన్ము ఖోత్కంఠతా
నన్త స్తోత్రపరా నతాఖిల సురాభీష్ట ప్రదానోద్గతః
శ్రీ శ్వేతాద్రినివాస రాస జనితా సంపూజిత శ్రీపదః
శ్రీ కూర్మేశ్వర రూప భాసుర హరీ కుర్యాత్సదా మంగళమ్॥

2. శ్రీ రామానుజ యోగివర్య విహిత శ్రీసత్వ సంధాంచితః
తన్నిర్దేశ గతార్చకై రహరహ శ్రీపాఞ్చరాతార్చితః
బ్రహ్మేశామర మౌళిరత్న రుచిభి ర్నీరాజిత శ్రీపదః
శ్రీ కూర్మేశ్వర రూప భాసుర హరీ కుర్యాత్సదా మంగళమ్॥

3. కస్తూరీఘనసార కుంకుమ మిళ శ్రీచందనాఞ్చి త్తను
ర్మన్దారామల కుంద చంపక తులస్యా బద్ధ మాలాఞ్చితః
గుఞ్జాసన్నిభలోచ నోన్నతశిర శ్రీశంఖ చక్రాంకితః
శ్రీ కూర్మేశ్వర రూప భాసుర హరీ కుర్యాత్సదా మంగళమ్॥

4. మత్వా సర్వజనాన్ స్వపాద భజనాత్ స్వాభీష్ట సిద్ధింసదా
కర్తుం భూమితలే పవిత్రత తమే శ్రీకూర్మ తీర్థే ముదా
కృత్వా నిత్య నివాస మిష్ఠ ఫలదాం సేవాం సదా కుర్వతామ్
శ్రీ కూర్మేశ్వర రూప భాసుర హరీ కుర్యాత్సదా మంగళమ్॥

5. నానా రత్న సువర్ణ నిర్మిత మహాప్రాసాద మధ్యోల్లస
త్స్వర్ణాలఙ్కృత రత్నమన్దిర తలే సద్రత్న సింహాసనే
శ్రీశైలేశ ఫణీశ తార్క్ష్య విమలాద్యా సేవ్య మానః స్థితః
శ్రీ కూర్మేశ్వర రూప భాసుర హరీ కుర్యాత్సదా మంగళమ్॥

6. భేరీ శంఖ మృదంగ మంగళ రవై రాపూరితే వ్యోమని
జ్యాభాగే సురముక్త కల్పక సుమై ర్వ్యాప్తే జనే హృష్యతి
గాత్రాలంకృత భూషయా కమలయా కల్యాణ పీఠే స్థితః
శ్రీ కూర్మేశ్వర రూప భాసుర హరీ కుర్యాత్సదా మంగళమ్॥

7. నానా రత్న కిరీట కుండల లస న్మంజీర హారాంగద
గ్రైవేయామల తార హార కటకాద్యాముక్త వేషోజ్వలః
కస్తూరీ కృతరేఖయా కమలయా కల్యాణ పీఠే స్థితః
శ్రీ కూర్మేశ్వర రూప భాసుర హరీ కుర్యాత్సదా మంగళమ్॥

8. శ్రీకాన్తా శుభ గాత్ర కాన్తి లహరీ సంప్లావి తాంగోజ్వల
స్తన్నేత్రోత్పల పూజిత స్త దధరాస్వాదేన సంతర్పితః
తత్స్మేరాఙ్కురకల్పపుష్ప నివహై ర్నిష్పన్న పుష్పాంజలిః
శ్రీ కూర్మేశ్వర రూప భాసుర హరీ కుర్యాత్సదా మంగళమ్॥

9. శ్రీరఙ్గే బదరీవనే యదుగిరౌ శ్రీ చంపకాఖ్యే వనే
నీలాద్రౌ ఘటికాచలే కరిగిరౌ సింహాచలే నైమిశే
భద్రాద్రౌ వృషశైల మంగలగిరి శ్వేతాచలేషు స్థితః
శ్రీ కూర్మేశ్వర రూప భాసుర హరీ కుర్యాత్సదా మంగళమ్॥

## 5. దశావతారమంగళాష్టకములు

1. మత్స్యోచ్చస్వరబద్ధజాల నిగమాంతాకల్పహృ ద్దైత్యజిత్
స్వేచ్ఛాచార జలాన్తరస్థిత మహా సత్వా న్యథా పాలయన్
బీజానుద్ధరయన్ తమోమయవతి స్వశృంగ స్వేచ్ఛాపురా
భూతార్థం సకలార్థదో మధురిపుః కుర్యాత్సదా మంగళమ్॥

2. ధర్మా ధర్మ విచార సంభ్రమ పరై ర్దేవేశ దైత్యాధిపైః
నిర్మ థ్యోదధి మధ్యగం గిరివరం ధృత్వాబలే నోత్కటం
మూర్తిం కచ్ఛపికాం మహోన్నత బలాం కృత్వా సుధార్థం చరన్
శ్రీ కూర్మేశ్వర రాజశేఖర సుహృ త్కుర్యాత్ సదా మంగళమ్॥

3. సర్వాధార ధరా హృతిం ప్రతిమతి ప్రాప్తోద్యమం దానవమ్
జ్ఞాత్వా బాహుబలా ద్వరాహతనుభృ జ్జిత్వాఽ సురం భీషణమ్
దేవాన్ మౌనివరాన్ చరాచరగణాన్ సంతోషయన్ సర్వదా
భూసంస్థాన నిదాన శీలజ మతిః కుర్యాత్సదా మంగళమ్॥

4. సత్కో త్యర్భట కూట ఝూట శతకో ట్యత్యుగ్ర ధాటీనటత్
కోటీ హస్తరుహోత్తర త్ర్పకట హృ త్పశ్యల్లలా టోత్కటః
కీటీభూత నిశాట సార భటకో ట్యుచ్చాట వార్తార్తిభృ
ద్ఘాటీ మానుష సింహరూప ఘటనః కుర్యాత్సదా మంగళమ్॥

5. భూమిం దేవభువిం పదద్వయతలే నాక్రమ్య క్రవ్యాదనో
త్యుగ్రం నిర్గతికం నితాన్త గుణినం నిర్మత్సరం నిశ్చలమ్
కృత్వా స్వస్థ మధస్థలే ఘనతర ధ్యాన ప్రభావా న్వితమ్
దేవేశం కృతవాన్ త్రివిక్రమతనుః కుర్యాత్సదా మంగళమ్॥

6. చణ్డాంశు ద్యుతి మండలాగ్ర విలస త్పాండిత్య కోదండ భృ
ద్దోర్దండస్థ విలాస మండన గణైః దండ్యాన్ నృణాన్ ఖంగనైః
కృత్వా ఽ ఖండల సన్నుతో ద్విజవరం భూ మండలం యో దదౌ
సోద్దండ ద్విజరాజ రూప తను భృ త్కుర్యాత్ సదా మంగళమ్॥

7. శ్రీరామః శ్రితవత్సలః శ్రితజనశ్రేయఃప్రదః శ్రీకరః
శృంగారాంచిత నీలనీరదనిభః శ్రీజానకీసంగతః
శ్రీకంఠశ్రృత నామ సంభవసుధా సేవా మహోత్సాహభృత్
శ్రీ భాగ్యామిత సౌఖ్యదో రఘుపతిః కుర్యాత్సదా మంగళమ్॥

8. కాలాభీల విశాల మూల హలరు గ్వాతూల తూలీకృతా
ఛ్ఛాలా ద్వీజన హేల దానవ మహా రక్షోగ్ర యక్షేశ్వరాః
తాలాగ్రా చ్ఛలదభ్ర విభ్రమ కనత్కౌతు స్ఫుర త్సుద్రధో
రామో రాజకళావతంస తనుభృత్కుర్యాత్ సదా మంగళమ్॥

9. సూపాద్యామిత భక్ష్య భోజ్య పృధు నాగాపూప సమ్మంటపాన్
సత్కు ల్యామృతతుల్య శర్కర మిల చ్ఛాకాచ్ఛ పాకాన్ బహూన్
భూమిం నీలగిరీన్ద్ర సౌధ శిఖరే భేరీ మృదంగాదిభిః
స్వస్తా బుద్ధ శరీరభృ త్సురపతిః కుర్యాత్సదా మంగళమ్॥

10. గంగా తుంగ తురంగ సంగత తను శృంగార భవ్యాంచితః
మ్లేచ్ఛాన్ కుచ్ఛిత ధర్మ్యధర్మనిరతాం నిర్మధ్య, ధర్మాంచితాన్
విప్రాన్ వేదవిధాన దానవినయాచారా న్యథా పాలయన్
జాతో కల్క్యవతార దైత్య దమనః కుర్యాత్సదా మంగళమ్॥

## 6. రుక్మిణీ కల్యాణ మంగళాష్టకములు

1. సత్యజ్ఞాన సుఖ స్వరూప మమలం సర్వోత్తమం నిత్య దృ
క్రృత్య క్తృమచిన్త్య శక్తి విలసద్యోగే పరబ్రహ్మయత్
లోకానుగ్రహ విగ్రహస్య జగతాం నాధస్య తస్యామరాః
రుకిణ్యా స్సతతం వివాహ సమయే కుర్వన్తు వాం మంగళమ్॥

2. గంగాద్యా స్సరితా గ్రహాశ్చ శుభదా గన్ధర్వ విద్యాధరాః
దిక్పాలా ఋషయశ్చ దేవమునయో దేవ్యశ్చ గౌర్యాదయః
శ్రీవత్సాఙ్కిత వక్షస స్సుమనసా మగ్రేసరస్య ప్రభోః
రుక్మిణ్యా స్సతతం వివాహ సమయే కుర్వన్తు వాం మంగళమ్॥

3. యో గోపీ నయనోత్పలై రనుపమై రారాధితో గోకులే
గోభి ర్గోపసుతై రనేక మునిభి ర్యత్పద్మ కోశాన్తరే
మయామానుష విగ్రహస్య మరుతస్తే వాలఖిల్యాదయో
రుక్మిణ్యా స్సతతం వివాహ సమయే కుర్వన్తు వాం మంగళమ్॥

4. బ్రహ్మా విష్ణు రుమాపతి శ్శృతిచయో వాణీ రమోమాంచితా
ఆదిత్యా వసవో గణాధిపముఖా రుద్రాశ్చ భద్రప్రదా
తే సర్వే యదునాయకస్య మహత స్సర్వాత్మకస్య ప్రభో
రుక్మిణ్యా స్సతతం వివాహ సమయే కుర్వన్తు వాం మంగళమ్॥

5. వంశీనాద వినోద నన్దిత మహానందాదివంద్యో మహా
నందాద్యై రభిపూజితః పరమయా భక్త్యా ముహుర్లాలితః
యః పూర్వం కమలేక్షణస్య కమలానాథస్య తస్యామరాః
రుక్మిణ్యా స్సతతం వివాహ సమయే కుర్వన్తు వాం మంగళమ్॥

6. మీనాం కాధిక సుందర స్సురవధూ దృక్పాత కాంభోధరో
గోపీ మండల మండనాంచిత తనుర్యో సుదరః పూరుషః
తస్యా ఖండ సుఖాత్మకస్య విదుషా మేకాత్మకస్య ప్రభో
రుక్మిణ్యా స్సతతం వివాహ సమయే కుర్వన్తు వాం మంగళమ్॥

7. యే సత్యం ప్రవదన్తి సర్వభువనే యా ధర్మ శీలా స్స్త్రియః
పాతివ్రత్య పరాయణా స్సురభయో మన్దార ముఖ్య ద్రుమాః
తేసర్వే యదునాయకస్య మహత స్సర్వాత్మకస్య ప్రభోః
రుక్మిణ్యా స్సతతం వివాహ సమయే కుర్వన్తు వాం మంగళమ్॥

8. గర్గాద్యై ర్మునిభి స్సదాஉ మిత మహా శీర్వాద వర్మాంచితో
దేవైర్వ్యోమ్ని విమాన మధ్య కలితః ద్దత్త ప్రసూ నాంజలిః
సంతుష్టామర సమ్యగాచరిత భేరీనాద సంతుష్టవాన్
రుక్మిణ్యా స్సతతం వివాహ సమయే కుర్వన్తు వాం మంగళమ్॥

**7. శ్రీనారసింహ మంగళాష్టకములు**

1. ప్రహ్లాదం దురవాప శోకజలధే రుత్తార యన్నిగమామ్
బాహ్యాంతః పరిపూర్ణతాం ప్రకటయన్ స్తంభం విభిందన్ బలాత్
హేమాక్షాగ్రజ మాజఘాన నఖరైర్యోమంగళానాం నిధిః
శ్రీమాన్ శ్రీవిభు రీశ్వరో నరహరిః కుర్యా జ్జగన్మంగళమ్ ॥

2. సోమేశాబ్జ భవాష్టదిక్పతిముఖై ర్దేవై ర్వశిష్ఠాదిభిః
బ్రహ్మర్షి ప్రవరైశ్చ నారద ముఖై ర్దేవర్షిభి ర్భూషితే
ఆసీనో రమయా భువాసహ మహో వైవాహికే మంటపే
శ్రీమాన్ శ్రీవిభు రీశ్వరో నరహరిః కుర్యా జ్జగన్మంగళమ్ ॥

3. యత్పాదాబ్జ మరంద బిందు సదృశీ గంగా జగత్పావనీ
య న్నామస్మరణం దదాతి సకలా న్కామాన్ నృణామన్వహమ్
యత్సేవా భవసాగరైక తరణీ సోయం జగన్నాయకః
శ్రీమాన్ శ్రీవిభు రీశ్వరో నరహరిః కుర్యా జ్జగన్మంగళమ్ ॥

4. కల్యాణైక నికేతన స్సుజనితః కల్యాణ సంధాయకః
కల్యాణప్రద కీర్తనో గుణనిధిః కల్యాణ కల్యాణదః
కల్యాణాద్రి సమాన సారవిభవః కల్యాణ సారాత్మకః
శ్రీమాన్ శ్రీవిభు రీశ్వరో నరహరిః కుర్యా జ్జగన్మంగళమ్ ॥

5. అన్యోన్యాభినవాక్షతార్పణవిధౌ శృంగార భంగ్యావహామ్
లక్ష్మీ వీక్షణ వైఖరీమనుభవన్ తత్పాణిసంగోత్సవే
సానందం స్మరపారవశ్య పిశునం రోమాంచ ముద్వేలయన్
శ్రీమాన్ శ్రీవిభు రీశ్వరో నరహరిః కుర్యా జ్జగన్మంగళమ్ ॥

6. లక్ష్మీ దత్తవరాం పుళింద తనయాం లావణ్య సారాత్మికామ్
సంరక్తాం సుమమంజరీం కరుణయా జగ్రాహ లీలాస్పదః
సర్వజ్ఞః ప్రధిత శ్చిరంతన ముని స్సుబ్రహ్మ చారీతి యః
శ్రీమాన్ శ్రీవిభు రీశ్వరో నరహరిః కుర్యా జ్జగన్మంగళమ్ ॥

7. సత్యా సత్య వివేచనైక కుశల స్సత్యప్రియ స్సత్యవాక్
సత్యజ్ఞాన సుఖాత్మక స్సుఖకర స్సత్యావతారో హరిః
సత్యః కేవల జన్మయో నతజనా నత్యాపహ స్సర్వదా
శ్రీమాన్ శ్రీవిభురీశ్వరో నరహరిః కుర్యా జ్జగన్మంగళమ్ ॥

8. రాజీవాయత లోచనః ప్రవిలస ద్రాజీవమిత్రప్రభః
రాజీవాంఘ్రి రజో విధూత వృజినో బ్రహ్మర్షి రాజిస్సదా
రాజీవైక నికేతనో ముఖలస ద్రాజీవ పుష్పంధయః
శ్రీమాన్ శ్రీవిభురీశ్వరో నరహరిః కుర్యా జ్జగన్మంగళమ్ ॥

9. ఇత్యే త ద్వరమంగళాష్టకమిదం లక్ష్మీనృసింహస్య యః
కల్యాణోత్సవ వేదికాసు పఠతే వధ్వావరస్య శ్రియై
మాంగల్యం సుతసంపదం సువిమలాం కీర్తించ దత్వా విభుః
శ్రీమాన్ శ్రీవిభు రీశ్వరో నరహరిః కుర్యా జ్జగన్మంగళమ్ ॥



## అనుబంధం -12

# మధుపర్క ప్రకరణం

(ఆగమ ప్రయోగమున, మధువర్క విషయములైన యజుర్వేదీయ ఆవస్తంబ సూత్రోక్తవిషయములకంటె ఋగ్వేదీయ అశ్వలాయన సూత్రాన్తర్గతములు చాలగలవు. క్రింది కారికలను గమనించగలరు.)

1. మధుపర్క ప్రకరణం ... అశ్వలాయన గృహ్యా సూత్రాన్తర్గతం (ఋగ్వేద ప్రయోగరత్నే -పుట 161)

1. **ఋత్విజో వృత్వా మధుపర్కమాహరేత్॥**

టీక॥ ఋత్విక్కులను వరించి మధుపర్కమునివ్వవలెను.

2. **స్నాతకాయోపస్థితాయ ॥**

టీక॥ ఉపస్థితాయ = ఇంటికి వచ్చిన, స్నాతకాయ = స్నాతకుల కొరకు

3. **రాజ్ఞేచ ॥** టీక ॥ ఇంటికి వచ్చిన రాజు కొరకు,

4. **ఆచార్య, శ్వశుర, పితృవ్య మాతులానాంచ ॥**

టీక॥ ఆచార్యుడు, మామ, తండ్రి సోదరుడు, మేనమామలకు మధుపర్కమివ్వవలెను.

5. **దధ్ని మధ్వానీయ ॥**

టీక ॥ దధ్ని = పెరుగునందు, మధు = తేనెను, అనీయ = చేర్చవలెను.

6. **సర్పిర్వా మధ్వలాభే ॥**

టీక॥ తేనే దొరకనిచో నెయ్యిని కలుపవలెను.

7. **విష్టరః పాద్య మర్ఘ్య మాచమనీయం మధుపర్కోగౌ రిత్యేతేషాం త్రిస్త్రిం రేకైకం వేదయన్తే॥**

టీక॥ విష్టర = ఆసనము, కాళ్ళు కడుగుకొనుటకు జలము, అర్ఘ్య జలము, ఆచమన జలము, మధు పర్కము, ఆవు, ఏతేషాం = పైన చెప్పిన వానియందు, ఏకైకం = ఒక్కొక్కటిని, త్రిః త్రిః = మూడేసి మారులు, వేదయన్తే = నివేదించవలెను.

8. **అహం వర్ష్మ సజాతానాం వి........ తా మిన సూర్యః ॥**

టీక॥ అహం = నేను, సజాతానాం = నాజనులలో, వర్ష్మః = శ్రేష్ఠుడును, యః = ఎవడు, మాం=నన్ను, అభిదాసతిచ = హింసించువాడో, తం =వానిని, అధితిష్ఠామ = తొక్కుచున్నాను, ఇతి = అని (చెప్పి), ఉదగగ్రే విష్టరే = ఉత్తంమునకు అగ్రముండిన ఆసనమందు, ఉపవిశేత్ =

కూర్చుండవలెను, వా = లేక, ఆక్రమింపవలెను.

9. **పాదౌ ప్రక్షాలౌపయీత దక్షిణమగ్రే బ్రాహ్మణాయ । ప్రయచ్ఛేత్ ॥**

టీక॥ (యజమానుడు) పాదౌ ప్రక్షాలౌపయీత = కడుగ వలయును, బ్రాహ్మణాయ = బ్రాహ్మణుని కొరకు (బ్రాహ్మణుడైతే), అగ్రే = ముందు, దక్షిణం = కుడికాలిని ప్రయచ్ఛేత్ = (కడుగుటకు) ఇవ్వవలెను.

10. **సవ్యం శూద్రాయ ॥** టీక॥ (శూద్రుడైతే) శూద్రునికొరకు, సవ్యం = ఎడమకాలును

11. **ప్రక్షాలిత పాదః అర్ఘ్యమంజలినా పతిగృహ్య॥**

టీక॥ కడుగబడిన పాదములు కలవాడై, అర్ఘ్యం = గంధపుష్పములతో కూడిన నీటిని, అంజలినా = అంజలిచేతను, ప్రతిగృహ్య = ప్రతిగ్రహించవలెను.

12. **అథాచమనీయేన్వాచామతి । అమృతోపస్తరణమసీతి ।**

టీక॥ అథ = ఆపైన, ఆచమనీయేన = ఆచమన ఉదకముచేత, అమృతోపస్తరణమసి = అమృతోపస్తరణమసి అను మన్త్రమును చెప్పి, ఆచమనము చేయించవలయును.

13. **మధుపర్క మాహ్రియమాణ మీక్షేత మిత్రస్యత్వా చక్షుషా ప్రతీక్ష ఇతి ॥**

టీక॥ అహ్రియమాణ = తీసుకొని వచ్చిన మధుపర్కమును, మిత్రస్య అను మన్త్రమును చెప్పి, ప్రతీక్ష = చూడవలె.

14. **దేవస్యత్వా సవితు ః ప్ర...... రతి గృహ్ణామీతి తదంజలినా ప్రతిగృహ్య, మధువాతా ఋతా యత ఇతి ఋచేనావేక్ష్యాఽనామికయా చాంగుష్ఠేనచత్రిః ప్రదక్షిణమాలోఢ్య వసవస్త్వాగాయత్రేణఛందసాభక్షయన్త్వితి పురస్తాన్నిమాష్టిన్॥**

టీక ॥ దేవస్యతే అను మన్త్రము చెప్పి ఆ మధుపర్కమును అంజలితో గ్రహించి, మధు వాతా ఋతాయతే మధుక్షరన్తి సిన్ధవ; మాధ్వీన్న స్సంత్వోషధీః ॥ మధు నక్తముతో షతి మధుమాత్పార్థివగ్ం రజః మధుద్యౌరస్తు నః పితా ॥ మధుమాంనో వనస్పతి ర్మధుమాగ్ం అస్తు సూర్యః మాధ్వీర్గావో భవన్తున॥ అను మూడు ఋక్కుల చేత చూచి నాలుగవ వ్రేలుచేతను బొట్టన వ్రేలిచేతను మూడు సారులు ప్రదక్షిణముగా కలియ బెట్టి భక్షయన్తు అను మన్త్రమును చెప్పి తూర్పు దిక్కునందు చల్లవలెను.

15. **రుద్రస్త్వాత్రైష్టుభేన ఛందసా భక్షయన్త్వితి దక్షిణతః । ఆదిత్యా స్త్వాజాగతేన ఛందసాభక్షయంత్విితి పశ్చాత్। విశ్వేత్వాదేవా అనుష్టుభేన ఛందసా భక్షయన్త్వి త్యుత్తరతః। భూతేభ్య స్త్వేతి మధ్యాత్ త్రి రుద్గృహ్య॥**
టీక ॥ రుద్రస్త్వా మన్త్రమున దక్షిణము వైపున, ఆదిత్యాస్త్వా మన్త్రమున పడమటివైపు, విశ్వేత్వా మంత్రమున ఉత్తరమువైపున చల్లవలెను. త్రిః = మూడుసారులు, ఉద్గృహ్య =తీసుకొని.

16. **విరాజో దోహోసీతి ప్రథమం ప్రాశ్నీయాత్। విరాజో దోహమశీయేతి ద్వితీయం, మయిదోహః పద్యాయై విరాజ ఇతి తృతీయం॥**
టీక ॥ పైన చెప్పిన మూడు మన్త్రములతో ముమ్మారు ప్రాశనము చేయవలెను.

17. **న సర్వం ॥** టీక॥ సమస్త మధుపర్కమును త్రాగకూడదు.

18. **న తృప్తిం గచ్ఛేత్ ॥**
టీక॥ (ఆ మధుపర్కమును త్రాగుట చేత) తృప్తిని పొందగూడదు.

19. **బ్రాహ్మణాయో దఙ్ముఖో చ్ఛిష్టం ప్రయచ్ఛే దలాభే ప్సు॥**
టీక ॥ బ్రాహ్మణాయ = బ్రాహ్మణుని కొరకు, ఉత్తరపు దిక్కు ముఖము కలవాడై, ఉచ్ఛిష్టం = మిగిలిన మధుపర్కమును, ప్రయచ్ఛేత్ = ఇయ్యవలయును, అలాభ = దొరకనిచో, అప్సు = నీటియందు వేయవలెను.

20. **సర్వం వా ॥** టీక॥ లేక సమస్తమధుపర్కమును త్రాగవలెను.

21. **అథా చమనీయేనా న్వాచామతి అమృతాపిధానమసీతి॥**
టీక॥ ఆపైన ఆచమన యోగ్యమైన నీటిచేత అమృతాపిధానమసి అను మన్త్రమును చెప్పి ఆచమనము చేయవలెను.

22. **' సత్యం యశః శ్రీర్మయిశ్రీ శ్రయతా ' మితి ద్వితీయః ॥**
టీక॥ పై మన్త్రమును చెప్పి రెండవసారి ఆచమనము చేయవలె.

23. **ఆచాన్తోదకాయ గాం నివేదయన్తే॥**
టీక॥ ఆచమనము చేసిన వానికొరకు ఆవును, వేదయన్తే = వచ్చినదని

24. **హతో మే పాప్మా పాప్మా మే మత యితి జపి త్వోం కురుతేతి కారయిష్యన్ ॥**
టీక॥ మే = నా యొక్క, పాప్మా = పాపము, హతం = చంపబడినది, ఇతి= అని జపముచేసి, కారయిష్యన్ = ఆవును చంపుటకు ఇచ్ఛయించినయడల, ఓం = అంగీకార మును, కురుత = చేయుడు, ఇతి = అని చెప్పవలెను.

25. **మాతా రుద్రాణాం దుహితా పశూనాం స్వసాదిత్యానాం మమృతస్య నాభిః । ప్రణువోచం చికితుషే జనాయ మాగామ నాగామదితిం వధిష్టేతి జపి త్వో ముత్సృజతే త్యుత్స్రక్షన్॥**

టీక॥ ఉత్స్రక్షన్ = (అవును) విడిపింప నిచ్ఛగలవాడైతే, మాతా రుద్రాణాం ..అను మన్త్రమును, జపిత్వా = జపము చేసి, ఓం = అంగీకారమును, ఉత్సృజత ఇతి = (అవును) విడువవలయును అని చెప్పవలెను.

26. **నా మాంసో మధుపర్కోభవతి ॥**

టీక॥ మధుపర్కము, అమాంసః = మాంసము లేనిది, న భవతి = కానేరదు.

॥ ఇతి మధు పర్క ప్రకరణం సంపూర్ణం ॥

**2. ఆపస్తంబ గృహ్యసూత్ర ప్రయోగమున, మధుపర్క విషయమున, ఈ క్రిందివి ముఖ్యమైన మార్పులు -**

1. మధుపర్క ద్రవ్యములు " దధిమధ్వా " దులు అని, " దధ్నస్థానే పయో వికల్పేన లభ్యతే। అభావే ఉదకం చ " అని, మధుపర్కమును పిధానయుత కాంస్యపాత్రమున ఉంచవలెనని చెప్పబడినది.
2. అర్ఘ్యమును కూర్చతో కూడిన మృణ్మయపాత్రమునందుంచి ఇవ్వవలెను.
3. పాదప్రక్షాళనము ఆపఃపాదా అను మన్త్రముతో చేయవలెను.
4. ఆపస్తంబమున మధువాతా మన్త్రప్రయోగము కన్పించలేదు.
5. "యన్మధున" మంత్రంతో ప్రాశన.
6. స్నాతకాయ, ఆచార్యాయ, ఋత్విజో వేదాధ్యాయాయ, శ్వశురాయ, రాజ్ఞేషు సహ గవా మధుపర్కః గార్హ్యో ధర్మ ఉక్తోవా। అవేదాధ్యాయాయ వినాగవా। - అనేది కేవలం ఆపస్తమ్బీయం.
7. "మాత్రా రుద్రాణాం ....." అను మంత్రము ఆపస్తంబమున కన్పించలేదు.



## అనుబంధము - 13

# పుష్పయాగవిధి

(శ్రీ పురుషోత్తమ సంహిత 25. అధ్యాయము)

ఉత్సవ పర్యటన వలన, అస్పృశ్య స్పర్శనము వలన ఏ కొద్దిపాటి దోషమైన ఏర్పడినచో, తద్దోషపరిహారార్థము పుష్పయాగము చెప్పబడినది.

- సమాప్త దినమున రాత్రి లేదా ఆ మరునాటిరాత్రి పుష్పయాగం చేయవలె. ఆస్థానమంటపమున గాని, యాగమంటపమునగాని తాలము ఎత్తు, రెండు తాలముల ఆయామ విస్తారములు గల మహావేదిని కల్పించి దానియందు దేవుని ఉంచవలె. దాన ముందు భూతలమున రెండు హస్తములు పొడవు వెడల్పులతో జానెడు ఎత్తుతో అద్దమువలె సమతలముగ నుండునట్లు వేదినేర్పరచి, దానికి దక్షిణమున పంచవర్ణ చూర్ణములను, పుష్పములను సమకూర్చు కొనవలె. - ప్రోక్షించిన తర్వాత ఆ రెండవ వేదియందు మండలమును లిఖించవలె.
- శ్యామచూర్ణమున కర్ణికనేర్పరచి, దాని చుట్టూ పీత చూర్ణమున వృత్తము లిఖించవలె - ఆ తర్వాత ఇంద్రాది దిక్కులయందు క్రమముగా శ్వేత, రక్త, పీత శ్యామ వర్ణములతో పూరించిన నాలుగు దళములను కల్పించవలె - దళాన్తరములయందు తెలుపు పసుపు రంగులను పూరించవలెను - దానిచుట్టూ శ్వేత వర్ణమున వృత్తము కల్పించి, అందు అష్ట దళములను క్రమముగా ప్రాగాదిగా శ్వేత, శ్యామ, రక్త, శ్వేత, పీత, రక్త, శ్యామ, శ్వేత వర్ణములతో పూరింపవలె - దళాంతరాళములయందు రక్త, ధూమ్ర వర్ణములు పూరించవలెను - దీనికి పైన రక్తవర్ణ చూర్ణమున భ్రమణమొనర్చి అందు అష్ట దళములను లిఖించవలె - వానిని పీత వర్ణమున పూరించి దళాంతమున నలుపును, అంతరాళముల తెలుపును పూరించి ధూమ్ర వర్ణమున నేమి నేర్పరుపవలె - దానికిపైన ద్వాదశ దళములను పంచవర్ణ మిశ్రితముగ పూరించి దళాంత రేఖలు శ్వేత రక్త మిశ్రితములుగ, దళాంతరాళములయందు పసుపు పచ్చనిరంగుతో నింపవలె - దాని చుట్టూ శ్యామ చూర్ణమున మనోహరమగు వృత్తము నేర్పరచి దానియందు శ్వేతరక్త కృష్ణ చూర్ణములను నింపవలె - నాలుగు దిక్కులయందు నాలుగు ద్వారముల నేర్పరచి అందు క్రమముగా అధిదేవతల నావాహన మొనర్పవలె.
- మండలమున దేవతావాహన - కర్ణికా మధ్యమున శంఖచక్ర శ్రీవత్స వనమాదులతో శ్యామవర్ణమున శోభిల్లు పరాత్పరుడగు వాసుదేవుని ద్వాదశాక్షరీ మంత్రముతో ఆవాహన మొనర్చి పూజించవలె - ఆపైన గల దళ చతుష్కమున ఇంద్రాదిగా

శ్వేతవర్ణమున శుద్ధ స్ఫటిక స్వరూపుడగు వాసుదేవుని, యెఱ్ఱని దళమందు జాజ్వల్యమానమగు శరీరమున వెలుగు సంకర్షణుని, పీతవర్ణ దళమున కనక ప్రభలనొప్పు ప్రద్యుమ్నుని, నల్లని దళమందు మేఘశ్యాముడగు అనిరుద్ధుని అర్చించవలె - ఆపై గల 8 దళములయందు అష్టాక్షరిని, ఆపై గల 6 దళములయందు షడక్షరిని, ఆపై గల 12 దళములయందు ద్వాదశాక్షరిని లిఖించవలె - కర్ణిక చుట్టూగల ఐదు వలయములయందు పృధివ్యాధి పంచభూతములను, దళాంత రేఖలయందుననూ ఆవరణములు నాల్గిటియందుననూ సాత్విక రాజస తామస గుణములను, దళముల చివరిభాగమున ఋగాది వేదములను, ఆపై ఆవరణములయందు బ్రహ్మాది దేవతలను, రక్తవర్ణముగల స్థలములలో బ్రహ్మను, శ్వేతమున విష్ణువును, కృష్ణవర్ణమున రుద్రుని యథోచితముగ ఆవాహన మొనర్చి అర్చించవలె - ప్రథమావరణ ద్వారచతుష్కమున పాలికలను, ద్వితీయావరణ ద్వారచతుష్కమున అష్ట మంగళలములను, తృతీయావరణద్వార చతుష్కమున కుముదాదులను ఆవాహనమొనర్చి గంధ పుష్పాదులతో అర్చించవలె - మండలాంతస్థ దేవులను వారివారి వర్ణానురూపములగు సుగంధ కుసుమములతో పూజించవలె - ఆమండలమున ఉత్సవ బేరములనుంచి ధ్యానించి అర్చించవలె.

- పుష్పయాగమున ద్వాదశారాధన విధి - ఆనాటి రాత్రి వేదవాద్య పురస్సరముగా శోడశోపచారములను 12 మార్లు యథావిధిగ నొనర్చి పాయసాన్నములను, ఆమ్రాది ఫలములను, ఘృతపక్వ భక్ష్యములను నివేదన మొనర్చి, పానీయాచమనములు, కర్పూర తాంబూలములు సమర్పించి పాదములయందు పుష్పాంజలి సమర్పించవలె
- దేవుని యానము పైనధిరోహింపచేసి ఆలయమును చేర్చవలె - ఆపై స్వామిని సర్వాలంకార శోభితమగు శయన మంటపమున పుష్పశయ్యపై నాసీనునొనర్చి అర్చించి, దేవాగారమును ఏడుసార్లు ప్రదక్షిణమొనరింపచేసి మండప మధ్య భాగమున భద్రపీఠమున నాసీనుని జేసి దేవేరులను ఎదురుగ నుంచి కవాట బంధనాదుల నటనముతో లక్ష్మీసంవాదమను ఉత్సతవమును జరిగించవలె - ఆపైన దేవుని దేవేరుల నడుమ నాసీనుని జేయవలె - అటుల దేవేరులతో కూడియున్న శ్రీస్వామివారి ప్రతిబింబమును ఎదుటగల దర్పణమున నెవ్వరుసేవింతురో వారి పాపములెల్ల నశించి సర్వాభీష్టములనందగలరు - ఆపై స్వామికి పాయసాన్న నివేదనము శర్కరమిశ్రితములగు క్షీరముల నివేదనము, కర్పూర లవంగ యుక్తమగు తాంబూలమును నీరాజనమును సమర్పించి, ప్రణమిల్లి, శయ్యోపచార విహితములగు ఉపచారములను జేయవలె.

- ఆపైన పాలికలయందు గల అంకురములచే స్వామిని పూజించి, అగ్నిని ప్రతిష్ఠించి మూలమన్త్రమున సమిధాజ్య చరువులతో అష్టోత్తరశతాహుతులనొనర్చి, పంచోపనిష న్మంత్రములతో ప్రాయశ్చిత్తాహుతులను ఘృతముననొనర్చి పూర్ణాహుతినీయవలె.
- అనంతరము అగ్నిని ఉద్వాసన మొనర్పవలె - తోరణ ధ్వజ పతాక దేవతల నుద్వాసన మొనర్చి ధ్వజస్థంభమునందున్న పటస్థ గరుడుని పూజించి సంహారక్రమమున ఉద్వాసన మొనర్పవలె - ధ్వజస్తంభమును,(ఇదిశాశ్వత ధ్వజస్తంభము లేని పక్షమున-ఎడిటర్) పటమును, రజ్జువును గూడ ఆచార్యున కొసగుటచే గరుడుడు తృప్తినందును - ఆపైన ఆవాహిత సర్వదేవులకు బలినొసంగి ఉద్వాసన మొనర్పవలె
- భక్తులకు స్వగ్రామముల కేగుటకు అనుజ్ఞ నీయవలె - మంగళ వాద్యములతో స్వామిని దేవాలయమునందు ప్రవేశింపజేయవలె - మహోత్సవకర్త ఆచార్యుని పూజించి నూరు నిష్కములను, యథాశక్తి నొసగవలె - అందు సగము ఋత్విజులకు, అందు సగము పరిచారకులకు నివ్వవలె - నృత్త గీత వాద్యాదు లొనరించినవారికి, భక్తులకు, బ్రాహ్మణులకు, యజమాని తన విభవానుసారము దక్షిణ లొసంగి, దీనులు, అంధులు, వికలాంగులగువారల కన్న వస్త్రాదుల నొసంగవలె - క్రియ యను శరీరమునకు దక్షిణ ప్రాణము వంటిది - దక్షిణ హీనమగు క్రియ జీవములేని శరీరమువలె నిష్ఫలమగును - గాన విత్తాను సారము స్వల్పమైనను తప్పక యాగదక్షిణ నొసంగవలె
- ఇట్లు యథావిధిగ నెవ్వరు శ్రీమన్నారాయణుని మహోత్సవము నొనరింతురో వారు తప్పక విష్ణుసాయుజ్యము నందుదురు - ఎక్కడ నీమహాయాగము జరుగునో ఆ గ్రామమున, ఆ పట్టణమున, ఆదేశమున, ఆరాష్ట్రమున దుర్భిక్షమనునది సంభవింపదు. ప్రజలు సర్వదు:ఖ వినిర్ముక్తులై సుఖమున నుందురు.

కపింజల సంహిత (పుష్పయాగవిధి 24 అధ్యాయము)

-మంటపమున మండలమును రచించవలె - భద్రకము కాని, స్వస్తికముకాని చక్రాబ్జముకాని, చతురస్రముకాని కల్పించవలె.

మండలమునేర్పరచు విధానము :- పూర్వాదిగా ద్వారద్వారమున రెండు రెండు ఘటికలను, అదేవిధముగా శరావములను ఉంచవలె - ఇంద్రాదీశాన పర్యంతం క్రమముగా పాలికలను ఉంచవలెను - వాని ప్రక్కన శంఖాది మంగళములను ఉంచవలె - పుష్పయాగమండలమును శ్వేత రక్తపీత కృష్ణ వర్ణ పుష్పములతో నింపవలె - అవి శుద్ధ వర్ణకములు, మిశ్రితములు కూడ కావచ్చును -

పసుపురంగున కర్ణికను, రక్తవర్ణమున కేసరములను, కర్ణికావలయమును రక్తవర్ణమున కాని పసుపురంగునకాని, కేసరాంత వలయమును శ్వేత వర్ణమున, దళమూల భాగములు శ్వేతరక్తమిశ్రితములు, దళాగ్రమున రక్తవర్ణము, దళసంధి ప్రదేశములయందు శ్యావర్ణము, అంతర్రేఖలు ఆకుపచ్చనిరంగునను, నాభిరేఖలు తెలుపున, నేమ్యాది రేఖలు కృష్ణ వర్ణమున, నేమ్యన్తము తెల్లనిరంగున, నేమిని రక్తవర్ణమున లేదా పసుపు రంగున - అన్నియూ ఆయారంగుల పుష్పములతో పూరించవలె.

- అర్గళావిధి - (అర్గళమనగా గడియ అని అమరం) మండలమునకూ చుట్టూ ప్రతిదానికీ రెండవది ఒక హస్తము దూరమున వృత్తమార్గమున నాలుగు రేఖలు గీసి అర్గళములను కల్పించవలె - ఆ విధముగా గీసిన మొదటి బహిర్రేఖ సిత పూష్పములతోను, రెండవదానియందు పసుపురంగు పుష్పములను, మూడవదానియందు హరిత వర్ణపుష్పములను (పాలాశో హరితో హరిత్ - ఆకుపచ్చనిరంగు - అమరం), నాలుగవ దానియందు రక్త పుష్పములను అలంకరింపవలె.
- పద్మము యొక్క అష్టదళపద్మములలో, ప్రాచ్యాది చతుర్దిక్కులయందు వాసుదేవాది మూర్తులను, కోణములయందు శ్రియాది దేవేరులను ఆవాహన మొనర్పవలె.
- రెండవ అర్గళమున - ముద్రలు పూర్వవత్, మూడవ అర్గళమున - లోకపాలురు

<u>ఆవరణ పద్మ లక్షణము</u> - కర్ణికార్ధ ప్రమాణమున మూర్తిపద్మము, తదర్ధమానమున శంఖపద్మము, అదే ప్రమాణమున ఇంద్రాదులు, అదే విధమున గరుడ విష్వక్సేనపద్మములు నిర్మించవలె. (ఇంద్ర బాహ్యమున గరుడ పద్మము, సోమేశానమధ్యమున విష్వక్సేవ పద్మములను లిఖించవలె. యమ నిర్బతుల మధ్య ద్వారము ఏకహస్త ప్రమాణము, ప్రథమార్గళ పర్యన్తము ఇంద్ర ద్వారము ఉండవలె.)

దా॥ ప్రకాశంగారి వ్రాతప్రతిలో కన్పించిన పుష్పయాగమండల రచనా విధానము ఈ క్రింద నివ్వబడినది.

### <u>1. శ్రీపుష్పయాగ మండల రచనా ప్రకారము (గ్రంథాన్తరే)</u>

ఈ మండలమునకు 24 అం.ల పొడవుగల సూత్రముతో 5 ఆవరణములను సమముగ వేసి అష్టదళ పద్మములను వెయ్యవలెను. కర్ణిక పీతవర్ణము, కేసరములు రక్తవర్ణముచేతను, కేసరాంత వృత్తము శ్వేతవర్ణము చేతను, ఆపై నాలుగు పద్మములు శ్వేతరక్త మిశ్రితములగు వర్ణములచేతను, దళాగ్రములయందు, దళసంధులయందు, దళాంత రేఖలయందును, తదితర రేఖలయందునూ,

నేమ్యన్తములయందుననూ, నేమిమధ్యను శ్వేత రక్త పీత కృష్ణ వర్ణములు వెయ్యవలెను. చతుర్విధ పుష్పములచేత పూజింపవలెను. ఇట్టి పుష్పమయమయిన పద్మమందు అష్ట రత్నములు, వాసుదేవాది అష్టమూర్తులు, శంఖాది అష్టదివ్యాయుధములు, ఇన్ద్రాద్యష్ట మూర్తులున్నూ వరుసగా ప్రథమాది చతుర్థావరణాన్తము ధ్యానించవలెను. కర్ణికార్థమానమందు మూర్తి పద్మమున్నూ, తదర్థమానమందు శంఖ పద్మమున్నూ ధ్యానించేది. ఇన్ద్ర గరుడ విష్వక్సేనాదులను తూర్పు దిక్కున ధ్యానించేది. శరావ ఘట పాలికలను ద్వారోభయ పార్శ్వములయం దుంచవలెను. అష్టదిక్కులయందు అష్టమంగళములను నుంచవలెను. ఈలాగటి పుష్పయాగ మండలమునందు భగవంతుని ఆవాహన చేసి పూజించిన ఉత్సవాంగ సర్వాస్పర్శ దోష శాన్తి కలుగును. ఇది పుష్పయాగ మండల పూజావిధి.

*(దొడ్డిపట్ల ప్రకాశంగారి ఆగమగ్రంథం వ్రాతప్రతినుండి ఉద్ధృతము)*

## 2. శ్రీపుష్పయాగ మండల రచనా ప్రకారము (పురుషోత్తమ సంహితనుసారి)

ఈ మండలమునకు శ్యామవర్ణ చూర్ణముచే, కర్ణికయున్నూ, అందు పైని పీత వర్ణవృత్తమున్నూ, దానిచుట్టూ చతుర్దళ పద్మమున్నూ, ఆ పద్మమునకు నాలుగు దళముల యందు శ్వేత రక్త పీత శ్యామ వర్ణములున్నూ, పైని శ్వేత చూర్ణముతో వృత్తమున్నూ, దళాంతరేఖ దళమధ్యలయందు శ్వేత పీత వర్ణములున్నూ వేశేది. అందు పైని అష్టదళ పద్మము వేశి ఆ దళములయందు మహాదిక్కులయందు శ్వేత రక్త పీత శ్యామ వర్ణములున్నూ, ఈశాన్యాది విదిగ్ద ళములయందు పీత శ్యామ శ్వేత రక్త వర్ణములున్నూ, అష్ట దళముల యందు నారాయణాష్టాక్షరీ మంత్రమును లిఖించి అందుపైని రక్తచూర్ణముతో వృత్తము వేశి, దళాంతరేఖ దళ మధ్యములయందు రక్త శ్యామ వర్ణములు వేయవలెను. అందుపై షడంగుళ పద్మం వేశి ఆ దళములు పీతవర్ణముచే పూరించి వాటియందు రామతారకం లిఖించి, దళాంతరేఖ దళమధ్యములయందు కృష్ణ శ్వేత చూర్ణముచే వృత్తము వేయవలెను. దానిపై ద్వాదశ దళ పద్మం వేశి వాసుదేవ ద్వాదశాక్షరిని పంచవర్ణ పూరితములగు దళములలో లిఖించి, దళాంతరేఖ దళమధ్యలు శ్వేతరక్త పీత మిశ్రితవర్ణ పీతవర్ణములచే వేసేది. దానిపై శ్యామవర్ణముచే వృత్తము వేసేది. అందు పైని 4 ద్వారములతో శ్వేత రక్త కష్ణ వర్ణములచే ఆవరణ త్రయం వేసి భగవంతుని పూజించవలెను.

(దొడ్డిపట్ల ప్రకాశంగారి ఆగమ గ్రంథం వ్రాతప్రతినుండి ఉద్ధృతము)



అనుబంధము - 14

# ఉపయుక్త స్మార్తకారికాదులు

## శ్రీమదాపస్తంబ ప్రణీత గృహ్య సూత్రాణి

### ప్రథమకాండ

ఓమ్ అథ కర్మాద్యాచారాద్యానిగృహ్యంతే ॥

1. ఉదగయన పూర్వ పక్షాహః పుణ్యాహేషు కార్యాణి ॥ 2. యజ్ఞోపవీతినా ॥ 3. ప్రదక్షిణం ॥ 4. ప్పురస్తాదుదగ్వోపక్రమః ॥ 5. తథా-పవర్గ ॥ 6. అపరపక్షే ప్రత్యాణి । 7. ప్రాచీనావీతినా॥ 8. ప్రసవ్యం ॥ 9. దక్షిణతోఽపవర్గః ॥ 10. నిమిత్తావేక్షణి నైమిత్తికాని ॥ 11. అగ్ని మిథ్వా ప్రాగగ్రైర్దర్భై రగ్నిం పరిస్తృణాతి ॥ 12. ప్రాగుదగగ్రైర్వా ॥ 13. దక్షిణాగ్రైః ప్రత్యేషు ॥ 14. దక్షిణా ప్రాగగ్రైర్వా॥ 15. ఉత్తరేణాగ్నిం దర్భాన్ సంస్తీర్య ద్వంద్వంన్యంచి పాత్రాణి ప్రయునక్తి దేవసంయుక్తాని॥ 16. సకృదేవ మనుష్యసంయుక్తాని ॥ 17. ఏకైకశః పితృసంయుక్తాని ॥ 18. పవిత్రయో స్సంస్కార ఆయామతః పరీమాణం ప్రోక్షణీ సంస్కారః పాత్ర ప్రోక్ష ఇతి దర్శ పూర్ణ మాసవత్తూష్టీమ్ ॥ 19. ఉత్తరేణాగ్నిం పవిత్రాన్తర్హితే ప్రాత్రేఽప ఆనీ యోదగగ్రాభ్యాం పవిత్రాభ్యాం త్రిరుత్పూయ సమం ప్రాణైర్హృత్వోత్తరేణాగ్నిం దర్భేషు సాదయిత్వా దర్భై ప్రచ్ఛాద్య ॥ 20. బ్రాహ్మణం దక్షిణతో దర్భేషు నిషాద్య॥ 21. ఆజ్యం విలాప్యా పరేణాగ్నిం పవిత్రాన్తర్హితాయా మాజ్యస్థాల్యా మాజ్యం నిరూప్యోదీచోఽఙ్గారా న్నిరూహ్యా తే ష్వధిశ్రిత్య జ్వలతావద్యుత్య ద్వే దర్భాగ్రే ప్రత్యస్య త్రిః పర్యగ్ని కృత్వోద గుద్వా సాఙ్గారాన్ ప్రత్యూ హ్యో ద గగ్రాభ్యాం పవిత్రాభ్యాం పునరాహారం త్రిరుత్పూయ పవిత్రే అను ప్రహృత్య ॥

22. ఇత్యాపస్తంబీయే గృహ్యా ప్రశ్నే ప్రథమ ఖండః ॥

### అథ ద్వితీయ ఖండః

యేన జుహోతి తదగ్నౌ ప్రతితప్య దర్భై స్సమృజ్య పునః ప్రతితప్య ప్రోక్ష్య నిధాయ దర్భానద్భి స్సంస్పృశ్యాగ్నౌ ప్రహరతి ॥ 1. శమ్యాః పరిధ్యర్థే వివాహోపనయన సమావర్తన సీమన్త చౌల గోదాన ప్రాయశ్చిత్తేషు ॥ 2. అగ్నిం పరిషించ్యఽదితేను మన్యస్వేతి దక్షిణతః ప్రాచీనం, అనుమతేఽను మన్యస్వేతి పశ్చాదుదీచీనం, సరస్వతేఽను మన్యస్వేతి ఉత్తరతః ప్రాచీనం, దేవసవితః ప్రసువేతి సమన్తమ్ ॥ 3. పైతృకేషు సమన్త మేవ తూష్టీమ్ ॥ 4. ఇధ్మ మాధా యా-ఘారా వాఘారయతి దర్శ పూర్ణమాస వత్తూష్ణీం ॥ 5. అథాజ్యభాగౌ జుహో త్యగ్నయేస్వాహే త్యుత్తరార్ధపూర్వార్ధే, సోమాయస్వాహేతి దక్షిణార్ధపూర్వార్ధే, సమం పూర్వేణ ॥ 6.

యథోపదేశం ప్రధానాహుతీర్హుత్వా జయాభ్యాతానా న్రాష్ట్రభృతః ప్రజాపత్యాం వ్యాహృతీ ర్వ్యాహృతాః సావిష్టకృత మిత్యుపజుహోతి యదస్యకర్మణో త్యరీరిచం యద్వాన్యూన మిహాకరం। అగ్నిష్ట త్స్విష్టకృద్విద్వాన్ సర్వగ్గ్ స్విష్టం సుహుతం కరోతు స్వాహేతి ॥ 7. పూర్వ పరిషేచన మన్వమగ్గంస్థాః ప్రాసావీరితి మన్త్ర సన్నామః ॥ 8. లౌకికానాం పాకయజ్ఞశబ్దః ॥ 9. తత్ర బ్రాహ్మణావేక్షో విధిః ॥ 10. ద్విర్జుహోతి ద్వి ర్నిమార్ష్టి ద్విః ప్రాశ్నా త్యుత్సృ ప్యాచామతి నిర్లేఢీతి॥ 11. సర్వ ఋుతవో వివాహస్య శైశిరౌ మాసౌ పరిహాప్యోత్తమంచ నైదాఘం ॥ 12. సర్వాణి పుణ్యోక్తాణి నక్షత్రాణి ॥ 13. తథా మంగలాని ॥ 14. ఆవృతశ్చా స్త్రీభ్యః ప్రతియేరన్ ॥ 15. ఇన్వకాభిః ప్రసృజ్యన్తే తే వరాః ప్రతి నన్దితాః ॥

16. ఇత్యావస్తంబీయే గృహ్యపశ్నే ద్వితీయ ఖండః ॥

## ద్వితీయ పటలః

### చతుర్థశ్చ ఖండః

సుహృద స్సమవేతాన్ మన్త్రవతో పరాన్ ప్రహృణియాత్ ॥

1. తానాదితో ద్వాభ్యా మభిమన్త్రయేత ॥ 2. స్వయం దృష్ట్వా తృతీయం జపేత్॥ 3. చతుర్థ్యా సమీక్షేత ॥ 4. అంగుష్ఠే నోపమధ్యమయా చాంగుళ్యా దర్భం సంగృహ్యోత్తరేణ యజుషా తస్యా భ్రూరన్తరం సమ్మృజ్య ప్రతీచీనం నిరస్యేత్ ॥ 5. ప్రాప్తే నిమిత్త ఉత్తరాం జపేత్॥ 6. యుగ్మాన్ సమవేతాన్ మన్త్రవత ఉత్తరయాద్భ్యః ప్రహిణుయాత్ ॥ 7. ఉత్తరేణ యజుషా తస్యా శ్శిరసి దర్భేణ్వం నిధాయ। తస్మి న్నుత్తరయా దక్షిణం యుగ ఛ్ఛిద్రం ప్రతిష్ఠాప్య ఛిద్రే సువర్ణ ముత్తరయా న్తర్ధా యోత్తరాభిః పంచభి స్స్నాపయి త్వోత్తరయాఽహతేన వాససాఽఽచ్ఛాద్యోత్తరాయ యోక్త్రేణ సన్నహ్యతి ॥ 8. అథైనా ముత్తరయా దక్షిణే హస్తే గృహీత్వాఽగ్ని మభ్యానీయాపరేణాగ్ని ముదగగ్రం కటమాస్తీర్య తస్మి న్నుపవిశత ఉత్తరో వరః ॥ 9. ఆగ్నే రుపసమాధానా ద్యాజ్య భాగాన్తేఽథైనామాదితో ద్వాభ్యా మభిమన్త్రయేత ॥ 10. అథాస్యై దక్షిణేన నీచాహస్తేన దక్షిణముత్తానం హస్తం గృహ్ణీయాత్ ॥ 11. యది కామయేత స్త్రీ రేవ జనయేయ మిత్యంగుళీ రేవ గృహ్ణీయాత్ ॥ 12. యదికామయేత పుసంయేవ జనయేయ మిత్యం గుష్ఠ మేవ సోఽభీ వాంగుష్ఠ మభీవలోమాని గృహ్ణాతి ॥ 13. గృహ్ణామిత ఇత్యేతాభి శ్చతసృభిః ॥ 14. అథైనా ముత్తరే ణాగ్నిం దక్షిణేనపదా ప్రాచీ ముదీచీం వా దిశ మభిప్రక్రమయ త్యేక మిష్య ఇతి ॥ 15. సఖేతి సప్తమే పదే జపతి ॥

16. ఇత్యాపస్తంబీయే గృహ్యపశ్నే చతుర్థః ఖండః ॥

# గృహ్యసూత్ర ప్రయోగదర్పణము

## ప్రథమ పటలము

1.'అథ కర్మాచారాద్యాని గృహ్యంతే' అథానన్తర మాచారాద్యాని కర్మాణి గృహ్యంతే జ్ఞాయన్తే కర్తవ్యత్వేన తాని కార్యాణి కుత్ర. 2.ఉదగయన పూర్వపక్షాహః పుణ్యాహేషు కార్యాణి. ఉదగయ నాదయః ప్రసిద్ధాః। పుణ్యహాస్తు, ' దేవస్య సవితుః ప్రాతః ప్రసవః ప్రాణః ' (తై.బ్రా. 1.5.3) ఇత్యస్మి న్ననువాకే పంచ పుణ్యహాఉక్తాః ప్రాతర్మధ్యందినాపరాహ్ణాది శబ్దవాచ్యాః నాడికాత్రయం నాడికా తృతీయాంశ శ్చైకః పుణ్యాహః। తేషు తాని కర్తవ్యాదీని చౌలాదీని। సీమన్తోన్నయనాదీనాం నైమిత్తికానామపి పూర్వపక్ష పుణ్యాహే భవన్తి, నతూదగయనాదయ। 3.సర్వం 'యజ్ఞోపవితానా' కర్తవ్యం ॥ 4. యథా ప్రదక్షిణం భవతి తథా కర్మణి కరోతి ॥ 5. సర్వత్ర <u>పురస్తా దుదగ్వా</u> కర్మణా ముపక్రమః। 6. తథాపవర్గోపి పురస్తా దుదగ్వా భవతి। అపవర్గ స్సమాప్త రిత్యర్థః। 7.అపర పక్షే పిత్ర్యాణి కర్మాణి కర్తవ్యాని । ఉదగయనాది ర్న భవతి। 8. పాచీనా వీతినా పిత్ర్యాణికర్తవ్యాని ॥ 9. యథా 'ప్రసవ్యం' కథాచ కరోతి। 10.'అపవర్గశ్చ దక్షిణతో భవతి॥ 11.అగ్ని మిధ్వేతి॥ అత ధర్మ శాస్త్రోక్తేన విధినా అగ్ని ప్రతిష్ఠాపనం॥ కింపునస్తత్ - 'నిత్యం లోక ఉపదిశన్తి' యత్ర క్వచాగ్ని ముపసమాధాస్యన్ స్యా త్తత్ర ప్రాచీరుదీచీశ్చ త్రిస్ర స్తిస్రోరేఖా లిఖిత్వా ఽ ద్భిరవోక్ష్యాగ్ని ముపసమిన్ధ్యాత్॥ ఉత్సిచ్యేత దుదక ముత్తరేణ పూర్వేణవా న్య దుపదధ్యాత్। (ఆ.ప.ధ. 2-1-1-13) ఇతి.

తస్యాయ మర్థ:-

నిత్యం లోకే ఏతత్కర్మోపదిశన్తి వృద్ధాః స ధర్మకేచా ధర్మ కేచాగ్నౌ। యత్ర క్వచాపి గృహే ప్రవాసే రణ్యేవా అగ్ని ప్రతిష్ఠాపనం కుర్వన్ స్యాత్ తత్ర ప్రాచీ దుదీచీశ్చ త్రిస్రస్తిస్రో రేఖా లిఖతి, ప్రాచీరేఖాః పూర్వం దక్షిణస్యామారభ్యోదగపవర్గాః కరోతి ॥ అవాగ్భూతేన హస్తే నావోక్ష్యాగ్నిం ప్రతిష్ఠాప్య, అవోక్షణ శేషతోయ ముత్సృజ్య। ప్రాగుదగ్వా అన్యత్తోయం నిదధాతి॥

తత్ర శ్లోకాః :-

శ్రుతి స్మృతి ప్రచోదితం కరిష్యతే యథా తథా। స్వకర్మయ త్తదాదితో యతాసురా గురుం వదేత్ (అగూస్కంకల్పః) ప్రాచీః పూర్వ ముద క్సంస్థం పశ్చిమారంభ మాలిఖేత్। తథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభమాలిఖేత్॥ అవాక్కరో భ్యుక్ష్య నిధాయ వహ్నిముత్సిచ్యతే వోక్షణతో యశేషమ్। ప్రాక్తోయ మన్య న్నిదధా త్యుదగ్వా యథా బహిస్స్యాచ్చ పరిస్తరాణామ్ ॥ తతో గ్ని ముపసమాధాయ ప్రాగగ్రై రుదగగ్రై ర్దర్భై రగ్నిం పరిస్తృణాతి యథా 'ఉత్తరేణ పూర్వేణవా' ఇత్యుపహిత ముదకం బహిర్భవే త్తథా పరిస్తృణాతి సర్వ దిక్షు ప్రాగగ్రైర్వా ప్రాగగ్రాః దక్షిణోత్తరా ఉదగగ్రా పశ్చా త్పురస్తాచ్చ। దక్షిణపరిస్తరణౌ నుత్తరా న్కరోతి. ఉత్తరానధరాన్ ॥ 14.పిత్రేషు దక్షిణాగ్రైః 15. దక్షిణా ప్రాగగ్రైర్వా పరిస్తరణమ్॥ 16. ఉత్తరే ణాగ్నిం దర్భాన్ సంస్తీర్య। తేషు కుశేషు దైవాని పాత్రాణి ద్వంద్వంన్యఞ్చి ప్రయునక్తి ద్వే ద్వే అధోచితే ప్రయుఞ్జ్యా దిత్యర్థః॥ తస్య

ప్రయోగ : హోమసాధనీ దర్వీ అజ్య స్థాలీ చ సహప్రయోక్తవ్యే ప్రోక్షణీ ధానీ ప్రణీతే చ ఉపస్తరణాభిఘారణార్థా దర్వీ ఇధ్మ దారూణి చ।

తత్ర శ్లోకః :- దర్వ్యాజ్య ప్రాత్రేణ సహప్రయోజ్యా వైక్మతి ప్రోక్షణ భాజనీ స్రుక్ ॥ ప్రణీతి పాత్రేణ సహేధ్మ దారూ ణ్యుపస్పృతే శ్వాభిఘృతేశ్చ దర్వ్యా।

17.మానుషాని ప్రాతాణి సకృదేవ ప్రయునక్తి॥ 18.పిత్ర్యాణిపాత్రా ణ్యేకైకశః ప్రయోక్తవ్యాని।

19.తతో దర్శ పూర్ణమాసవ త్పవిత్ర సంస్కారం పాత్ర ప్రోక్షణం చ తూష్ణీం కరోతి।

తస్య ప్రయోగః - సమావ ప్రచ్ఛిన్నాగ్రౌ దర్భౌ ప్రాదేశమాత్రౌ తృణం కాష్ఠం వాన్తర్ధాయ ఛిత్వా - ద్భిరనుమృజ్య ప్రోక్షణీధాన్యాం పవిత్రే నిధాయ తత్రాప ఆనీయ త్రి రుత్పునాతి। పాత్రాణి శోధ్యావృత్య ఇధ్మంచ విస్రస్య త్రిః ప్రోక్షతి।

20.అపరే ణాగ్నిం పవిత్రాన్తర్హితే పాత్రే -ప ఆనీయ। త్రిరుత్పూయ ప్రాగ్రై స్సమముద్ధృత్య। ఉత్తరేణాగ్నిం పునస్త్రీర్ణేషు దర్భేషు సాదయిత్వా దర్భై ప్రచ్ఛాద్య।

21.బ్రాహణం దక్షిణతో దర్భేషు నిషాద్య। 22. అజ్యం విలీన మప్పస్మి న్నగ్నౌ విలాప్య। అపరేణాగ్నిం పవిత్రాన్తర్హితాయా మాజ్యస్థాల్యా మాజ్యం నిరూప్య। ఉదీచోఙ్గారాన్నిరూహ్య। తే ష్వధిశ్రిత్య జ్వలతా తృణేన అధోగామిన్యా దీప్త్యావద్యోతయతి। ద్వే దర్భాగ్రే ఛిత్వా, ప్రక్షాళ్య, యుగవ త్ప్రత్యస్య, పునర్జ్వలతా తృణేన త్రిః పర్యగ్ని కరోతి। అవద్యోతన పర్యగ్ని కరణే యదానిరూఢా దేవాగ్నేర్లవతః తదాదయో స్తస్మిన్నేన ప్రక్షేపః। అన్యస్మాచ్చేత్త్యా గః। ఉదగుద్వాస్యాఙ్గారాన్ ప్రత్యూహ్య ఉదగగ్రాభ్యాం పవిత్రాభ్యాం పునరాహారం త్రిరుత్పూయ। పవిత్రే ప్రాగగ్రె అను ప్రహరతి॥

### ద్వితీయ ఖండః

1. యేన జుహోతి అంజలినా దర్వ్యావా తదగ్నౌ ప్రతితప్య దర్భై స్సంమృజ్య పునః ప్రతితప్య। ప్రోక్ష్య నిధాయ। దర్భా నద్భి స్సంస్పృశ్యాగ్నౌ ప్రహరతి॥
2. శమ్యాః పరిధ్యర్థే భవన్తి వివాహోపనయన సమావర్తన సీమన్త చౌళ గోదాన ప్రాయశ్చిత్తేషు - అగ్నిం పరిషించతి॥
3. అదితేను మన్యస్వేతి దక్షిణతః ప్రాచీనం, అను మతేను మన్యస్వేతి పశ్చాదుదిచీనం, సరస్వతేను మన్యస్వే త్యుత్తరతః ప్రాచీనం, దేవసవితః ప్రసువేతి సమన్తమ్॥
4. పైత్రుకేషు మాసిశ్రాద్ధాదిషు కర్మసు సమస్తమేవా ప్రదక్షిణం పరిషించతి తూష్ణీమ్॥
5. తతః ఖాదిరం పాలాశం వా పఞ్చదశ దారుక మాజ్యాసక్త మిధ్మ మగ్నా వాధాయాఘారా వాఘారయతి, దర్శ పూర్ణ మాసవ తూష్ణీమ్। ఉత్తరం పరిధి సన్ధిమన్వవహృత్య। దక్షిణా ప్రాఞ్చ మృజం సన్తతం జ్యోతిష్యత్యాఘార మాఘరయాన్ సర్వాణీధ్మ సకాష్ఠాని సంస్పర్శయతి। దక్షిణపరిధి సన్ధి మన్వవ హృత్య ప్రాఞ్చ ముదంచ మిత్యాది॥ అఘారయోః ప్రజాపతి ర్దేవతా। అథవా ప్రథమస్య ప్రజాపతి ర్ద్వితీయ స్యేన్ద్రః।

6. అథా ఽఽజ్య భాగౌ జుహోత్యగ్నయే స్వాహా త్యుత్తరార్ధపూర్వార్ధే ప్రాగుదీచ్యామ్, అగ్నయిదమ్। సోమాయ స్వాహేతి దక్షిణార్ధపూర్వార్ధే దక్షిణ పూర్వస్యాం సమం పూర్వేణ సోమాయేదమ్॥

7. యథోపదేశం ప్రధానాహుతీ ర్హుత్వా జయా ఽభ్యాతనా న్రాష్ట్ర భృత ప్రాజాపత్యాం వ్యాహృతీర్వ్యాహృతాః స్విష్టకృతీ రిత్యుప జుహోతి । యధోపదేశం యేనయేన మన్త్ర హవిరవదానాదినా వివాహాదిషు ప్రధానాహుతయః ఉపదిష్టాః తేనతేన విధానేన తాస్తా హుత్వా। జయాః 'చిత్తం చస్వాహా' ఇతి త్రయోదశ। అగ్నిర్భూతానామధిపతిస్సమావత్వస్మిన్' ఇతి సానుషా అభ్యాతానా అష్టాదశ। తత్ర 'పితరః పితామహాః' ఇత్యస్మి న్మన్త్రే జీవపితృకస్య పితర ఇత్యస్య లోపః పితామహాః ఇత్యస్య లోపః॥ జీవపితృ పితామహస్యోభయోర్లోపః। కేచ దవికృతం జుహ్వతి, జీవపితృ కాణాంచ విశేషో నాస్తే త్యాహుః । రౌద్రే పిత్రేచాపా ముపస్పర్శనమ్ । ఋతాషాఢితి రాష్ట్రభృతజ పర్యాయేణ హూయన్తే॥ 'ప్రజాపతే నత్వదేతాని' ఇతి ప్రాజాపత్యా భూర్భువస్సురితి వ్యాహృతయో విహృతా, న సమస్తాః। యదస్య కర్మణ ఇతి సవిష్టకృతీ ॥

8. పూర్వవ త్పరిషేచన మన్వమంస్థాః ప్రాసావీరితి మన్త్ర సన్నామః కర్తవ్యః। అగ్నేరుప సమాధానాది తన్త్ర మోషధి హవిష్యు దధ్యంజలౌ చేష్యతే । ఉపనయనాదిషు వచనాద్భవతి । అగ్ని ముఖ స్విష్టకృతౌచ దధ్యోషది హవిష్వేన వివాహే లాజహోమం వర్జయిత్వా 'సర్షపాన్ ఫలీకరణ మిశ్రాన్' (గృ-15-16) 'దక్షిణేన ఫలీకరణ ముష్టిం' (గృ - 23-1) ఇత్యత్రౌపాసన హోమ వైశ్వ దేవయోశ్చ యావదుక్తం । వ్రతాధ్యాయోపాకరణోత్సర్జనేషు సాగ్నిముఖం తన్త్రం జయాదయాశ్చ॥

తత్రశ్లోకాః :-తన్త్ర మోషధిమత్సుదధన్యపి ప్రేష్యతే వచనా దితరత్రతు ॥ స్విష్టకృచ్ఛ తథాగ్ని ముఖం భవే ల్లాజహోమ మపాస్య కపర్దినా। సర్షపేషు తథైవ హవిష్య భు గ్వైశ్వ దేవ ఫలీకరణాహుతౌ ॥ యావదుక్త మలేహి జయాదికం నాస్తి యత్ర వచస్మర తత్రతు ॥ ఉత్సృజౌ సముపాకరణే వ్రతేష్విష్టనాగ్ని ముఖంచ జయాది చ ॥

(ఇక్కడనుండి ఉన్న శ్లోకాలు మొ॥వి ప్రస్తుతవిషయంలో అవసరం కాదుగనుక వదలివేయడమైనది)

ప్రథమ పటల ప్రయోగ స్సమాప్తః ॥

## అథద్వితీయ పటల ప్రయోగ ప్రారంభః

ప్రాణి గ్రహణ కర్మోచ్యతే । పాదౌ ప్రక్షాళ్యాచమ్య కృతప్రాణాయామో వరాన్ ప్రేషయిష్య ఇతి సంకల్ప్య। సుహృదస్సమవేతాన్ మన్త్ర వతో వరాన్ ప్రహృణియాత్ ॥ సుహృదో మిత్రాణి సమవేతాన్ ఏకకార్య వతః। వరం ప్రతి మన్త్రవతో మన్త్రబ్రాహ్మణవతః ప్రహృణియాత్ - ప్రేషయే దిత్యర్థః । తాన్ ప్రసుగ్మన్తేతి ద్వాభ్యా మృగాభ్యా మభిమన్త్రయేత్ । అభిమన్త్రణ మాభిముఖేన మన్త్ర స్యోచ్చారణః । అనుమన్త్రణ మప్యనేనైవ వ్యాఖ్యాతమ్ । అనుమన్త్రితం

ద్రవ్యగతేన చిత్తే నేత్యేతా వా న్విశేషః । తే ప్రేషితాః వరాః కన్యాదాతారన బ్రూయుః వాత్స్యాయనాయ - యజ్ఞయ్య శర్మణే గౌతమీ జనితాం - ధర్మ ప్రజార్థం- వృణీమహ ఇతి ॥ దదామీ తి దాతాహ ॥ ఏవ ముక్తసంగతాయ వరాయ కన్యా ముదకపూర్వకం ప్రయచ్ఛతి గౌతమీ జనితాం వాత్స్యాయనాయ యజ్ఞయ్య శర్మణే తుభ్యం ప్రజానహత్వ కర్మభ్యః ప్రతిపాదయా మీత్యుక్త్వా ప్రయచ్ఛతి । షక్తృత్యయేసతి వాత్స్యాయనాయేతి భవతి । ఏవం సర్వత్ర తాం ప్రతిగృహ్య వరో యత్ర క్వచాగ్నిమితి విధినా వివాహస్థానే అగ్నిం ప్రతిష్ఠాపయతి తత్రకన్యా ఆస్తే గోమధుపర్కం గచ్ఛతి వరో వేదాధ్యాయశ్చేత్ । నో చే ద్గవా వినా గృహ్ణాతి । వరస్యయ ఆచార్యాదిః పూజ్యః । తస్మా అపి వేదాధ్యాయాయ । కన్యాప్రదో గోమధుపర్కం దదాతి । అ తాదృశాయ వినాగవా ॥ వేదాధ్యాయః షడంగవిత్ ॥ తతో ఉ_బ్రాతృఘ్నీ మిత్యృచం కన్యాం దృష్ట్వా జపతి । దృష్టిహోపచా తస్యాః దృష్టౌ దృష్టిం నిపాతయతి ॥ అవయవశో నిరీక్షతే । .......... (వధూవర సంకల్పం ... వధూ భ్రూరంతర సమ్మార్జనం) ........ ....... అఘృష్ట ఇతి యజుషా తస్యా శ్శిరసి కుశేణ్వం నిధాయ । ఇణ్వం నామ కుంభధారణార్థం తృణపుంజమ్ । ఖేనస ఇత్యృచా ఇణ్వే దక్షిణం యుగచ్ఛిద్రం ప్రతిష్ఠాప్య । శంతే హిరణ్య మిత్యృచా ఛిద్రే హిరణ్య నిధానమ్ । ఉ ః పూర్వమనీతా ఆపస్తాభిః సువర్ణసహితాభిః హిరణ్యవర్ణా ఇతి పంచ ఋచ ఉక్త్వా తై స్నాపయ ౯ వధూమ్ ॥ ...... (యోక్త్ర బంధనం) ........ (పాణిగ్రహణం) ..... (సప్తపది) ....... (హోమాదులు) ......... సర్వత్ర లాజేషు హవిః ప్రత్యభి ఘారణం నేష్యతే । ఇయం నార్యుప్రబూత ఇత్యృచా లాజహోమశ్చ పూర్వవత్ర్త దక్షిణం కరోతి । అగ్నిముఖ స్విష్టకృతౌ నస్తః । జయాది ప్రతి పద్యతే పరిషేచనాన్తం కరోతి । .... ఔపాసనాగ్ని మాధాస్యే విచ్ఛిన్న సంధానార్థమితి సంకల్ప్య । నిర్మన్థ్య అధీత వేదస్య గృహా ద్వా అగ్నిం గృహీత్వా । యత్రక్వచాగ్ని మిత్యాదినా అగ్ని మిధ్వా-జ్యం సంస్కృత్య । అగ్నిం పరిస్తీర్య । అయాశ్చేతి జుహోతి । సర్వ ప్రాయశ్చిత్తం జుహోతి .................. ॥

## ఆవశ్యక స్మార్తకారికలు -( కపర్ది కారికలనుండి)

1. ఉల్లేఖనప్రకారః -- శ్లో॥ అంగుష్ఠా నామికాభ్యాంతు సంగృహీతేన సూత్రవిత్ । ఋజువత్సంతతం రేఖా విలిఖేత్తు యథావిధి ॥

2. రేఖా కరణ ప్రకారః - శ్లో॥ ప్రాచీః పూర్వ ముక్సంస్థం దక్షిణారంభ మాలిఖేత్ । అథోదీచీ పుర స్సంస్థం పశ్చిమారంభ మాలిఖేత్ ॥

3. అపః స్పర్శనం - శ్లో॥ శకలాది నిరస్యాప ఉపస్పర్శన మాచరేత్ । ఛేదే నిరసనే భేదే కృతే త్వాత్మాభిమర్శనే నైరృతే రాక్షసే రౌద్రే పైతృకేవా ప్యుదీయతే । అమేధ్య కేశ వేపాది స్పర్శేవాఽ_ ప ఉపస్పృశేత్॥

4. ప్రోక్షణాదీనాం లక్షణం - శ్లో॥ అవాచీనేన హస్తేన కర్తవ్యం స్యా దవోక్షణం । ఉత్తానేనతు హస్తేన కర్తవ్యం ప్రోక్షణంభవేత్ ॥ అన్యాప్తి ప్రకారేణ అభ్యుక్షణముదీరితం ॥ శ్లో॥ అవాక్కరోభ్యుక్ష

నిధాయ వహ్ని ముత్పృజ్యతే పోక్షణ తోయ శేషం। ప్రోక్తాయ మస్య న్నిదధా త్యుదగ్వా యథా బహిస్స్యాచ్చ పరిస్తరాణామ్ ॥

5. అగ్నిప్రణయనం - శ్లో॥ హోమస్థానే పురోభాగే స్థిత్వా వహ్నిం నిధాయచ। నమస్కృత్య తతో వహ్నిం హృదిధ్యాత్వా సమాహితః। పాణిభ్యాం పాత్రమాదాయ వ్యాహృతీభి ర్నిధాయచ। తత్పాత్రే పూరయే త్తోయం పూజయేచ్చ సువాసినీమ్। గంధ పుష్పాక్ష తాద్యైశ్చ తతో వహ్నిం సమింధయేత్, అగ్న్యానయన పాత్రంచ ఆర్ద్రంకృత్వా సమూహయేత్। అకృతే భ్రష్ట హోమస్స్యా దాయుస్తత్ర నపూర్యతే ॥

6. అగ్న్యభిముఖీకరణం - శ్లో॥ ప్రాఙ్ముఖోహి తతో హ్యగ్నిః ప్రాఙ్ముఖశ్చైవ ఋత్విజః। ప్రాఙ్ముఖీ హి ప్రణీతాచ కథం ప్రత్యఙ్ముఖోభవేత్ ॥ ఏషహి దేవ మన్త్రేణ మన్త్రపూతేనవారిణా। హవ్యవాట్ సలిలం దృష్ట్వా భీతః ప్రత్యఙ్ముఖో భవేత్ ॥

7. పరిసమూహనం- శ్లో॥ కరేణ తోయమాదాయ ప్రాగారభ్య ప్రదక్షిణమ్। పరితో మార్జనం యత్త దాహు పరిసమూహనమ్ ॥

8. పరిధిపరిస్తరణ పూజనేషు అంగులి ప్రమాణం- శ్లో॥ అష్టమే నవమే చైవ దశమేకాదశే తథా సేచనం పరిధించైవ స్తరణం పూజనం క్రమాత్ ॥

9. పరిస్తరణ విన్యాసః - శ్లో॥ పరిస్తరణ దర్భాంశ్చ పరిధీ నపి సంధిషు ఉదీచ్యా నధారాన్ కుర్యాత్పిత్రే కర్మణ్యతూపరి। అగ్నిం షోడశభి ర్దర్భైః పురతస్తు పరిస్తరేత్। పరిస్తరణ మన్యే షా మేవం సంఖ్యా విధీయతే॥ శ్లో॥ పాత్రాణాంతు ద్విషట్కం స్యా త్ప్రణీతాసాదనం తథా। అష్టభిశ్ఛాదనం తస్య త్రిభిర్బ్రహ్మాసనం భవేత్। ద్వౌతు దర్భౌ పవిత్రంస్యా త్తథా ప్రత్యసనస్యచ। సమ్మార్జనం త్రిభి ర్దర్భై ర్జ్వలన స్త్వేక ఉచ్యతే। పర్యగ్ని కరణస్త్వేక మేవ మష్టోత్తరంశతమ్ ॥

10.పాత్రాసాదన - శ్లో॥ అగ్న్యాత్మనో రుదగ్దర్భా స్పమ్యగాస్తీర్య తేషుహి। దర్వ్యాదీని చ పాత్రాణి తత్తత్కాలేతు విన్యసేత్। ద్వంద్వం న్యంచితు పాత్రాణి దర్వ్యాదీని ప్రయోజయేత్। మానుషాణి సకృద్యోజ్యా న్యేకైకం పితృకర్మణి । దర్వ్యాజ్య పాత్రాణి సకృత్ప్ర యోజ్య వైకంకతీ ప్రోక్షణభాజనీ స్రుక్। ప్రణీత పాత్రేణ సహ ధ్రువారూ ణ్యప స్మృతేశ్చాఽపి ఘృత్యైశ్చ దర్వ్యా। ఇధ్మ స్యాధోముఖ గ్రస్థం తత్ర్యగ్భాగే నియోజయేత్। తదేవ విపరీతం స్యా దుత్తానం తు విధీయతే ॥

11.పవిత్ర లక్షణం - శ్లో॥ సమే ద్వే స్థౌల్య దైర్ఘ్యాభ్యాం సాగ్రే ప్రాదేశ సమ్మితే। పవిత్రే గ్రంథితే జ్ఞేయం దైవే కర్మణిచోదితే । సాగ్రాణి త్రీణి ప్రాదేశ సమ్మితాని సమానిచ । నైకమూలా న్యబద్ధాని పవిత్రాణీహ పైతృకే। విశ్వేదేవేషు దైవత్వా త్పవిత్రే ద్వేసమే ఖలు। శ్రాద్ధాంగ త్వాథ బద్ధేచ సర్వ మన్యత్సమం భవేత్। సమిత్పవిత్రం వేద్మంచ త్రయః ప్రాదేశ సమ్మితాః ద్విస్తావ దిధ్మం కుర్వీత త్రిస్తావ త్పరిధి స్మృతః॥

శ్లో॥ అప్రచ్ఛిన్నాగ్రకౌ దర్భౌ ఛింద్యా త్ప్రాదేశ సమ్మితౌ। అంతర్ధాయ తృణంవాసి కాష్ఠంవా ననఖేనతు। ఏవం సర్వత్ర కుర్వీత దర్భాణాం ఛేదనే తథా। ప్రక్షాళ్యాద్భి స్పముత్సృజ్య కృత్వాచ బ్రహ్మబంధనమ్॥

శ్లో॥ పవిత్రే ప్రోక్షణీ పాత్ర ముదగగ్రే క్షిపేజ్జలం। ఆనీయ పశ్చాదారభ్య ప్రోక్షణ్యుత్పవనం భవేత్। అంగుష్ఠా నామికాభ్యాంతు పాణ్యో రుత్తానతః పృథక్। గృహీత్వా మూలమగ్రంచ త్రిరుత్పవన మాచరేత్। ఏత త్ప్రోక్షణపాత్రాది త్రి రుద్యస్య సమానసమ్। ఆజ్యస్య పునరాహారా దన్య త్సర్వం సమంత్వివహ॥ పూర్ణపాత్రస్య చాజ్యస్య ప్రోక్షణస్య తథైవచ। పశ్చా దుపక్రమం కృత్వా పూర్వ ముత్పావయే ద్ధ్రువమ్। అజ్య స్యోత్పవనం తద్వ దుపక్రమ విధానతః। వ్యావృత్య పూర్వత స్సమ్య క్పున రాహార మాచరేత్। కృత్వోత్తానాని పాత్రాణి విస్రసేద్ధ్మం తు తజ్ఞలైః। ప్రోక్షయే త్తాని సర్వాణి ప్రణీతాః ప్రోక్షణీ సమాః। ప్రోక్షణార్థాని పాత్రాణి ప్రోక్షయే త్ప్రోక్షణీజలం। ప్రణీతార్థాణి పాత్రాణి త్రిః ప్రోక్షణ మతః పరమ్॥

12.పూర్ణపాత్ర స్థానం - శ్లో॥ పాత్రాగ్నో రన్తరం యత్త ద్ద్విపంచాంగుల మాత్రకం। పూర్ణపాత్రస్య తత్ స్థానం కపర్ద్యా దిభి దీరితమ్॥

13. బ్రహ్మాసన లక్షణం - శ్లో॥ అగ్నేర్దక్షిణ దేశేతు బ్రహ్మాణ ముపవేశయేత్। కులీనం వేదసంపన్న మాచారజ్ఞం తపస్వినమ్। షట్కర్మ నిరతం శాన్తం దయాలుంచ జితేన్ద్రియమ్। దక్షిణాం దిశ మాశ్రిత్య యమో మృత్యుశ్చ తిష్ఠతి । తదీయ దోషహరణే సమర్థం శాన్త తేజసమ్। అగ్రామయాజకం శుద్ధ మప్రతిగ్రహ లోలుపమ్। అసూయరహితం సత్యం సదా సజ్జన సేవినమ్॥

14.స్రుక్ స్రువసమ్మార్జనం - శ్లో॥ వామేన ప్రథమాం దర్వీం ద్వితీయాం దక్షిణేనవై। దర్భై స్సహైన సంగృహ్య హస్తాభ్యాం ప్రతి తప్యచ। వామాంగుళీషు తే దర్వ్యౌ ధారయే త్క్రమశోబుధః। ద్వితీయా ముపరిష్టాత్తు ప్రథమా మధ్య ఏవచ। వామేతరస్థ దర్భాగ్రై స్రువ మన్తః ప్రదక్షిణమ్। సంమృజ్య యత్నతః దర్భాగ్రైః త్రిః సమృజ్యాథ మధ్యతః। దర్వీమూల ముపక్రమ్య ప్రాచీం సమృజ్య యత్నతః। తదగ్రా న్మూల పర్యన్తం ప్రతీచీం బహిరప్య చ। దండం పూర్వవ దత్రాఽ_పి సమృజాథ యథాక్రమం। దర్భ్యా నద్భిస్తు సంస్పృశ్య వహ్నౌ యత్నేన హోమయేత్॥

15. ఇధ్మ లక్షణం - శ్లో॥ సమిత్కాష్ఠస్య చేధ్మస్య పరిధీనాం యథాక్రమమ్। స్థౌల్యం ప్రమాణం విజ్ఞేయం వృద్ధ వాక్యానుసారతః। కనిష్ఠి కాగ్ర పర్వణ్యో యావత్ స్థౌల్యం ప్రతీయతే। తావత్ స్థూలం సమిత్కాష్ఠం గృహ్య భాష్యాద్వినిశ్చితమ్। తథైవా నామికాగ్రస్య చేధ్మ కాష్ఠస్యమానతః। శిష్టాంగుళిత్రికస్యోర్ధ్వ మానాః పరిధయః ఖలు। తత్రాపి తారతమ్యాది కనిష్ఠాది క్రమా ద్భవేత్। సమిత్పవిత్రం వేదిశ్చ త్రయః ప్రాదేశ సమ్మితాః। ద్విస్తావ దిధ్మం కుర్వీత త్రిస్తావ త్పరిధి స్మృతః। ఆయామే నేధ్మ సమిధం ప్రాదేశ ద్వయ ముచ్యతే। వితస్తి మాత్ర మథవా సంఖ్యయా చైక వింశతిః త్రయః పరిధయోత్ర ద్వే ఆఘార సమిధావపి। అనుయాజ సమి చ్చైకా ఇధ్మం పంచ దశ స్తథా॥ యత్రేధ్మసాదనం తత్ర సమిత్సన్నహనం క్షిపేత్॥

(శ్లో॥ పలాశ ఖదిరా శ్వత్థ వైకంకత శమీ వటాః। వేణూదుంబుర బిల్వాద్యా గ్రాహ్యా స్సర్వత్ర శోభనాః। ఏషాం ద్రుమాణాం శాఖాశ్చ స్కన్ధ పర్వ వివర్జితాః। ప్రాదేశమాత్రా సత్వక్కాః ఋజవో దోష వర్జితాః॥ శ్లో॥ పక్షశుద్ధం పలాశంచ ఔదుంబరం దిన త్రయం। త్రి దినం పిప్పలన్నాహు రపామార్గం తు తద్దినమ్। ఖాది రార్క కుశా దూర్వా శమ్యః తాత్కాలికా భవేత్॥)

16.పరిధ్యాసాదనం - శ్లో॥ దక్షిణోత్తరయో ర్మూలే మధ్యమస్య యథాక్రమమ్। ఉపరిష్టా దధస్తాచ్చ నిక్షిపే త్పరిధీనిహ। సవ్యోత్తర కరేనాత్ర గృహీత్వోర్ధ్వం సమిద్ద్వయమ్। యుగపన్మధ్యమం స్పృష్ట్వా పరిధిం హుతభుగ్దిశి । ఊర్ధ్వం సంస్థాప్య విధివత్ రుద్రదిశ్యేవ మేవహి । సర్వత్రా- ఘూర సమిధామేవ మేవేతి సూత్రతః।

17.ఇధ్మ ప్రక్షేపణం - శ్లో॥ ఇధ్మాసాదనదేశే -నూ యాజ సన్నహనం క్షిపేత్ । దక్షిణేనాథ హస్తేన ఆదాయేధ్మం త్రి పంచకమ్ । సవ్య హస్తేన తత్సర్వం గృహీత్వాథ యథావిధి । ఏకం ద్వే గణయిత్వైవ చేధ్మం పంచ దశైవతు। సువ్రేణాజ్యం గృహీత్వాథ చేధ్మదారూణి సేచయేత్। ఆసనా త్కించి దుత్థాయ తత్రస్థి ర్త్వాహ్యైస్సహ । అనుజ్ఞాత స్తతస్తూష్ణీ మిధ్మాధానం ప్రకల్పయేత్। హస్తాభ్యాంచ గృహీత్వైవ ప్రహరే దుపవిశ్యచ। సమిత్సన్నహనే చైప సగ్గ్రావం తథైవచ। అఘూరే చేధ్మధానేచ స్వాహాకారంతు వర్జయేత్॥

18. అఘూరహోమః - శ్లో॥ అఘారహోమేచ సకృత్ గృహీత్వా దర్వ్యావృతిః స్యా దృజు సంతతం చ । స్వాహాది వర్జం జుహుయాద్యధావ దాసీన ఏవేతి కపర్దినోక్తం । అఘార హోమే ప్రథమే ద్వితీయ దర్వ్యాచ సకృద్గృహీత్వా । ప్రక్రమ్య కోణే పవనస్య దిశ్యా ముషర్బుధాయాన్తు హునేచ్చ తూష్ణీమ్ । ద్వితీయ మైన్ద్రం నిరృతేచ కోణే ప్రధానదర్వ్యాచ్య సకృద్గృహీత్వా । ఆశాం గిరీశస్య హునేచ్చ తద్వ దాఘూర యోర్నిర్ణయ ఏవ మేవ॥

19.చక్షుర్హోమః - శ్లో॥ అథాజ్యభాగౌ జుహుయా త్పూర్వార్ధే చక్షుషీ ఇతి। తయోరుత్తర ఆగ్నేయో దక్షిణే సౌమ్య ఉచ్యతే॥

20.ముఖాహుతిః - శ్లో॥ అగ్నిమధ్యేచ జుహుయా న్ముఖాహుతి రితి స్మృతా । తత్రైవా-న్యాశ్చ హోతవ్యాః పశ్చిమే త్వాజ్య భాగయోః కర్మస్వాషధి మధ్యేచ ప్రతేషుహి చతుర్ష్వపి। ముఖాహుతి రవశ్యంహి సర్వాచార్యై స్సునిశ్చితాః। ముఖాహుతిర్హి యత్రస్యా త్రుచా తత్రైవ హోమయేత్। సకృద్గృహీత్వా తత్రా-పి స్రువేణేతి వినిర్ణయః।

21.స్రువాహుతిః - శ్లో॥ ప్రథమాఘూర హోమశ్చ ప్రధానాహుత్యనన్తరమ్। యద్ధోతవ్యంతు త త్సర్వం స్రువేణోక్తం కపర్దినా ॥ పూర్వావఘారో జయాద్యంచ ప్రాజాపత్యం చ వ్యాహృతిః । పాహిత్రయోదశే చైవ ప్రాయశ్చిత్తాహుతి స్తథా । స్రువేణైవతు కర్తవ్యం నసందేహః కపర్దినా । యత్ర స్రువేణ హోమస్యాత్తత్రైవం జుహుయా ద్ఘృతమ్ । తేనై వాజ్యం గృహీత్వేతి నిశ్చిత్యోక్తం కపర్దినా ॥ శ్లో॥ ద్వితీయాఘూర హోమశ్చ ప్రధానాహుతయ స్తథా । ఆజ్య భాగౌతు సర్వత్ర స్రుచా హోమం కపర్దినా॥ స్రువేణైవాజ్య మాదాయ స్రుచిం సంపూర్య హోమయేత్ । యత్ర స్రుచాచ హోమస్యాత్ తత్రైవం హవినిర్ణయః॥

22.తిష్టద్ధోమః - శ్లో॥ తిష్టద్ధోమాన్ ప్రవక్ష్యామి పూర్ణాహుతి పురోగమాన్। అఘూర స్స్రుచ్య ఏవాన్యః ఫలీకరణ మేవచ। ఔదుంబర గతో హోమో లలాటే హోమమేవచ। లాజా నాంచ తథా హోమో వివాహేషు న సంశయః॥ గ్రంథాన్తరే- శ్లో॥ ఫలీకరణ హోమశ్చ జాతకర్మణి కీర్త్యతే। సౌమ్యవ్రతే సమిద్ధోమ మైన్ద్రాఘూర స్తథైవచ । పూర్ణాహుతిశ్చ శ్రౌతేహి లాజహోమో వివాహకే ।

చతుర్థ్యామాజ్య శేషేణ యోహోమో ౽ న్యే వివాహకే। వధ్వా శిరసి చోంకార చతుర్థ్యన్తం లలాటకే। వ్యాహృతీభిః సహోమశ్చ తిష్ఠన్నేవ నసంశయః॥ ద్వితీయఘార హోమశ్చ పూర్ణాహుతి ర్ద్వయం। శ్రౌతకర్మణి తిష్ఠంత్యా త్స్మార్తే ఆసీన ఏవహి। దర్వ్యాచ విహితో హోమః స్మార్త కర్మసు యత్రవై। తత్రాసీనే న హోతవ్యం పరిభాషా విధానతః॥

23.అనుయాజ సమి ధిధ్మ సన్నహన ప్రక్షేపణం - శ్లో॥ సమిత్సన్నహనం కుర్యాత్ప్రధానాహు త్యనన్తరం। నత్వన్యథేతి నిశ్చిత్య తత్రై వోక్తం కపర్దినా॥

24.జయాదిహోమః - శ్లో॥ పూర్వ మాసద్వయా దగ్నే న భావతి జయాదికాన్। మతాన్తరేణ కేనా -పి కే చి న్నేచ్ఛన్తి సూరయః॥ ప్రయోగసారే- శ్లో॥ మాసత్రయా త్ర్వాశ్యది తత్ర కుర్యా త్ప్రధాన మగ్నేర్న జయాదిహోమః। కుర్యా జ్జయా దీంశ్చ తతః పరస్తా త్తత్సర్వ పూర్వేద్యు రపాస్య హోతా। చిత్తాది మన్త్రేషు యథా క్రమేణ మన్త్రాది శబ్దాది హితంతు దైవమ్। అభ్యాత హోమేషు తదాదితశ్చ పదత్రయే ణాభిహితస్తు దైవమ్। పిత్రాది హోమే పితరః పితామహాః పరే వరే చా౽ పి తత్పితామహో। విశ్వేచదేవాఅథవా౽ త్ర దేవతాః పరం రాష్ట్ర భృతః క్రమేణ। స్థితే తాతే త్యజే దత్ర విషమస్య పదత్రియమ్। పితామహో యుగ్మ సంస్థా ఉభయోర్షప ఏవచ॥

25.జయా దగ్ని ముఖ కర్తవ్య కర్మాణి - శ్లో॥ వివాహే యదృతే ప్రాయశ్చితే గేహ ప్రవేశనే। సమావర్తన సీమన్త చౌల పుంసువ వాస్తుషు। చతుర్థహోమోపనయే త చ్చతుర్థ్యాం తథైవచ। అగ్రయణే సర్వబలా వగ్నిముఖం జయాదయ। అష్టకాసుచ దధ్యన్న హో మేశాన బలావపి। వృషోత్సర్గే చ సంసర్గే గోదానాఖ్యవ్రతే తథా। అధ్యా యోపాకర్మణీ చ వ్రతే షూత్సర్జనేషు చ। ముఖాహుతి శ్చాగ్నిముఖం కర్తవ్యాశ్చ జయాదయః॥

26. జయాది వర్జ్య కర్మాణి - శ్లో॥ సర్వబల్యుత్సర్జనే చ మాసి శ్రాద్ధే తథైవ చ। గృహస్థూణావిరోహాది ప్రాయశ్చిత్తేషువై తథా। పార్వణ్యహోమే నా౽ గ్నేయ స్థాలీపాకే జయాదయః। నవిద్యతే- గ్నిముఖంచైవ తథైవా ౽ త్ర ముఖాహుతి॥ గ్రన్థాన్తరే - శ్లో॥ ఆగ్నేయాగ్రయ ణేశాన మాసిశ్రా ద్ధాష్టకాసు చ। దధ్యంజలి సపిండాఖ్య క్రియాసు న జయాదయః॥

27.స్విష్టకృద్ధోమః - శ్లో॥ ఉక్తా ముఖాహుతిర్యత్ర ప్రధానాహుత్యనన్తరమ్। తత్రాగ్నయే స్విష్టకృతే స్వాహేతి స్విష్టకృద్ధునేత్। స్థాలీపాకేషు సర్వేషు చరుణైవ విశేషతః। స్విష్టకృ జ్జుహుయా ద్విద్వా న్నాన్యథేతి వినిర్ణయః॥

28.పరిధి ప్రహరణం- తత్రా వృత్తరార్థ స్యాగ్ర మంగారేషూ పోహతీ త్యుక్త రీత్యా తథైవ ప్రహరేత్। శ్లో॥ ప్రహృత్య మధ్యమం పరిధి మితరౌ యుగపత్ క్షిపేత్। దహన్యామపరిధ్యగ్ర మంగారేషూహ చ పోహతి। వ్రతేషు సవనే చైవ తథై వాధ్యయనే మఖే। పరిధి ప్రహరణం కుర్యా ల్లేప కార్యం నవిద్యతే। ఆఘార సమిధా వగ్నౌ సర్వ కర్మసు నిక్షిపేత్। అదధాతీతి సామర్థ్య న్నిశ్చిత్యోక్తం కపర్దినా॥

29.పరిధి ప్రహార నిషేధం - శ్లో॥ జయాద్యా శ్చాహుతీ ర్హుత్వా శమ్యానాంచ విమోచనమ్ । పశ్చిమాయాన్తు పూర్వం స్యా దన్యయో ర్యుగప త్తతః । వ్రతేషు శాన్తి హోమేషు విభ్రష్టేష్టా వృషోత్సజే। చరోః ప్రధానకే చైవ శమ్యా శ్చైవ నసంశయః। ప్రధాన హోమే యద్భుతాది హోమే ప్రవేశ హోమేచ చతుర్థి హోమే । అంత్యస్య సమ్య గృదయస్య సర్గ ఇత్యేషు శమ్యాః ప్రవదన్తి తద్జ్ఞాః। చౌల గోదాన సీమన్త స్నానోద్వాహోపనాదిషు । ప్రాయశ్చిత్తే ప్రహరణం న ప్రహార స్సవనే భవేత్ ॥

30.సర్గ్ స్రావ హోమః - శ్లో॥ స్రువాగ్రం స్రుఙ్ముఖే స్థాప్య స్రుచ మప్యాజ్య పూరితాం । ఉభావపి కరాభ్యాంచ విపర్యాసేన ధారయేత్। యథా బ్రహ్మ యథా కామ దేవతా చోపవిద్యతే। నాశం ప్రాప్తాః పరిధయో యత్రస్య ర్గృహ్యా భాష్యతః । తత్ర త త్రాఽ భిసామర్థ్యా త్సంస్రావోఽ పి విధీయతే॥

31.సర్గ్గం స్రావ నిషేధః - శ్లో॥ శమ్యా యత్ర విధీయన్తే గార్హ్య కర్మసు సూత్రతః। సంస్రావస్తు న తత్రస్యా దభిశబ్ద వియోగతః ॥

32.ప్రాయశ్చిత్తాహుతయః - శ్లో॥ అనాజ్ఞాత త్రయోఽ గ్నిస్యా త్వన్న స్సత్వన్నయో ర్గతే। అభి ర్గీర్భి రితీన్ద స్యా ద్ధరి వాశ్చేతి దేవతాః । ఇదం విష్ణుశ్చ విష్ణుస్యా త్సర్వ చిత్తే ప్రజాపతిః । సర్వ చిత్తేతి భూర్భువ స్సువరితి సర్వ ప్రాయశ్చితే ప్రజాపతి ర్దేవతే త్యర్థః ॥

33.పూర్ణాహుతి లక్షణం - శ్లో॥ ఆజ్యం ద్వాదశ కృత్వస్తు గృహీత్వా పూరయే త్స్రుచమ్ । తయా చాజ్యాహుతిః కార్యా సా పూర్ణాహుతి రిష్యతే। స్రుచా పూర్ణాహుతి ర్వాస్యా దిత్యేతే యాజ్ఞికా విదుః ॥

34.పూర్ణాహుతి నిషేధ కర్మాణి - శ్లో॥ వివాహాది క్రియాస్సర్వాః శాలాయాం వాస్తు హోమకే । వ్రతబన్ధేచ మోక్షేచ పూర్ణాహుతిం నకారయేత్ ॥

35.పూర్ణాహుత్యుక్త కర్మాణి - శ్లో॥ శాన్తించ వేదవ్రత తంతుమత్యా వృషోత్సృజేషు గ్రహా యజ్ఞ.... పాహి । కామ్య వ్రతేష్వేచ సపాష్టి కేషు కుర్యాచ్చ పూర్ణాహుతి నాన్యథా స్యాత్ ॥

36.పూర్ణపాత్ర వర్ణనం - శ్లో॥ ప్రణీతా మార్జనంకుర్యా త్సార్ధ కర్మణ్యమన్తకమ్। పురతః ప్రస్తరస్థానే తూష్ణీమాసాద్య యత్నతః । పూర్ణపాత్రం తత స్తత్ర అప ఆనీయ తజ్జలమ్ । హస్తే నామన్త్రకం తత్ర ప్రాగాదిష్వేవ పంచసు । దిక్షు సమ్మార్జనం కృత్వా తచ్ఛేష మవనౌ క్షిపేత్ । భూమిష్ఠమేవ తత్తోయం శిరసి ప్రోక్షయే త్తతః। భార్యయా అంజలౌశేషం నినయే త్ప్రయతో ద్విజః। బ్రాహ్మణే దక్షిణాం దత్వా తముద్వాస్య స్వశక్తితః। సదః పూజాంచ కృత్వాఽ థ ఆశీర్వచన మాచరేత్॥

(ఇతి సర్వ కర్మ సాధరణ అగ్నిముఖ కారికా స్సమాప్తా)

గ్రంథాన్తరే - " నాఘారౌ నాజ్యభాగేచ నచేద్ధ్మం న జయాదయః । చతుష్పాత్ర ప్రయోగేతు నిశ్చిత్యోక్తం కపర్దినా। ప్రాయశ్చిత్తేషు హోమేషు చతుష్పాత్రవిధానతః । నాఘారే చక్షుషీనైవ ప్రణీతీధ్మంవినాకృతమ్ ।"



## అనుబంధము - 15

# కుంభకోణ కల్యాణ విషయములు

కుంభకోణం శ్రీ కోమలవల్లీ సహిత శ్రీ శార్ఙ్గపాణి స్వామివారి దేవాలయమున జరుగు కల్యాణోత్సవమునందలి అంశములు -

(ఆర్.వి.వి. గోపాలాచార్యులు, పొందూరు గోవిందాచార్యులు మరియు శ్రీ ఎల్. వేంకటేశన్ (తిరుపతి) 27.8.2003న కుంభకోణంలో వారివద్దకు వెళ్ళినపుడు అక్కడి అర్చకస్వామి శ్రీమాన్ వి. శేషాద్రి భట్టాచార్ గారు స్వయముగా వారి గ్రంథం చూపిస్తూ చెప్పిన అంశములు.)

మూలవర్లనుండి ఉత్సవులకు ఆవాహన - కల్యాణ మండపమునకు వచ్చుట - నవకలశ స్నపనం - తిరుమంజనం - ఆరాధన, నైవేద్యం - అలంకారం (స్వామివారికి, లక్ష్మీదేవికి విడివిడిగా) - యాత్రా (గ్రామోత్సవం, ప్రాసాద ప్రదక్షిణం) - మాలమార్చడం (ఎదురుకోలు) - ఉదుత్తర మారోహన్తు అను ఋక్‌తో నిశ్చితార్థం - డోలోత్సవం, అర్ఘ్యపాద్యాద్యారాధన - ఘృత భక్షణము, అపూపాదుల నైవేద్యము - పరిషత్ "నమస్సదసే..." - పుణ్యాహవాచనం (వాసుదేవ పుణ్యాహవిధి, ఏకకలశతో సుదర్శనవాహన, వాస్తోష్పతేతి మంత్రంతో ప్రోక్షణ) - విష్వక్సేన పూజ (కూర్చయందు గాయత్రితో ఆవాహన) - శౌరి అనుజ్ఞ, రమాదేవి అనుజ్ఞ - పాలికా పూజ - అపరాజిత మంత్రంతో రక్షా సూత్రవాహన, శ్రియావాహన, షోడశోపచార పూజ, ఇక్కడే మాంగల్య పూజకూడా, విశ్వేత్తాతే మంత్రంతో ఇద్దరికీ కంకణ బంధన - అంకురార్పణ (పుష్పాంకురార్పణ, ఎనిమిది పాలికలయందు విష్ణువును ఆవాహన, సోమకుమ్భము లేదు) - అగ్ని ప్రతిష్ఠ, కుండమున దేవుని అమ్మవారిని ఆవాహన, బాలాగ్ని ఆవాహన, గర్భాదానాది సంస్కారములు, పెరుమాళ్ళ ఆవాహన, సమిధాజ్య చరు హోమం -

ప్రవర :- కశ్యప గోత్రోద్భవాయ (ఋషులు లేరు) వాసుదేవ శర్మణో నప్త్రే, నారాయణ శర్మణః పౌత్రాయ, విష్ణుశర్మణః పుత్రాయ, శ్రీ అపర్యాప్తామృత శర్మణే వరాయ (ఇలా చెప్పడం అక్కడ ఆచారం)ః భార్గవ గోత్రోద్భవాం...భృగు శర్మణోనప్త్రీం, భార్గవశర్మణః పౌత్రీం, శ్రీ అంబరీష (హేమర్షి) వర్మణ పుత్రీ,ం శ్రీ కోమల వల్లీ నామ్నీం .. మధుపర్కం (పంచామృత మధుపర్కం).

పాణిగ్రహణం :- ఓం నమః పుండరీకాక్ష నారాయణ జగన్మయ । అభిరామ స జీవేశ పీతామ్బర సముజ్జ్వల । క్షీరసాగర సంభూతాం పారిజాతాది సోదరీమ్ । సర్వ లక్షణ సంపన్నాం సర్వాభరణ భూషితామ్ । మహాలక్ష్మీ మిమాం కన్యాం తుభ్యం దాస్యామి విష్ణవే - గృహాణ జగతాం యోగ క్షేమాయ పురుషోత్తమ ॥ కన్యాం కనకసంపన్నాం .... మహాలక్ష్మీం మమసుతాం సహధర్మ చరీతవ । తీర్థదాన పురస్సరం ... తుభ్యమహం సంప్రదదే ॥

**మాంగల్యధారణ** :- "ఇందిరే వికసత్పద్మ మందిరే లోక వన్దితే । నమః పంకజ మాలిన్యై నమస్తే అమృత యోనయే । సముద్ర తనయే మాతః లక్ష్మీస్త్వాం ప్రార్థయామ్యహం । మాంగల్య సూత్రం దేవేన యుష్మత్కంఠే సమర్పణే । నియోజితోహం బధ్నామి గృహాణ పరమేశ్వరీ ।" ఇతి విజ్ఞాప్య 'మాంగల్య తంతునానేన' మాంగల్య సూత్రం కంఠే బధ్వా ।

**హోమం - అగ్ని ప్రదక్షిణలు** -

**లాజహోమం** :- విష్ణుగాయత్రితో 12 సార్లు ఆజ్యం, లక్ష్మీగాయత్రితో 12 సార్లు సమిధలు, భూగాయత్రితో 12 సార్లు చరువు - పురుష సూక్త హోమం - పంచోపనిష న్మంత్రములతో ప్రాయశ్చిత్తహోమం - కుక్కుటాండ ప్రమాణమున చరుపిండముతో పూర్ణాహుతి - అగ్ని ఉద్వాసన

వారణమాయిరం - అపరాధ క్షమణం - ఆశీర్వాదం - చదివింపులు

(ఘృతారోపణ, అక్షతారోపణములు లేవు. వాస్తుపూజ, యోగేశ్వర పూజలు పాంచాహ్నికమున ఉండవచ్చు, ఒక పూట కల్యాణమున ఇవి ఉండవని చెప్పినారు.. వీరు బ్రహ్మోత్స వాంతర్గతముగా 7వ దినమున కల్యాణోత్సవం చేస్తున్నారు. పాలతో కాళ్లు కడగడం, చిత్రాన్నంతో దిష్టితీయడం వంటి లౌకికాచారాలు ఇక్కడి కల్యాణమున ఉన్నవి.)

వాస్తుపూజ - కుంభకోణమున విగ్రహవాస్తు పూజ కన్పించుచున్నది. మంటప దక్షిణ పార్శ్వమున భూమియందు ధాన్యపీఠముపై "నీలజీమూత సన్నిభం దంష్ట్రాకరాళవదనం ... వాస్తునాథం" తండులేన విలిఖ్య । పరిస్తీర్య । వాస్తుపూజాం కరిష్యే । పుణ్యాహవాచనం । తజ్జలేనవాస్తుపురుష ప్రోక్షణ । వాస్తుపురుషావాహన, ఓం వాస్తుపురుషాయనమః ఇతి ఆవాహ్య అభ్యర్చ్య ।

వాస్తుపురుషస్య శిరసి ఓం అంశుమాలినే నమః, దక్షిణ బాహుమూలే ఓం జటాధరాయనమ, కూర్పరే ఓం కుమారాయనమః, హస్తే ఓం వినాయకాయ నమః, పాదయోః ఓం అశ్వినీదేవేభ్యో నమః, మధ్యే ఓం చంద్రమసే నమః, హృదయే ఓం విష్వక్సేనమః, నాభిదేశే ఓం బ్రహ్మణే నమంః - ఇతి ఆవాహ్య అభ్యర్చ్య । ఆపైన అష్ట దిక్పాలకావాహన, ఉత్తరమున క్షేత్రపాలకావాహన, మాషాన్న నివేదన.

వాస్తునాథునికి ఉత్తరమున విధ్యుక్తముగా అగ్ని ప్రతిష్ఠాపనము - వాస్తుహోమము అర్ఘ్యాది నైవేద్యాన్తం - ఘృతమున తన్మంత్రమున హవనము, పంచోపనిష న్మంత్రములతో శతాహుతులు, ఆఘార సమిధలతో వాస్తునాథాస్వాహేతి 108 ఆహుతులు - మూలమంత్రమున, పురుష సూక్తమున ఆహుతులు, అంశుమాలి మొదలగు వారలకు ఆహుతులు, కొబ్బరి ఆకులను వెలిగించి దేవాలయము చుట్టూ త్రిప్పి పర్యగ్నికరణం - "యక్షా పిశాచా నాగాశ్చ అసురా రాక్షసాగ్రహాః సర్వేతే వ్యపగచ్ఛంతు బలిం తుష్టా యథాతథం" అంటూ మాషాన్న ఉదకములతో బలినివ్వడంతో వాస్తుపూజ సమాప్తం. ఇదే విధంగా ద్వారతోరణ పూజయందు కూడ తోరణముల పేర్లు, అధిదేవతల నామాదులు ఇక్కడి వారివీ చాలవరకూ ఒకే విధముగ ఉన్నవి.



# చోర లక్ష్మీ సంవాదములు

## 1. చోరసంవాదము (మూలము - ఆంధ్రానువాదము)

1. సంపాదితార్థః పరకాలసంజ్ఞః శ్రీమన్మహాభాగవత శ్చిరేణ ।
శ్రీవైష్ణవారాధన మేవ కుర్వన్ భూమావతిష్ఠ ద్ధరిదాసదాసః ॥

శ్రీమంతుడై తొలుత చిరకాల మొకరీతి
శ్రీవైష్ణవోత్తముల నారాధనము జేసి
ధరణి నేలెనునాడు ధనముతృణమనిఎంచి
హరిదాసదాసుడైపరకాలుడనుప్రభువు.

2. కాలేగతే కతిపయే త్వథ సంచితార్థరిక్తో బభూవ పరకాల కవిస్తదానీం
చౌర్యేణ వాసమపహృత్య ధనంనృపాణా మారాధయామి కమలాధవపాద భక్తాన్॥

కాలమ్ము గడువగా కరగిపోయినది సిరి
పట్టుదలతో ధరణిపతుల ధనమును దెచ్చి
కమలాధవుని పాద భక్తులను గొల్తునని
శూరుడాతడు నిలిచె చోరుడై యానాడు.

3 ఇత్థంవిచిన్త్య మనసా దృఢబద్ధ కేశః నీలాంబరేణనిబిడం వినిబద్ధ కచ్ఛః
కుంతంచ ఖేట మసి ముత్తమమాశుధృత్వా మార్గాటవీంసమభియాయ బలేనదస్యుః॥

నీలవస్త్రము తలకు జుట్టి యాచోరుండు
కాసెకోకను బిగియగట్టి కడుదృఢముగా
కత్తి బల్లెము డాలు కరములందున బట్టి
తన బలముతో నడవి దారులన్ దిరుగాడె.

4. స్థిత్వా నిలీయ గహనే ఽచలసానుభూమౌ మార్గే లతాద్రుమయుతే దృఢగుల్మజాలే
నిమ్నోన్నతావనితలే పరకాలనామ చోరో జహార వసుమార్గ గతాగతానాం॥

మిట్ట పల్లములున్న కొండచరియలతోడ
అడవితీగెలుచెట్లు దట్టమగు పొదలతో
నిండి నిబిడమ్మైన కొండదారుల గాచి
దోచసాగెను వచ్చిపోవు ధనికులనెల్ల.

5. ఇత్థం ధనం సమాహృత్యవైష్ణవారాధనం ముదా
ప్రకుర్వ న్ననయ త్కాలం చోరః కలిజితాహ్వయః ॥

6. భక్త ప్రీత్యా హరిస్తస్మై స్తేయందత్వా వనాంతరే
తదీయారాధనం ధర్మ మైచ్ఛ ద్వృధితుం భువి ॥

7. తతో వనాంతరంగత్వా చోరః కలిజిదాహ్వయః
ద్రుమగుల్మలతాకీర్ణం ప్రాపమార్గం దురాసదమ్॥

ధనమిటుల గడియించి తనియవైష్ణవులెల్ల
ఆరాధనముజెసె నాతడట ముదముతో-
కలిజిదాహ్వయుడగుచు కాలమ్ము గడిపెగా
వైష్ణవార్చనజేయ విభుధు చోరుండగుచు.
భక్తులన నెనలెని ప్రీతిగల్గిన హరియు
కరుణతో నాతనికి దోపునిడి అడవిలో
పుడమిపై "తదీయారాధన" మ్మనెడి
ధర్మమును వృద్ధినందింపగా దలపోసె.
ఒక్కపరి నేరీతి ధనము దొరుకకయున్న
విష్ణు భక్తుల కడుపు నింప నా తస్కరుడు
ఉపవాసముండి శ్రీవైష్ణవుల కన్నమిడె
తిరిగి అడవికి పయనమయ్యె ఖిన్నుండగుచు.
కలిజిదాహ్వయుడైన ఆచోరుడాపైన
అడవిలో చొరబడుచు అతిప్రయాసమ్ముతో
పొదలు తీవలు చెట్లతోడ దట్టమ్ముగా
నిండి నిబిడమ్మైన కొండదారులదిరిగె॥

8. ప్రతీక్షమాణో ధనవ జ్జనాగమం పథిస్మరన్ చేతసి వైష్ణవార్చనమ్
తదీయ పాదాంబురుహాభివందనం స్మృతి ప్రకర్షాచ్ఛిరసా చరన్ స్థితః ॥

ఎదురుజూచును మార్గమందుధనికులరాక
మదిదలచు శ్రీవైష్ణవార్చనము జేసినటు
అవ్వారిపద కమలములయందు భక్తితో
తలవంచిమ్రొక్కినటుదలపోయుస్మృతులలో.

9. ఏవంస్థితే కలిధ్వంసే హరిర్మానుషరూపభాక్
ఆజగామ శ్రియాసార్ధం సానుగో భక్తవత్సలః॥

కలిజితుండారీతి కనిపెట్టుకొనియుండ
భక్తవత్సలుడు హరి మనుజుడై ఏతెంచె

అనుగుణమ్ముగ లక్ష్మి తనవెన్క తోడురా
పరివారమాపైన వెనువెంట కదలిరా ॥

10. భాస్వ త్కిరీట మణికుండల కంఠభూష కేయూరహార కటకాది విభూషణాఢ్య
పీతాంబరః కనక నూపుర కంకిణీకోనర్ఘాంశుకాభరణ సంచయవాన్మురారిః॥

11. ముక్తా ప్రవాళమణికాంచన చిత్రవర్ణైర్గ్రైవేయ హారరశనా మణినూపురాద్యైః
భాంత్యాశ్రియాసహ తటిత్సదృశాంగకాన్త్యా వక్త్రప్రభాహసిత పూర్ణశశాంక కాన్త్యా॥

12. వీణామృదంగ పటహానక గోముఖాద్యై ర్విధ్వానయన్ గగన మాధృత భక్త సంఘైః
శ్వేతాతపత్ర మణిచామర కేతు సంఘై స్సంసేవితో హరి రరణ్య పథం జగామ॥

వెలుగులిడు మకుటమును మణికుండలమ్ములను
కంఠభూషలు కేయూర హారమ్ములున్
కటకాది సద్భూష ణాఢ్యుడై వెలుగొంది
పీతాంబరముదాల్చి కనకనూపురములన్
కింకిణులు రవళింప కదలెనా శ్రీవిభుం
డనర్ఘమ్ము లంశుకాభరణ తతులతో ॥
కదలివచ్చినది సిరి హరివెంటనంటితా
ముత్యాలు పవడములు మణులు బంగారమ్ము
చిత్రవర్ణములీను కంఠభూషలదాల్చి,
హారముల్ మొలనూలు నూపురమ్ములు వెలుగ
మెఱపుటీవెనుమించు తనుకాన్తిపుంజముల
ముఖకాన్తి యాపూర్ణచంద్రుగని హసియింప॥
వీణామృదంగములు పటహముల్ గోముఖము
గగనవీథిన్ మ్రోయ అడవిజేరెను హరియు
మణిచామరలు పట్టుగొడుగులున్ ధ్వజములున్
గొని భక్తసంఘముల్ తననుసేవింపగా.

13. శృత్వా నినాదం పరకాల సంజ్ఞః చోరస్తదానీం ముదితాన్తరాత్మా
నిరీక్ష్య భృత్యాన్ సుసమాహితాస యూయం సమాయాతి నరాధిపోఽత ॥

14. ఇతీరయిత్వా వచనం ససంజ్ఞం స్వయం సమాబద్ధ పటో ధృతాసిః
సమాహిత స్తేయ విధౌ విలీనః కుంజాంతరేషు ద్రుమషండమధ్యే॥

ఆరవము వినినంత లోలోన ముదమంది
తనవారిగని పల్కె తస్కరుడు వెనువెంట
కదలవలె మీరిపుడు కడుజాగరూకులై
కావచ్చు వచ్చువా డొక ప్రభువు, త్వరపడుడు.
సహచరులనారీతి అదలించి చోరుండు
నడుము గట్టిగ గట్టి, ఖడ్గమును చేబూని
మనమునందున చౌర్యవిధిని చక్కగదలచి
పాదలననగుచు, చెట్లచాటుగొని కదలెగా.

15. సనృత్త గీతాది మహోత్సవేన సమాగత స్యాశ్రితవత్సలస్య
సుదుర్గహారణ్యపథే మురారేః ఛత్రాది వస్తూని జహార చోరః ॥

16. భూయస్సమాగత్య సహానుగో యః మహార్హ వస్త్రాభరణాని సర్వం
జహార చోరః పరకాలనామా తథాపి తృప్తిం నయయౌ తదానీం॥

నృత్య గీతములతో వాద్య ఘోషలతోడ
అటు మహోత్సవముగా వచ్చువారిని నిలిపి
ఆభక్తవత్సలుని భూషణమ్ముల తోడ
ఛత్రాది వస్తువుల గొని చోరుడేగినను
సహచరులతో తిరిగి వచ్చె యా వెనువెంట
విలువైన వస్త్రముల నాభరణములనెల్ల
దొంగిలించినకాని మరిదేనికోసమో
తృప్తినందడుగదా పరకాలుడానాడు.

17. పున స్సమాగత్య సుపాదపీఠం అనర్ఘ రత్నోజ్జ్వలితం మురారేః
లక్ష్మీ పదాంభోరుహ భూషణంచ హృత్వా సుతృప్తః ప్రయయౌ జవేన॥

మరలివచ్చెను దొంగ సహచరులు వెంటరా
వెలుగులిడు మణులున్న హరిపాదపీఠమును
శ్రీదేవి పదకమల భూషణమ్ములనెల్ల
దోచి యాపై మిగుల సంతృప్తుడై వెడలె.

18. తతః ప్రాహ హరిం లక్ష్మీ చోరేణేదం విభూషణమ్
త్వత్సన్నిధౌ హృతం సర్వం త్వచ్చౌర్యం క్వగతం హరే॥

అంతనా శ్రీదేవి హరిని ప్రశ్నించినది
" మీ ఎదుటనే దొంగ నా భూషణమ్ములను
పదపీఠమాదిగా సర్వమును హరియింప,
శ్రీహరీ మీ చౌర్య మేమూల దాగెనో? "

19. ఇతీరితః సురశ్రేష్ఠో రమయా పురుషోత్తమః
ధైర్యగాంభీర్య జలధిః తదా స్మేరాననోభవత్

అటుల శ్రీసతి తనను ఎకసక్కెమాడ నా
పురుషోత్తముడు ధైర్య గాంభీర్య జలధియన
చిరునవ్వు మోముపైవెలుగొంద తనచూడ్కి
పరివార జనులపై బరపె మెల్లగ నంత.

20. అధ తత్ర నిరీక్ష్య సర్వ దాసాన్ ప్రియ సేనాపతి తార్క్ష్య ముఖ్యాన్
అవద త్కరుణా నిధి ర్భవంతో హృతవిత్తం పరిశోధయన్తుచోరమ్॥

21. ఫణీశ సేనేశ విహంగమేశా స్తదా స్వభృత్యైస్సహ తే ప్రజగ్ముః
ఇతస్తతస్తం పరిమృగ్య చోరం వనాంతరే తే దదృశు ర్మహాన్తః ॥

అటనున్న పరివారమందు నిలచినయట్టి
సర్వ సేనాపతిని ఖగపతిని శేషునిన్
పరివారముఖ్యున్ గనియాజ్ఞ నిడెను హరి
'వెదకి చేకొనిరండు విత్త చోరుని నేడు'.
సేనేశ ఖగేశ ఫణీశు లాపైన
పరిజనులు వెంటరా బయలువెడలిరి వనిన్
అందందు చోరుకై శోధించి శోధించి
అడవి నడుమన కడకు గాంచిరా చోరునిన్.

22. సేనానీ ప్రముఖాంశ్చ సోపి మహాతో భక్తాన్ హరేస్స్వాగతాన్
దృష్ట్వోత్థాయ వినమ్య చాహ వచనం కేవా భవన్తః కుతః

సంప్రాప్తాః పరిగృహ్యాతా ముపచితి ర్వ్యష్మాభి రిత్యబ్రవీత్
శ్రీమద్భాగవతార్చనేతి రతిమాన్ చోరో కలిధ్వంసకః ॥

అటుల వచ్చిన యట్టి హరిభక్తులందరిని
సేనేశ ప్రముఖులన్ జూచియూ చోరుండు
లేచి ఎదురేగి తా వంగి వందనములిడి
మీరలెవ్వరు? ఇటకు ఎటనుండివచ్చితిరి?
నాదు ఉపచారముల స్వీకరింపుడు స్వామి
అనిపల్కె భాగవత పూజాన్వితాత్ముడై.

23. ఊచు స్తమాలోక్య ఫణీశ్వరాద్యాః దాసా వయం చోర రథాంగపాణేః
తస్యైవవిత్తం పురుషోత్తమస్య హృతం త్వయా త్వద్గ్రహణేను శిష్టాః ॥

24. త్వయా హృతం విత్తమిదం ప్రగృహ్య శీఘ్రం త్వమాగచ్ఛ విభోః పురోనః
మాతే భయంచాస్తు హృది వ్యథాతే దయాక్షమా సాగర ఏష నాథః ॥

వారలా తస్కరుని గాంచిబదులిడి రిటుల
వినుము చోరుడ చక్రపాణి దాసుల మేము
నిన్ను గొనిపోవగా నియమించె హరి మమ్ము
పురుషోత్తముని విత్త మపహరించితి వీవు.
దొంగిలించిన విత్తమెల్ల చేకొని నీవు
వెనువెంట మావెంట విభుముందు నిలువుమా
నీకే భయములేదు హృదినివ్యథ నందకుము
దయకు క్షమకును సంద్రమయ్య నాస్వామిహృది.

25. లీలా మనుష్య వపుషః పరివీక్ష్య భక్తాన్ ప్రోవాచతస్కర జనోస్యపతీ స్వశౌరేః
త్వద్దాసమత్ర భవదీశ్వర సన్నిధానం సమ్ప్రాపయన్త్వితి హృతాభరణం భవన్తః॥

లీల మనుజులరూపు దాల్చి నిల్చిన విష్ణు
భక్తులన్ గనిపల్కె తస్కర విభుండపుడు
తమదాసుడను నేను, భవదీశ్వరుని కడకు
గొనిపొండు నన్ను, నేదొంగిలిన సొమ్ముతో.

26. తతస్తు సేనేశ విహంగనాథ  ఫణీశ్వరాద్యాః పరిగృహ్య చోరమ్
శీఘ్రం నయాన్తిస్మ హరేస్సమీపం స్వాజ్ఞాకరం స్తేనవరం దయాళోః ॥

అనిన యా సేనేశ ఖగేశ్వరాదులా
స్వాజ్ఞాకరుండైన పరకాల రాజేంద్రు,
హరిభక్తు, చోరవరు జేర్చినారాపైన
అతి దయాళుండైన హరి సమ్ముఖమ్మునకు ॥

27. దృష్ట్వా సమాగతంచోరంహృతవిత్తం దయానిధిః
శ్రీపతిః పురుషశ్రేష్ఠః ఇదంవచన మబ్రవీత్॥

బలముతో ధనమెల్ల దోచుకొని ఈరీతి
నెదుట నిలచిన చోరశేఖరుని వీక్షించి
పురుషశ్రేష్ఠుడు దయానిధియౌరమాధవుడు
పలికె నీరీతిగా పలు ప్రశ్నలనుగూర్చి ॥

28. కావాఖ్యాతే చోర ? కా జన్మభూమిః? కోవాబన్ధుః? కస్యపుత్రోఽసి దస్యో ?
కా వా మాతా? కస్య భూపస్య భృత్యః? కస్మై విత్తం సంభృతం త్వందదాసి?

చోర నీపేరేమి? జన్మస్థలంబెద్ది?
బంధులెవ్వరు నీకు? తలిదండ్రు లెవ్వారు?
ఏరాజునకు నీవు భృత్యుడవు తెల్పుమా?
ఎవరికిచ్చెదవీవు ఈధనమ్మంతయును.

29. చిత్రం చోర ! బలంతవాస్తి బహుళం హర్తుం మదీయం బహు
స్వర్ణం రత్నయుతంచ కుండలయుగం ఛత్రం ధ్వజాన్ చామరే
క్రోధోనాస్తి మమ త్వయీహ గహనే పూర్వం రఘూణాం పతేః
సూను స్వస్య కుశీలవౌ యుధి యథా సర్వం త్వయా కథ్యతామ్॥

రత్నకుండలములన్ ఛత్రచామరములన్
ధ్వజములాదిగ నాదు అభరణములనెల్ల
దొంగిలించిన శక్తి గలవాని నినుగాంచ
చిత్రమదియేలనో క్రోధమేర్పడదు హృది

పూర్వమా కుశలవులతోడి యుద్ధమునవలె
గాన సర్వము నీవె చెప్పుమా వివరముగ ॥

30. చోరస్తు మానుషంమత్వా మాధవం మనుజేశ్వరమ్
నిర్భీకః ప్రాహ సువ్యక్తం వచనం పరమార్థవిత్॥

చోరుడా మాధవుని మనుజేశ్వరుండైన
మనుజుడని తలపోసి నిర్భయుండై నిలచి
చక్కగా వివరించి చెప్పినాడీరీతి
పరమార్థ విదుడైన పరకాల విభుడతడు.

31. మాతా రమా మమపితా భువనైకకర్తా విష్ణు ర్మదీయ సుహృదో హరిభక్తియుక్తాః
మజ్జన్మభూమి రఖిలా పరకాలనామా సోఽహం నృపాలకమణే హరిదాసదాసః॥

నాతల్లి రమ, నాదు తండ్రియన భువనైక
కర్తయగు విష్ణుండు, హరి భక్తులే హితులు,
భువి జన్మభూమి, నాపేరు పరకాలుండు,
నరపాలమణి ! నేను హరిదాస దాసుడను.

32. యే కంఠలగ్న తులసీ నలినాక్షమాలా యే బాహుమూల పరిచిహ్నిత శంఖచక్రా
యేవా లలాటఫలకే లసదూర్ధ్వపుండ్రా స్తేభ్యస్సమాహృతధనం త్వహమర్పయామి॥

ఏకంఠముల తులసిపూస మాలలు వ్రేలు
ఏభుజములన్ శంఖ చక్ర చిహ్నము లమరు
ఏనుదుట వెల్గులిడు ఊర్ధ్వపండ్రము సతము
వారికొరకే ధనము నర్పింతు నెల్లపుడు.

శ్రీహరిః ॥

33. అసత్యమేత ప్రతిభాతి దస్యో యద్వైష్ణవార్థం హరణం ధనస్య
చోరాస్తు విత్తం నహరంతి దాతుం సంభోక్తు మేవాపహరంతి లోకే ॥

వైష్ణవులకై ధనము వెచ్చింతు ననుమాట
సత్యమని నమ్మగా దగునె? చోరుడ వినుము

దానమిడుటకుదొంగ దొంగిలించునధనము?
అపహరించుటయన్న అనుభవించుటకునే.

చోరః ॥

34. నారాధ్యవా ప్రతిదినం హరిపాదభక్తాన్ అన్నాంబరాదిభి రహంహరిదాసదాసః
భూతోర్ధ్వపుండ్ర తులసీ నలినాక్షధారీ గృహ్ణామి నోదకం నృపతే వ్రతం మే॥
తులసిపూసలు ఊర్ధ్వ పుండ్రములుధరియించి
హరిదాస దాసుండనగు నేనుప్రతిదినము
హరిభక్తులనుగొల్చి అన్నాంబరములిడక
నీరమైనను ద్రావ నృపతి వరమిదినాకు.

శ్రీహరిః ॥

35. సంపాద్య చౌర్యేణ ధనం పరేషాం దానేన కింతే ఫలమస్తి చోర
దోషంపరస్వా హరణే వదన్తి సంత స్త్వయా నశ్శ్రుతపూర్వ ఏషః ॥

అపహరింతువు పరుల ధనము చౌర్యమ్మునన్
దానమిడ నద్దాన ఫలమేమితస్కరా!
పరవిత్త హరణమ్ము పాపకారణమనుచు
వినియుండవా పెద్ద లెపుడు బల్కుదురుగా .

36. తస్మా త్త్యజేదం వచనాన్మమ త్వం చౌర్యేణ దానం బహుదోషమూలమ్
శాస్త్రేషు సద్భి ర్నిరణాయి దోష స్త్వన్యాంగనార్థా హరణం మహద్భిః ॥
చౌర్యమున దానమ్ము బహుదోషమూలకము
గాన నామాటవిని వదలుకొను మద్దాని
శాస్త్రముల జెప్పబడి నట్టి దోషములలో
పరుని భార్యా ధనము లపహరించుట మిన్న.

37. చౌర్యార్జితేన సకలేన ధనేన సోహం నద్రవ్య సంచయ పరో మురవైరి భక్తాన్
ఆరాధయా మ్యనుదినం పర ఏష ధర్మః స్వార్థేహి చౌర్యకరణే ప్రభవన్తి దోషాః ॥
దానమిడితినికాని దాచలే దెన్నడును
చౌర్యార్జితమ్మైన నేదైన సర్వమును

హరి భక్తులనుగొల్చి ఆరాధనము సేతు
దోషమగు చౌర్యమ్ముజేయ స్వార్థమునకై .

శ్రీహరిః ॥

38. ధర్మస్య మార్గా వివిధః ప్రశస్తాః ధర్మో నచాసీ ధ్రువతా ధృతోఽయమ్
స్వార్థంహి వా స్యా ద్యదివా పరార్థం హర్తుం పరేషాం ద్రవిణం నసాంప్రతమ్॥

కలవు ఈలోకమున ధర్మ మార్గములెన్నొ
నీవు త్రొక్కినదారి నిజము ధర్మముగాదు
స్వార్థమునకననేమి - పరులకన వేరేమి
పరద్రవ్య హరణమన నెన్న డయుక్తమ్ము.

చోరః ॥

39. ముషిత్వాఽహం పరద్రవ్యం వైష్ణ వేభ్యః సమర్పయే
ఇత్యేతస్య న తాత్పర్యం త్వయా జ్ఞాతం నరాధిప ॥

40. ద్రవ్యం హరే ర్భూప సమస్త మేత త్తతస్తదీయార్థ మిదంహి సర్వం
తస్మా త్పరార్థేన కృతః పరార్థః యదర్థ ఏషః సుకృత స్తదర్థః ॥

విష్ణు భక్తుల సమర్చనమునకు నేనిటుల
పరుల ద్రవ్యముదెచ్చి పాటుపడుచుంటినన
నద్దానిగూర్చి యో అధిప నీకీనాడు
సరియైన తాత్పర్య మవగతము కాలేదు.
అన్ని ద్రవ్యమ్ములా హరికి చెందినవియే
గాన నాతనిసేవ కర్హమ్ము లెన్నడవి,
దేనికొరకేర్పడెనొ దానికది సుకృతియె
గాన పరధర్మమున పరధనము సరియౌను.

శ్రీహరిః ॥

41. అయంతు పరమో ధర్మః కింగురుభ్య శ్శృతం త్వయా
స్వబుద్ధ్యా వాథ సంప్రాప్తో వద సత్యేన తస్కర ॥
ఏగురువు చెప్పెనీ కీపరమ ధర్మమును
దోచి దానముసేతు ననుచు పల్కెదవెపుడు

చోరుడా నీబుద్ధికిది తోచినదికాని
దారి దొంగకు విష్ణు దాసులన ప్రీతియా.

చోరః॥

42. సత్యోక్తిర్వాథ హాస్యోక్తి రయం తవ నరాధిప
నజానే నిశ్చయం మేఽద్య సమాహితమనాః శృణు॥

43. పూజనా ద్విష్ణుభక్తానాం పురుషార్థోస్తి నేతరః
ఇతి శాస్త్రేతు నిర్ణీతః ఇతి సద్భ్యః శృతోమయా ॥

44. వ్రతోత్తమం శ్రీకమలాధవస్య ప్రసాద హేతుం స్వయమేవ భోగ్యం
శ్రీవైష్ణవారాధన మద్య తస్మాత్ త్యక్తుం నశక్తో నరపాల వర్య ॥

45. యద్యేషధర్మో వ్యథవా వ్యధర్మో నాథా మమాసన్ హరిపాద భక్తాః
తత్పూజనం ప్రాప్త మత స్తనుం వా త్యక్ష్యామి నత్వే తదహం త్యజేయమ్ ॥

నీపల్కులవి నిజమొ, హాస్యమునకంటివో
తమభావ మెట్టిదో తెలియకున్నదినాకు
వినుము నా నిశ్చయ మ్మిదియె ఓరాజేంద్ర
పురుషార్థమన విష్ణు భక్త పూజన మొకటె
వింటి పెద్దలు చెప్ప-వేరేదియును లేదు
ఇది వ్రతోత్తమమనుచు హరిదయాహేతువని
నమ్మియుంటెనిస్వామి స్వయముగాతలపోసి
గాన శ్రీవైష్ణవారాధనము నేనాడు
వదలుకొనజాలనే నిది నిశ్చయమ్మధిప,
అది ధర్మమేయైన కాదధర్మమెయైన
హరిపాద భక్తులే ప్రభువు లెన్నడు నాకు
ఎటులో సంప్రాప్తించె వారి పదపూజనము
తనువు పోయినగాని విడువ నద్దాని నే.

శ్రీహరిః ॥

46. ఏవం యది స్యా త్తవ నిశ్చయోఽత్ర త్యక్త్వా మమార్థం సుఖమేవ గచ్ఛ
ఇతీరిత స్తేన బలోర్జితోఽసౌ సునిశ్చితార్థం వచనం బభాషే ॥

అదియె నీ నిశ్చయమ్మైనచో చోరుడా
వదలి మాధనమెల్ల వెడలుమా సుఖముగా
అని స్వామిపలుకగా బలయుతుండగు చోరు
డీరీతి స్పష్టముగ బల్కె నావిభునితో

చోరః॥

47. కథం త్యజేయం నరపాలవర్య శ్రీవైష్ణవార్థం హృతమేత దర్థం
జిత్వాహవేమాం బలమస్తి చేత్తే ధనం గృహీత్వా సుఖమేవ గచ్ఛ ॥

ఎటుల విడువను నేను నరపాలవర ధనము
శ్రీవైష్ణవార్థమగు చౌర్యార్థమిదియెల్ల
బలమున్న యుద్ధమున గెలువుమా ననునీవు
ఆపైన సులభముగ అర్థమ్ము నీదౌను .

శ్రీహరిః ॥

48. పరీక్షితుం మే బలమస్తిచేత్తే శృణుత్వ మేత స్సకలా మహీమే
పూర్వేణ కాలేన యదార్జితంతే తదార్జనేచాపి మమాస్తి శక్తిః ॥

49. అద్య త్యజత్వం భవతః ప్రతిజ్ఞాం చోరోసి నూనం మమవాక్య తుష్టః
హృతంతు విత్తం భవతా యదస్తి స్వస్త్యస్తుతే తస్కర తత్ప్రదేహి ॥

నాబలమ్మును పరీక్షింప గోరినయెడల
వినుము నీచే పూర్వ మీధరణి యందెల్ల
ఆర్జించి నట్టి ధనమంతయును గొనుశక్తి
కలదు నాకడచోర- కనుగొందువదినేడు.
గాన నామాటవిని చోరవర నీవిపుడు
నీప్రతిజ్ఞను, నీవు దొంగిలించిన ధనము
విడచి, వెనువెంటనే వెడలుమా సుఖముగా
కలుగు శుభమద్దాన నీకునిశ్చయముగా

చోరః॥

50. అశేష మాయానిలయశ్చ విష్ణోః నిర్వాణ దాతు ర్జగదేక నేతుః
హరేః ప్రియేభ్యః ప్రదదామి కోశం కురుష్వ యుద్ధం బలమస్తి చే త్తే ॥

మాయలన్నిటి నిలయమయ్యె మా విష్ణువన
నిర్వాణదాతయును జగదేక నేత హరి
హరి భక్తులకు దానమయ్యె నీ కోశమ్ము
బలముగలిగిన యుద్ధమొనరించి గెలువుమా.

51. చోరస్య బుద్ధిం సుదృఢా మవేక్ష్య శ్రీవైష్ణవారాధనరూప ధర్మే
సవిస్మయం ప్రాహ తమాత్మ వంతం చోరం మహాపాల వరస్తదానీం ॥

52. పృధ్వీ భాగవతోత్తమాతి మహతీ తద్వేష్టనం వారిధిః
సోభూ త్కుంభసముధ్భవస్య చుళుకః ఖేసోపితారాయితః
తద్విష్ణో ర్దనుజేంద్ర నందనజితః పూర్ణం పదం నాభవ
త్సోయం విష్ణురభూ త్త్వదీయ హృదయే త్వత్తోధికో నాపరః ॥

శ్రీవైష్ణవులగొల్చు స్థిరబుద్ధి నున్నయా
చోరునింగని విభుడు విస్మయమ్మున బలికె
"పృథివి గొప్పది చూడ నోభాగవత ముఖ్య
పరివృతమ్మగు జలధి దానికన్నను గొప్ప
అట్టి జలధికి మిన్న ఆ అగస్త్యుని చుళుక
తారగా నతనిగొను గగన మంతకు మిన్న
ఆగగనమును గొల్చు హరిపదమ్మది మిన్న
హరిమదినిగలనీవు అన్నిటికి మరిమిన్న
లేడు నినుమించువా డీజగతి వేరొకడు.

53. ఇతి ప్రశస్యాత్మని భక్తియుక్తం స్వదాస దాసం పరకాల సంజ్ఞం
చతుర్భుస్సన్ ధృత శంఖ చక్రః ప్రదర్శయాసమాస హరిస్వరూపమ్॥

54. చోరస్య తం ప్రేక్ష్య సశంఖ చక్రం చతుర్భుజం పద్మ దళాయతాక్షం
లక్ష్మీసమేతం సకలామరేశం ప్రణమ్య మూర్ధ్నా సహసానువాచ ॥

తనయందు భక్తితో హరిదాసదాసుడౌ
పరకాలు నటుల సంభావించి ప్రీతితో
హరిచతుర్భుజుడగుచు స్వస్వరూపముజూపె
ఇరుకరమ్ముల శంఖ చక్రములు గన్పట్ట.
నాల్గుభుజముల శంఖచక్రముల వెలుగొందు
నలినాయతాక్షుడౌ కమలా మనోహరుని
సకలామరేశ్వరుని కనుల నిండుగ గాంచి
తలవంచి చోరుండు ప్రణమిల్లి పల్కెనిటు .

55. జనారణ్య పథం ప్రవిశ్య విషయవ్యామోహ తాపాతురో
నిత్యం ప్రాజ్ఞ్యగ తృష్ణి కాభ షయాన్ ప్రేక్ష్య ప్రధావ్యాంజసా

56. సుశ్రాన్తః పరితాప శాన్తి జనకాన్ శీతాన్ ప్రపన్నాశయాన్
అన్విష్యాహ మపశ్య మాత్మసదనం నారా యణాఖ్యం సరః ॥

57. నమో నమో వాఙ్మనసాతిభూమయే
నమోనమో వాఙ్మనసైక భూమయే
నమోనమో నంత మహా విభూతయే
నమోనమో నంత దయైక సింధవే॥

58. అంభోదనీల మరవిందనిచాంఘ్రియుగ్మ
మాతామ్ర తామరస రమ్య కరాగ్రకాన్తిమ్
భృంగాలకం భ్రమరవిభ్రమ కాయ కాన్తిమ్
పీతాంబరాంచిత వపు స్తవ సంస్తవామా ॥

59. ఉన్నిద్ర పత్ర శతపత్ర సగోత్ర మంత
ర్లేఖారవింద మభినందన మింద్రియాణాం
మన్మూర్ధ్ని హంత కరపల్లవ తల్లజంతే
కుర్వన్ కదా కృత మనోరథ ఇష్యసేమామ్ ॥

60. త్రైవిక్రమ క్రమ కృతాక్రమణ త్రిలోక
ముత్తంస ముత్తమ మనుత్తమ భక్తి భాజామ్
నిత్యం ధనం మమ కదాహి మదుత్త మాంగ
మంగీకరిష్యతి చిరం తవ పాదపద్మమ్॥

పలుజన్మముల అడవి మార్గముల పయనించి
విషయసుఖ తాపముల వెఱ్ఱినై నిరతమ్ము
ఎండమావుల నమ్మి ఎంతొ స్రుక్కిననేను
పరితాప శాన్తికై పర్వులిడి కనుగొంటి
శరణుగొన చల్లనై సేదదీర్చుచునున్న
ఆత్మసదనము సరోవరము నారాయణము.

మ్రొక్కులివె నీ కవాఙ్మానస గోచరా
మ్రొక్కులయ్యా వాఙ్మానస స్థానమా
మ్రొక్కెద ననంత మహదైశ్వర్య రూపమా
మ్రొక్కెద ననంత దయా సముద్రమా

నల్ల కల్వల కెట్టిదామరల జేర్చినటు
కనవచ్చు కమనీయ పదయుగమ్ముల కాన్తి ,
అంతటను ఎఱ్ఱనైనట్టి తామరలవలె
గనవచ్చు రసరమ్య కరాగ్రముల కాన్తి,
భ్రమరవిభ్రమకాన్తి ముంగురుల కాయమున
గనరాగ, నడయాడు ఘనఘనాఘనమనెడి
పీతాంబరా, స్వామి, స్మరియింతునిన్‌సతము.
ముల్లోకముల మూడుఅడుగులుగ జేసుకొన
మున్ను పైకెత్తి యున్నట్టి యాపాదమును
ఉత్తమమ్మును , భక్తి భాజనమ్మగుదాని
చిరము నాశిరమునన్ జేర్చియుంచుముస్వామి.

61. ఇత్యుక్తవంతం పరిరంభ్య దోర్భ్యాం సంస్పృశ్య చాంగం కరపల్లవేన
మూర్ధ్న్యవస్థాప్య పదారవిన్దం ప్రోవాచ లక్ష్మీ పతిరాత్త హర్షః ।
ఇటుల బల్కిన చోరు గాంచి యా విష్ణుండు
హర్షాతిరేకమున జేర్చుకొనె బాహులన్
కరపల్ల వములతో కాయమెల్లనుదడిమె
పదపంకజము శిరమ్మునునుంచె - పల్కెనిటు.

62. శ్రీమద్భాగవతార్చనం భగవతః పూజావిధేరుత్తమం
శ్రీవిష్ణో రవమాననాద్గురుతరం శ్రీవైష్ణవోల్లంఘనం
తీర్థాన్మచ్చరణోద్భవా ద్గురుతరం తీర్థం తదీయాంఘ్రిజం
తస్మా న్నిత్యమతంద్రితో భవ సతాం తేషాం సమారాధనే ॥
దేవపూజకు మిన్న భాగవత పూజనము
నన్ను దూరుటకన్న మిన్న వారల ననిన
పదతీర్థ మదిమిన్న నాకన్న వారిదే
సతము విడువక గొల్వు మవ్వారి శ్రద్ధతో.

63. ఇతి ప్రయుజ్యాశిష మాత్మభక్తం వరం వృణీష్వేతిపునర్జగాద ।
భక్తానుకంప స్సకలేప్సితార్థ ప్రదో హరిస్సంశ్రిత కల్పవృక్షః ॥
అట్టి ఆశీర్వచన మాభక్తునకు నిచ్చి
వరముగోరుమ యనుచు పల్కె నాహరి తిరిగి

తనదు భక్తునికోర్కె లెల్ల దీర్చగదలచె,
ఆశ్రితుల కోర్కెలకు హరి కల్ప వృక్షమే

64. ఇతఃపరం దేవ వరం నయాచే త్వదీయ పాదాంబుజ భక్తిరస్తు ।
దృఢం వరం దేవవర ప్రయచ్ఛ పునః పున స్త్వా మిదమేవ యాచే॥

65. అపూర్వదృష్టం తవపాదపద్మం దృష్ట్వా వరం నాథ దయైకసింధో
కామం నయాచేఽ న్యమహం నమూఢో యః కల్పవృక్షాత్ తృషమాత్రమిచ్ఛతి॥

66. పరిజన పరిబర్హా భూషణాన్యాయుధాని ప్రవర గుణగణాశ్చ జ్ఞాన శక్త్యాదయస్తే
పరమపదమథాండా నాత్మదేహస్తదాత్మా వరద సకలమేతత్సంస్థితార్థం చకర్థః॥

ఇంతకన్నను మించి ఏమి కోరను స్వామి
నీదుపదముల నెపుడు నిలువగావలె భక్తి
అదియెగావలె నాకు దృఢముగా నయ్యదియె
అదియె నేకోరెదను మరియు మరియున్ స్వామి.

ఎన్నడును కనలేని నీదుపద యుగళమును
గనుగొంటి నింకేమి వలదునా కెన్నడును,
వేరు కోర్కెను గోరు మూఢుడను గాను నే
కల్పతరువును ఊక కోరువా డుండునా.

పరిజనమ్మును చామరాదులును, భూషలున్
ఆయుధమ్ములు, మరియు వరగుణగణమ్ములును
జ్ఞానశక్త్యాదులున్ పరమపద బ్రహ్మాండ
దేహాత్మ లేర్పరచితివి ఆశ్రితులకున్నై.

67. ఇతి బ్రువాణః పరకాల నామా ప్రాదాన్మహా భాగవతోఽచ్యుతాయ
ఛత్రాదికం వస్తుచయం మహార్హః కేయూర హారాది విభూషణంచ ।

అనిపల్కి పరకాలు డాపైన గొనివచ్చె
ఛత్రమ్ము చామరము వస్తు సంచయమెల్ల,
కేయూర హారాదులగు సర్వ భూషణములన్
దెచ్చి అచ్యుతుకొరకు భాగవతుడర్పించె.

శ్రీహరిః ॥

68. యావత్సుధాంశు రవిమేరు కులాద్రి సింధు
తారా గ్రహా ధ్రువ సరిన్నద భూవికల్పాః
తిష్ఠంతి రామచరితం భువనేషు తావ
త్తిష్ఠే త్సుకీర్తి రిహ తే పరకాలదాస ॥

సూర్య చంద్రులు నింగినున్నంత కాలమ్ము,
మేరువును కులపర్వతములు నిలిచెడి దనుక
తారలు గ్రహమ్ములున్ ధరవెల్గు లిడుదాక
నదులు నదములు సంద్రములు గల్గు వరకునీ
కీర్తి నిలచును సతము పరకాలదాసుడా-
భువనముల శ్రీరామ చరితముండెడి వరకు.

69. సంవాద మావయోర్యస్తు శృణుయా చ్ఛ్రద్ధయా నరః
స భక్తిమాన్ సమాప్నోతి దేహాన్తే మత్పదం పరం ॥

70. ఇతి వచన ముదారం ప్రోచ్య పద్మాయతాక్షః
నిరతిశయ జయశ్రీ భక్త వాత్సల్య పూరః
నృహరి రథ దిశః ఖం ధ్వానయన్ తూర్యఘోషై
ర్నిజ సదన మగచ్ఛ ద్భక్తి సంఘై ర్మురారిః ॥

ఇట్టి మన సంభాషణమును శ్రద్ధగవినెడి
నరులు మద్భక్తులై మెలగి దేహాన్తమున
పరమపదమును పొందెదరు ధ్రువమ్మిదియనుచు
వాత్సల్యపూర్ణుడై పల్కి హరి యానాడు
తూర్య ఘోషల దిక్కులాకసమ్మును మ్రోయ
నిజసదనమున కేగె భక్త సంఘమ్ముతో.

॥ చోరసంవాదః సమాప్తః ॥

చోరసంవాద మిది పరకాలవిభు చరిత
అనువదించెను వేణు గోపాలు డాంధ్రమున
తాళపత్ర స్థితములగు శ్లోకములజూచి పద్మనాభాచార్యు తాత్పర్యములనుగని.

## 2 .లక్ష్మి సంవాదము (మూలము - ఆంధ్రానువాదము)

1. ద్వారకానామ నగరీం రత్న ప్రాసాద శోభితాం
శౌరిరధ్యవస లక్ష్మ్యా రుక్మిణ్యాసహ భార్యయా ॥

2. నారాయణః కమలయాసహ దివ్య గేహే
ముక్తా ప్రవాళ కృత చిత్రతలే మనోజ్ఞే
రేమే సదానన శుభే సుసుఖోపవిష్ట
శ్చాటూక్తిభిః క్షణమివ వ్యనయచ్చ కాలం॥

శ్రీదేవియగు రుక్మిణీ సతిని గూడుకొని
ద్వారకాపురినున్న శ్రీకృష్ణదేవుండు
పురమధ్యముననున్న నొకదివ్య గేహమున,
ముక్తాప్రవాళముల నతిసుందరమ్ముగుచు
విలసిల్లు నొకదివ్య సింహాసనమునందు
గూరుచొనియుండె తా సఖులతోనొకనాడు.

3. ఏకదాన్యవసల్లక్ష్మీ సఖీభిః పరివేష్టితాః
అంతఃపురే రుక్మమయే రత్నస్తంభ శతాకులే ॥

4. నర్తకైశ్చ భూజంగైశ్చ చాటుకారై స్సగాయకైః
విలాసిభి స్సభాందివ్యా మధ్యువాస జనార్దనః ॥

5. నటవిట గాయక చాటుకరై ర్యువతేస్సహ భృత్యగణైః
మధురాపురి సముదాపరయా సదసిమనోహర భూమితలే ॥

6. రమమాణే వాసుదేవే లీలామానుషవిగ్రహే
దూతంసంప్రేషయామాసు స్త్రిదశాః దానవార్దితాః॥

పదిపదులుగా పసిడి స్తంభములువిలసిల్ల
రత్నకాంతులవెలుగు అంతిపురమందు తా
సఖులతో గూడుకొని రుక్మిణీసతియుండె -
నటులతో విటులతో చాటుకారులతోడ
నర్తకుల్ విలాసులును గాయకాదులతోడ

